# పారమార్థిక సంభాషణలు

(శ్రీరామకృష్ణుని ప్రథమశిష్యవర్గమువారివి)

అనువాదకులు :

శ్రీ కందుకూరు - మల్లికార్జునంగారు

"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"




శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# విషయసూచిక

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఈ గ్రంథమునందు ఆర్గురు జ్ఞానసిద్ధుల సంభాషణములు కలవు. వారిలో శ్రీ మాతృదేవి శ్రీ రామకృష్ణదేవుని సహధర్మచారిణి; ఆయన 'శక్తి'; ఆయనకన్న కొన్నివిధముల నధికురాలని పేరొందినది. శ్రీ బ్రహ్మానందస్వామియు, శ్రీ ప్రేమానందస్వామియు 'ఈశ్వరకోటులు'. శ్రీ తురీయానందస్వామిని శ్రీ వివేకానందస్వామి తన అమెరికా శిష్యుల కిట్లు వర్ణించెను: "నేనిచట చేసినది ప్రసంగమాత్రరూపమగు బోధ. తదనుసారముగా జీవించు మార్గమును మీకు కఱపగల నా సోదరశిష్యు నొకనిని మీకడ కంపెదను". శ్రీ శివానందస్వామి "మహాపురుష" నామముతో శ్రీ వివేకానందస్వామిచే కీర్తింపబడినవాడు. ఇక శ్రీ శారదానందస్వామి "జగత్తునందు గల ప్రతి స్త్రీయందును విశ్వమాతృత్వమును సాక్షాత్కరింపజేసికొన్న" మహాత్ముడు; శారదామూర్తి యనదగు జ్ఞానవిజ్ఞాననిధి.

ఈ చిఱుతుకవర్ణనమువలన ఈ గ్రంథములోని సంభాషణములెంత అమూల్యములైనవో మన మూహించుకొనవచ్చును. పారమార్థిక సమస్యలు ప్రాతవడునవికావు. ఆ కాలపు జిజ్ఞాసువులను బాధించిన సమస్యలే ఈ కాలపు జిజ్ఞాసువులనుకూడ నిరంతరము బాధించుచున్నవి. కావున ఆంధ్రపాఠకలోకమున కీ గ్రంథ మత్యంతోపకారకముగా నుండుననుట నిస్సంశయము. వారీ గ్రంథమును చదివి ఉపకారమొందుదురుగాక.

ఈ గ్రంథమునకు చేర్చబడిన అకారాది విషయసూచి జిజ్ఞాసుజన 'చింతామణి' వంటిది. తత్సాహాయ్యమున పారమార్థిక సమస్యల నేకములకు అధికారపూర్వకములగు సమాధానములు వెనువెంటనే లభింపగలవు.

శ్రీ రామకృష్ణమఠము
మైలాపూరు, మద్రాసు - 4
15-6-1955

ప్రకాశకులు

# మూలగ్రంథ పీఠిక

నేడు హిందూదేశమంతయు మాత్రమే గాక, ఇతరదేశములుకూడ, శ్రీరామకృష్ణుని భక్తులను — అందు ముఖ్యముగా, ఈ గ్రంథములోని సంభాషణములకు సంబంధించినవారిని — చక్కగా నెఱిగియున్నవి. శ్రీ గురుదేవుని ప్రధానశిష్యుడగు వివేకానందస్వామిచే స్థాపింపబడిన రామకృష్ణసేవాసంఘమును (Ramakrishna Mission) నిర్మించినది వీరే. వీరు గురుపదవి నధిష్ఠించి ఆధ్యాత్మికబోధనలొనర్చిన విషయము జన సామాన్య మెఱుగదు. వారిని శుశ్రూషించు మహాభాగ్యమునొందిన కొలది మందికే ఆ విషయము తెలియును. ఆ శిష్యులలో కొందఱు తమతోను, ఇతరభక్తులతోను, ఈ మహాపురుషులు పల్కిన వాక్యములను తమ దిన చర్యాజ్ఞాపికలలో సొంత ఉపయోగార్థము వ్రాసియుంచుకొనిరి. అట్టి వాక్యములను క్రోడీకరించి, గ్రంథరూపముగా, ప్రకటించుట కిదియే ప్రథమ ప్రయత్నము. పారమార్థికధర్మానుసారముగా జీవింపగోరువారికి ఉపయుక్తముగానుండు నెన్నో విషయము లీ బోధనవాక్యములందు సరళ ముగా విశదపఱుపబడియున్నవి. కావుననే ఈ వాక్యము లమూల్యములు. కొందఱి కుపకరించినవి ఇతరులకుకూడ ఉపకరింపగలవు అను విశ్వాసము తోడనే ఈ గ్రంథమును లోకమున కందిచ్చుచున్నాము. తమ దినచర్యా జ్ఞాపికలను మాకు మిక్కిలి దయతో నిచ్చి, ఈ ప్రకటనమును సాధ్య మొనర్చినవారికెల్లరకు మా హృదయపూర్వకవందనము లర్పించు చున్నాము.

అద్వైతాశ్రమము,<br>మాయావతి, హిమాలయములు.<br>మే 15, 1936

ప్రకాశకులు

(ఆంగ్లమూలమునుండి)

# తప్పొప్పుల పట్టిక

(ఈ తప్పులు సవరించుకొని గ్రంథమును చదువవలయును)

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 21 | 1 | మే 22, 1911 | మే 22, 1921 |
| 21 | 6 | ''ప-'' | 'ప్రే-' |
| 22 | 5 | 'ప-' | 'ప్రే-' |
| 55 | 10 | దర్శించి. | దర్శించి, |
| 101 | 23 | క్షుదా | క్షుధా |
| 101 | 23 | దుర్బర | దుర్భర |
| 108 | 13 | స్వానుభవ | సానుభవ |
| 130 | 6 | పర్యుపాశింతురో | పర్యుపాసింతురో |
| 209 | 21 | అనాసుసక్తి | అనాసక్తి |
| 250 | 24 | పశ ంసించువా | ప్రశంసించువా |
| 335 | 11 | భగనన్నామము | భగవన్నామము |
| 342 | 8 | విముక్తిని | విముక్తుని |
| 391 | 15 | లాచరింపదాదు | లాచరింపరాదు |
| 394 | 5 | బద్ధితో | బుద్ధితో |
| 397 | 5 | స్లారు | సార్లు |
| 413 | 1 | వాశ్చాత్య | పాశ్చాత్య |

# పారమార్థిక సంభాషణలు

## 1-వ ప్రకరణము

## శ్రీమాతృదేవి సంభాషణములు

### I

"అమ్మా, నా జీవితము నెట్లు గడపుమందురు?" అని శ్రీ మాతృదేవి నడిగితిని.

"ఇప్పటివలెనే. ఎప్పుడును ఆయనను చిత్తమున నుంచుకొని, ఆయనను గూర్చియే తలచుచు, ఆయనకై తపించుచు ప్రార్థనలు సలుపుచుండుము."

"అమ్మా, మహాత్ములు, మహాపురుషులు సహితము ఆదర్శమునుండి భ్రంశమునొందుచుండుట చూచి నేను భీతిలుచున్నాను."

"భోగ్యవస్తుమధ్యమున నివసించుచున్నచో అవి మానవుని లోబఱుచుకొనుట చిత్రమా? స్త్రీవిగ్రహము—కొయ్యదైనను—దానివైపుననే చూడకుము, దానిని సమీపింపనుకూడ వలదు."

"కాని మానవుని ప్రతికర్మమునకును పురికొల్పువాఁడు భగవంతుఁడే అందురే! అది నిజముకాదా?"

“అవును, నిజమే. కాని మానవునికి ఆ సత్యము తెలిసి యుండునా? కండకావరము కన్నులుగప్ప, కర్త తానే యని గదా అతడు భావించుకొనుచుండును! భగవంతునిపై ఆధార పడడుగదా! భగవంతుని శరణుచొచ్చినవా రందఱును సంర క్షింపబడుదురు. సాధువు నిత్యజాగరూకుడై యుండవలెను. అతనిత్రోవ మిక్కిలి జాఱుడైనది. జాఱుడుత్రోవయం దెంతో మెలకువతో, అడుగడుగు చూచుకొనుచు, గదా నడువవలెను! సన్న్యాసియొక్క జీవితము వేడుక కాదు, ఆటలా డుట కాదు. అతడు స్త్రీవైపు చూడనేరాదు. వీధులలో నడచునప్పుడు అతనిదృష్టి కాలిబొటనవ్రేళ్లమీదనే నిలిచి యుండవలెను. మెడపట్టగల కుక్కను ఊరకుక్కలవలె ఎట్లు చంపివేయరో, అట్లే సన్న్యాసియొక్క కాషాయవస్త్రములు చూచి ఎవ్వరును అతని జోలికిపోరు. రాజమార్గము నతనికి విడిచిపెట్టి అందఱును తొలగిపోవుచుందురు.

“మనస్సునకు దుష్ప్రవర్తనము సహజము, సత్ప్ర వర్తనము దానికి గిట్టదు. వేకువనే లేచి ధ్యానముచేయుట నాకు అలవాటైయుండెను. కాని ఒక్కతడవ కొంచెము స్వస్థత చెడి అంత వేకువనే లేవలేదు. ఆ పిదప చాలదినములు ఆలస్యముగనే లేచుచుంటిని. మనస్సునకు బద్ధకము సహజము. కావున నీవేదైన ఉత్కృష్టమైనదానిని, మహనీయమైనదానిని, సాధింపగోరితివేని, అవిరామపరిశ్రమ మలవఱచుకోవలెను. దక్షిణేశ్వరమున నేను నహబత్తు(వాద్యమండపి)లో నివసించు చున్న కాలమున గంగాస్రవంతియొక్క ప్రశాంతజలమునందు ప్రతిబింబించియున్న చంద్రబింబధావళ్యమునుచూచి అశ్రు

పూరితనేత్రములతో భగవంతు నిట్లు ప్రార్థించుచుండెను ‘ప్రభూ, ఈ చంద్రునిలోకూడ కళంకములు కలవు. నా మనస్సునందు కళంకమే లేకుండుగాక!’

“నీవు కలకత్తాలో పుట్టి పెరిగినవాడవు. వివాహమాడి సుఖజీవనముచేయుట నీకు సుసాధ్యముగా నుండెను. కాని నీవు సర్వమును విడనాడితివి. ఇట్టితలంపులు నీ మనస్సులో మరల ఏల కలుగవలెను?”

“అమ్మా, ఆసనప్రాణాయామము లభ్యసించుట శ్రేయస్కరమేనా?”

“వానిచే సిద్ధులు ప్రాప్తించును. సిద్ధులు మానవుని అపవిత్రమార్గములకు కొంపోవును.”

“సాధువులు తీర్థయాత్రలు చేయవలెనా?”

“తా నున్నచోటనే మనస్సు నిశ్చలముగను ప్రశాంతముగను ఉండినచో తీర్థయాత్ర లేల?”

“సామాన్యముగా నా మనస్సునకు ఏకాగ్రతయే లభింపదు. అనుగ్రహించి నా కుండలినీశక్తిని మేలుకొల్పుము.”

“నా మాట నమ్ముము. అది మేల్కాంచును. కొద్దిపాటి జపధ్యానములు దానిని మేలుకొల్పును. అది తనంతతానే మేల్కొనదుగదా. సాధన అత్యావశ్యకము. ధ్యానము నభ్యసింపుము. క్రమేణ నీ మానస మత్యంతప్రశాంతతను, నిశ్చలతను పొందును. ఆ దశ లభించినపిదప ధ్యానింప

కుండుట నీకు కష్టముగాతోచును. కాని బుద్ధిని బలాత్క-రించి ధ్యానములో దింపకూడదు. మనస్సు ధ్యానోన్ముఖము కాని దినమున, ఈశ్వరునికి ప్రణామములొనర్చి అంతటితో ముగించుకొనుము. తక్కినదినములలో ధ్యానస్థితి తేలికగను, సులభముగను లభించును.''

''నా మనస్సునకు నిశ్చలత్వమును, ఏకాగ్రత్వమును చేకూర్పజాలకున్నాను. దీనికి కారణమేమి? ధ్యానకాలమున ఏవేవో తలంపులు రేగి బుద్ధిని కలతపెట్టుచుండును.''

''మనస్సు ధనముమీదికి, భార్యమీదికి, బిడ్డల మీదికి పోరాదు నిజమే. కాని తన కర్తవ్యములమీదికి పోవుట సహజమే. ధ్యానము చేయజాలకపోయితివేని, మంత్రజప మొనర్చుచుండుము. 'జపాత్ సిద్ధిః'—మంత్ర జపముచేతనే సిద్ధి లభించును. ఔను, జపమే చివరకు ఆత్మ సాక్షాత్కారము చేకూర్చును. ధ్యానము చేయగలిగితివేని మంచిదే. కాని అందుకై బలాత్కరించుకొనకుము.''

''అమ్మా, నేను వారణాసిమఠముననే ఉండి సాధన లభ్యసించుట మంచిదా, ఏదైన నొక ఏకాంతప్రదేశమున కేగి అచట నభ్యసించుట మంచిదా?''

''హృషీకేశమువంటి నిర్జనస్థానమున కొన్నాళ్లు సాధనలు సాగింపుము. అందుచే నీ మనస్సునకు బలము చేకూరును. ఆ పిదప నీ వెచటనున్నను, ఎవరితోనున్నను, అది నసిచెడక సుస్థితియందే ఉండును. లేతమొక్కకు ఆవుల వలనను, మేకలవలనను అపాయము కలుగకుండుటకై దాని

చుట్టు కంచె కట్టవలెను. పెరిగి చెట్టైనపిదప దానికి వాని వలని భయములేదు. మనస్సు దుష్టభావములచే సంక్షోభింప బడుచుండియు, జ్ఞానవాంఛాభిముఖమై యున్న వేళలందు భగవంతుని గాఢముగా ప్రార్థింపుము. అతడు నీ మనస్సును పరిశుద్ధపఱచి నీ సంశయములు తీర్చివైచును."

## II

శ్రీ మాతృదేవి: "భీతిలకుము. భగవంతుడు నిన్ను సర్వదా కనుపెట్టియే యున్నాడు. ఆయనకార్యము లొనర్చుచు సాధన లభ్యసించుచుండుము. అనుదిన మొకించుక పని చేయుచున్నచో అది వ్యర్థభావములను తొలగించును. ఏ పనియు చేయక ఏకాంతజీవనము నడుపువానిని వ్యర్థభావములు బాధింపవచ్చును."

"నే నెట్టిసాధన లభ్యసింపవలెను? ఎచ్చట?"

"వారాణసియే నీకు తగినచోటు. సాధన యనగా ఈశ్వరునిపై మనస్సు నేకాగ్రముగా నిలిపి ఆయనమననము నందే దానిని మఱిమఱి మగ్నముచేయుటయే. ఆయన నామోచ్చారణము చేయుచుండుము."

"ఆయనను ప్రేమింపక ఊరకయే నామజపము చేయుట ఉపయోగకరమేనా?"

"నీవు నీటిలో కావలెనని పడ్డను, కాబట్టక పడ్డను, నీ గుడ్డ తడిసియేతీఱును గదా. నిరంతరధ్యాన మభ్యసింపుము. నీ మన స్సిప్పుడు అపక్వముగా—నిలుకడలేక—

యున్నది. నిరంతరధ్యానము దానికి నిలుకడను శాంతతను చేకూర్చును. ఇంతేకాదు. ఎప్పుడును వివేచన చేయుచుండుము. మనస్సు ఈశ్వరుని వీడి మఱి ఏ వస్తువుదెసకు పాఱినను, ఆ వస్తువు క్షణభంగుర మని తలచి, ఈశ్వర దివ్య పాదపద్మములముందల దానిని మరల సమర్పింపుము. తన ప్రక్కనే పోవుచుండిన పెండ్లిఊరేగింపుయొక్క గందర గోళపురొద యేమాత్రము చెవిసోకకుండునంత ఏకాగ్రతతో తన గాలమును చూచుకొనుచున్న జాలరివానివలె కమ్ము."

"జీవితముయొక్క ఉద్దేశ మేమి?"

"భగవత్సాక్షాత్కార మొంది సర్వదా అతని తలంపునందే మగ్నమైయుండుట."

"అమ్మా, నే నారంభించిన ప్రాణాయామాభ్యాసము సాగింపవచ్చునా?"

"సాగింపవచ్చును. కాని మితిమీఱనీయకుము. అధిక మైనచో మెదడు కాగిపోవును. ఐనను మనస్సు స్వభావా నిశ్చలముగానున్నచో, ప్రాణాయామ మెట్లు ఉపకరించును?"

"అమ్మా, ఇది నిజమేకాని కుండలినీప్రబోధము కలిగినకాని, ఏమియు సాధింప నేరముకదా?"

"కుండలిని నిస్సంశయముగా ప్రబోధ మొందును. నామజపమువమాత్రము వదలక చేయుచుండుము. అంతయు సరి పడును. మనస్సు సుస్థిరముగా ఉండకపోయినను నామమును పదిలక్షలసార్లు జపింపుము. కుండలిని మేల్కాంచుటకుముస్న

నీకు అనాహతధ్వని (ఓంకారము) వినవచ్చును. కాని ఒక విషయముమాత్రము మఱవకుము. సర్వము జగజ్జననికృప మీదనే ఆధారపడియుండును. కొలదినాళ్ళకుము. నాకొక వేగుజామున నా కొక శివలింగము—శ్రీ విశ్వనాథునిది— గోచరమయ్యెను.'' *

''కాని, అమ్మా, శివుని ఈ శిలామూర్తులు మా కిప్పుడంతగా తృప్తి నిచ్చుటలేదు.''

''నాయనా, అది పొరపాటు. అవి సత్యములే. కాశికి వచ్చు మహాపాతకు లెందఱో విశ్వనాథమూర్తిని తాకి పాపవిముక్తు లగుచున్నారు. ఎల్లర పాపములను ఆయన అవ్యాజకరుణతో కైకొనుచున్నాడు. శని, ఆదివారముల నాడు అన్నివిధములవారును వచ్చి నా పాదములంటి ప్రణమిల్లుచున్నారు. తత్ఫలముగా నా పాదములు మండిపోవుచుండును...''

దినముతప్పక యింటికివచ్చి, శ్రీ మాతృదేవి నొకభక్తుడు దర్శించుచుండెను. ఉన్నట్టుండి అతడు వచ్చుట మానుకొనెను. ఈ మార్పు దురవగాహముగా నుండెను. అందుకు కారణ మేమని నేను శ్రీ మాతృదేవి నడిగితిని. ''అతని పూర్వకర్మఫలము. అది చివర కతనిని వివశుని చేసినది'' అని ఆమె బదులుచెప్పెను. అందుపై నేను ''సర్వము భగవదిచ్ఛానుసారమే నడచునెడ, ఆయన అతని కర్మము నేల నశింపజేయుడు?'' అని ప్రశ్నించితిని. అందు కామె

* శ్రీ మాతృదేవి అప్పుడు కాశిలో నుండెను

యిట్లు బదులిడెను : "కావలెనన్నచో సరింపజేయగలడు. కాని శ్రీ గురుదేవుడుకూడ తనకార్యముయొక్క ఫల మనుభవింపవలసివచ్చెను. ఆయన అన్న (రామకుమారుడు) తీవ్రమగు దుష్టజ్వరపీడితుడై కూడ నిరుత్రాగుచుండెను. అందుచే జ్వర మధికమగునని జడిసి శ్రీ గురుదేవుడా పాత్రమును ఆయనచేతినుండి లాగుకొనెను. అన్న కోపోద్రిక్తుడై 'నాకిప్పుడు నీవు నీటిలేమిని కలిగించితివికదా. అట్లే నీ అవసానకాలమున నీవు ఏమియు భుజింపజాలకుందువు' అనెను. శ్రీ గురుదేవుడంత 'నీ మంచికై కదా నే నట్లుచేసితిని. అందుకై శపించితివేల ?' అని యడిగెను. రామకుమారుడిది విని విలపించుచు 'ఆ శాపము నానోట నేలవచ్చెనో నే నెఱుగను' అనెను. కాని ఆ శాపము తగిలెను. శ్రీ గురుదేవుడా కర్మ మనుభవింపవలసివచ్చెను. చివరివ్యాధిలో ఆయన ఇంచుమించు ఛేదియు పుచ్చుకొనజాలక పోయెను."

"జపముచేయునప్పుడు నేను లెక్కించుకోవలెనా ?"

"వలదు. తఱచు బుద్ధి జపమునుండి లెక్కమీదికి పోవును."

"జపమువలన నా బుద్ధి గాఢముగా ఈశ్వరునియందు నిమగ్న మేల కాదు ?"

"క్రమక్రమముగా అగును. కాని నీ మనస్సు జపమునకు అభిముఖము కాకున్నను, సుస్థిరముగానుండక చలించుచున్నను, జపముమాత్రము మానుకోవలదు. జపము సాగించు

చునే ఉండును. మనస్సు క్రమక్రమముగా నిలుకడనొందిన గాలివీవనిచోటి దీపమువలె నగును. గాలిలో ఏపాటి చలనము కలిగినను దీపపునిశ్చలత చెడునట్లు ఏ తలంపుగాని, ఏ కోరికగాని, పొడచూపినచో మనస్సు చలించును. మంత్రము నిర్దుష్టముగా ఉచ్చరించుచుండవలెను. ఉచ్చారణ తప్పుగానున్నచో పురోగతి మందగించును. ఒక స్త్రీకుప దేశింపబడిన మంత్రములో 'రుక్మిణీనాథాయ' అనున దొకభాగము. కాని ఆమె దానిని 'రుకు' అని ఉచ్చరించు చుండెను. ఆమెపురోగమనమున కిది అడ్డుతగిలెను. కాని పిదప భగవత్కృపవలన ఆమెకు సరియగు ఉచ్చారణ చేపడెను.''

# III

శ్రీ మాతృదేవియొక్క ప్రథమదర్శనభాగ్యము 1907 లో నాకు ప్రాప్తించెను. మఱుసంవత్సరపు వర్షకాలమున ఆమె దర్శనార్థమై రెండవసారి వెళ్ళితిని. అప్పుడామె జయరామ వాటిలో నివసించుచుండెను. నేనచటికి ఉదయము 10–30 గంటలకు చేరితిని. ఆమెపాదములకు నేను సభక్తికముగా మ్రొక్కినపిదప "నీవు 'మ.' యొద్ద చదువుకొను విద్యార్థివా'' అని నన్నామె అడిగెను.

"కాదు, కాని నే నాయనను తఱుచు దర్శించు చుందును'' అని నేను బదులుచెప్పితిని.

"అతడు క్షేమముగా ఉన్నాడా? ఇటీవల నీ వతనిని చూచితివా?''

"అవును. క్షేమముగానున్నాడు. సుమారు రెనిమిది దినములక్రిందట నే నతనిని చూచితిని."

ఆ రాత్రి భోజనము చేయుచుండగా "నీవు ఇంటి యొద్దనే ఉన్నావా?" అని ఆమె న న్నడిగెను. "ఔను, ఇంటియొద్దనే ఉన్నాను. ఇటీవల నాకు మహావిపత్తు సంభవించెను. అపాయకరమగు జబ్బు చేసినది. ఆ పిదప వివాహము తటస్థించెను" అని నేను బదులాడితిని.

శ్రీమా: "అప్పుడే పెండ్లియైనదా?"

నేను: "అవును."

శ్రీమా: "పెండ్లికూతురు ఎన్నేండ్లది?"

నేను: "సుమారు పదుమూడేండ్లది."

శ్రీమా: "జరిగిన దంతయు నీ మంచికొఱకే. ఇప్పుడందుకు పశ్చాత్తాపపడుట నిష్ప్రయోజనము."

నేను: "నన్ను వివాహ మాడవలదని శ్రీ 'మ.' చెప్పియుండెను."

శ్రీమా: "పాప మతడు గృహస్థజీవనమున నెన్నియో బాధలొందెనుగదా! కావుననే నిన్ను వివాహము చేసికోవలద నెను."

నేను: "గృహస్థజీవనము వ్యథామయము. ఆ జీవనమున మనుష్యుడు తన మనుష్యత్వమును కోల్పోవును."

శ్రీమా: "సత్యము. అం దెప్పుడును ద్రవ్యార్థమగు ఘోషలే."

నేను : "అది కష్టభాజనముకూడ."

శ్రీమా : "కాని శ్రీ గురుదేవునికి గృహస్థభక్తులు కూడ ఉండిరిగదా. వ్యాకుల మొందకుము."

నే నేమియు బదులుచెప్పక మౌనముగా ఉంటిని.

శ్రీమా : "మా తమ్ములుకూడ వివాహితులే."

నేను : "వారి వివాహములు మీ రనుమతించితిరా?"

శ్రీమా : "అనుమతింపక నే నేమిచేయగలను? పురీషములో బ్రదికి సుఖించు పురుగులు అన్నపుకుండలో నుంచినచో చచ్చిపోవునని శ్రీ గురుదేవుడు పలుకువారు; మఱియు మా కాలములో మేము సేవచేయుచుండినంత చక్కగా ఇప్పటి పిల్లలు వారి పినతండ్రులను పెత్తండ్రులను సేవింపరు."

నేను : "కాలక్రమమున సర్వము మాఱిపోవు చున్నది."

శ్రీమా : "నిజమే, పూర్వము నే నొక చీమను కూడ చంపుదాననుకాను. కాని ఇప్పుడు పిల్లులనుకూడ కొట్టుచున్నాను. 'ఇది చేయుము, అదియు చేయుము' అని శ్రీ గురుదేవుడు చెప్పెను. ఆయన 'నీవు', 'నీవు' అను వారు. * చిరకాల మెన్నో కష్టము లనుభవించినపిదప మానవుడు 'నీవు', 'నీవు' అనుట నేర్చుకొనును.

* 'నేను' అనున దేదియు లేదు. అంతయు నీవే—ఈశ్వరుడే—అని దీని కర్థము.

"భీతిలవలదు. వివాహితుడ వైననేమి? శ్రీ గురుదేవుని సంకల్పబలముచే నీభార్యకునైతము పారమార్థిక బుద్ధి లభించును. పూర్వజన్మమున ఆమె పుణ్యము లార్జించుకొన్నది. 'అవిద్య విద్యకన్న శక్తిమంతము' అని శ్రీ గురుదేవుడు చెప్పువారు. 'అనగా అవిద్య లోకమునంతటిని సమ్మోహితమొనర్చునది' అని యర్థము."

# IV

1919-వ సంవత్సరము ఏప్రిల్ 20-వ తేదినాడు "మ-" "స-" అను బ్రహ్మచారు లిరువురును, "వ-" అను నొకమదరాసుప్రాంతీయుడును శ్రీ మాతృదేవిదర్శనార్థము వచ్చిరి. ఆమె అప్పటి కొక నెలనాళ్లనుండియు బాంకురా జిల్లా, కోల్పారాగ్రామమున జగదంబాశ్రమమున నుండెను. కోల్పారాలో రెండాశ్రమములు కలవు: ఒకటి పురుషులకు, ఒకటి స్త్రీలకు. శ్రీ మాతృదేవి రెండవదానిలో నుండెను.

శ్రీ మాతృదేవి మనుమడు — ఆమె మేనగోడలగు మాకూ యొక్క కుమారుడు—అప్పటి కైదుమైళ్ళదూరమునందుండు జయరామవాటిలో అంగిటివాపువలన మిక్కిలి అపాయస్థితియం దుండెను. శ్రీ మాతృదేవి ఆ బిడ్డవిషయమున చాల వ్యాకులముతో నుండెను.

వారు ప్రణామము లొనర్చినపిదప జబ్బుగానున్న మనుమని విషయము మాటలాడజొచ్చిరి.

'వ-': "అమ్మా, మీ అనుగ్రహముచే బాలునికి బాగగును."

శ్రీమా: చేతులు జోడించి "శ్రీ గురుదేవుని అనుగ్రహముచే" అని పలికెను.

'న-': "ఈయన ('న-') మాకూబిడ్డకై చాల పాటు పడెను."

శ్రీమా: "అవును, ఆయన సత్పురుషుడు. కలకత్తా నుండి ఔషధము తెప్పించి ధనవ్యయ మొనర్చెను. ఆయన లేనిచో అంత సహాయము మరెవ్వరు చేసియుందురు?"

'న-': "శ్రీ గురుదేవుని ఉపకరణమాత్రుడను నేను. తన చేతిలోని పనిముట్టుగా నన్నాయన ఉపయోగించు చున్నాడు."

శ్రీమా: "కలవారు కుమ్మరింప (ధనవ్యయ మొనర్ప) వలెను. లేనివా రాతని నామస్మరణ మొనర్పవలెను" అని శ్రీ గురుదేవు డనువారు.

'న-': "జపప్రారంభమునకుముందు ఆచమనము (నోటిని, కరచరణాదులను కడుగుకొనుట) చేయుట అవసరమా?"

శ్రీమా: "అవును. ఇంట నున్నప్పుడు ఆసనా చమనములు పాటింపవలెను. కాని షయనించునప్పుడు నామోచ్చారణముమాత్రమే చాలును."

'న-': "నామముమాత్రమేనా? మంత్ర మక్కఱ లేదా?"

శ్రీమా: "మంత్రముకూడ అవసరమే. అందుకు సందేహమేమి? కాని, ఏకాగ్రబుద్ధితో భగవన్నామ మొక్క

తడవమాత్రమే ఉచ్చరించుట పదిలక్షలసార్లు ఉచ్చరించునంత ఫలప్రదము. పరధ్యానముగా పదిలక్షలసార్లు చ్చరించి ఏమి ప్రయోజనము? మనఃపూర్తిగా నుచ్చరించిననే నీ వతని కృపకు పాత్రుడవగుదువు.''

'స—' : ''అకృత్రిమభక్తితో రెండు మూడు నాళ్లు ప్రార్థించినవానికిగూడ భగవంతుడు దర్శనమిచ్చునని చెప్పుదురు. నే నెన్నాళ్ళనుండియో అతనిని ప్రార్థించు చున్నాను. నా కేల దర్శనమీయడు?''

శ్రీమా : ''నీ కతనిదర్శన మబ్బును. శివునియొక్కయు శ్రీ గురుదేవునియొక్కయు పలుకులు రిత్తపోవునా? శ్రీ గురుదేవుడు సురేంద్రునితో నిట్లనెను : 'కలవారు ద్రవ్యము నిచ్చుచుందురు, లేనివారు అతనినామస్మరణము చేయుదురు.' ఇదియు చేయజాలరేని, అతనికి శరణాగతులు కండు. నిన్ను కనుపెట్టువా డొకడు—భగవంతుడు— కలడనియు, అతడే నీ తల్లియో తండ్రియో అనియు జ్ఞప్తి యుంచుకొనినగూడే చాలును.''

# V

శిష్యుడు : ''అమ్మా, ఉపదేశ మొందు టేల? ఉపదేశ మొందకయే 'కాళి', 'కాళి' అని 'స్మరించుకొనుచుండిన చాలదా? తన దివ్యనామోచ్చారణమాత్రమున జగన్మాత సాక్షాత్కరింపదా?''

శ్రీమా : ''ఉపదేశ మావశ్యకమే. అందుచే శరీరము పవిత్రమగును. ఈశ్వరనామమంత్రోచ్చారణమువలన

మానవుడు పవిత్రత నొందును. దీనినిగూర్చి యొక పౌరాణిక కథ కలదు: నారదుడు వైకుంఠలోకమునకు—శ్రీమహావిష్ణు ధామమునకు—వెళ్లెను. అత డప్పటికి ఉపదేశ మొందలేదు. కొంచెముసేపు సంభాషించి అతడు వెడలిపోగా, అతడు కూర్చుండిన స్థలమున గంగోదకము ప్రోక్షింపుమని శ్రీమహావిష్ణువు శ్రీ లక్ష్మీదేవితో చెప్పెను. 'నారదుడు భక్తాగ్రేసరుడుగదా, ఇట్లు చేయ నవసరమేమి?' అని ఆమె అడుగగా 'భక్తాగ్రేసరు డైనను అతడు మంత్రోపదేశ మొందినవాడు కాడు' అని యాయన బదులిడెను. ఉపదేశ మొందినగాని శరీరము పవిత్రత నొందదు. మనశ్శరీరములు పవిత్రతనొందుటకు గురూపదేశ మావశ్యకము.

"మంత్రోపదేశానంతరము వైష్ణవగురువులు శిష్యునితో 'ఇపుడు ఈ మనస్సు నీది'* అందురు. అంతయు మనస్సుమీదనే ఆధారపడియున్నది. అది పవిత్రమైనగాని ఏదియు సాధింపనేరము. గురువుయొక్కయు, భాగవతుల యొక్కయు, భగవంతునియొక్కయు అనుగ్రహము లభించినను, మనస్సుయొక్క అనుగ్రహాభిక్షను జీవాత్మ అర్థించు చుండును."

* ఇచట 'మంత్ర' శబ్దమునకు శ్లేషాచమత్కారార్థము కలదు. వ్యావహారిక భాషలో వంగదేశీయులు లా మాటను 'మంతర్' అని ఉచ్చరింతురు. దీనిని 'మన్' (మనస్సు) తర్ (నీది) అని విడదీసినచో ఈ యర్థము వచ్చును. 'ఇక సర్వము నీ పరిశ్రమపై ఆధారపడియుండును' అని భావము.

శిష్యుడు : "ఎందరో మంత్రోపదేశ మొందుదురు. వారికి అందుచే ఏమిఫలము కలుగును? వారు ఉపదేశపూర్వమున్నట్లే కానిపింతురు."

శ్రీమా : "ఉపదేశకాలమున మంత్రముద్వారా గురువు శిష్యునకు పారమార్థికశక్తి నిచ్చును. గురునొద్దనుండి శిష్యునకుగాని, తద్విరుద్ధమార్గమునగాని ఈ శక్తి ప్రసరించును. కావుననే ఉపదేశమొనర్చినపిదప గురువు అస్వస్థుడగును. శిష్యుని పాపము లతడు కైకొనవలసియుండును. కనుకనే ఇట్లు జరుగును. రాఖాల్ (శ్రీ బ్రహ్మానందస్వామి) ఉపదేశింపనొల్లకుండుట కిదియే కారణము. కొందఱు ఉపదేశ మొందిన వెనువెంటనే పారమార్థిక ప్రబోధముగాంతురు. కాని అది వారి పూర్వ సంస్కారములపై ఆధారపడియుండును."

శిష్యుడు : "అమ్మా, ఇది సరేగాని, (ఆధ్యాత్మిక) దృశ్యములు ఆంతరములా, బాహిరములా?"

శ్రీమా : "ఆంతరములనియే ప్రతివారును చెప్పుదురు గాని నాకీ చర్మచక్షువులతోడనే అట్టి దృశ్యములు గోచరించినవి. నేను కామార్పుకుర్ లో నున్నప్పుడు నే నెచ్చటికి పోయినను నా వెంట నొక బాలిక—తల విరియబోసికొని, మెడలో పూసలు ధరించి—వచ్చుచుండుట చూచుదానను. బేలూరులో నీలాంబరబాబు ఇంటియందు గాఢతప స్సొనర్చిన పిదపగాని ఆ దృశ్యము నిలిచిపోలేదు.

"చిత్తశుద్ధి యున్నచో ఏకాగ్రత ఏల లభింపదు? పారమార్థికదృశ్యము లేల కానిపింపవు? జపము కొంతకాల

మభ్యసించినపిదప, ధ్యానమునకు కూర్చుండిన వెనువెంటనే మంత్ర మప్రయత్నముగా లోనుండి పైకి ఉబికివచ్చుట కాన నగును. (కొంచెము ఉద్రేకముతో) దినమునకు కనీసము ఇరువై వేలసార్లు మంత్రోచ్చారణ మొనర్చినగాని ఫలము కానిపింప నారంభింపదు. ఫలప్రాప్తి తథ్యము. పురోగమనము కాన్పింపలే దని పలుకుటకుముందు సాధన లభ్యసింప వలెను. కాని జపమును కొంచెముశ్రద్ధతో చేయవలెను. జనులు సాధన లభ్యసింపకయే 'ఆధ్యాత్మికముగా నే నేల పురోగమించుటలేదు?' అని ప్రశ్నించుచుందురు.

"గాఢతపస్యానంతరము చిత్తపారిశుద్ధ్యము కలుగును. క్రమముతప్పని సాధనవలనగాని ఫల మేమియు లభింపదు. పవిత్రతయు, అపవిత్రతయు ఉండునది మనస్సునందే. తన మనస్సు దోషయుక్తమైయుండువానికే ఇతరులలో దోషములు కానిపించునది. ఇతరులలో దోషములు వెదకువానికి అందుచే ఏమి ప్రయోజనము కలుగును? అతనికే అపకారము. పసినాటినుండి నా కితరులలో దోషములు కనిపించునవికావు. ఆయొకటిమాత్రము నే నింత దనుక నేర్వలేదు. క్షమించుటే ఒక మహాతపస్య. ఒక్క విషయము జ్ఞప్తియుంచుకొనుము. మనశ్శాంతి కోరితివేని ఇతరులతప్పు లెన్నకుము. తప్పు లెన్నుదువేని, నీ తప్పులను, నీ లోపములను ఎన్నుము. ఎల్లరను నీ స్వకీయులుగనే భావించుట నలవఱచుకొనుము. పరాయివా రెవ్వరును లేరు. ప్రపంచమంతయు నీ సొంతమే."

శిష్యుడు: "అమ్మా, కొందఱుభక్తు లిట్లు పలుకుదురు:

'సేవాశ్రమములు, చికిత్సాశాలలు స్థాపించుట, పుస్తకములు, పత్రికలు ప్రకటించుట, లెక్కపుస్తకము లుంచుట మున్నగు కార్యములు సాధుజనాదర్శవిరుద్ధములు. ఇట్టి కార్యములు శ్రీరామకృష్ణు డెన్నడైన చేసెనా? వైరాగ్యప్రేరితులై ఈ సంప్రదాయములో ప్రవేశించు యువకులపై నిట్టికార్యములు త్రోయుట శోచనీయము. కార్యాచరణ మావశ్యక మేని, అది పూజాజపధ్యానాదికముగా ఉండవలెను. ఇతరవిధకార్యము లన్నియు ఐహికభావపూరితములు, భగవంతునికి వైముఖ్యము కల్పించునవి.' "

శ్రీమా : "అట్టివారి మాటలను పాటింపకుము. కార్యాచరణము లేనిచో దినమంతయు ఏమి చేయవలెను? రేయుంబవళ్లు ధ్యాన మొనర్చుచుండుట సాధ్యమా? శ్రీరామ కృష్ణుని విషయమే వేఱు. లోకోపకారక కార్య మొనర్చుచుండుట చేతనే నీకు ప్రతిదినము ఆహారము లభించుచున్నది. లేనిచో నీవు ఇంటింటికి తిరిగి మాధుకర మెత్తుకొనవలసి యుండెడిది. నీ యారోగ్య మిందుచే చెడియుండెడిది. ఇంకొక సంగతి. పూర్వకాలమందువలె ఇప్పుడు సాధువుల కెవరు భిక్ష మిడుచున్నారు? ఇట్టి యాక్షేపవాక్యములు వినిపించుకొనకుము. శ్రీరామకృష్ణుడు చూపు త్రోవనే అనుసరించుచుండుము. మఠ మిప్పటిమార్గముననే నడచుచుండును. ఈ మార్గమున కనుకూలింపజాలనివారు ఈ సంస్థ నుండి తొలగిపోవలసియుండును.

"మణిమల్లిక్ తీర్థయాత్రానంతర మింటికివచ్చి శ్రీ గురుదేవుని దర్శించెను. 'నీవు సాధువుల నెవరినైన

చూచితివా?' అని ఆయన ప్రశ్నించెను. 'చూచితిని. కాని వారు డబ్బు అడుగువారే' అని యతడు బదులుచెప్పెను. అందుపై శ్రీ గురుదేవు డిట్లనెను: 'సరేగాని, ఎంతడబ్బు అడిగిరి వారు? గంజాయికో, పొగాకుకో ఒకటిరెండు కానులే కదా! మీకు మృష్టాహారములు, సుఖములైన గదులు, చక్కని పడకలు కావలెను, వారికి చిల్లముకై ఒకకాని చాలును. అదికూడ వారి కీయగూడదా? సర్వసుఖానుభవములు మీకు కావలెను, వారి కొక కాని పొగాకుకూడ వలదా?' "

శిష్యుడు: "భోజనవిషయమున ఏమి నియమము లనుష్ఠింపవలెను?"

శ్రీమా: "శ్రీగురుదేవుడు శ్రాద్ధాహారము భుజింపవలదని భక్తులకు చెప్పువారు. అట్టి ఆహారము భక్తికి హానికరమనువారు. అది యొక్కటి తప్ప ఎట్టి ఆహారమైన కైకొనవచ్చును. కాని ముందుగా భగవంతుని కర్పించి, పిదప గైకొనవలెను. ఏమి తిన్నను భగవంతుని కర్పించి అతని ప్రసాదముగా తినుము. అట్లు చేసితివేని, నీ రక్తము పవిత్రత నొందును. రక్తము పవిత్రమైనచో మనస్సు పవిత్రమగును."

శిష్యుడు: "ధ్యానానుకూలమైన వేళ ఎద్ది?"

శ్రీమా: "ప్రాతఃసాయంసంధ్యావేళ లనుకూలములు. నియమితవేళలో ప్రతిదినము తప్పక ధ్యానించుచుండవలెను. ఈశ్వరసాక్షాత్కారము లభించు శుభముహూర్త మెప్పుడు

వచ్చునో ఎఱుగము గనుక, ఒక్కనాడైనను తప్పకూడదు. ఆ శుభముహూర్తము హఠాత్తుగా వచ్చును. వచ్చుజాడ ముందుగా నేమియు తెలియరాదు. కావున మన స్సెంత కలకబాఱియున్నను, అనుష్ఠానవేళ తప్పింపరాదు.''

శిష్యుడు: ''కాని పనితొందరలు, అనారోగ్యము అడ్డు వచ్చునుగదా. ఇవిగాక మన స్సొకప్పుడు ప్రశాంతముగను, మఱొకప్పుడు మిక్కిలి కలతనొందియును ఉండును.''

శ్రీమా : ''నిజమే. అనారోగ్యము కలిగినప్పుడు ఎవ రేమి చేయగలరు? కాని ఏ దినమైన పనితొందర లపార ముగా కలిగినయెడల, భగవంతుని తలచి ప్రణామమొనర్చిన చాలును. ఇక మనస్సు కలకబాఱుట సహజమేగదా. ప్రకృతిలోనిది గదా అది. కావున దానికి ఆటుపోటులు తప్పవు.''



*

## 2-వ ప్రకరణము

# శ్రీ బ్రహ్మానందస్వామి సంభాషణములు

మే 22, 1911

రాత్రి ఎనిమిదిగంటలు. ఈ శిష్యుడును, 'ల-' యును కలకత్తా బాగ్‌బజారులో బలరాంబోస్ ఇంటియొద్ద శ్రీ బ్రహ్మానందస్వాములవారియెదుట కూర్చుండియుండిరి.
'ల-': (స్వామితో): "మహారాజ్,* మి మ్మొకప్రశ్న మడుగదలచుకొనియున్నాను. స్వామి "ప-" నిర్యాణమునకు కొన్నాళ్లు పూర్వము 'ఉద్బోధన' కార్యాలయములో మీకు పిశాచములు కనిపించెనందురే, అది నిజమేనా?"

స్వామి: "అవును నిజమే. నా కప్పుడప్పుడు పిశాచములు కనిపించుచుండును. మేడమీదినుండి నే నొకనాడు రెండు మిక్కిలిపొడవైన ఆకారములు పడమటిమెట్లయొద్ద నిలుచుండియుండుటను చూచితిని. మనుష్యాకారములవలె నుండెనుగాని వికారముగా, అమానుషముగా, కానిపించెను. కొంచెముసేపటి కవి మాయమయ్యెను గాని, ఆ దృశ్యముచే

---

* సాధువులను "మహారాజ్" అని పిలుచుట ఆ దేశాచారము. ఇదిగాక శ్రీ బ్రహ్మానందస్వాములవారికి 'మహారాజ్' అని రూఢినామము కూడ కలదు. శ్రీరామకృష్ణసంప్రదాయములో "మహారాజ్ వాక్యమిది" అనగా "ఇది శ్రీ బ్రహ్మానందస్వామి వాక్యము" అని అర్థము.

నా మనస్సు ఆకులపాటు నొందెను. ఇంకెవరికైన నచట పిశాచములు కనిపించెనా అని విచారించితిని. ఎవ్వరికిని కనిపింపలేదు. ఆ పిదపకూడ అట్టిపిశాచముల నొకటి రెండు సార్లు చూచితిని. ఏదో అశుభసంఘటనము కలుగనున్నదని నా మనస్సు సంక్షోభించెను. మఱికొలదినాళ్లకే 'స–' నిర్యాణమొందెను.

"ఈ యింటిలోకూడ ఆ మెట్లయొద్ద నొకపిశాచము నాకు కనిపించెను. ఏదో కీడుమూడు ననుకొంటిని. నేను మఠమునకు వెళ్ళిన కొద్దినాళ్ళలోనే 'స–' భార్య మరణించెను."

శిష్యుడు: "ఢాకాలోకూడ మీ కొక పిశాచము కనిపించినదట!"

స్వామి: "అవును, మే మచట నున్న ఇంటనే. మే మచటచేరిన మఱునాడు వాకిటియొద్ద నిలుచుండియుండినది. మహమ్మదీయునివలె తోచినది. నామనస్సు కలతనొందెను. ఆ దృశ్యము మరల కలిగనేని, ఆ యింటినుండి వెళ్ళిపో నెంచితిని. కాని అది మరల కనిపింపలేదు. అచట భగవన్నామసంకీర్తనము మిక్కుటముగా జరుగుచుండెను. కావుననే కాబోలు అది పాఱిపోవుట. దుష్టభూతములు భగవన్నామమును భరింపజాలవు."

శిష్యుడు: "ఈ పిశాచమే కాబోలు 'స–' కుమారుని ఆత్మహత్యకు పురిగొల్పినది. అతనిచర్యకు తగుకారణమేదియు లేదు. ఆ బాలునికి కొంతచిత్తచాంచల్యము

కలదు. ఆ పిశాచపు ప్రేరణల నతడు ప్రతిఘటింపజాలక పోయెనేమో.

"ఒక స్త్రీ యొక వేపచెట్టుకొమ్మకు ఉరిపోసికొని చచ్చెనట. ఆ పిదప మఱొక స్త్రీ ఆ చెట్టువైపు దృష్టించి చూడ నారంభించెను. ఉన్నట్టుండి ఆమెయు ఆ చెట్టునకే ఉరిపోసికొని మరణించెను. ఒక బాలికకూడ అట్లే దృష్టించి చూడసాగగా, అది కనుగొని కారణ మడిగిరి. అందుపై ఆ బాలిక 'ఎవరో ఆ కొమ్మమీదనుండి న న్నచటికి వచ్చి ఉరిపోసికొమ్మని చెప్పుచున్నారు' అని తెలిపెను. వెంటనే ఆ చెట్టును కొట్టివేసిరి. అంతటితో ఆ పీడయు తొలగి పోయెను."

'ల-' : "మహారాజ్, మీరు ఇతరభూతములనుకూడ చూచితిరా?"

స్వామి : "ఉపకారకములను అపకారకములను కూడ చూచితిని. నేను దక్షిణేశ్వరమున శ్రీ గురుదేవుని యొద్ద ఉండగా, దేవాలయములోనివాని కొకనికి మిక్కిలి జబ్బుచేసెను. అతనివారు ఎవ్వరును లేనందువలన నే నతని విచారణ వహించితిని. ఒకరాత్రి అతని తపన అపార మాయెను. ఉపశాంతి కలిగించుమార్గ మింకేదియు తోపక భగవన్నామస్మరణ మారంభించితిని. కొంతసేపు జపించిన పిదప నా కొకవిధమగు నిద్రపట్టెను. ఆ నిద్రలో నొకదృశ్య మును గంటిని : ఒక పండ్రెండేండ్ల బాలిక వచ్చి నా ప్రక్కన

నిలుచుండెను. 'ఇతనికి బాగగునా?' అని యడిగితిని. ఆమె తల ఆడించి 'అవును' అని యంతర్ధానమయ్యెను. ఆ మఱు నాటినుండి అతనికి నెమ్మదింపనారంభించెను.

"నేను బృందావనమున నుండగాకూడ నొక ఉపకారకపిశాచమును చూచితిని. మే ముండినయిల్లు 'పిశాచి గల్లీ' అను నొకసందులో నుండెను. హరిమహారాజ్ (తురీయానందస్వామి) నాగదికి ప్రక్కగదిలో నుండెను. ఆ కాలమున నేను అర్ధరాత్రమున లేచి జపముచేయువాడుక. అట్టివేళలయందు నాప్రక్కనే నిలుచుండి జపమాలతో జపముచేయు వైష్ణవపిశాచ మొకటి నాకు పలుమాఱు కనిపించుచుండెను. ప్రాయికముగా ప్రతి రాత్రియు నా కది కనిపించెడిది. నా కేమియు వెఱపు కలుగలేదు. ఒకరాత్రి మిక్కిలి బడలి గాఢనిద్ర నందియుంటిని. హఠాత్తుగా నన్నెవరో బలిష్ఠముగు త్రోపు త్రోయగా, నేను పడుకనుండి క్రిందపడితిని. 'లెమ్ము, పంద్రెండు కొట్టినది. జపముచేయవా ఏమి?' అను మాటలుకూడ ఎవరివో వినవచ్చెను. ఆ త్రోపుకు నేను మేల్కాంచితిని. దేవాలయములో అర్ధనిశాగీతికలు ధ్వనించుచుండినవి. నన్నిట్లు లేపియుండనిచో, నే నారాత్రి పంద్రెండుగంటలకు మేలుకాంచియుండజాలను.

"కాశిలోనే మఱొకమనోహరదృశ్యానుభూతియు నాకు కలిగినది. సేవాశ్రమములోని ప్రధానసభాగారమునందు రామనామసంకీర్తనము జరుగుచుండెను. ఆవాహన శ్లోకములు ప్రారంభించి ప్రారంభింపకముందే ఒక వృద్ధుడు

మెల్లగా ప్రవేశించి శ్రీరామపటముప్రక్కన కూరుచుండెను. ఆయన నంతకుముం దెప్పుడుగాని నేను చూచియెఱుగను. అందుచే రెండుమూడుసారు లాయనను పాఱజూచితిని. పిదప కొన్నిక్షణముల కాయన అచట లేడు. రామనామ సంకీర్తనము జరుగుతావులకెల్ల మహావీరుడు (హనుమంతుని కా దేశపుపేరు) వచ్చుచుండునని నా కప్పుడు జ్ఞప్తికివచ్చినది. అప్పుడు వచ్చినది ఆయనయేనేమో! తులసీదాసుకుకూడ ఇట్టి దృశ్యమే కానిపించెను."

శిష్యుడు: "మహారాజ్, అదేమిటో కొంచెము సెలవిండు."

స్వామి: "తులసీదాసు ఒకచెట్టుకు ప్రతిదినము నీళ్లు పోయుచుండెను. ఆ చెట్టునం దొక భూతము నివసించుచుండెను. మిక్కిలి ఆనందించి అది యొకనాడు తులసీదాసుకు కానిపించి 'నీయెడ సంప్రీతుడనైతిని. నీ కేమి వలయునో చెప్పుము' అని యడిగెను. అందు కాయన 'శ్రీరామదర్శన మొక్కటే నాకు వలయును, అది లభించు మార్గము తెలుపుము' అనెను. అందుపై అది 'నీ కా దర్శనము చేకూర్చుట నా కశక్యము. కాని ఒక ఉపాయము చెప్పెదను. కాశిలో రామాయణపారాయణ మనుదినము చేయు ప్రదేశ మొకటి కలదు. మహావీరు డచటికి దినము తప్పక వచ్చుచుండును. ఆయన నాశ్రయింపుము. నీకు శ్రీరామదర్శన మాయన చేకూర్పగలడు' అని చెప్పెను. 'కాని ఆయనను గుఱుతుపట్టు టెట్లు?' 'అందఱికన్న

ముందుగా వచ్చును. వృద్ధబ్రాహ్మణవేషమున నుండును. ప్రతిదిన మొకేమూలలో కూరుచుండును. అందఱు వెళ్ళిన పిదప వెళ్లును.'

"తులసీదా సా ప్రదేశమునకు పోయి, ఆ భూతము వివరించినట్లే మహావీరుడు వచ్చి కూర్చుండుటను చూచెను. మహావీరుడు వెడలిపోబోవుచుండగా, తులసీదా సాయనపాదములు పట్టుకొని 'మిమ్ము గుర్తించితిని. శ్రీరామదర్శనము నాకెచట లభించునో తెలిపి నన్ను ధన్యునొనర్పుడు' అని యడిగెను. చాలసేపు వేడుకొన్నమీదట 'చిత్రకూటపర్వతమునకు పొమ్ము, నీకచట రామదర్శన మగును' అని హనుమంతుడు చెప్పెను.

"తులసీదా సట్లే చిత్రకూటమున కరిగెను. అచట నొకరాత్రి కాఱడవిలో నుండగా దూరపు సంగీతధ్వనులు వినవచ్చెను. విచారింపగా అది రామలీలాసంకీర్తనమని తేలెను. అంత నత డక్కడకు వెళ్లగా, సీతారామలక్ష్మణులు కూర్చుండియుండిరి (వారు పాత్రధారులని యతనికితోచెను), రామలీలాసంకీర్తనము నడచుచుండెను. తిరుగవచ్చి పర్వతాగ్రమున నడచుచుండిన రామలీలాసంకీర్తన మెంతమనోహరముగా నుండెనో ఇతరులకు తెలిపెను. వా రందుపై అతనితో నిట్లనిరి : 'నీకు మతిపోయినదా ? అది నిర్జనప్రదేశము, దుర్గమారణ్యము. అచట రామలీలా సంకీర్తనము నడచుటేమి ?' తులసీదా సప్పుడు గ్రహించెను: తాను చూచినది శ్రీరామచంద్రమూర్తినే!"

శిష్యుడు స్వామిపాదములకు ప్రణమిల్లి వెళ్ళి పోయెను.

ఏప్రిల్ 25, 1913

కొన్ని స్వవిషయకప్రశ్నము లడుగుటకై స్వామిని నేడు శిష్యుడు ఏకాంతముగా కలిసికొని "మహారాజ్, మనస్సును నిశ్చలపఱచుకొనుట నాకు అసాధ్యముగా నున్నది" అని చెప్పుకొనెను.

స్వామి: "ప్రతిదినము కొంచెము జపధ్యానముల నభ్యసింపుము. ఒక్కదినమైన తప్పకూడదు. మనస్సు అశాంతిశీలమగు బిడ్డవంటిది. అది పాఱిపోవజూచుచుండును. మాటిమాటికి దానిని వెనుకకుమరల్చి భగవద్ధ్యానాయత్తముగా నొనర్పవలెను. రెండుమూడేండ్లు ఇట్లు చేయుము. అప్పుడు నీ మనస్సు అనిర్వాచ్యమగు ఆనందముతో నిండి పోవును. జపధ్యానములు ప్రారంభదశలో చప్పిడిగా తోచును. కాని చేదుగానుండు ఔషధమునుబోలె నీ మనస్సు చేత భగవద్ధ్యానము చేయింపవలెను. క్రమక్రమముగా పారమార్థికానందము నీలో అభివృద్ధినొందును. పరీక్షలలో గెలుపొందుటకై జను లెంత పరిశ్రమచేయుదురు! భగవత్సాక్షాత్కారముపొందుట అంతకన్న సులభము. కాని నిశ్చలము, ఉల్లాసవంతము, అగు హృదయముతో అతనిని చేరబోవుచుండవలెను."

శిష్యుడు: "మహారాజ్, మీమాటలచే నాకు ధైర్యము కలుగుచున్నది. కాని నా కొక్కొక్కసారి ఏమియు

తోపక, నా ఆధ్యాత్మిక సాధన లన్నియు, ఉన్నతానుభూతి రహితములు గావున . నిష్ప్రయోజకములని తలచుచుందును.''

స్వామి : ''కాదు, కాదు. అధైర్యపడవలసిన అవసరమే లేదు. పరిశ్రమమునకు ఫలము కలిగితీఱును. ఆయన దివ్యనామమును విడువక స్మరించుచుంటివేని,—అది మనస్సునకెక్కినదైనను, కాకపోయినను—ఫలము తప్పదు. అభ్యాసములందు శ్రద్ధచూపుము. సక్రమముగా కొంతకాల మిట్లు చేయుము. శాంత్యానందములు చవిచూతువు. ధ్యానఫలముగా మనశ్శాంతియేగాక దేహారోగ్యముకూడ లభించును. జబ్బులుచేయుట తగ్గిపోవును. కావున దేహస్థితిని బాగుపఱచుకొనుటకైనను ధ్యానాభ్యాస మొనర్చితీఱవలెను.''

శిష్యుడు : ''మహారాజ్, గురునొద్ద మంత్రము కైకొనుట అవసరమా ? ఎవని పారమార్థికభావాను సారముగా వాడు పరిపూర్ణశ్రద్ధతో సాధన లభ్యసించిన చాలదా ?''

స్వామి : ''మంత్రోపదేశముచే మనస్సుయొక్క కేంద్రీకరణము సులభమగును. లేనిచో నీ మనస్సు మార్పు లొందుచు, చంచలముగానుండును : నేడు కాళీరూపము మీదికి, రేపు హరిరూపముమీదికి, ఆమఱునాడు నిరాకార బ్రహ్మముమీదికి పోవునేమో ! నీ మనస్సు ఏదోయొక భావముపై నిశ్చలముగా నిలువదు...''

కలకత్తాలో బాలికాపాఠశాల స్థాపించిన యొక స్త్రీనిగూర్చి ఆ సాయంకాలము స్వామి మాటలాడెను. కొన్ని విషయములలో ఆమెకు మిక్కిలి పట్టుదల. ఇతరులెవ్వరిని ఆమె నమ్మదు. సులభముగా కోపగించుకొనును. కొలువుకా డెవడును ఆమెయొద్ద పెక్కుదినము లుండడు. ఆమెకు తోడ్పడుచున్న కొలదిమందికూడ ఒకరొకరుగా వెళ్లిపోవుచున్నారు. స్వామి యిట్లనెను: "ఇది యొకవిధమగు వెఱ్ఱి. ప్రతికార్యము సొంతముగా చేయదలచుకొనువాడు తన శక్తి నంతయు స్వల్పాంశములందే కోల్పోయి, ముఖ్య విషయములు సమాహితబుద్ధితో విచారింపజాలడు. కర్మయోగము మిక్కిలి కష్టమైనది. నిశ్చలబుద్ధి, త్యాగసమృద్ధి, నిస్సంగత్వము గలవానికే అది సాధ్యము. ఇవి లేనివాడు భ్రంశమునొందును. నిజమునకు ఈశ్వరసాక్షాత్కారమొందినవా డొక్కడే కర్మాచరణయోగ్యుడు. స్త్రీలతో పనిచేయుట మిక్కిలికష్టము. ఎట్లో వా రితరులపై అధికారము చూపజూతురు."

ఏప్రిల్, 30

అపరాహ్ణవేళ. బేలూరుమఠము. స్వామితో శిష్యు డిట్లు విన్నవించుకొనెను: "మహారాజ్, జపధ్యానము లొకే సారిగా చేయుచుండుమనిరి. కాని ధ్యానము నాకు సాధ్యమగుటలేదు. ఇందుచే, నాకు మిక్కిలి ఖేదము కలుగుచున్నది. మూడువిధములుగా నేను ధ్యానము చేయగలను: ధ్యేయునిలో ఏదోయొక భాగముమీద—పాదములపైనో,

కనులపైనో, ముఖముపైనో—మనస్సునిలుపుట మొదటి విధము. ఒక్కభాగము పిదప మఱొక్కభాగముపై—పాదాది శిరఃపర్యంతము, శిరోది పాదపర్యంతము—మనస్సునిలుపుచు పోగలను. ఇట్లు పెక్కుతడవలుకూడ చేయగలను. ఇది రెండవవిధము. ఇక మూడవది : ఆయన మూర్తియంతయు నా హృదయకమలముపై విశ్రమించియున్నట్లు భావించి ధ్యానింపగలను. ఈ మూడవదానిలో మూర్తి విస్పష్టముగా నుండక నీడవలె నుండును. ఐనను ఆయనహృదయాసీనుడై యున్నాడను భావము మిక్కిలి ఆనందము నిచ్చును. ఈ మూటిలో ఏది యెక్కువ గుణవంతమో తెలిపి నన్ను కృతార్థుని చేయుడు.''

స్వామి : ''ఈ ప్రశ్నలు నీ గురువు నడిగిన మంచిది. ఆమె సమాధానములు, నా సమాధానములు ఏకీభవింపక పోవచ్చును. త్వరలోనే ఆమె కలకత్తాకు రానున్నది.... మనస్సు అప్పుడప్పుడు ఖేదమునొందుట చిత్రము కాదు. దక్షిణేశ్వరములో నుండగా నాకును అట్టిస్థితి యొకతడవ తటస్థించెను. నే నప్పుడు మిక్కిలి చిన్నవాడను. శ్రీ గురుదేవునికి ఏబదేండ్లుండును. కావున నాలోని ఆరాటమంతయు ఆయనకు తెలుపజాలకపోవుట సహజమేగదా. ఒకనాడు కాళికాలయములో ధ్యానస్థితుడనై యుంటిని. మనస్సు ఏకాగ్రము కాలేదు. మిక్కిలి చింతాక్రాంతుడనైతిని. అప్పుడు నాలో నే నిట్లనుకొంటిని : 'ఇచట ఇంతకాల ముండియు, ఏమియు సాధింపజాలక పోయితిని. ఇంకను ఇచటనే ఉండి నే నేమి చేయుదును? సరి, శ్రీగురుదేవునితో

ఈ సంగతి యేమియు ప్రస్తావింపను. ఇంకను రెండు మూడు నాళ్లు చూచెదను. అప్పటికిని నా స్థితియందు మార్పేమియు కలుగనిచో, ఇంటికి పోయెదను. అచ్చట నా మనస్సు నాక్రమించు విషయము లెన్నో యుండును.' ఇట్లాలోచించుకొని శ్రీగురుదేవునిగదికి వచ్చితిని. ఆయన అప్పుడు వసారాలో పచారుచేయుచుండెను. నన్ను చూచుటతోడనే తన గదిలోనికి వచ్చెను. కాళికాలయమునుండి వచ్చుటతోడనే ఆయనకు మ్రొక్కి ఆ పిదప కొంచెము భోజనము చేయుట మా కప్పుడలవాటు. ఆచొప్పున నే నాయనకు ప్రణమిల్లి నిలుచుండినవెంటనే ఆయన యిట్లనెను: 'నీవు ఆలయమునుండి తిరిగివచ్చినప్పుడు నీ మనస్సు నేదియో కమ్ముకొని యున్నట్లుండెను.' నా స్థితి యంతయు ఆయనకు తెలిసిపోయినదని కనుగొని ఇట్లు విన్నవించుకొంటిని: 'మీ రంతయు ఎఱుగుదురు. నా మనస్సు అట్టిస్థితియందే ఉన్నది.' ఇది విని ఆయన నా నాలుకపై ఏమో వ్రాసెను. అనుక్షణముననే తొల్లిటి మనఃస్థితియంతయు అదృశ్యమై అనిర్వాచ్యానంద మగ్నుడనైతిని.

"ఆయనతో నున్నంతకాలము నా కీశ్వరస్మృతి, ఈశ్వరచింతనము అప్రయత్నముగా లభించుచుండెను. ఎప్పుడును ఆనందపారవశ్యస్థితియే! శక్తిమంతుడైన—భగవత్సాక్షాత్కారముగన్న — గురు వుండుట ఆవశ్యకమనునది ఇందుచేతనే. శిష్యునకు మంత్రోపదేశ మొనర్చుటకుముందు, గురుశిష్యు లొండొరులను చక్కగా—చాల కాలము—పరీక్షించుకోవలెను. లేనిచో పిదప పశ్చాత్తాప

కారణ మేర్పడవచ్చును. ఈ గురుశిష్యసంబంధము శాశ్వత మైనదిగదా!

"నా శిష్యత్వ మపేక్షించువానిని నేను మొదట అంగీకరింపక పంపివేయుదును. అతడు అంతటితో విడువక పట్టు పట్టినచో, ఈశ్వరనామ మొకటి ఉపదేశించి, దానిని దినమునకు వేయిసారు లొక సంవత్సరకాలము ఉచ్చరించుచుండుమందును. ఇంతమాత్రముననే బెదరి యెందఱో మానుకొందురు...శిష్యునికి మంత్రోపదేశము చేయుటకు గురువు చాల శ్రమింపవలెను. మొదటిసంగతి ఆ శిష్యుని కనుకూలించు మంత్రమును, ఇష్టదైవమును కనిపట్టవలెను.* ఇది కష్టసాధ్య మైనపని. ఒకనా డొకడు మంత్రోపదేశార్థము నా యొద్దకు వచ్చెను. ధ్యానమునం దతని యిష్టదైవము నెఱుగగలిగినగాని ఉపదేశ మొనర్పరాదని యెంచి ధ్యానస్థితుడ నైతిని. గంటసేపు ధ్యానించినపిదప నా మదిలో నొక ఆకృతి గోచరించెను. తనకు ప్రియతమ మగు దైవరూప మదియే అని ఆ శిష్యుడు పిదప చెప్పెను....అనేకులీ కాలమున మంత్రోపదేశము గైకొన్నపిదప (సాధనలేమియు చేయక) ఊరకుందురు. యోగ్యాయోగ్యవివేచన లేక, వచ్చినవారి కందఱికి ఉపదేశ మొనర్చుట అనుచితము."

---

* మనుష్యుని యొక్క బుద్ధియు, ఆత్మయు పొందియుండు పరిపాకదశనుబట్టి, ఈశ్వరభావములలో ఏదోయొకదాని నుపాసించుట అతని పారమార్థికాభివృద్ధికి తోడ్పడునదై యుండును. ఆ ఈశ్వరభావమే అతని యిష్టదైవము. ప్రతి ఈశ్వరభావమునకు సంబంధించిన నిగూఢార్థవరవ్యూహ మొకటి యుండును. అదియే మంత్రము.

"గాఢసాధన లొనర్చుచుండుము. మొదటిలో పార మార్థిక సాధన లాచరించుట కేవలక్లేశకరమై యుండును — అక్షరాభ్యాస మొనర్చునప్పటివలె. కాని కాలక్రమమున మనశ్శాంతి లభించును. ఉపదేశఫల మేమియు కలుగలే దని మొఱ పెట్టుకొనువారి మాటలు మొదటి రెండుమూడేండ్లు నేను వినిపించుకొనను. ఆ పిదప వారే పురోగమనము కలుగు చున్నదని యంగీకరింతురు. అధైర్యపడి వ్యాకులపడ నవసరమే లేదు. రెండుమూడేండ్లు సాధనలు సాగింపుము. ఆ పిదప నీకే తెలియవచ్చును."

మే, 4.

స్వామి బేలూరుమఠములో కొందఱు సాధువులతోను భక్తులతోను సంభాషించుచుండెను. 'క–' అను న్యాయవాది తన సాధనలనుగూర్చి స్వామిని పెక్కువిషయములు అడుగు చుండెను. స్వామి యిట్లు బదులుచెప్పెను :

"వేగిర పెట్టుకొనుట నిష్ప్రయోజనకరము. సరియగు తరుణము వచ్చువఱకును ఏమియు జరుగదు. ఆ లోపలి మనఃస్థితి నిజముగా దుర్భరమే: ఒకప్పుడు ఆశ, మఱొకప్పుడు నిరాశ; ఒకప్పుడు చిఱునగవులు, మఱొకప్పుడు ఏడుపులు, కన్నీళ్లు. మహాత్ముడగు గురువు లభించెనేని, అతడు కొన్ని పారమార్థికవిధానము లవలంబించి నీ మనస్సును కొంత ఉన్నతదశ కెక్కింప గలుగును. కాని, ఉచితతరుణము రాకముం దైనను, అత్యున్నతదశకైనను, ఎక్కించినచో, నీవు తాళజాలవు. మథుర్‌బాబువిషయ మిందు కుదా

హారణము. శ్రీ గురుదేవుని కెన్ని అలోకసామాన్యశక్తు లుండెడివి! అప్పుడు ఆ శక్తులయొక్క యథార్థతత్త్వము నెఱుగలేక అవేవియో విశిష్టలక్షణమాత్రములని మేము తలచుచుంటిమి. వాని మహాద్భుతత్వ మిప్పుడు గ్రహింప గలుగుచున్నాము. ఒకనాడు నేనాయనతో 'కామవికార మును నిర్మూలింప జాలకున్నాను. ఏమి చేయుదును?' అని యంటిని. అస్పష్టవాక్కు లేవియో తనలోతా నుచ్చరించు కొనుచు ఆయన నా హృదయసీమను స్పృశించెను. అంతటితో నా కామవికారము శాశ్వతముగా అంతరించెను! దాని జాడయే మరల పొడచూపలేదు. ఇందలి యద్భుతత్వము గోచర మగుచున్నదా?

"ప్రాణాయామాది యోగసాధన లీకాలపు స్థితి గతుల కనుకూలింపవు. నిష్ఠురబ్రహ్మచర్య మనుష్ఠింపగల వానికిగాని అవి ఆచరణీయములు కావు. ఆహారము అపవిత్రతాస్పర్శయే లేక కేవలసాత్త్వికమై యుండవలెను. పరిపూర్ణనైపుణ్య మార్జించిన గురువు వలయును. ప్రారంభ దశయందు ధ్యాన మనగా, మనస్సుతోడి పోరాటమే: అది మాటిమాటికి పాఱిపోవుచుండుటయు, మనము దాని నీశ్వర పాదారవిందములకడకు లాగుకొని వచ్చుచుండుటయు. ఈ ప్రయాసముచే కొంచెము సేపటికే మెదడు కాగిపోవును. కావున ప్రథమదశయందు మెదడుకు మితిమీఱిన శ్రమ కల్పింపరాదు; ఊపిరినికూడ విస్తారముసేపు బిగింపరాదు. యథార్థధ్యాన మలవడినప్పుడు మూడునాలుగు గంటలసేపు

కూడ ధ్యానింపవచ్చును. ఆపిదప నిశ్చలగాఢనిద్రానంతరము పోలె మనశ్శరీరములు సేదదేఱి వినూత్న తేజముతో విరాజిల్లును.

"మనశ్శరీరములకు సన్నిహితసంబంధము గలదు. జీర్ణకోశము పసిదక్కియున్నచో, చక్కగా ధ్యానము చేయుట అసాధ్యము. కావుననే ఆహారనియమము లెన్నియో యేర్పఱుపబడినవి. జీర్ణకోశములో సగమువఱకే ఆహారము, నాలవపాలువఱకే జలము; తక్కిన నాలవపాలు వాయు చలనార్థము వట్టిదిగా విడువవలెను.

"పాపచర్యలు తలపునకు తెచ్చుకొని మనస్సును క్లేశపఱచుకోవలదు. ఏలన, ఆపాప మెంత ఘోరమైనదిగా నున్నను, ఆ ఘోరత మానవదృష్టికేకాని ఈశ్వరదృష్టికి కాదు. ఒక్కచూపుతో కోటిజన్మముల పాపములను ఆయన పటాపంచలు చేయగలడు. కాని కర్మఫల మనున దొకటి కలదుగదా. దుష్కర్మఫలముగా, మనశ్శాంతి కోల్పోవుట మున్నగువాని ననుభవింప వలసియుండును.

"వైష్ణవుల పారమార్థికసాధనలు చక్కనివి. వారు ప్రాతఃకాలము మొదలు రాత్రివఱకును శ్రీకృష్ణలీలా చింతనము చేయుచుందురు. ఈ మార్గమున విసుగునకు తావులేదు. కాని ఒక విధమగు అపాయముమాత్ర మిందు కలదు. శ్రీ రాధికా సఖీభావమున స్త్రీవేషము దాల్చి స్త్రీజీవనము చేయుటమాత్రము పతనహేతు వగును."

మే నెల నడిమిభాగము.

ప్రాతఃకాలధ్యానానంతరము స్వామి బేలూరుమఠ మందు తన గదిలో విశ్రమించియుండెను. కొందఱు సాధువులును ఈ శిష్యుడును ఆయనముందట క్రింద కూర్చుండి యుండిరి. "మీరు తెలియగోరు విషయములనుగూర్చి ప్రశ్నింపుడు" అని స్వామి పలికెను.

శిష్యుడు : "మహారాజ్, ఈశ్వరభక్తి సాధించు టెట్లు?"

స్వామి : "భక్తజనసాంగత్యముచేత. వారి మార్గములనుగమనించి, నీ జీవితమున వాని ననుసరింపవలెను. సందేహములు వారి నడిగి తీర్చుకోవలెను. వారంతట వారు చెప్పు మాటలు వినుచుండుట చాలదు. బ్రహ్మచర్యమును, ఆధ్యాత్మికసాధనలను అభ్యసింపుము. లేనిచో పారమార్థిక బోధ నీ జీవితమున ఫలింపదు. కేవల పఠనమాత్రమున శాస్త్రములయొక్క తాత్త్వికార్థము నీకు బోధపడదు. 'శ్రీ శ్రీరామకృష్ణకథామృతము' మున్నగు గ్రంథములు చదివి వాని భావమును గ్రహింప యత్నింపుము. చదువుకొలది వానియందు గంభీరమగు అంతరర్థములును, వినూత్నార్థములును నీకు స్ఫురించుచుండును. ఇతరులపలుకులు వినుటచే సాధకునకు కలుగు ఈశ్వరభావ మొకరీతిది; సాధనాభ్యాసముచే కలుగు భావము వేఱొకరీతిది; ఈశ్వరసాక్షాత్కారసిద్ధిచే కలుగు భావము ఇంకొకరీతిది. నాగమహాశయుడు (శ్రీరామకృష్ణశిష్యులలో నొకరగు దుర్గాచరణనాగ్ అను

నతడు) 'లంగరు వేసిన పడవను తెడ్లువేసి నడపజూచుటవలన నేమి ఫలము?' అని మనోహరముగా పలికెను. ఎంతో అదృష్టవంతులకుగాని మనుష్యత్వము, ముముక్షుత్వము, మహాపురుషసమాశ్రయము అను మూడును లభింపవని శ్రీ శంకరులవారు చెప్పియున్నారు. నాగమహాశయుని వాక్యము మఱొకటికూడ కలదు: 'కీర్తి నార్జించుట సులభము. దానిని విడనాడుట మిక్కిలి కష్టము. విడనాడగలవాడు నిజమగు సాధువు' "

ఒక భక్తుడు: "కామవికారమును జయించు టెట్లు?"

స్వామి: "భగవన్నామస్మరణముచేత, భగవన్నామ చింతనముచేత. తెలిసినదా?"

భక్తుడు: "దాని నే మార్గమునను జయింప జాలకున్నాను."

స్వామి: "అట్లయినచో పెండ్లాడుము. నిరంతరము తర్కించుకొనుచుండుము. ఇతరు లెన్నియో సాధించుచున్నారే, నీ వేలసాధింపరాదు ? సాధించితీఱవలెను. నీకే మార్గములు ఇష్టములో ఆమార్గములలో—ధ్యానము, నామజపము, సంకీర్తనము —అతని నావాహనము చేయుము. సందేహమున కెడ మీయకుము, ఆత్మవిశ్వాసమును వీడకుము."

శిష్యుడు: "ఏకాంతప్రదేశమునకో, నెమ్మదిగానుండు నొక మూలకో, పోయి విలపించుచు భగవంతునికి విన్నవించుకోవలెనని శ్రీ గురుదేవుడు పలుకువాడు. భక్తులతో

సాంగత్యము చేయుట, ఏకాంతస్థలమున కేగుట : ఈ రెంటిలో దేనికి ప్రాముఖ్య మీయవలెను?''

స్వామి : ''ఏకాంతస్థలధ్యానముచే మనస్సు సులభముగా అంతర్ముఖ మగును, లేనిపోని తలంపు లంతగా ప్రవేశించి దానిని కలవరపెట్టవు. కాని సర్వకాలములందును, సర్వప్రదేశములందును భక్తసాంగత్యము చేయుచుండవలెను. కొంత పురోగమించువఱకు కేవల మేకాంత మగు ప్రదేశమున నీవు నివసింపజాలవు. యుక్తకాలమునకుముందు నిర్మానుష్యస్థలవాస మాశ్రయించి మతిభ్రష్టు లైనవా రెందఱో కలరు. మొన్న నొకనాడు చెప్పినట్లు సమాధ్యవస్థలోను, భగవంతునందును, మనస్సు మునిగి అదృశ్యమగు దనుక, కేవల నిర్జనప్రదేశమున నెవ్వరును ఉండజాలరు. సాధుసంగములో గల ఉపయోగములలో నొకటి వారి శీలమును నీవు కనుపెట్టి చూడగలవు. సాధుజనమార్గపరిశీలనమువలన కలుగు భావవిస్పష్టత పుస్తకపఠనముచే కలుగజాలదు. అధరచంద్రసేను (శ్రీరామకృష్ణశిష్యులలో నొకరు) ఒక స్కూళ్ల సబ్ ఇన్స్పెక్టరుతో కూడి శ్రీ గురుదేవునికడకు పలుమాఱు వచ్చువాడు. ఆ సబ్ ఇన్స్పెక్టరు కొక విధమగు మైమఱపు పెక్కుసార్లు వచ్చెడిది. ఒకనాడు వారు వచ్చిన కొంచెము సేపటికి శ్రీ గురుదేవుడు సమాధిస్థితుడయ్యెను. అప్పటి మహానందానుభూతిని ఆయన తనలో నిముడ్చుకో జాలకపోయెనో యన్నట్లు ఆయన ముఖము దివ్యదరహాస విరాజిత మయ్యెను. ఇది చూచి అధర్ బాబు తన మిత్రునితో నిట్లనెను: 'నీ మైమఱపు నాకు అసహ్యముగా నుండెను; నీ

వేదో మహావేదన ననుభవించు చుండినట్లు తోచెను. దివ్య పారవశ్యస్థితి వేదనాకారణ మెన్నడైన నగునా? శ్రీ గురుదేవునియొక్క ఆనందపారవశ్యము నా కన్నులు తెఱచినది. ఆయనమైమఱపుకూడ నీ మైమఱపువంటిదిగనే ఉండినచో, మఱెప్పుడును ఇచటికి రాజాలకపోయి యుందును.'

"ఒక మనుష్యుడొకతడవ త్రైలింగస్వామిని దర్శించెను. ఆయన అతనితో ఏమియు మాటలాడకపోవుటచే తన రాక వ్యర్థమైనదని అతడు తలచెను. కాని ఇంకొకసారికూడ పోయి అచట కూర్చుండెను. ఉన్నట్టుండి స్వామి అమితముగా ఏడువసాగెను. పిదప ఉన్నట్టుండి అమితముగా నవ్వసాగెను. ఇదిచూచి అత డిట్లు తలచెను: 'ఆహా! నేడు నా కబ్బిన పాఠము వేయిగ్రంథములు చదివినను అబ్బియుండదు. స్వామి ఏడ్చినప్పటివలె భగవంతునికై నేను ఆవేదన పడిననాడు నాకు ఆయన దర్శనము లభించును. భగవదనుగ్రహము నాకు ప్రాప్తించిననాడు స్వామి నవ్వినప్పు డనుభవించినంతటి యానందము నేనును అనుభవింతును.' "

ఒక భక్తుడు: " 'వేగిరపెట్టుకొనుట నిష్ప్రయోజనకరము, సరియగుతరుణమువచ్చువఱకును ఏమియు జరుగదు' అని మొన్న చెప్పితిరి. భగవంతునికొఱకు ఆవేదనపడుట మానుకొను మనియేనా దీని కర్థము?"

స్వామి: "ఏదో సందర్భమున నే నట్లు చెప్పియుందును. 'వేగిరపెట్టుకొనుట' అని నే నన్నది అస్థిరమగు తాత్కాలికావేదనను గూర్చి. అట్టి సందర్భములలో

ఏడుపు మొదలగు బాహ్యలక్షణములు కానిపించును. కొలది నాళ్లకా అవస్థ మాఱి మానవుడు నిరాశాపూరితుడై జడత్వము నంది ఈశ్వరాన్వేషణమునే మానుకొనును. 'గ-' విషయ మిందు కుదాహరణము. ఒకప్పు డతడు మిక్కుటముగా సాధన లొనర్చెను. కాని ఇప్పు డతని కోరిక సంస్కృతవ్యాకరణమునేర్చి విద్వాంసుడు కావలెనని. పాండిత్యప్రదర్శనముచే యశస్సు నార్జించుకొను వాంఛ కాబోలును.''

శిష్యుడు: ''బావి త్రవ్వగోరి, వేర్వేఱుచోట్ల గుంటలు పెట్టువాడు నీటిని సాధింపలే డని శ్రీ గురుదేవుడు పల్కు వాడు.''

స్వామి: ''నిజమే. ఏదో ఒకదానిపై నిలుకడ ఉండ వలెను. ఈశ్వరప్రేమచే ఆవేదనపడువా డొకవేళ ఆయన సాక్షాత్కారమును పొందజాలకపోయినను, ఆయనను మఱవ జాలడు. సాక్షాత్కారములేక లక్షలాది జన్మములు గడచి నను అతడు తన కృషిని మానుకొనడు. 'కుండలినీప్రబోధము అల్పముగా కలుగుట అపాయకరము' అని స్వామిజీ* చెప్పి యున్నాడు. కుండలిని ఊర్ధ్వతరక్షేత్రముల కెగసినగాని కామక్రోధాది క్షుద్రమనోవికారములు మిక్కిలి బలిష్ఠము లగును. కావుననే వైష్ణవసాధనలలోని మధురభావము, సఖీభావము అపాయకరములు. శ్రీ రాధాకృష్ణుల ప్రణయ

* శ్రీరామకృష్ణ సంప్రదాయపరిభాషయందు 'స్వామిజీ' అను మాటకు 'శ్రీవివేకానందస్వామి' అని యర్థము.

లీలలపై బుద్ధి నెప్పుడును చొన్పువారు కామోద్రేకము నాపుకొనజాలక భ్రంశ మొందుదురు. చాలకాల మిట్టి సాధన లభ్యసించి చివర కొక అయోగ్యురాలిని పెండ్లాడినవాని నొకనిని నే నెఱుగుదును. కావున ప్రారంభదశలో, సాధకులు శ్రీకృష్ణుని గోపికాక్రీడలు వర్ణించు గ్రంథములు చదువ రాదు.

"ధ్యానము సులభమా? భోజనము కొంచెము అధిక మయ్యెనేని, మనస్సు నిలుకడ నొందజాలదు. అరిషడ్వర్గమును అదుపులో నుంచుకొనగలవానికే ధ్యానము సాధ్యము. వానిలో ఏది ప్రకోపించినను, ధ్యాన మసాధ్య మగును. రెండు కానుల పిడకలు కొని వెలిగించి వానిమధ్య కూర్చుండుట (అనగా, 'పంచాతప' తపస్సు) సులభమే, ఇంద్రియములకు లోబడక నిగ్రహించుటే యథార్థతపస్సు. అదియే అత్యు త్కృష్టమగు తపస్సు. దుష్టభావము లెప్పుడైన నొకసారి మనస్సులో రేకెత్తినంతమాత్రముననే ఖేదము నొందకుము. వానిని లక్ష్యపెట్టవలదు."

మే, 27.

బేలూరుమఠములో స్వామి మాటలను శిష్యు డాల కించుచుండెను. స్వామి ఇట్లు చెప్పెను:

"అహో! శ్రీ[illegible]ని సత్యనిష్ఠ యెంత అగాధము! ఒకవేళ 'ఇకను తినను' అని పలికెనేని, ఆకలి యగుచున్నను ఆయన తిన నశక్తుడగును. ఒకనా డాయన యదుమల్లిక్

ఇంటికి వత్తు నని చెప్పి పిదప ఆ సంగతినే మఱచిపోయెను. నేనుకూడ జ్ఞప్తిచేయలేదు. రాత్రి భోజనానంతరము ఆ మాట ఆయనకు జ్ఞప్తివచ్చెను. అప్పటికే చాల ప్రొద్దు పోయినది; కాని ఆయన పోయియేతీఱవలసియుండెను. చేత లాంతరు పట్టుకొని నేనాయన వెంట వెళ్ళితిని. మే మచట చేరుసరికి ఇల్లు మూయబడి యుండెను. అందఱు నిద్రపోవు చుండిరి. శ్రీ గురుదేవుడు చావడితలుపులు కొంచెము నెట్టి ఒక్కసారి లోపల అడుగు పెట్టి వచ్చివేసెను.

"మనుష్యుని ముఖము చూచుటతోడనే అతని అంతరంగ మాయనకు తెలిసిపోవును—అద్దపుపలక వెనుక నుండు వస్తువువలె! దర్శనార్థము వచ్చువారి నొక్కసారి ఎగదిగ చూచునంతనే ఆయన కంతయు తెలిసిపోవును. ఆ పిదప వారడుగు మాటలకు సమాధానము చెప్పును.

"సిద్ధపురుషులుకూడ నొక్కొకప్పుడు అహంభావము నకు లోనగుదురు. కాశిలో నుండు భాస్కరానందస్వామి కూడ తన ఛాయాచిత్రమును నాకు చూపి '[illegible]ని విక్రయించు చున్నారు చూచితివా' అనెను! కాని గురుదేవుడో! కేశవ సేను ఆయననుగూర్చి తన పత్రికలో వ్రాయగా ఆయన నిషేధించెను!

"ఒకనాడొక వెలయాలివర్తకుడు దక్షిణేశ్వరము నకు వచ్చెను. శ్రీ గురుదేవు[illegible] తన గదిలో నిద్రించు చుండెను. అతడు లోనికి[illegible] ఆయన పాదము లంటెను. శ్రీ గురుదేవుడు వెంటనే —మీద నెవరో నిప్పులువైచినట్లు

—లేచి అతనితో నిట్లనెను : 'నీవు చేసిన పాపము లన్నియు దాపఱికములేక నాతో చెప్పుము. అట్లు చేయ జాలవేని, గంగయొద్దకుపోయి బిగ్గరగా చెప్పివేయుము. వాని నుండి నీవు విముక్తుడ వగుదువు.' కాని ఆ అదృష్టహీనుడు అట్లు చేయజాలకపోయెను.''

మే, 28.

రాత్రివేళ స్వామి, రామలాలు (శ్రీరామకృష్ణుని యన్నకుమారుడు), కొందఱు భక్తులు, బేలూరుమఠపు మేడ వసారాలో కూర్చుండియుండిరి.

రామలాల్ : ''మొన్న నొకనాడు బెల్ఘురియా నివాసియగు 'తా–' (శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యప్రముఖు లలో నొకడు) దక్షిణేశ్వరము వచ్చెను. అతని కిప్పుడు పియాల్దాలో ఉద్యోగము. రెండవవివాహము చేసి కొన్నాడు. చాలమంది బిడ్డలు కలరు. గాఢముగా బంధము లలో చిక్కుకొనియున్నవానివలె నగపడుచున్నాడు. మునుపటి తే[illegible]స్సిప్పుడు లేదు.''

స్వామి : ''ఆ దినములలో అతని చిత్త మెంత నిర్మల[illegible] అది ఇప్పటికిని నిర్మలమే. శ్రీ గురుదేవు డెంతో జాగ్రత్తతో పరిశీలించిగాని తనయొద్ద కెవ్వరిని చేరదీయు వాడుకాడు. 'న–' [illegible]త పారమార్థికక్షేత్రము నంది యుండెను. కాని అతనినిగూర్చి శ్రీ గురుదేవు డిట్లనెను : 'అట్లైనచో అతని దోవతి మొలనుండి దిగజాఱి పోదేల?'

అతడు బ్యాంకీలో పదివేలరూపాయలు పెట్టుకొనియున్నా డని విన్నప్పు డాయన ఇట్లనెను : 'సరే, కారణ మిప్పుడు తెలిసిపోయినది గదా. లాభనష్టములు లెక్క చూచుకొను వాడు నాశిల్లును.' "

ఒక భక్తుడు : "మహారాజ్, ఇదంతయు నాకు అగమ్యగోచరముగా ఉన్నది. 'న-'యును, 'తా-'యును ఎంతో ఉన్నతి నందిన సాధకులు, శ్రీ గురుదేవుని యనుగ్రహ పాత్రులైనవారు, కాని త్రోవతప్పిరి. శ్రీ గురు దేవుని దర్శనభాగ్యము నొందినవా రందఱును ముక్తు లగుదు రని కొందఱు విశ్వసింతురు. రామబాబుకుకూడ అదే విశ్వాసము."

స్వామి : "అతని విషయమే వేఱు. అతని శ్రద్ధా విశ్వాసములు మేరలేనివి! అవసానకాల మాసన్న మగు చుండగా అతడు పారమార్థికమార్గమును పట్టుటకై సర్వమును పరిత్యజించెను. ఇతరుల శ్రద్ధావిశ్వాసములు మాటలలోనివే. నిజమైనవి కావు....

"ఇంకొక సంగతి. మహాపురుషుని దర్శించుట మాత్రము చాలదు. ధ్యాన, నిదిధ్యాసనములు వలయును, వివేకవైరాగ్యములు వలయును....

"ఆహా! దక్షిణేశ్వరములో మేము శ్రీగురుదేవునితో కూడి ఎంత ఆనందమయులమై [illegible]ంటిమి! ఒక్కొకప్పు డాయన తన హాస్యోక్తులచే మమ్మును పొట్టలుబ్బ నవ్వించును. మాకిప్పుడు ధ్యానమూలమునగూడ సిద్ధింపని దప్పుడు

అప్రయత్నముగా సిద్ధించుచుండెను. నా మనస్సులో అతి స్వల్పదోషము ఏర్పడినను, నన్ను చూచుటతోడనే ఆయన కది తెలిసిపోవును. నా వక్షఃస్థలమును స్పృశించి ఆ దోషమును సరిపఱచును. ఆయనతో నే నెంత చనవుగా నుంటిని! ఒకనాడు ఆయనగదికి పశ్చిమమున నుండు అర్ధవలయాకారపు వసారాలో ఆయనకు తైలమర్దనము చేయుచుంటిని. ఎందుకో నా కాయనపై కోపము వచ్చెను. సీసా పాఱవేసి, మరల నెన్నటి కక్కడకు రాకూడ దను తలంపుతో అచటినుండి గంతిడి వెళ్లిపోయితిని. దేవాలయప్రాకారము దాటి యదుమల్లిక్ ఉద్యానగృహమును సమీపించితిని. కాని ఇక సాగి పోజాలకపోయితిని. అచ్చట కూర్చుంటిని. ఈ లోపల ఆయన నాకై రామలాలును పంపెను. నేను తిరిగి వచ్చినప్పుడు ఆయన యిట్లనెను: 'చూచితివా? పోగలిగితివా? ...'

''ఒకసారి నే నొక తప్పుచేసి మిక్కిలి పశ్చాత్తాపమొంది, నా తప్పిదము నొప్పుకొనుటకై ఆయనయొద్దకు పోయితిని. నీళ్ల చెంబు తీసికొని తన వెంట రమ్మని ఆయన చెప్పగా అట్లు వెళ్లితిని. మరల వచ్చునప్పు డాయన ఇట్లనెను: 'నిన్న నీ వీ తప్పుచేసితివిగదా? ఇక నెప్పటికిని అట్లు చేయకుము.' ఆశ్చర్యమగ్నుడనై మాటలాడజాలక పోయితిని. ఆయన ఎట్లుకనుగొనెను?

''మఱొకనాడు నేను కలకత్తాకు వెళ్లి తిరిగివచ్చినప్పుడాయన ఇట్లనెను: 'నేను నీవైపు చూడజాలకున్నా నేల?

ఏదైన తప్పుచేసితివా?' 'లేదు' అని నేను బదులుచెప్పితిని — అసత్యమొకటి చెప్పియుంటిని గాని అప్పుడు ఆ సంగతి మఱచితిని. 'అసత్య మాడితివా ?' అని ఆయన ప్రశ్నింపగా నా కది జ్ఞప్తికివచ్చినది."

జూన్, 1

ఆదివారము. అపరాహ్ణవేళ. బేలూరు మఠములో. స్వామియెదుట నెందఱో భక్తులు కూర్చుండియుండిరి. "మహారాజ్, భగవంతునికై ఆవేదన లభించు టెట్లు?" అని యొక రడిగిరి.

స్వామి : "సాధువులయొక్కయు భక్తజనుల యొక్కయు సాంగత్యము చేయుటచేతను, నీ గురునొద్ద బోధ లొందుటచేతను నీ చిత్తమును పరిశుద్ధ మొనర్చుకోవలెను. ఆ పిదప గాఢసాధన లభ్యసింపవలెను. అంతటగాని నీకు భగవంతునికై ఆవేదన కలుగదు. చౌర్యము నేర్చుకొనుటకు కూడ గురు వొకడు కావలెను. ఇక అతిమహనీయమగు ఈ బ్రహ్మవిద్య — బ్రహ్మమునుగూర్చిన జ్ఞానము — గురువు లేకయే లభించునా ?"

ఆ పిదప స్వామి కొంతసేపు మాటలాడి ఇట్లనెను : "సాధువులయొద్దకు పోయినప్పుడు నీవు పరిప్రశ్నమూలమున నీ సంశయములు తీర్చుకోవలెను. మీ రెఱుగదలచిన విషయములు నన్నడుగుడు."

భక్తుడు : "శాంతి నార్జించుకొను టెట్లు?"

స్వామి : "భగవంతునియెడ భక్తిప్రేమలు కలిగి, ఆయనయందు యథార్థశ్రద్ధావిశ్వాసము లుంచుటచేత. ఇది ఒకేసారిగా, ప్రారంభదశలోనే, లభింపదు. ప్రథమమున చిత్త సంక్షోభ ముండవలెను. భగవత్సాక్షాత్కారము కొఱకు మనస్సు తపించిపోవలెను. కాని అట్లుండుటయే మంచిది. దప్పి ఎంత అధికముగా నున్న నంత యధికసంతుష్టి నిచ్చును గదా నీరు! చిత్తసంక్షోభము లేనిచో నీవు దానిని కలిగించు కోవలెను. ఈ ఐహికజీవనముచే మానవు డెప్పుడు సంతుష్టి నొందజాలడో అప్పుడు వాని మనస్సు సంక్షోభించును. అప్పు డతడు భగవంతుని వెసకు మరలును."

భక్తుడు : "ఈశ్వరప్రేమ కలుగు టెట్లు ?"

స్వామి : "స్తోత్రమూలమునను, నామసంకీర్తనమూల మునను, ప్రార్థనామూలమునను, అతని సాక్షాత్కృతి నొంద బ్రయత్నించుటచేతను, మన కాయనయెడ ప్రేమ జనించును. మహాపురుషు లీ మార్గముననే ఆయన నెఱుగ గలిగిరి."

భక్తుడు : "ఈ లోకములో నుండియే నేను ఈశ్వర సాక్షాత్కార మొందజాలనా ?"

స్వామి : "లోకము వెలుపల నెవ్వరైన నుందురా ?"

భక్తుడు : "కుటుంబజీవనము చేయుచునే అని నా భావము."

స్వామి : "అట్లనుము. పొందగలవు గాని, కష్టము."

భక్తుడు : "వైరాగ్యబుద్ధి కలిగినప్పుడు ఐహికజీవనమును విసర్జింపవచ్చునా?"

స్వామి : "ఔను. విసర్జింపవలెను. అదియే నిజమైన వైరాగ్యము—ప్రాపంచికవిషయము లన్నిటియెడ నిస్సంగత్వము. అది నీయం దొక్కసారి ఉత్పత్తి యయ్యెనేని, ఇక నశింపదు; నశింపకపోవుటయే కాదు, అభివృద్ధి యగుచుండును కూడ—అగ్నివలె. ఐహికజీవనమును త్యజించినవానికి మరల దానిలో ప్రవేశించు వాంఛయే ఉండదు."

భక్తుడు : "గురువు లేనిదే జరుగదా?"

స్వామి : "జరుగదనియే నా తలంపు. గురువు లేనిది జరుగనే జరుగదు. గురు వనగా నేమి? నీ యిష్టదైవమును చేరుటకు మార్గదర్శకుడు—ఏదోయొక నామమును నిర్ణయించి, దాని నుచ్చరించుచుండుమని బోధించుటవలన నను కొనుము. ఎందఱో ఉపగురువులు (అంత ప్రధానులుకాని ఇతరగురువులు) ఉండవచ్చును. అసలుగురువు నీవే సాధన నభ్యసింపవలసినది బోధించి, భక్తజనసాంగత్యము చేయుచుండుమని చెప్పును. పూర్వకాలమున శిష్యుడు గురు నింటనే నివసించుట ఆచారమై యుండెను. గురువు శిష్యుని కనుపెట్టియుండుటకును, అతడు తప్పుత్రోవను పడినచో సరియైన త్రోవకు మరల తెచ్చుటకును, అప్పుడు అవకాశము లుండెను. కావున గురువు నేర్పఱచుకొనుటలో నీవు జాగ్రత్త వహింపవలెను. అతడు బ్రహ్మవిదుడుగా నుండవలెను, లేక

పారమార్థికమార్గమున మిక్కిలి ఔన్నత్యమొందినవాడుగా నైన నుండవలెను."

భక్తుడు : "అట్టివానిని గుఱుతించు టెట్లు?"

స్వామి : "అతనితో కొన్నాళ్లుంటివేని నీ కది తెలియ వచ్చును. నిన్ను గ్రహించుటకు గురువునకుకూడ అవకాశ ముండును. ప్రపంచతృష్ణ నీ కధికముగా నుండి, దానిని నిరోధించుట దుర్ఘటముగా నుండెనేని, నిన్నతడు ఉపదేశ మీయకయే పంపివేయవలెను. నీ వెవరిని గురువుగా ఎన్నుకొనదలతువో అతనియొద్ద కొన్నాళ్లు నివసించి అతని మార్గముల నారయుము. వంశపారంపర్యగురుపద్ధతిలో ఈ గుణము కలదు : గురుశిష్యు లొండొరువులను, ఒండొరుల కుటుంబ చరిత్రములను పూర్తిగా ఎఱిగియుందురు.

"మనస్సును కేంద్రీకరించుట అభ్యాసమువలననే లభించును. ప్రాణాయామము (ఊపిరిని నియమించుట) కూడ ఒక మార్గమే. కాని గృహస్థుని కది అపాయరహితమార్గము కాదు—ఇంద్రియనిగ్రహము లేనివాడు వ్యాధిపీడితు డగును; బలవర్ధకాహారము, నిర్మలవాయువు, అనుకూలస్థలము, అవసరములు. ధ్యానము, చిత్తైకాగ్రత అభిలషింతువేని, ఏకాంతస్థలమున సాధన లొనర్పవలెను ; సిద్ధి ప్రయత్నమున కనురూపమై యుండును. అనుకూలవాతావరణము ఎచ్చట లభించునో —ప్రకృతిరమణీయస్థల మిందు కుదాహరణముగా కైకొనవచ్చును —అచ్చట కూర్చుండి ధ్యాన మొనర్పుము. ఈశ్వరు నన్వేషింపుము, కామినీకాంచనములను (కామాతుర

తను, ధనతృష్ణను) విడనాడుము. మొదట మానసికముగా విడనాడుము. అవి క్షణభంగురములు. నీ బుద్ధిని వానినుండి తొలగింపుము.

"ఈశ్వరుడు సాకారుడును నిరాకారుడును కూడ. మఱియు నతడు సాకారనిరాకారముల కతీతుడు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అను వేదాంతవాక్యమున కర్థ మేమి? మన కిప్పుడు గోచరించు రూపమున జగత్తు మిథ్య అని దాని కర్థము. సమాధిస్థితియందు జగత్తు అదృశ్య మగును, కాని నీకు మహానందానుభూతి కలుగును. ఋషు లా అఖండా నందము ననుభవించిరి. సమాధిలో ఏమి ఉండునది వివరించుట అసాధ్యము. 'నేను', 'నీవు' అను భావము లచట లేనే లేవు. సచ్చిదానంద మొక్కటియే యుండును — అఖండమగు అస్తిత్వము, ప్రజ్ఞానము, ఆనందము.

"'ఈశ్వరుడు కల డనుటకు నిదర్శన మేమి?' అని నన్నడుగువానికి 'సాధువులు తా మాతనిసాక్షాత్కార మొందితిమని పలికియున్నారు. మఱియు ఆ సాక్షాత్కార మొందుటకు మార్గమునుకూడ చూపియున్నారు' అని నేను బదులుచెప్పుదును. గురుదేవు డిట్లు చెప్పువాడు: 'గంజాయి', 'గంజాయి' అని పల్కినమాత్రమున కైపు వచ్చునా? దానిని తెచ్చి, సిద్ధపఱచి, పుచ్చుకొని కొంతతడవు ఆగవలెను. అప్పటికిగాని కైపు రాదు. అట్లే, 'దేవుడు', 'దేవుడు' అని పల్కుటతోడనే అతడు కాన్పింపడు. సాధన లొనర్చి కొంత తడవు వేచియుండవలెను.'"

భక్తుడు : "జపముచేయునప్పుడు నేనొక్కొక్కసారి జపించుటనే మఱతును. ఎందువలన ?"

స్వామి : "దీనిచే యోగమునకు నిరోధము కలుగునని పతంజలి చెప్పియున్నాడు. ధ్యానించు టనగా భగవంతుని గూర్చి తలంచుచు, అతనిని ఎఱుకలోనికి తెచ్చుకొనుట. ధ్యానము గాఢమై, భగవంతుడు సాక్షాత్కరించునప్పుడు సమాధ్యవస్థ పైకొనును. సమాధి లభించెనేని, ఆ యానందము చాలకాలము (ఎల్లకాల మని కొంద ఱందురు) నిలిచి యుండును.

"శ్రీ చైతన్యుడు తన శిష్యు నొకనిని రాయ రామానందునికడ కంపెను. రాయ డప్పుడు భోగవైభవపరాయణుడై ఆనందించుచుండెను. కాని శిష్యుడు భగవన్నామ ముచ్చరించుటతోడనే అతని హృదయమునుండి ప్రేమ యుబికి వెలువడి వెల్లివిరియజొచ్చెను. తాను సాధు వగు వాడుతప్ప ఇతరులు సాధువును గుఱుతింపజాల రందురు. వంకాయ లమ్మువాడు వజ్రముయొక్క విలువ నెఱుగగలడా? సాధనలచే ఎవరైన, ఉన్నతాధ్యాత్మికదశ నందినప్పుడు, వాని కా సంగతి తనంతటతానే తెలియవచ్చును.

"ధ్యానములో ఐహికవిషయములు తుచ్ఛము లని తలంపుము. ఇందుచే మనస్సునం దనుకూలభావము నాటుకొనును. నీ మనస్సునుండి వాంఛలను తఱిమివేయుచుండగా, మంచి తలంపులు, సద్భావములు ఉత్పత్తియగును. ధ్యానములో వెలుగులు కానిపించినను, అలౌకికనాదములు వినిపించి

నను, సరియైన త్రోవనే పురోగమించుచున్నావని ఎఱుగుము. కాని ఆ లక్షణములు శుభసూచకములేయైనను, వాని కేమియు ప్రాముఖ్య మీయవలదు. ఏకాంతప్రదేశధ్యానములో నీ కొకప్పుడు ఓంకారనాదముగాని, ఘంటానాదములుగాని, దూరగతములగు సామాన్యశబ్దములుగాని, వినిపింపవచ్చును.

" 'అమ్మా, నీవే నాకు దిక్కు' అని శంకరుడు జగన్మాతృప్రార్థన చేసినది లోకజనులకు మార్గదర్శకముగా నుండుకొఱకే — సర్వమార్గములద్వారా భగవత్సాక్షాత్కారమందుట సాధ్యమే యని వారికి బోధించుకొఱకే."



### 3-వ ప్రకరణము

# శ్రీ ప్రేమానందస్వామి సంభాషణములు

1912 మే, 8.

శ్రీరామకృష్ణుని శిష్యప్రముఖులలో నొకరగు శ్రీ ప్రేమానందస్వామి బేలూరుమఠముయొక్క విచారణాధికారములో నుండెను. ఆయన మూర్తిమత్త్వము అత్యంత మనోహరమైనది. ఆయన విడుచు శ్వాసవాయువులుకూడ ప్రేమపారిశుద్ధ్యపూరితములై యుండు ననవచ్చును.

మధ్యాహ్న భోజనానంతర మచట కూడియున్న సాధు భక్తబృందముతో శ్రీరామకృష్ణునిగూర్చి ఆయన మహోత్సాహముతో మాటలాడ జొచ్చెను.

స్వామి: "శ్రీ గురుదేవునికి నిమ్మపండ్లయందు మిక్కిలి ప్రీతి యగుటచే యోగేఁ (యోగానందస్వామి) ప్రతిదిన మొక నిమ్మపండు ఆయనకు తెచ్చి యిచ్చువాడు. ఒకనాడు శ్రీ గురుదేవు డతనితో ఇట్లనెను: 'నిన్నటి నిమ్మపండును ఎచటనుండి తెచ్చితివి? దానిని నేను ఉపయోగింప జాలకపోయితిని.' దుశ్చరితులయొద్దనుండిగాని, అపవిత్రుల యొద్దనుండిగాని, తెచ్చిన వస్తువులు శ్రీగురుదేవుడు ఉపయోగింపజాలడని యోగేఁకు తెలియును. కాని 'తా నీ పండును మునుపటిపండ్లను తెచ్చిన చెట్టునుండియే కోసికొని వచ్చెను. కావున శ్రీ గురుదేవున కది అభోగ్యమగుటకు కారణ

మేమి?' యోగేన్ మిక్కిలి కలవరపాటుతో కారణ మారయసాగెను. జాగ్రత్తగా విచారింపగా తాను పండ్లు తెచ్చుచుండిన తోటయొక్క కౌలు ఈ సంఘటనమునకు ముందటినాడు వెళ్లిపోయె ననియు, మఱియొకడు దాని నప్పటి నుండి కౌలుకు తీసికొనె ననియు తెలియవచ్చెను. పూర్వపు కౌలుదారు పండ్లు కోసికొనుట కనుమతించియుండెను. కావున ఆ దినము ఆ అనుమతి వర్తింపదు. నిజముగా అది చౌర్యము —బుద్ధిపూర్వకము కానిదైనను!

"తన కర్పింపబడు వస్తువులను చూచి, అవి యెట్టి తలంపుతో అర్పింపబడినవో, శ్రీ గురుదేవుడు కనుగొనగలిగి యుండెను. పాపలేశముచే కళంకితమైన ఆహారమునుకూడ ఆయన గ్రహింపజాలడు. ఆయన పవిత్రత యెంత అద్భుతము! అపవిత్రతాస్పర్శ, అపవిత్రతాసామీప్యముకూడ, ఆయనకు దుస్సహములు! కావున మీ రాయన సాక్షాత్కార మపేక్షింతురేని, మీ హృదయములం దపరిశుద్ధతా కళంకమే లేకుండునట్లు చేసికొనవలెను. అరిషడ్వర్గము పరిమార్పబడ వలెను. ఇచ్చటికి రాగోరువా రందఱు ఆదర్శమానవులు కావలెను. ఆయనబిడ్డల మని జ్ఞప్తియుంచుకొనుడు. కాని ఇది గర్వకారణము కాకుండుగాక! గర్వమును నిర్మూలించు కొనవలెను. తా నీ లోకపువాడు కాడని తన కప్పుడప్పుడు తోచునని 'మహారాజ్' (శ్రీ బ్రహ్మానందస్వామి) చెప్పు చుండును. శ్రీ గురుదేవుడుకూడ ఇట్లనువాడు: 'నరేన్,*

* శ్రీ వివేకానందస్వామియొక్క పూర్వాశ్రమనామము

రాఖాల్,† నాయొద్ద లేనిచో నే నెవరితో మాటాడుదును? వా రత్యంత వినిర్మలచిత్తులు — నారాయణునియొక్క ఆకృతులే; లౌకికులతో మాటాడుచో, నా పెదవులు మండి పోయిన ట్లుండును!' ఏమి పారిశుద్ధ్యము! మీ రందఱును అట్టి పారిశుద్ధ్యమును సాధించుకోవలెను."

ఆ రాత్రి ఆరతి అనంతరము స్వామి మఠపుమేడ క్రిందిభాగమున కూర్చుండియుండగా, ఈ శిష్యు డాయనను "శ్రీ గురుదేవుని సాక్షాత్కారము నా కెట్లు లభించునో తెలిపి యనుగ్రహింపుడు" అని అడిగెను.

స్వామి: "నీవు శ్రీమాతృదేవిని దర్శించి. ఆమె కృపా పాత్రుడ వైతివిగదా. ఇంకను నీకు చింత యేల?"

శిష్యుడు: "కాని నా కే మాత్రమును మనశ్శాంతి లేకున్నది. మనశ్శాంతి చేకూర్చుకొను టెట్లు?"

స్వామి: "ఇదేమి పసిబిడ్డచేతిలోని మిఠాయియా, బుజ్జగించి లాగుకొనుటకు? కాని విచారింపకుము. 'ఒక్క నీటిబిందువునందు నేను సముద్రమును చూతును' అని శ్రీ గురుదేవు డనువాడు. ఆయనవైపు మన మొక్క అడుగు వైచినచో, ఆయన మనవైపు వేయి అడుగులు వైచును. ఆయనశరణుచొచ్చి, ఆయననామ ముచ్చరించు చుండుము. కాలక్రమమున నీ కాయన సాక్షాత్కరించును."

శిష్యుడు: "మహారాజ్, లోకమును పరిత్యజించిన గాని, ఆయన యనుగ్రహము లభింపదందురే!"

† శ్రీ బ్రహ్మానందస్వామియొక్క పూర్వాశ్రమనామము

స్వామి : (కఠినముగా) "పరిత్యజించుటకు నీ కేమి కలదు? ఆయన ని న్నేదశలో నుంచునో, ఏ ప్రదేశమున నుంచునో అచటనే, అట్లే, ఉండుము. నీ కృషివలన నీ వాయనను ప్రత్యక్షపఱచుకో జాలవు. ఆయన అనుగ్ర హించెనేని, సర్వము సాధ్యమే. గాఢతపస్సు ఆచరించినను ఎందఱికో ఆయనకృప లభింపదు. ఇతరుల కది సులభముగా లభించును."

జూన్, 6.

అపరాహ్ణవేళ. శిష్యుడు 'స-' తో కూడ గంగా తీరమున కూర్చుండియుండగా స్వామి అచటికివచ్చెను. 'స-' మధురస్వభావము గలవాడు కావున స్వామి కతడు ప్రేమపాత్రుడయ్యెను. శ్రీ గురుదేవునకు తనయెడ గల ప్రేమనుగూర్చి 'స-' కు చెప్ప నారంభించెను. ఆయన యిట్లనెను : "నేను దుష్టబాలుర సహవాసముచేసి చెడి పోవుదు నను భీతిచే, సెలవులలోసైతము, మా అమ్మ నన్ను మా గ్రామములోని యింటియొద్ద ఉండనిచ్చునది కాదు. కాని నేను కలకత్తా వచ్చునప్పు డేడ్చును. నేను దక్షిణే శ్వరమునుండి కలకత్తావచ్చినప్పుడు శ్రీ గురుదేవుడును ఏడ్చును. ఆహా, ఆయన మమ్మెంతగా ప్రేమించెనో నే నెట్లు వర్ణింపగలను! పూర్ణునికి మధురభక్ష్యములు తినిపించు నిమిత్త మాయన బండియెక్కి కలకత్తావచ్చును! పూర్ణుడు చదువు కొను పాఠశాలయొద్ద కాచుకొనియుండి, ఆ బాలు నచటికి పిలిపించుకొని, ఆ భక్ష్యముల నతని నోట బెట్టి తినిపించును!

అప్పు డాయన ఇట్లనును : 'నాకేమి సంభవించినదోగాని, నన్ను పిలిచి కూర్చుండబెట్టుట కొక చాపకుకూడ గతిలేని నిన్ను చూచుటకు నాకింత తహతహపాటు కలుగుచున్నది!' ఒకనా డాయన నేనప్పుడు నివసించుచుండిన బలరాంబాబు ఇంటిబైట నిలుచుండియుండెను. బలరాంబాబు అప్పుడు ఇంటిలో లేడు. లోపలికి ప్రవేశించినచో, ఎవ రేమందురో యని ఆయన ప్రవేశింపలేదు! నన్ను చూచుటకై ఆయన రాక! పిదప నెవరో ఆయనను లోపలికి రమ్మనిరి. ఆయన ప్రేమ మితిలేనిది. అందులో నొక్క బిందువు చాలును మనలను నింపివైచుటకు. మాలో ప్రతివాడును తానే ఆయనకు ప్రియతముడని భావించుకొనుచుండెను. 'అహంకార మొక్కటి వినా నే నేదైన సహింపగలను' అని ఆయన పలుకు వాడు. కావుననే ఆయన ఎవరినైన దర్శింపగోరినయెడల, ముందుగా హృదయుని పంపి, అతడు గర్వి కాడుగదా అని విచారించును. ఆయన మాకై యొక అచ్చును సిద్ధపఱచి పోయినాడు. మే మిపుడు చేయవలసిన దంతయు మనోమృత్తికలోనుండి రాళ్లు, రప్పలు, కల్మషము తీసిపాఱవైచి, దానిని మెత్తగా పిసికి, అచ్చులో దింపుకొనుటయే. వెంటనే మనోజ్ఞాకార మొకటి దానిలోనుండి వెలువడును. ఆయన సర్వలోకకల్యాణార్థ మవతరించెను."

శిష్యుడు : "శ్రీ గురుదేవుని ప్రథమదర్శనకాలమున మీకు కలిగిన అనుభూతులు మాకు సెలవిండు."

స్వామి : "నేను దక్షిణేశ్వరము వెళ్ళిన మొదటినాటి రాత్రి నేనును మఱొకభక్తుడును శ్రీగురుదేవుని గదికి

వెలుపటి వసారాలో పరుంటిమి. రాత్రిపూట గస్తీతిరుగు వారి అఱపులచే నాకు చక్కగా నిద్రపట్టలేదు. కొంత సేపటికి కొంచెము కూరుకు పట్టెను. కాని ఆ సమయముననే శ్రీ గురుదేవుడు మాకడకు వచ్చెను. అప్పు డాయన దిస్సమొలతో నుండెను. గుడ్డ చంకలో నుండెను. మమ్ము లేపి 'మీరు నరేంద్రు నెఱుగుదురా? చాల మంచిబాలుడు. కలకత్తాలో సిమ్లాయం దతని యిల్లు. చదువు సంగీతము లందును, సర్వమునందును, ప్రవీణుడు. నన్నొకసారి వచ్చి చూచిపొమ్మని అతనికి తెలుపుడు. అతనిని చూచుటకు నా కత్యాతురముగా నున్నది. బండి కుదుర్చుకొని రేపే రమ్మనుడు. బాడుగ ఇచట ఈయబడును.' ఇది చెప్పి ఆయన వెళ్ళిపోయెను. మేము మరల పరుంటిమి. మా కొకింత నిద్ర పట్టబోవుచుండగా ఆయన మరలవచ్చి ఇట్లు చెప్పెను: 'ఒకసారి వచ్చిపొమ్మని తప్పక చెప్పవలెను. నేలపై పిల్లి బరికినట్లు నా అంతరంగము బరకబడుచున్నది. తప్పక రేపు రమ్మనుడు. చెప్పెదరుకదా!' ఆయన వెళ్ళిపోయిన పిదప నే నిట్లు తలచితిని: 'ఈయన కతనిపై ఎంతటి అగాధప్రేమ! ఐనను ఆ బాలు డాయనను వచ్చి చూడడు! ఎంత క్రూరుడు! ఎంత దుర్మార్గుడు!' కొంచెముసేపటికే శ్రీ గురుదేవుడు మరలవచ్చి నరేంద్రుని మిక్కిలి ప్రశంసించి, అతని రమ్మని చెప్పుడని మమ్ము ప్రార్థింపసాగెను. ఆ రేయి యంతయు ఇట్లే గడచెను.

"మఱొకరేయి నేను శ్రీ గురుదేవుని గదిలోపల నిద్రించుచుంటిని. అర్ధనిశాసమయమున నాకు మెలకువ

వచ్చెను. శ్రీ గురుదేవు డప్పుడు గదిలో ఇటునటు తిరుగుచు ఇట్లనుచుండెను: 'అమ్మా, నా కిది అక్కఱలేదు. మానవ సన్మానము నా కీయకుము. వలదు, అమ్మా వలదు! దానిపై నేను ఉమియుచున్నాను.' ఇ ట్లనుచు వెఱ్ఱివానివలె గదిలో పరుగిడ సాగెను. నా కీ చర్య అత్యాశ్చర్యము కలిగించెను. 'కీర్తి నార్జించుకొనుటకై జను లెంతో ఆతురపడుచుండగా ఈయన తన కది ఈయవలదని జగన్మాతను ప్రార్థించు చున్నాడు! ఇది నా యెదుట జరుగుచున్న దేల? నా కిది గుణపాఠమా?' అని నేను తలంచితిని."

అక్టోబరు, 29.

క్రొత్తగా సన్న్యాసాశ్రమము గైకొన్న యొక యువకునికి బేలూరుమఠములోని జనసమ్మర్దమువలన నచట సాధనలు సాగించుట కష్టముగా తోచి, కాశికి పోవనెంచి రైలుకర్చుకై యాచింప కలకత్తాకు పోయియుండెను. స్వామి కిది అసమ్మతముగా నుండి ఆ సాధువు కలకత్తానుండి వచ్చుట తోడనే అతనితో ఇట్లనెను: "మంచి వయస్సులోనుండు నీకు యాచించుట లజ్జాకరముగా తోపలేదా? అందులో నీవు సాధువవు. కాశికి నడచిపొమ్ము. సుఖముగా కాశి చేరి, నాలుగుసార్లు ఈశ్వరనామము స్మరించుటతోడనే అతడు నీ చెంగటికి పరుగిడి వచ్చు ననుకొనుచున్నావా? ఈశ్వర సాక్షాత్కార మంత సులభముకాదు. 'చిత్తమా, నీ కపట ప్రేమతో జగన్మాతృసాన్నిధ్యమును సాధింపగలవనియా నీ భావము? పసిబాలునిచేతి భక్ష్యమా ఆమె? అతనిని

మాయ చేసి లాగుకొనుటకు!' బాలుర కిప్పుడు కర్మాచరణ త్యాగమనిన చాల మక్కువ—వా రందఱు శుకదేవుని స్థితికి వచ్చినట్లు! కథామృతము (శ్రీ 'మ.' చే రచింపబడిన 'శ్రీరామకృష్ణకథామృత' మను గ్రంథము) చదివిన ఫల మిది. శ్రీ 'మ.' గ్రంథములలో కొలదినాళ్లు జరిగిన సంభాషణలుమాత్రమే కలవు. 'ఈశ్వరునికై ఏకాంతమున సాధన లొనర్పుము' అనునది సరియే. కాని ఆయనకై ఎవరు విలపించుచున్నారు? ఎవరు విలపింపగలరు? సత్త్వతమో గుణము లొండొంటిని పోలియుండును. కాని తమస్సువలన నిద్ర, సోమరితనము, కార్యాచరణవైముఖ్యము కలుగును. స్వామిజీ (శ్రీ వివేకానందస్వామి) ఇట్లనువాడు: 'దేశము తమస్సులో మునిగియున్నది. మతిచెడి ప్రేలు సన్నిపాతజ్వర రోగివలె అది తన కేమియు జబ్బు లేదని ఔషధము సేవింప నొల్ల కున్నది. దీనికి చికిత్స నే నెఱుగుదును. దాని నిప్పుడు ప్రయోగింపవలయును. సన్నిపాతజ్వరమును విషౌషధము లెట్లు కుదుర్చునో, అట్లే తమస్సును రజస్సు కుదుర్చును. దేశమును తమోగుణవిముక్త మొనర్చుటకు మన మిప్పుడు రజోగుణమును ప్రవేశపెట్టవలెను.' తమోవైరాగ్యములు కేవలము వేర్వేఱు వస్తువులు.

"పోయి చదువుకొనుము. నీ కర్చులు మేము భరింతుము. ఈశ్వరసాక్షాత్కార మర్థింతువేని శాస్త్రజ్ఞాన మలవఱచుకొనవలయును. శ్రీ గురుదేవునికి వ్రాయుట చదువుట రాకపోయినను, ఎన్నో గ్రంథములు చదువగా వినుచుండెను. విన్నదంతయు ఆయనకు జ్ఞప్తియుండెడిది. కాశీపురోద్యాన

గృహమున శశిమహారాజ్ (శ్రీరామకృష్ణానందస్వామి) ఆయనకు అధ్యాత్మరామాయణము (మూలసంస్కృత గ్రంథము) చదివి వినిపించుచుండగా 'స్వామిజీ' ఆయన నిట్లు ప్రశ్నించెను: 'మహాశయా, మీకు చదువను, వ్రాయను కూడ రాదుగదా, ఈ సంస్కృతపఠనము మీ కేమైన అర్థమగుచున్నదా?' అందు కాయన ఇట్లు బదులిడెను: 'నేను స్వయముగా చదువకపోయినను, ఎన్నో విషయములు వింటిని. ప్రతిమాటకు నా కర్థము తెలియును.' ఆయనలోని దంతయు విచిత్రమైనదే, సాటిలేనిదే. డాక్టరు మహేంద్రలాల్ సర్కార్ (శ్రీగురుదేవుని రోహిణీవ్యాధికి చికిత్సచేసిన హోమియోపతి డాక్టరు) శ్రీ గురుదేవుడు శ్యాంపుకుర్‌లో నుండగా నొకనాడు ఉదయము పదిగంటలకు వచ్చి మధ్యాహ్నము మూడునాలుగుగంటలవఱకు ఉండెను. ఇది చూచి మణిమల్లిక్ ఇట్లనెను: 'మహాశయా, కృష్ణదాస్ పాలు ఇంట నొకనాడు గానసభ జరిగెను. కలకత్తాలోని ప్రముఖు లందఱు విచ్చేసిరి. డాక్టరు సర్కారుకూడ వచ్చెను గాని, ఒక ఐదు నిమిషములుమాత్రమే ఉండి వెళ్లిపోవుటకై లేచెను. ఇంక కొంచెము సేపుండి పొండని ప్రార్థింపగా: 'వీలులేదు, నేను పోవలెను, నాకు చాల పనియున్నది, ఇక నుండజాలను' అనెను. ఆ మహేంద్రుడే ఐదాఱుగంటలకాల మిచ్చట గడపెను, పని యేమియు అంతగా లేనిదే. ఎంత విచిత్రము!' "

మే, 1913.

బేలూరుమఠములో దర్శనార్థిశాలయందు ప్రతి సాయంకాలము మూడు గంటలకు (ఆదివారము తప్ప) శాస్త్ర

పాఠము జరుగుచుండెను. అప్పుడు మఠసాధువులకే కాక దర్శనార్థము వచ్చినవారికికూడ ప్రవేశము కలదు. అట్టి సందర్భమున ('మే' మొదటివారమున) స్వామి యొకప్పు డిట్లు చెప్పెను: "గోసాయిఁజీ (విజయకృష్ణగోస్వామి) శ్రీ గురుదేవునికడ కొకనాడు వచ్చి తన కామవికారమును నశింపజేయుడని వేడుకొనెను. శ్రీగురుదేవు డతనిని తాకెను. తత్ఫలముగా అద్భుతగుణము కలిగెను. మఱొకనా డింకొక పురుషుడు ఆయనకడకు వచ్చి 'మహాశయా, నా భార్యపై గల వ్యామోహముచేత నా మన స్సింక నే కార్యము మీఁదికిని పోజాలకున్నది. నా వ్యాపార మంతయు నాశన మొందుచున్నది. అనుగ్రహించి ఈ మనఃస్థితిని మార్చి వేయుడు'. అని ప్రార్థించెను. అందుపై శ్రీ గురుదేవుడు 'కానిమ్ము, పండ్లు కొన్ని తీసికొని ఇచటి కొకనాడు రమ్ము. నీ మాయను మ్రింగివైతును' అనెను. కాని పండ్లు తెచ్చి నప్పుడు శ్రీ గురుదేవుడు వానిని తినజాలకపోయెను. ఎంత యత్నించినను అవి నోటివఱకు పోలేదు. పిదప నతడు ఆ భార్యవలన ఘోరవ్యథల పాలయ్యె నని వింటిని."

రామలాల్ (శ్రీరామకృష్ణుని అన్న కుమారుడు) దక్షిణేశ్వరమునుండి వచ్చెను. అతడు శ్రీ గురుదేవునితో చాలకాలము నివసించి ఆయనను సేవించినవాడు. అతని భక్తి గీతికలు విని ఆయన తఱచు పారవశ్యస్థితి నందువాడు. అందుచే రామకృష్ణసంప్రదాయమువారి కందఱకును అతనిపై మిక్కిలి మక్కువ. ప్రసంగసందర్భమున నత డిట్లు చెప్పెను:

"కొన్నేండ్లనాడు శ్రీ గురుదేవుడును హృదయుడును కుఠి (దేవాలయావరణములోనుండు ఒక బంగళా) లోని యొక పెద్దగదియందును, శ్రీ గురుదేవుని తల్లి ఆ గది ప్రక్కనుండు నొక చిన్నగదియందును నివసించుచుండిరి. అనేకరాత్రులు వారి కొక మనుష్యుడు పాదరక్షలతో మెట్లెక్కుచు దిగుచు, తలుపులు, కిటికీలు తెఱచుచు ఉండు శబ్దములు వినిపించెడివి. అది యొక పిశాచము — యూరపు దేశీయునిదిగా నుండును. దేవాలయనిర్మాణమునకు పూర్వము ఆ కుఠి యూరపు దేశీయుల నివాసగృహముగా నుండెను. శ్రీ గురుదేవు డిట్లనువాడు : 'ఈ జగత్తు కేవలము అసత్య మని చెప్పజాలము. దానిని మన కన్నులతో ప్రత్యక్షముగా చూచుచున్నాముగదా. కాని అది సత్య మనియు చెప్ప జాలము. ఇందుకు నిదర్శనముగా ఈ తోట ఎన్ని మార్పు లొందినదో చూడుము. పూర్వ మిది యొక ఒలుకులమిట్ట, ఈ కుఠి యొక యూరపు దేశీయుని గృహము. కాని ఇప్పుడు చూడుము! ఇంక కొంతకాలమునకు ఈ దేవాలయముకూడ అదృశ్యమగును. ఆ పిదప ఏమి యగునో ఎవరు చెప్ప గలరు?'

"ఆయన నా కొకనా డిట్లు చెప్పెను : 'నే నొకసారి యొక దృశ్యమును చూచితిని. జగన్మాత చుట్టుచేరి యనేకులు చేతులతో తాళమువైచుచు 'కాళికి జయ, కాళికి జయ' అని జయధ్వానములు చేయుచు నృత్య మొనర్చుచుండిరి. గదియొక్క నైరృతిదిక్కున రాణిరాస్మణి నిలుచుండి యుండెను. నృత్య మొనర్చుచుండినవారిలో మథురుడు,

శంభు, బలరాముడు, జయగోపాలసేను మఱికొందఱును ఉండిరి. కొందఱు తెల్లవారుకూడ — స్త్రీలు, పురుషులు — ఉండిరి. వీరు నాకింతదనుక పరిచయముకాలేదు.' "

స్వామి : "వారు పాశ్చాత్యులు. ఒకనాడిచటి కొక పాశ్చాత్యస్త్రీ వచ్చెను. శ్రీరామకృష్ణుని జ్ఞాపికాపరిశిష్టములు చూపగా ఆమె విలపింపసాగెను. అందులోని చిన్న తునుక నొకదానిని తీసికొని దానిని తా నెప్పుడును వక్షఃప్రదేశమున నుంచుకొను నని చెప్పెను."

ఆ రాత్రి రాజయోగపాఠము చెప్పబడెను. ఆ చివరను స్వామి అచటి సాధువులతో ఇట్లు చెప్పెను : "ఇవన్నియు పఠించిన మాత్రాన ఏమియు ఫలముకలుగదు. వీనినిగూర్చి ధ్యానించి మీ జీవితములను తదనుసారముగా నిర్మించుకోవలెను. భగవత్కృపవలన నిచటికి వచ్చినవా రెవ్వరును అల్పులుకారు. మీ రందఱును సింహపు పిల్లలు. 'నాకిది తెలియును', 'అది తెలియును', 'స్వామిజీ యిట్లు పలికియున్నాడు', 'అట్లు పలికియున్నాడు' అని జనులకు చెప్పుట చాలనేచాలదు. ఈ బోధలయొక్క సత్యమును మీ జీవితములో ప్రదర్శించి చూపవలెను. మీలో ప్రతివారును వివేకవైరాగ్యనిస్సంగత్వములకు మేలుబంతులై యుండవలెను."

మే, 14.

బేలూరుమఠము. అపరాహ్ణపాఠానంతరము స్వామి ఇట్లు చెప్పెను : "తాను ఈశ్వరుని ఏ భావమున సాక్షాత్క

రింపజేసికొన గోరునో ఆ భావమున నతనికి యథార్థమగు నిష్ఠ—అనగా సుస్థిర, మనఃపూర్వక భక్తియు, అనురాగమును—ఉండవలయును. కాని అందుచే ఇతర భావములయెడ అసహ్యత కలుగరాదు. నేనొకకథ నొకసారి వింటిని. అది యథార్థముగా జరిగిన విషయమే. ఒక ధనికుని యింట కాళికాంబికావిగ్రహము ప్రతిష్ఠింపబడియుండెను. వారు ఇష్టమృష్టాన్ననైవేద్యములతో దేవిని అర్చించువారు. ఒకనాడొక వైష్ణవుడు వచ్చి దేవికి మ్రొక్కి యిట్లనెను: 'వదినా, మా అన్నగారెట్లున్నారు?' * ఇంటియజమానుడతని భావమును గ్రహించెను. అతని సత్యాదరముతో పిలిచి కూర్చుండబెట్టుకొని, అతనికి బుద్ధిచెప్పుటకై దురదకందకూర వండి తెప్పించి అతనికి వడ్డింపజేసెను. అది ఆ కూరయనియు అంత దురదగా నుండుననియు ఆ వైష్ణవుడెఱుగక తిన నారంభించెను. కాని మొదటిముద్దకే నోరు మండిపోవ నారంభింపగా తినుట మానుకొనెను. 'తినుట అప్పుడే మానితిరేమి' యని యజమాను డడుగగా 'ఇది దురదకంద' అని యతడు బదులుచెప్పెను. 'అయిన నేమి? మీ అన్నగారు హాలాహలవిషము నెంతో పానముచేయగా మీ రీకొంచెము దురదకందకూర తినజాలరా? ఎవరక్కడ! ఒక కఱ్ఱ తీసికొనిరారా, ఈ మూర్ఖుని తల చితుకగొట్టి,

* కొందఱు వైష్ణవులు తమ మతమునం దత్యంతమూర్ఖాభిమానము గలిగి, శ్రీ కాళికాంబికానాథుడగు శివుడు భగవంతుడని భావింపక, ఆయన విష్ణుభక్తులలో నొకడనియు, కావున పారమార్థికముగా తమకు సోదరుడనియు, తలంపగోరుదురు.

వీనిచేత ఈ కూరనంతయు తినిపించెదను' అని యజమానుడు పలుకగా ఆ వైష్ణవుడు తన క్షుద్రత్వమును గ్రహించి 'క్షమింపుడు. శివునిగూర్చి ఇక నెన్నటికి అట్లు నీచముగా మాటాడను' అని దీనముగా వేడుకొనెను. అంత నతనికి చక్కని భోజనము పెట్టించి ఆ అపచారము మరలచేయ కుండునట్లు హెచ్చరించి పంపివేసిరి.

"కాని ఆ నిష్ఠ నిజమైనదై, ఇతర దేవదేవీరూపముల యెడ ద్వేషములేనిదై యున్నచో, త్వరితముగనే భగవత్సాక్షాత్కారసిద్ధి కలుగును. శ్రీ గురుదేవు డొకసారి మా కొక కథ చెప్పెను : ఇరువురు సోదరులు కలరు. అందు చిన్నవాడు బాలగోపాలభక్తుడు, పెద్దవాడు కాళీభక్తుడు. వారి తోటలో నొకప్పుడు ఒక అరటిచెట్టు చక్కని గెల వేసెను. అది పక్వముకాగానే తన యిష్టదైవమున కర్పింప వలెనని వా రిరువురును సంకల్పించుకొనియుండిరి. కాని అది పక్వమైనప్పుడు చిన్నవా డింట లేకపోయెను. పెద్దవాడు దానిని కోసి కాళికాంబిక కర్పించెను. చిన్నవా డింటికి వచ్చి విషయ మంతయు విని కోపావేశపరవశుడై, కాళికావిగ్రహమును విఱుగగొట్టు నుద్దేశముతో నొక కత్తి తీసికొని ఆమె ఆలయమున కరిగెను. కాని లోని కేగి చూడగా అచట పీఠముపై గోపాలవిగ్రహమే కానిపించెను, కాళికాంబా విగ్రహమే లేదు. మిక్కిలి పశ్చాత్తాపముతో గోపాలాలయములోనికి పొరపాటుగా ప్రవేశించితి నని తలచి వెలికి వచ్చి రెండవగుడిలోనికి పోయెను. కాని అదేమి చిత్రము!

అచ్చటకూడ గోపాలవిగ్రహమే!! అప్పు డతనికి సత్యము స్ఫురించెను. 'ఎవడు గోపాలుడో అతడే కాళియును' అని అతనికి తెలిసిపోయెను.

"భగవత్సాక్షాత్కార మొందినవానికి స్వమతదురభిమానము ఉండదు. విజయకృష్ణగోస్వామి విషయ మిందుకు ఉదాహరణము. అతడు బ్రాహ్మమతస్థుడు. కాని పిదప ఆ మతమును వీడి తపశ్చర్య యొనర్చి వైష్ణవవేషము పూనెను. ఒకనా డతడు శ్రీరామకృష్ణునియొద్దకు వచ్చి వినమ్రతతో ఇట్లు మనవిచేసికొనెను: 'మహాశయా, అనేకులు నాయొద్ద మంత్రదీక్షకై కొనగోరుచున్నారు. నేనుపదేశింపవలయునా?' అందుకు శ్రీ గురుదేవు డిట్లు బదులుచెప్పెను: 'ఏల ఉపదేశింపరాదు? నీవు అద్వైతప్రభుని (శ్రీ చైతన్యదేవుని ముఖ్యశిష్యులలో నొకరు) సంతతివాడవు. కావున నీవు గురువుగనే జన్మించితివి. నిస్సంశయముగా నీవు ఉపదేశమీయవచ్చును.' స్వామిజీ (వివేకానందస్వామి) అమెరికా నుండి వచ్చినప్పు డాయనను తనయొద్దకు రమ్మని గోస్వామిజీ వర్తమాన మంపెను. తన కప్పుడు జబ్బుగా నుండుటచే అట్లు చేసెను. స్వామిజీ వెళ్ళగా ఆయన తన పీఠమునుండి లేచి స్వామిజీని అచట కూర్చుండుమనెను. స్వామిజీ ఇందు కాక్షేపింపగా ఆయన ఇట్లనెను: 'వారు (శ్రీ గురుదేవుడు) ని న్నెట్లు గణించుచుండిరో నది నే నెఱుగుదును. నీ విలువ నంతయు మా బోంట్లు గ్రహింపగలరా?' "

మే నెల, చివరవారము.

బేలూరుమఠము. దర్శనార్థిశాల. ఒక సాధువు 'శ్రీ శ్రీరామకృష్ణకథామృతము' చదువుచుండెను. ఆ పఠనమధ్యమున కేదారనాథఛట్టోపాధ్యాయను (శ్రీరామకృష్ణభక్తులలో నొకరు) గూర్చి స్వామి ఇట్లు చెప్పెను :

"పూర్వ మతడు బ్రాహ్మమతస్థుడు, లాహోరులో నుండువాడు. భగవంతునెడ అతనికి గాఢప్రేమ. భగవత్సాక్షాత్కారము లభింపమి కతడొకనాడు అత్యంతవ్యథ నంది, ఆత్మహత్య చేసికొనుట కొక కొండమీదనుండి క్రిందికి దుముక నుద్యమించెను. ఇది యొక గోపబాలకుడు చూచి 'అదేమి పని?' అని ఆక్షేపించెను. ఈ అవరోధానంతర మతడా బాలుని 'నాకు భగవత్సాక్షాత్కారము లభించునా?' అని యడిగెను. 'తప్పక లభించును' అని యా బాలు డనెను. ఈ అభయవాక్యము భగవంతునిదిగనే గ్రహించి అతడు వంగదేశమునకు తిరిగివచ్చెను.

"కలకత్తాకు పోవు మార్గములో అతడు 'బాలీ' యొద్ద దిగి ఏదో అదృశ్యశక్తిచే ఆకర్షింపబడిన తెఱగున దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణునియొద్దకు వచ్చెను."

పాఠకుడు : "శ్రీ చైతన్యప్రభు, రాయరామానందుల సమాయోగమునుగూర్చి రెండు భిన్నగాథలు కలవు."

స్వామి : "ప్రతిగాథను నీ వేల నమ్మెదువు? అధికారపూర్వకప్రకటననే నమ్మవలెను ...గాఢమగు మనోబలము అత్యవసరము."

స్వామి ఈ క్రింది యర్థముగల పాటపాడెను :

"'జననీ, నీ దివ్యనామము స్మరించుచు నేను మరణించితినేని వీనిని —నీ దిక్కులేని శిశువును —నీవు రక్షించి తీరవలెను.

'గోహత్య చేసినను, బ్రాహ్మణహత్య చేసినను, భ్రూణహత్య చేసినను, నాకు భయములేదు. మద్యపాన పాతక మొనర్చినను, స్త్రీహత్యాపాతక మొనర్చిననుకూడ నాకు భయములేదు.

'ఇట్టి ఘోరాతిఘోర పాతకము లొనర్చియుండినను, నీ దివ్యనామస్మరణ చేయుచు మరణించితినేని నాకు బ్రహ్మైక్యసిద్ధి తప్పదు.'

"కాని మీ రిప్పుడు పాపము లొనర్చి, అవసాన కాలమున జగన్మాతృనామమును స్మరింపవలెనని అర్థము చేసికోరాదు. ఈ క్షణమునుండి పూర్ణమతితో, పరిపూర్ణ శ్రద్ధతో, ఆమె నామమును జపింపనేని అవసానకాలమున ఆ విషయమే మీ జ్ఞప్తికి రాదు.

"గర్వాహంకారములు పూర్తిగా పరిత్యజింపు మనియే శ్రీరామకృష్ణుని బోధయొక్క సారము. ఏదో యొక్క రవంత ధ్యానము చేయుట నిష్ప్రయోజనము. ఇట్టి 'పట్టీ పట్టని' సాధనలచే భగవత్సాక్షాత్కారము లభింపదు. సాధకుడు దుర్భరవాంఛతో తపించిపోవలెను. ఆవేదనతో సంక్షోభించిపోవలెను.

"ఈశ్వరుడు తన మాయచే మనల నెట్లు కప్పివై చెనో అట్లే దయామయుడై ఈలోకమున నవతరించి సాధన లొనర్చును. ఇట్లు చేయుట మనకొఱకు —మాయావరణ మును భేదించుకొని వెలికివచ్చు మార్గము మనకు చూపు కొఱకు. ఇంతేకాక మాయాకల్పనములను తాను స్వయ ముగాకూడ మనకై భేదించును. ఒక తండ్రి తన కుమారు లందఱితో నొక తోటకు పోయెను. కొమాళ్లు ఇటునటు ఆటలాడుచు వినోదించుచుండిరి. కొందఱు పూలు కోయు చుండిరి. కొందఱు కొబ్బరికాయలు కోయుచుండిరి. ఒకడు మాత్రము చేపలు పట్టుటకు తటాకముకడకు పోయెను. ప్రొద్దు గ్రుంకువేళ తండ్రి కొమాళ్ల నందఱను రమ్మని పిలి చెను. చేపలు పట్టునతడుతప్ప అందఱును వచ్చిరి. ఎన్ని సార్లు పిలువనంపినను అతడు రాలేదు —చేపలు పట్టుటలో నతడు మునిగిపోయి యుండెను. బాగుగా చీకటిపడినను అతడు రాకపోగా, తండ్రియే అతనియొద్దకు పోయి, గాలమును విఱిచివైచి బండియొద్దకు ఆ బాలుని లాగుకొనివచ్చెను. అట్లే భగవంతుడును అప్పుడప్పుడు వచ్చి మన ఆటవస్తువు లను ఛిన్నాభిన్నమొనర్చి, మనలను తన యొద్దకు ఈడ్చు కొనిపోవును."

మే, 30.

బేలూరుమఠము. దర్శనార్థిశాల. అపరాహ్ణకాల మున శిష్యుడు శ్రీ శ్రీ రామకృష్ణకథామృతపఠనమును వినుచుండెను. శ్రీ రామకృష్ణు డెవ్వనినైనను శిష్యునిగా

అంగీకరించులోపల అతనివిషయ మంతయు—అతని నడవడి, ఇతరులతో అతడు మెలగు తెఱగు, అతని ముఖమున తోచు సాముద్రికలక్షణములు, అతని బంధుత్వములు, అతని ఋణగ్రస్తత—పూర్తిగా కనుగొనువా డని అచట నొకరు పలికిరి. శిష్యు డిది విని యిట్లనెను : "అనగా, ప్రతివారిని ఆయన అనుగ్రహించువా డనుట నిజము కాదు. ఎంతటి పతితునికైనను శ్రీ గురుదేవుని దివ్యపాదాశ్రయము లభించు నని భక్తు డొకపాట వ్రాసియున్నాడు. ఇది నిజముకాదా?"

స్వామి : "ఏల కాదు ? గిరీశచంద్రఘోషుపై ఆయన కృపావృష్టిని కురిపింపలేదా, పెక్కండ్రు వెలయాండ్రపై కూడ కురిపింపలేదా? ఒకనాడు బలరామ్‌బాబు కుటుంబస్త్రీలు శ్రీ గురుదేవుని ముందట ఆయన గదిలో కూర్చుండియుండగా, రమణియను నొక వెలయాలు ప్రక్కనున్న రోడ్డువెంట వెళ్లు చుండెను. శ్రీ గురుదేవు డామెను పిలిచి 'ఇటీవల నీ వేల వచ్చుటలేదు ?' అని అడిగెను. శ్రీ గురుదేవు డొక వెల యాలితో మాటలాడుచుండుట వారికి మిక్కిలి విపరీతముగా తోచెను.

"పిదప కొంచెముసేపటి కాయన వారిని దేవాలయ ములకు పిలుచుకొనిపోయెను. కాళికాలయమున కేగినప్పుడు దేవితో ఆయన ఇట్లు విన్నవించుకొనెను : 'అమ్మా, నిజ ముగా నీవేగదా ఆ వేశ్య రమణి వైతివి. వెలయాలి వైనదియు నీవే, పతివ్రత వైనదియు నీవే!' రమణిని ద్వేషిం

చుటలో తాము పొరపడిరనియు, ఆ వేశ్య జగన్మాతయే యని యెఱిగి శ్రీ గురుదేవు డామెతో మాటాడెననియు, తమ పాతివ్రత్యముకై తామంత గర్వింపవలసిన కారణ మేమియు లేదనియు, అదంతయు జగన్మాతృసంకల్పమాత్రముచే కలిగె ననియు ఆ స్త్రీ లప్పుడు కనుగొనిరి.''

శిష్యుడు : ''శ్రీ గురుదేవునికి వేశ్యలయెడ ద్వేషము లేకుండుట సరియే కావచ్చును. కాని మనము వేశ్యలను ద్వేషబుద్ధితో చూడనియెడల, వారిని తప్పించుకొని జీవించు టెట్లు? వారిని ద్వేషింపకున్నను, తుదకు జాలితోనై నను చూడవలెను.''

స్వామి: ''ద్వేష మేల? జాలియు అహంభావజనితమే. శ్రీ గురుదేవుని గజనారాయణుని కథయు వ్యాఘ్రనారాయణుని కథయు వినలేదా నీవు? మనము గజముల, వ్యాఘ్రముల, బారి పడకుండవలె నన్నచో, వానిని ద్వేషముతోగాని జాలితోగాని చూడవలెనా? అవి ఆ దశలో నుండుటకును, నీవు నీ దశలో నుండుటకును ఈశ్వరేచ్ఛయే కారణమనియు, క్షణమాత్రమున ఆయన వానికి శాశ్వతవిమోచనమును, నీకు పతనమును కలిగింపగలడనియు, ఎఱిగి వానికి దూరమునుండి నమస్కరింపుము. నీ గర్వాహంభావములను తుదముట్ట నిర్మూలించుకొనుము. పడుపువృత్తితో జీవించుచుండిన ఆ రమణియే యిప్పుడు మహాభక్తురాలై శ్రీ గురుదేవుని తలంచి కన్నీరు కార్చుచున్నది.''

జూన్, 17.

బేలూరుమఠ దర్శనార్థిశాలయే. ఆనాటి అపరాహ్ణాపు శ్రీశ్రీరామకృష్ణ కథామృతపాఠానంతరము స్వామి యిట్లు పలికెను :

"ప్రతిసాధకుడును భగవంతునియెడ ఏదోయొక నిశ్చిత భావ మవలంబించి, దానియందు సుస్థిరుడై యుండవలెను. సర్వకాలసర్వావస్థలందును దానియందే సుప్రతిష్ఠితుడై యుండవలెను. అవలంబింపదగుభావము లనేకములు కలవు. శ్రీ గురుదేవు డా భావము లన్నియు నభ్యసించెను—సఖభావము, సఖీభావము, భగవత్ప్రియసీభావము. శ్రీకృష్ణుని సోదరుడగు బలరాముని భావముకూడ ఆయన అభ్యసించెను. మహాదేవభావముకూడ నభ్యసింపవచ్చును.

"ప్రపంచమునెడ పరిపూర్ణమగు ఉపేక్ష, భగవంతుని కొఱకు పరిపూర్ణమగు ఆవేదన—'ఈజన్మమునందే, ఈ క్షణముననే, భగవత్సాక్షాత్కృతి నొందితీరెదను' అను నిశ్చయబుద్ధి—ఉండవలెను. మందగమనము కాదు! ఇది చక్కగా జ్ఞప్తియుంచుకొనుము: నీవు భగవంతునియందు నిమగ్నుడవు కావేని, కర్మాచరణము నీకు నిష్ప్రయోజనము. నీ హృదయమును ఈశ్వరాలయముగా జేసి అందాయనను ప్రతిష్ఠింపుము. ఆయనయొక్క నామస్మరణము చేయుచు ఆయనయందు సర్వదా లీనమైయుండుము."

మఱునాడు స్వామి తల్లిగారు మఠమునకు వచ్చిరి. ఆమె కొంతతడవు విశ్రమించినపిదప శిష్యుడామెను

"(శ్రీ) గురుదేవుడు మీ కుమారుని తన కర్పింపుమని యడుగుచో ఆయన పలికిన పలుకులు తెలుపుదురా?" అని యడిగెను.

ఆమె యిట్లు బదులుచెప్పెను: "ఆయన పలికిన పలుకు లివి —'నీ కుమారుని నా కిమ్ము. అతనిచేతి మంచి నీళ్లుకూడ నా కానందము గొల్పుచున్నవి.' అందుకు నేను 'ఏ తల్లియైనను తన కుమారుని ఊరకయే ఇచ్చివేయునా?' అంటిని. ఆయన చిఱునగవుతో ఇట్లు బదులుచెప్పెను: 'నీకు నే నేమి యిత్తును? నీ యిష్టదైవమునెడ నీ భక్తి సునిశ్చిత మగుగాక!' "

జూన్ 29, 30.

తూర్పుబెంగాలులోని రాడీఖాల్ గ్రామమునకు వచ్చి, సెర్ జగదీశచంద్రబోస్ యొక్క పైతృకగృహమున స్వామి బసచేసియుండెను. శ్రీరామకృష్ణజన్మదినోత్సవమును గ్రామస్థు లపరిమితోత్సాహముతో జరుపుచుండిరి. గ్రామములో అన్ని తెగలవారును అందు పాల్గొనుచుండిరి. స్త్రీపురుషులు, బాలబాలికలు, హిందువులు, మహమ్మదీయులు: ఎల్లరును స్వామి దర్శనార్థము వచ్చి, ఆయనచే మిక్కిలి ఆకర్షింపబడి భక్తిపూరితహృదయులై యుండిరి. ఆ గ్రామస్థులలో నొకడు —ఢాకాలో ఉపాధ్యాయవృత్తియం దున్నవాడు —తన కుటుంబమునకు తటస్థించిన విపత్తులను స్వామికి విన్నవించుకొనుచుండెను. స్వామి ఇట్లు పలికెను: "శ్రీ గురుదేవునియొద్దకు మణిమల్లిక్ అను బ్రాహ్మమతస్థు డొకరు

వచ్చువారు. అతని పెద్దకుమారుడు కేశవచంద్రసేన్ యొక్క ప్రార్థనాలయములో శ్రీ గురుదేవుని చూచి 'ఆయన నిజముగు సాధువుగా నున్నాడు. నీవాయన దర్శనము చేసికొనుము' అని తండ్రితో చెప్పియుండెను. మణిమల్లిక్ శ్రీ గురుదేవుని కడకు వచ్చినప్పుడు 'నీవు —యొక్క తండ్రివి కావా? అట్లు కనబడుచున్నావే' అని ఆయన అనెను. పిదప ఆ కుమారుడు మరణింపగా, మణిమల్లిక్ దుర్భరచింతాక్రాంతుడై ఉపశాంతి కొఱకు శ్రీ గురుదేవునికడకు వచ్చెను. శ్రీ గురుదేవుడు మొదట నిట్లనెను: 'నిజమే, పాపము! కుమారుని కోలు పోవుట కొద్దిపాటి ఆపదయా!' ఇట్టి మాట లింకేమియో పలికి ఆ పిదప కొంతసేపు మౌనముగా కూరుచుండి, చేతితో తాళము వేయుచు నొక పాట పాడ నారంభించెను. దాని మొదటిమాట లీయర్థముగలవి: 'మానవా, ఆయుధములు కైకొనుము! ఆయుధములు కైకొనుము! మృత్యుదేవుడు యుద్ధసన్నద్ధుడై నీ యింటిమీదికి వచ్చుచున్నాడు!' ఇంటికి వెళ్లునప్పుడు మల్లిక్ శ్రీ గురుదేవునితో ఇట్లనెను: 'నా చిత్త మిప్పుడు స్వస్థపడినది. దుఃఖావేశము అడగిపోయినది.' "

మఱునాడు స్వామి తన వెంట వచ్చిన సాధుబృందముతో ఇట్లనెను: "వీరి (గ్రామస్థుల) ఉత్సాహము నాకు పరమానందము నిచ్చుచున్నది. శ్రీ గురుదేవుడు మాకెన్ని యోసార్లు తినుబండారములు పెట్టి మమ్మపారముగా ప్రేమించువాడు. అందుచే మేమాయనయొద్దకు పోయితిమి. కాని వీరట్టి కారణ మేమియు లేకయే, పుస్తకములలో

ఆయననుగూర్చి చదువుటమాత్రముచేతనే, ఇంత మహోత్సాహపూరితులై, ఇంత ఆనందభరితులై యున్నారు! ఈ మిడిమెండలో వారు స్టేషనుకు వెళ్లి, కాళ్లు తలలు మాడి పోవుచున్నను, సామగ్రి యంతయు స్వయముగా మోసికొని వచ్చిరి. అంతమందికిని వారిప్పుడు వంటచేయుచున్నారు. ఇంతేకాక కలరారోగులకు, అస్పృశ్యులకు, ఉపచారములు చేసి భయగర్వాహంకారవిముక్తులగుచున్నారు. ఇంత చేయు చున్నను, వారి చదువులవిషయమే మాత్రము ఏమఱుట లేదు. ఇదంతయు చూచి నా మనస్సు హర్షముతో పొంగి పోవుచున్నది. ఇవి చూచుటకే నేనీ ప్రాంతములకు పరుగిడి వచ్చునది, పేరు ప్రఖ్యాతులు గడించుకొనుటకు కాదు. ఇందు నేను చేసిన దేమైన కలదా? శ్రీగురుదేవు డిప్పటికే అంతయు చేసివేసినాడు. స్వామిజీ (వివేకానందస్వామి) ఇట్లొకసారి పలికియున్నాడు: 'శ్రీగురుదేవుడు ప్రతియింటను పూజింపబడును. మీరందఱును వెళ్లి ఆయనపేరు నంతటను వెలుపిరండు.' ఆ పలుకులే ఇప్పుడు ఫలించినవి. కానిచో, అజ్ఞుడనైన నా బోధల వలన నేమి జరుగును? ...ఇదంతయు చూచి నేనిట్లు తలంతును: 'ఈ దేహ మెప్పుడో యొక నాడు రాలిపోవును. దాని యారోగ్యముకొఱకు ఇంత మందులేల? నేను సమక్షమున నుండుటవలన జనులకే మాత్రము ఉపకారము కలిగినను, పయనించుటలోగల కష్ట నిష్ఠురములను, లంపటలను నే ననుభవింతునుగాక. అదంతయు

నేను సరకుగొనను.' * ఈ తలంపువలననే, నే నిట్లు అకాల భోజనములను, నిద్రలేమిని, ఓర్చుకొనుచున్నాను. ఇం దేమియు సుఖములేదని మీకే తెలియుచున్నదిగదా!

"ఇట్లిట్లు జరుగునని శ్రీ గురుదేవుడును స్వామిజీయును పూర్వ మెప్పుడో చెప్పినదంతయు, అట్లే జరుగుట నాకీ ప్రాంతములలో ప్రత్యక్షముగా కానిపించుచున్నది. మీరు విస్తారముగా పాటుపడ నక్కఱలేదు. ఇదంతయు జాగ్రత్తగా కనుపెట్టి చూడుడు. (శ్రీ) గురుదేవునియందు భక్తి మీ క ప్రయత్నముగా సిద్ధించును. నిరంతరముగా ఆయన పేరును జపించుచు, ధ్యానముచేయుట సాధ్యమా? కానేకాదు. కావున మీచేతనైనంత కాలము ధ్యానింపుచుండుడు. తక్కిన కాలమునంతయు లోకమునకు నిష్కామసేవ చేయుటలో వినియోగింపుడు. అట్లు చేసినచో మీ చిత్తము క్రమక్రమ ముగా పరిశుద్ధమై భగవదనురక్తిపూర్ణ మగును."

మఱొక సందర్భమున స్వామి తన చిన్ననాటి జీవిత వివరము లిట్లు నుడివెను: "మా తల్లి అప్పుడప్పుడు ఒక గదిలో కూర్చుండి తలుపు బిగించుకొని దినమంతయు ధ్యానించుచుండెడిది. అట్టి దినములలో మేము కలకత్తానుండి

---

* ఈ పయనమునుండి తిరిగివచ్చి బేలూరుమఠముచేరిన వెంటనే స్వామికి తీవ్రమగు కలరావ్యాధి తగిలినది. తూర్పుబెంగాలు కిట్లొకసారి వెళ్లినప్పుడు 'కాలఅజార్' అనెడు మొండిజ్వరము పట్టుకొనెను. దానితో చాలకాలము బాధపడి చివరకు దానివలననే మృతినొందె నని చెప్ప వచ్చును.

వచ్చితిమేని, ఆ నాటికి పొరుగింట నుండి మఱునా డామె యొద్దకు పోవువారము. ఆమె చండశాసనురాలు. మా చదువు చెడునని మమ్మెప్పుడును తనతో మా గ్రామములో ఉండనిచ్చునది కాదు. కాని తన కోడండ్రను గాని, పని వాండ్రను గాని, పల్లెత్తుమాట అనదు. చిన్నప్పుడు నేను మిక్కిలి తులువగా నుంటిని. కావుననే నా తలమీది గాయపు మచ్చలు. 'తలపై గాయపుమచ్చలు లేని బాలుడు బాలుడే కాదు' అని స్వామిజీ చెప్పువాడు!"

మార్చి 5, 1916.

నేడు రామకృష్ణసేవాసంస్థయొక్క సాంవత్సరిక సమావేశము. నిర్దిష్టకార్యక్రమము సమాప్త మైనపిదప అచటి సభ్యులతో స్వామి యిట్లుపలికెను: "ఏనుగులకు రెండు వరుసల పండ్లుండును: ఒక వరుస, వెలుపల — దంతములు —, రెండవ వరుస, లోపల — ఆహారమునమలుటకు. మా సేవా సంస్థయొక్క చర్య లన్నిటిని 'దంతములకు' పోల్పదగును. మీ రే కార్య మొనర్చుచున్నను — సేవాశ్రమములు నడ పినను, తాపోపశమనకృత్యములు చేసినను — మీకు శీల సంపద లేనిచో, అంతయు నిరర్థక మగును. శీలసంపద, చిత్తశుద్ధి, ఈశ్వరునియందు అచంచలభక్తి: ఇవి అత్యా వశ్యకములు. ఇవి కలవారు వృద్ధికి వత్తురు, తక్కినవారి కపజయము సిద్ధము. (గృహస్థసభ్యులతో) ఈ సంస్థలో సభ్యు లై నమాత్రమున ఏమియు ప్రయోజనము లేదు. శీలనిర్మాణ మొనర్చుకోవలెను; ప్రేమబంధముచే లోకము నంతయు

స్వకీయముగా చేసికోవలెను. అట్లు చేసితిరేని, మీ అస్వార్థతను, మీ వైరాగ్యమును, మీ చిత్తశుద్ధిని చూచి లోకులును అట్టి జీవితవిధానమును ఆర్జించుకొన యత్నింతురు. మీ హృదయములలోని గర్వాహంకారములను నిశ్శేషముగా పాఱదోలి, ఈశ్వరుని దాస్యభావముతో కొలుచుచు మానవసేవ చేయవలెను.

"మన గురుదేవుడు పేరుప్రతిష్ఠల నే మాత్రమును వాంఛింపలేదు. కావున ఆయన కవి అపారముగా లభించినవి. స్వామిజీ (వివేకానందస్వామి) తన చరమదశలో తన పేరుప్రతిష్ఠలను ఏవగించువాడు. మీ రెల్లరును శీలసంపన్ను లగుదురుగాక! దైవీభావము మీ కలవడుగాక! అప్పటికిగాని ఈ సంస్థ అభివృద్ధిదశకు రాదు. ఇట్లు చేయుడని మిమ్ము నందఱను నేను హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాను."

తదనంతరము సభ ముగిసెను.

ఆ రాత్రి, భోజనానంతరము మేడ క్రిందిభాగమున గంగానదికి అభిముఖముగానుండు బెంచీపై విశ్రమించి అచట చేరిన సాధుభక్తబృందముతో స్వామి ఇట్లుచెప్పెను: "ఈ లోకమున మన మనస్సు కామకాంచనాది అనేకవిషయముల మీదికి పఱచుచుండును. మనస్సు నిట్లు చెదర్చి ఏకాగ్రత కడ్డుపడుట అవిద్యయొక్క కార్యము. కాని దాని నేకాగ్ర మొనర్చుటే మన ఉద్యమము. చెదరిన మనస్సును కేంద్రీకరించు ప్రయత్నమునకే సాధన యని పేరు. వాంఛాలేశమున్నను మనస్సు భగవంతునియందు నిమగ్నము కాజాలదు.

జపధ్యానములు చేయుటేకాక, నిశితమగు తర్కవిచారము చేసి, మన డెందములందలి చీకటిమూలలలో డాగియుండు కోరికలను వెదకి కనిపట్టి పాఱదోలవలెను. 'ఉద్ధరే దాత్మ నాత్మానం' అను గీతావాక్యమున కిదియే అర్థము. అనగా మనోవిజయము సాధింపవలెను. అప్పుడు మనము నిరంతర ప్రశాంతచిత్తులమై జ్ఞానసిద్ధుల మగుదుము. వాంఛా నిర్మూలన ప్రయత్నము లేని జపధ్యానములు నిష్ప్రయోజనములు.

"నేను మొన్న ఢాకాకు వెళ్లినప్పుడు రేయుంబవళ్లు భక్తులతో ప్రసంగించుచుంటిని.* ఇందుచే నాకు పలుమాఱు నిద్రపట్టునది కాదు. నేను ఉదాహరించి, వివరించుచుండినది శ్రీ గురుదేవుని వాక్యములనే—స్వకీయ మగు జ్ఞానము నాకేమియు లేదు—కాని రాత్రి నిద్రపట్టునది కాదు. ఇందుకు కారణము నేను స్వల్ప'పాత్రము'నగుటయే. శ్రీ గురుదేవు డెన్నియోతడవలు పారవశ్యస్థితిని, సమాధ్యవస్థను పొందుట—ఇది ఆయనకు సహజము— మేము చూచియున్నాము. అపవిత్రతాస్పర్శగలవా డెవ్వనికిని ఆయనతో నివసించుటగాని ఆయన పరిచర్యచేయుటగాని సాధ్యము కాదు. ఆయన అనుగ్రహామూలముననే నే నాయనతో నుండగలిగితిని. ఎట్లుండగలిగితినో నా కిప్పుడు చిత్రముగా

---

* స్వామియు బ్రహ్మానందస్వామియు అప్పుడే పర్యటనానంతరము మఠమునకు వచ్చియుండిరి.

నున్నది. *

"'స్టార్' నాటకశాలలో జరుగుచుండిన చైతన్య లీలాప్రదర్శన మొకనా డాయన చూడబోయెను. వెళ్లుటకు ముందు ఆయన నాతో నిట్లనెను: 'నేనచట సమాధిస్థితి నొందితినేని, అందఱును నన్ను చూడనారంభింతురు. గడిబిడి కలుగును. సమాధిగతుడ నగు చిహ్నములు తోచిన వెంటనే ఇతరవిషయము లేవేవియేని ఎత్తి నాతో ప్రసంగింప సాగుము.' కాని ఎంత ప్రయత్నించినను నాటకశాలలో సమాధిస్థితిని ఆపుకొనజాలకపోయెను. నేను కొంతసేపు భగవన్నామ ముచ్చరించినపిదప ఆయనకు మెలమెల్లగా ప్రపంచస్మృతి వచ్చెను. ఇట్టి అతీంద్రియప్రజ్ఞానస్థితు లాయనకు స్వాభావికములు—మనస్సును ఐహికక్షేత్రమున నిలుపుకొనుట కెంతో ప్రయత్నింపవలసియుండెడిది. కాని స్వల్ప'పాత్రముల'మగు మనము ఆ స్థితికై ఎన్నో గాఢ సాధనలు చేయవలెను. మన కది అత్యంత దుర్లభము."

మార్చి, 8.

రాత్రి 8 గంటలు. బేలూరుమఠములోని దర్శనార్థి శాల. శ్రీ వివేకానందస్వామి గ్రంథములు చదువబడు చుండెను. కొందఱు సాధువులును గృహస్థభక్తులును విను చుండిరి.

---

* స్వామి శ్రీగురుదేవుని పరిచర్య చేయుచు ఆయనతోకూడ చాల కాల ముండెను. తన శిష్యు లందఱిలో స్వామి పరమపవిత్రుడని ఆయన ఎన్నువాడు.

ఇది పూర్తియైన పిదప అఖండానందస్వామి (శ్రీగురు దేవుని స్వశిష్యులలో నొకరు) "రేపటినుండి నేను వీరికి ఉపనిషత్తులు బోధించెదను" అనెను. అందుపై స్వామి ఇట్లనెను: "సజీవోపనిషత్తును విడిచి, ఏ ఇతర ఉపనిషత్తులు వీరికి బోధింపనగును? శ్రీ గురుదేవుని జీవితమే దేదీప్యమానమగు సజీవోపనిషత్తు. శ్రీ చైతన్యులవారవతరించి రాధాకృష్ణభక్తివిధానమును తన జీవితమూలమున ప్రకాశింపజేసి యుండనిచో, ఆ విధాన మెవ్వరికిని బోధపడి యుండదు. అట్లే ఉపనిషత్ప్రతిపాదిత సత్యములకు శ్రీ గురుదేవుడే సజీవనిదర్శనము. అనేకశతాబ్దములనుండి ఉపనిషత్తులు వ్యాప్తిలో నున్నవి. ఎందఱచేతనో వల్లింపబడు చున్నవి. కాని చదువురాని మన గురుదేవునికి వారందఱును మ్రొక్కి ఆయనపలుకులను వేదసత్యములుగా అంగీకరించు చున్నారు. ఆయన ఉపనిషత్తులు చదివియెఱుగడు సరే కదా, ఏ పుస్తకమునుకూడ చదివిఎఱుగడు. ఐనను ఆ అతిసూక్ష్మ, దురవగాహసత్యములను అంత సులభముగా, అంత సరళముగా ఆయన ఎట్లు వివరింపగలిగియుండెను! వేదములు చదువగోరువాడు వ్యాకరణమును కంఠపాఠముచేసి వివిధ భాష్యములు పఠింపవలెను. ప్రతి భాష్యకారుడు తన మతమున కనుకూలించునట్లు వ్యాఖ్యానించియున్నాడు. అసంఖ్యాకులగు విద్వాంసులు ఒక్కొక్కవాక్యార్థమునుగూర్చి అవిరామముగా చర్చించినను, సమాధానము కుదరలేదు. కాని, మన గురుదేవుడా సత్యము లన్నియు అతిసుబోధమగు భాషలో వివరించియున్నాడు. ఆ వాక్యములు

వ్యాప్తిలో నున్నవి. అట్టి సజీవకూపకము(చెలమ)ను ఎదుట పెట్టుకొని నీటికై బావిని త్రవ్వుదురా?"

ఆ ముందటినాడు శ్రీరామకృష్ణజన్మదినోత్సవము జరిగినది. ఆ సందర్భమున పంద్రెండుగురు బ్రహ్మచారులు సన్న్యాసదీక్షనొందిరి. వారినొక గృహస్థభక్తుని యాచించి ఒక రూపాయ తీసికొని, నావ కుదుర్చుకొని దక్షిణేశ్వరాలయదర్శనార్థము వెళ్లిరి. స్వామి కిది అసమ్మత మగుటచే వారితో ఆయన ఇట్లు చెప్పెను: "నిన్ననే కదా మీరు ముండనము కావించుకొంటిరి (సన్న్యాసులైతిరి)? శిక్షానియమ బద్ధులము కామని అప్పుడే తలంచుచున్నారా? శిక్షానియమములు పాటించువారే కదా వాని కతీతులు కాగలరు? లోకమును పరిత్యజించి సన్న్యసించినవారు జనులకు గురువులు. కావున మీరిప్పు డట్టివారై తిరి. అయ్యును నావ కీయవలసిన డబ్బుకై యెట్లు యాచించితిరి? ఇది పారమార్థికత్వమా? శ్రీగురుదేవుని సాధనస్థలమును దర్శింప మీ కంత వాంఛ యున్నచో ధనముకై యాచించుటకు మారుగ బాలీకి పోయి మిమ్ము దాటింపుమని పడవవానిని వేడుకొనియుండరాదా? లేక ఈది ఏఱు దాటియుండరాదా? లేక దూరమును పాటింపక నడచి వరానగరం తెనమీదుగా వెళ్లియుండరాదా? అప్పుడు మీరు నిజముగా గురుపదవి కర్హులైతిరని నేను తలచియుందును. మీరు మఠనివాసము చేయుచు శ్రీగురుదేవుని బోధలకు లోకవ్యాప్తి కలిగింతుమనియు, మీరట్లు చేయనిచో ఆ బోధలు లోకమునుండి అదృశ్యము లగుననియు తలంచుచున్నారు కాబోలును!

పారమార్థికత లేనిచో మఠనిర్మాణములు, సన్న్యాసస్వీకార ములు నిష్ఫలము లగును. పారమార్థికత కలిగి విధ్యుక్త జీవనము సలుపువారు మఠనిర్మాతలు కాకపోయినను, సన్న్యసింపక గృహస్థులై యున్నను, లోకముచే ఆరాధింప బడుదురు. కాషాయవస్త్రములు లేమి ఆ యారాధన కడ్డు రాదు. శ్రీ గురుదేవుని ఆదర్శము లెవరి జీవితవిధానమున ప్రకాశించునో —వారు గృహస్థులైనను సన్న్యాసులైనను —వారు మహనీయులు. తన భావములను శ్రీ గురుదేవుడే వ్యాపింప జేసికొనుచున్నాడు. సన్న్యాసులగు మీ ప్రబోధము లేనిది అవి వ్యాప్తినొందవని తలంపబోకుడు. గృహస్థులకన్న ఆ యవకాశము మీ కధికముగా ప్రాప్తించి నందుకును, ఈ మహితాత్ముల (శ్రీగురుదేవుని స్వశిష్యుల) దివ్యసాహచర్యభాగ్యము లభించినందుకును కృతజ్ఞులై యుండుడు.''

అఖండానందస్వామి : ''మేము ఆర్గుర మొకసారి హృషీకేశములో ఒకే కుటీరమున దాదాపు రెండుమాసములు నివసించితిమి. ఇది చూచి అచటనున్న తక్కిన సాధువులు మిక్కిలి అచ్చెరువుతో ఇట్లనిరి : 'మీ సోదర శిష్యు లెట్లు ఒకటిగా నివసింతురు? మే మిరువురు సోదర శిష్యుల మొకటిగా రెండునాళ్లుండినచో కలహింప సాగుదుమే!' ఈ విషయ మొకతడవ నేను బృందావనమున విజయకృష్ణగోస్వామితో చెప్పితిని. అత డానందభరితుడై యిట్లనెను : 'ఇది నా కేమియు వింతగా నుండలేదు. మీ

మ్మొకటిగా బంధించియుంచు సూత్రము అసామాన్యమైనది గదా! మీ గురుదేవుడు సామాన్యమానవుడా! సామాన్య సాధువా! ఆయన సామాన్యమానవుడైనచో కలకత్తా బాలురగు మిమ్ములను ఈ (మహోన్నత)స్థితికి తెచ్చియుండ గలడా? మీయందిట్టి ఐకమత్యము, ఇట్టి ప్రేమానుబంధము ఉండుట నాకేమియు వింతగా లేదు.''

స్వామి: ''కాషాయవస్త్రధారణమాత్రమున నెవ్వరును నాకు సంతృప్తి కలిగింపరు. సర్వసంగపరిత్యాగము, అరిషడ్వర్గవిజయము: ఇవియే నేను చూడగోరునది. నాగ మహాశయుని జీవితము సరి! సన్న్యాసచిహ్నమగు కాషాయము కట్టకపోయినను, ఆయన ఎంతటి మహాత్ముడు! ఆయన త్యాగ మెంత మహనీయము!

''మొన్న నేను ఢాకాకు వెళ్ళినప్పుడు నాగమహాశయుని గృహమును సందర్శించి వచ్చితిని. అచటి కొక బ్రాహ్మణుడు వచ్చి భాగవతము చదువువాడట. అత డొక శ్లోకము చదివినవెంటనే నాగమహాశయుడు దాని భావమును దీర్ఘముగా వివరించెడివాడట. పండితులు భాగవతము చదువుటమాత్రమే యెఱుగుదురు. కాని నాగమహాశయునికి అందలి సత్యములు అనుభవసిద్ధములు. అందుచే ఆయన కవి యెదుట కానిపించువస్తువులవలె సుస్పష్టముగా నుండెడివి. ఈ దీర్ఘవివరణము లాయన తండ్రికి - రుచించునవి కావు. అందుచే అతడు 'సరి! నన్ను భాగవతము విననీయవా యేమి?' అని చిరాకుతో పలుకువాడు. నాగమహాశయుడు

మహాశాంతిపరుడు. కావున వెంటనే మౌనము దాల్చు వాడు."

అఖండానందస్వామి: "సురేశ ముఖర్జీ (పిదప బాబా ప్రేమానందభారతి) శ్రీ గురుదేవునియెడ భక్తిగలవాడు. అతడు కొన్నాళ్లు వరాహనగరమఠమునకు వచ్చుచుండెను. అమెరికాకు పోయి అచట హిందూమతప్రచారము చేసెను. అత డొకసారి నాగమహాశయుని గ్రామమునకు దర్శనార్థము వెళ్లెను. అతనిని చూచుటతోడనే నాగమహాశయుడు 'కలకత్తా!', 'కలకత్తా!' అని ఆనందముతో చేతులెత్తి నృత్యముచేయ నారంభించెను. శ్రీగురుదేవుని యునికిచే పావనమైన కలకత్తానుండిగదా అతని రాక! అందులకే ఈ యానందము! ఇట్లే శ్రీ గౌరాంగస్వామికూడ తా నప్పుడు వెళ్లబోవుగ్రామపు మృత్తికతో ఖోల్ అనెడు వాద్యము (సంకీర్తనములో వాడబడు నొక వాద్యము) చేయబడు నని విని మైమఱచి పారవశ్య మందెనుగదా! *

"స్వామిజీ (వివేకానందస్వామి) ఎంత గాఢమగు తపోనిష్ఠ లాచరించినది విన్నచో, మీ రాశ్చర్యచకితులై పోవుదురు. ఆయన పరివ్రాజకవృత్తిలో హిందూదేశాటనము చేయుకాలమున, నే నప్పుడప్పు డాయన వెంట నుందు

---

* ఆ గ్రామమునకును మృత్తికకును సంబంధము; మృత్తికకును ఖోల్ కును సంబంధము; ఖోల్ కును సంకీర్తనమునకును సంబంధము; సంకీర్తనమునకును భగవంతునికిని సంబంధము. కావున ఆగ్రామము తలంపునకు రాగానే భగవంతుడు జ్ఞప్తికి వచ్చి మైమఱపు, పారవశ్యము కలిగెను!

వాడను. ఆ కాలమున (ఇది అమెరికాకు వెళ్లుటకు పూర్వపు మాట) ఆయన యొక ముదుకదుప్పటియు, సుమారిరువది సేర్లు (1½మణుగుకు కొంచెము ఎక్కువ) బరువుగల పుస్తకములసంచియు, మోసికొని పోవువాడు. లిమ్డీపురమున ఆయన ఇక్కట్టులపాలయ్యెను. అప్పుడొక బీదబ్రాహ్మణుడాయనను చేరదీసెను. అచట కొన్నాళ్లున్నపిదప లిమ్డీ మహారాజాయన మహత్త్వమును విని, తన నగరులో నుండ నాహ్వానించెను. కాని ఆ బ్రాహ్మణుని మనస్సు నొచ్చునని స్వామి ఆ ఆహ్వానము నిరాకరించెను. ఐనను, మహారాజు ఆయనకు అనేక రాజభోజ్యములగు భక్ష్యము లనుపువాడు. అవి ఆ బ్రాహ్మణునకుకూడ ఆయన ఇచ్చుచుండెను.”



### 4-వ ప్రకరణము

# శ్రీ తురీయానందస్వామి సంభాషణములు

## I

1915, జూన్ 7.

"ఎంత సమాధ్యనుభూతియు, ధ్యానశక్తియు ఉన్నను, భగవంతుని ప్రేమించుట మఱవరాదు. భగవత్ప్రేమ లేని జీవితము నిష్ప్రయోజనము కాదా!" అని శ్రీ శివానంద స్వామి పలుకగా, స్వామి యిట్లనెను: "అవును, తాను శరీర మను అను బుద్ధి గలప్పుడు భగవత్సేవకభావమును వహింప వలెను; జీవబుద్ధి గలప్పుడు, భగవదంశభావమును వహింప వలెను; ఆత్మబుద్ధి గలప్పుడు భగవంతుడే తాను అను భావమును వహింపవలెను.

"ఏ మాత్రపు బాధ కలిగినను ఔషధములకై పరు గిడువాడు భగవంతునికి లోబడక తిరుగుబాటు చూపుట చిత్రము కదా!"

శ్రీ రామకృష్ణకథామృతము చదువబడుచుండెను. స్వామి ఇట్లనెను:

"దక్షిణేశ్వరము ఆ కాలమున నిత్యానందపూర్ణమై కైలాసముతో తులదూగుచుండెను. ప్రొద్దున మొదలు మధ్యాహ్నము ఒంటిగంటవఱకు అందఱును అచటి దేవతల

యారాధనకై యేర్పాట్లు చేయుటయందును, ఆ పిదప ఆరాధించుటయందును మగ్నులై యుండువారు; శ్రీరామకృష్ణుడు అవిరామముగా భగవంతునిగూర్చి ప్రసంగించుచుండును; అచటివా రందఱును మంత్రముగ్ధులవలె ఆయన పలుకు లాలకించుచుందురు; వాతావరణమే భగవద్భావములతో స్పందించుచుండెడిది. ఆయన పరిహాసోక్తులలోను, ఎగతాళిమాటలలోను కూడ భగవత్సంబంధ ముండును. అవికూడ సమాధిస్థితిలోనే పరిణమించును. మధ్యాహ్న భోజనానంతరము కొంతతడవు విశ్రమించునుగాని కొంచెము సేపే. పగటివేళ తక్కినకాలమంతయు భగవంతునిగూర్చిన ప్రసంగములే! సాయంకాలము కాళికాలయమున కరిగి, ఆ జగన్మాతకు వింజామరమువైచి, దివ్యోన్మాదముతో తూలియాడుచు తన గదికి వచ్చును. సాధన లభ్యసించువారిని "మీకు ప్రాతస్సాయంవేళల నొకవిధమైన మత్తత కలుగుచున్నదా?' అని ప్రశ్నించుచుండువాడు......రాత్రి శ్లాయనకు ఇంచుమించు నిద్రయే లేదు. పరుండి పరుండక మునుపే లేచి తన గదిలో నిద్రించువారి నందఱిని లేపి 'అంతగా నిద్రింపవలదు. లేచి ధ్యానింపుడు' అని ఆదేశించును. ఆ పిదప తాను పరుండి వేకువజాముననే లేచి తన అసదృశ మధురస్వరముతో భగవన్నామోచ్చారణ మొనర్చును. తక్కినవారును అప్పుడు లేచి జపధ్యానస్థితు లగుదురు. అప్పుడప్పుడు వారియొద్ద కాయన పోయి వారి అంగవిన్యాసమును సరిపఱచును.''

జూన్, 10.

స్వామి : "ఆత్మసాక్షాత్కారము నొందగోరువారు వైరాగ్యపర్వతముయొక్క అత్యగ్రశిఖరము నధిరోహింప వలెను."

జూన్, 11.

స్వామి : "విషయప్రపంచమంతటినుండి మనస్సును విడబఱచుట సులభమా? ధీరాతిధీరునికే అది సాధ్యము. బాహ్యవిషయము లెప్పుడును నీ మనస్సులో ప్రవేశించి నిన్ను లోబఱచుకొనుటకు యత్నించుచుండును. మనస్సు లోపలనే, ఒకదానిపైనొకటిగ, ఎన్నోపొరలు కలవు. చెవులను కన్నులను మూసికొనిన మాత్రమున నేమియు ఫలము కలుగదు."

జూన్, 13.

స్వామి : "— అనునతడు రాజయోగమును త్వరగా గ్రహింపగోరుచున్నాడు. కాని మేమా యన్వేషణములో మా జీవితములనే ధారపోసితిమి. పసితనమునుండియు మాకిదియే పని. కాని మన కిప్పటికిని పరిశుద్ధత నొందలేదు. ఇప్పటికిని రాగద్వేషములు మిగిలియున్నవి...... ప్రభూ! నీ భక్తులయొక్క భక్తులకు నేను భక్తుడనై యుండునట్లనుగ్రహింపుము!

"అహంభావము నిరుపయుక్తము, అత్యపాయకరము. అది మద్యపానమువలె ఇంద్రియములను తప్పుత్రోవలకు

లాగును. 'నీరు పల్లమునగాని నిలువదు' అని శ్రీగురుదేవు డనువాడు. బుద్ధియొక్కయు హృదయముయొక్కయు సద్గుణములు ప్రకటితమగునది వినమ్రస్వభావము గలవానియందే. గర్వము శిరస్సును వంగనీయదు. ఉక్కువలె లివ (స్థితిస్థాపకశక్తి) గలిగి, విఱువశక్యముకాకుండునదే నిజమగు బలము. వివిధస్వభావములు గలవారితో సరిపుచ్చుకొని అనుకూలముగా మెలగగలవాడే బలవంతుడు.

"శాశ్వతముగా భగవంతునికి స్వకీయుడవై యుండుము. అప్పుడు నీ కిక భయముండదు. 'ఈ భూమిపై జన్మించినందుకు గుఱుతుగా శాశ్వతమగు జాడలు కల్పింపుము' అని స్వామిజీ (వివేకానందస్వామి) పలుకువాడు. 'మన పేళ్లు చరిత్రాత్మకము లగునని నమ్ముడు' అని వరాహనగరమఠమున ఆయన చెప్పెను. యోగానందస్వామి అందుకు గేలిసేయగా, ఆయన ఇట్లనెను: 'సరి, కానిండు. నిలుకడమీాద చూడుడు. వేదాంతసత్యములను నే నందఱికిని రూఢిపఱుపగలను. నా మాటలకు మీారు చెవియొగ్గరేని, నేను వెలివాడల కరిగి వారికి వేదాంతబోధ చేయుదును.'

"బోధ చేయగోరువారు బోధితులకు కొంత ఈయ గలిగి యుండవలెను. బోధ యనగా బాలురకు పాఠము చెప్పుటవంటిది మాత్రమే కాదు; పుస్తకములోని విషయమును వివరించుటవంటిదియు కాదు. వినువారికి కొంత ఈయవలెను. కావున బోధకు పూనుకొనుముందు పారమార్థిక బలము మీారార్జించుకోవలెను ...... కావు

క్రోధాదులను వశపఱచుకొంటిమనియెన్నటికిని గర్వింపకుడు. గర్వించితిరేని అవి వెంటనే తలయెత్తును. 'ప్రభూ! వానినుండి నన్ను రక్షింపుము' అని సదా భగవంతుని ప్రార్థించు చుండుడు.

"మనస్సును నిలుకడనొందనీయక అడ్డుపడున వెన్నియో కలవు: లయము, విక్షేపము, కషాయము, రసాస్వాదము. మనస్సు తమోగుణవశమై, నిద్రామత్తమై, యెఱుకదక్కుటను లయమందురు. సాధకులలో అనేకులు లయమునకు లోబడిపోవుదురు. మనస్సు వివిధవిషయముల దెస మరలి చీలి చెదరుటను విక్షేప మందురు. కషాయ మనగా ధ్యానము వెగటుగాతోచుట: ధ్యానించుటకు మనసు కొలుపకుండుట. మనస్సు ఈశ్వరస్వరూపములచే ముగ్ధమై అంతకు పై మెట్టుల కెగబాఱనొల్లమిని రసాస్వాదమందురు. శరీరముండువఱకును కామక్రోధాదులు నిలిచియే యుండును. కాని ఈశ్వరకృపచే అవి తల యెత్తజాలవు."

జూన్, 15.

స్వామి: "కేవల కర్మాచరణము నిరుపయోగము. పారమార్థికభావప్రదీప్తము కానిచో అది బండచాకిరిగా తోచును."

జూన్, 16.

శ్రీరామకృష్ణకథామృతము చదువబడుచుండెను. ఒక ఘట్టమున శ్రీరామకృష్ణు డిట్లు పలికెనని అందు చెప్ప

బడియుండెను : "కర్మాచరణమూలమున ఈశ్వరసాక్షాత్కారము లభించుననుట నిజముకాదు. కాని నిష్కామకర్మచే ఈశ్వరదర్శనతృష్ణ అభివృద్ధిచెందును. ఈ తృష్ణ అతని యనుగ్రహము నాకర్షించును. తత్ఫలముగా సాక్షాత్కారసిద్ధి లభించును."

ఈ సందర్భమున స్వామి యిట్లు పలికెను : "శాస్త్రముల నప్పుడప్పుడు కొంచెము తిరుగవేయుచుండుట, ఎప్పుడో కొంచెము ధ్యానము చేయుచుండుట: ఇంతమాత్రమున సాక్షాత్కారము సిద్ధింపదు. సాక్షాత్కారముకై ఆవేదన పొందవలెను. ఈశ్వరునికొఱకు హృదయము రోజి, కృశింపవలెను. శ్రీ గురుదేవుడు మాతో ఇట్లు చెప్పెను : 'దేవీదర్శనతృష్ణ నాకంతతీవ్రమైయుండుటచేతనే ఆమె నాకన్ని సదుపాయము లేర్పఱచెను —ఈ కాళికాలయమును, మథుర్ బాబును, నాకు ప్రసాదించెను. హృదయపూర్వకమగు సాక్షాత్కారవాంఛ కలదేని, అనుకూలవాతావరణము ఏర్పడును.'

"భక్తివినా వేఱుత్రోవయే లేదు."

స్వామి 'శి-' : "ఈ మాట ముమ్మాటికి సత్యము : 'ఈశ్వరపాదపద్మధ్యాన మొనర్పుము; ఇంద్రియములు తమంతట తామే వైదొలగును, మనస్సు ఆయనలో లీనమైపోవును.' పారమార్థికసిద్ధి కంతటికిని భక్తియే మూలమని రామప్రసాదు డొక కీర్తనలో పలికియున్నాడు. రామప్రసాదు డొకవిధముగా శ్రీరామకృష్ణుని కాదర్శపురుషు డని చెప్ప

వచ్చును. శ్రీ గురుదేవుడు జగన్మాతతో ఇట్లు మొఱపెట్టు కొనువాడు: 'అమ్మా, రామప్రసాదునికి నీ దర్శనభాగ్య మిచ్చితివి; నా కేల ఈయవు?' జ్ఞానముచే సంస్కరింపబడిన భక్తినే శ్రీ గురుదేవుడు బోధించినది."

జూన్, 20.

స్వామి: "భగవన్నామోచ్చారణమాత్రమున నా కన్నుల నీరుగ్రమ్ము శుభదిన మెప్పు డేతెంచునో గదా! (శిష్యునితో) ఆయన నామము స్మరించునప్పుడు నీకు కన్నీరు కాఱునా? ఆహా! ఎంత ఉన్నతస్థితి అది! ఆయన నామో చ్చారణమే కన్నులకు నీరు తెచ్చుట!"

స్వామి 'శి–': "శ్రీ గురుదేవుని దర్శనమున కేగ నారంభించిన క్రొత్తలో, నాకు పలుమాఱు ఏడుపు వచ్చెడిది. ఒకనాటి రాత్రి ఏటిగట్టున వకుళవృక్షముకడ నేను చాల తడవు ఏడ్చితిని. అదే తరుణమున శ్రీ గురుదేవుడు తన గదిలో నే నెచటికి వెళ్ళితినో యని విచారించుచుండెను. నేను ఆయనయొద్దకు వచ్చుటతోడనే కూర్చుండు మని చెప్పి ఇట్లనెను: 'తనకై విలపించువారియెడ ఈశ్వరుడు మిక్కిలి ప్రీతుడగును. యుగయుగములుగా కూడుకొని యున్న మనోమాలిన్యములు ప్రేమాశ్రువులచే కొట్టుకొనిపోవును. భగవంతునికై విలపించుట మిక్కిలి శ్రేయస్కరము.'

"మఱొకనాడు నేను పంచవటిలో ధ్యానము చేయు చుంటిని. నా ధ్యానము మిక్కిలి అగాధముగా నున్నప్పుడు

శ్రీ గురుదేవు డచటికి వచ్చెను. ఆయన నా వైపు చూడగనే నేను ఏడువసాగితిని. శ్రీ గురుదేవుడు నిశ్చలముగా నిలుచుండెను. నా హృదయసీమయం దేదియో ఎగబ్రాకుచున్నట్లు తోచి, నా యొడలు కంపింప నారంభించెను. దానిని ఆపుకొనజాలకపోయితిని. నా యేడుపు అర్థ రహితము కాదనియు, అది యొక విధమగు పారవశ్యస్థితియనియు ఆయన పలికెను. పిదప నే నాయన వెంట ఆయనగదికి వెళ్ళగా, నా కేవో భక్ష్యము లిచ్చెను. కుండలినిని మేలుకొల్పు టాయనకు సులభకార్యము. స్పృశించుటకూడ లేక, చెంత నిలుచుటచేతనే, ఆయన దానిని మేల్కొల్పగలడు."

జూన్, 21.

స్వామి : "మానవుడు సుఖముకై ప్రయాసపడుచుండును. కాని ఎంతటిప్రయాసమైనను భగవదిచ్ఛ లేనిదే ఫలింపదు. మోక్షసాధనమునకు రెండు మార్గములు కలవు: ఆయనతోడి ఐక్యభావము పూనుట ఒక మార్గము, ఆయనకు శాశ్వతముగా ఆత్మార్పణముచేసికొని జీవించుట రెండవ మార్గము. ఆయనను బాసి స్వతంత్రేచ్ఛ ఉండనేరదు.

"తన అసత్యాత్మను నమ్ముకొనియుండువానికి నాశము సిద్ధము. సర్వజ్ఞుడను అని తలచు అహంకారము మిక్కిలి హానికరము. ఆత్మవిశ్వాసము, ఆత్మైకాధారతాబుద్ధి, అనుటకు అర్థము పరమాత్మయందు విశ్వాసమని. తన ప్రస్తుతస్థితియే నిలిచియుండవలెనను మొండిపట్టుదలయు,

తన ప్రస్తుతభావముల నేమైనను విడువరాదను పట్టుదలయు శ్రేయస్కరములు కావు.”

జూన్, 22.

స్వామి : “మానవునికి ప్రేమగుణము ఉండవలెను. మా చిన్నతనమున మాకెంతటి ప్రేమోన్మాద ముండెడిది! నా సోదరులపై నా ప్రేమ మపారము. వారిని వీడి సన్న్యసించు టెట్లా అని ఏడ్చువాడను. కాని శ్రీ గురుదేవు డీయనుబంధముల నొక్కొక్కటిగా త్రుంచివైచెను. ఆయన ‘స–’ను ‘నీ వెవరిని ప్రేమింతువు?’ అని యొక తడవ ప్రశ్నించెను. ‘నే నెవ్వరిని ప్రేమింపను’ అని యతడు బదులుచెప్పగా ‘ఛీ! ఎంత శుష్కచిత్తము నీది!’ అని ఆయన పలికెను.”

జూన్, 24.

స్వామి : “మానవుని మానవునిగా భావించి ఆరాధించుటచే నీ కెన్నటికి ముక్తి లభింపదు. అతనిని భగవంతునిగా భావింపవలెను. అత డెంత ఆధ్యాత్మికజ్ఞాననిధానమై యున్నను, ఎంత త్యాగమూర్తియై యున్నను, ఎంత పారమార్థికప్రభావసంపన్నుడైనను, అతనిని నీవు భగవద్భావముతో చూడక చేయు అర్చనచే నీకు మోక్షము సిద్ధింపనేరదు. ఆ బుద్ధితో కాక చేయు సేవచే అతని పారమార్థిక గుణములును, శక్తులును నీకు పట్టుపడవచ్చును. అంతయే. కాని అవతారమూర్తిని సేవించితివేని —అతని యథార్థతత్త్వము నీ వెఱుగ కుండినను—నీ కతడు తప్పక మోక్షమిచ్చును. శిశుపాలుడు శ్రీకృష్ణుని ద్వేషించెనుగదా.

కాని యతని కీశ్వరసాక్షాత్కారము ప్రాప్తించెను. గోపికలు శ్రీకృష్ణుని తమ ప్రియుడుగనే గదా భావించుచుండిరి. కాని, వారి కీశ్వరసాక్షాత్కారసిద్ధి కలిగెను. ఒక గోపికను ఆమె భర్త బంధనమున నుంచెను. శ్రీకృష్ణవిరహముచే ఆమె యనుభవించిన పరితాప మామె పాపములను దహించి వైచెను. ఆయన ధ్యానముచే ఆమె యనుభవించిన యానంద మామె పుణ్యరాశిని దహించి వైచెను. ఆమెకు మోక్షము సిద్ధించెను.''

శిష్యుడు: ''కాని భక్తి అగాధమైనప్పుడు భగవంతుని మహత్త్వమే మఱపునకువచ్చు నందురుగదా!''

స్వామి: ''అది భగవత్సాక్షాత్కారానంతరము. అప్పు డతని యభీష్టము భగవంతునికి మఱిమఱి సమీపస్థు డగుచుండుట. ఆ ప్రయత్నమున నతడు భగవంతుని మహిమలను తన స్మృతిపథమునుండియే తుడిచివైచుకొనసాగును. గోపికలు సామాన్యమానవస్త్రీలు కారు. వారివి పారమార్థిక శరీరములు......ఈశ్వరసాక్షాత్కారమునకు బ్రహ్మచర్యనిష్ఠ అత్యావశ్యకము. ఇరువదెనిమిది సంవత్సరములు బ్రహ్మచర్యనియమ మభ్యసించువానికి భక్తిజ్ఞానములును, సర్వమును, సిద్ధించును. కామాతురత ''మనసిజము'' * అనగా మనస్సులోపుట్టునది. మహాధీరుడుగాని ఇంద్రియములను జయించి, వాని కతీతుడై, అతీంద్రియక్షేత్రముల కెగయజాలడు.

* మనసిజుడు=మన్మథుడు.

“హఠమును బల మందువా? నేను సమ్మతింపను. అది బలహీనతను మఱుగుపఱచు అంగీవంటిది. తమ బలహీనతను కప్పిపుచ్చుకొనుటకై దుర్బలులు దానిని దాల్తురు. యథార్థబలముగలవాడు వంగనేర్చును, మరల తన యథాస్థితి నందనేర్చును.”

జూన్, 26.

స్వామి : “స్వామి ప్రే- ఇట్లు వ్రాసినాడు: ‘మనము నివసించునది ఊహాక్షేత్రమున కాదు, ప్రత్యక్షానుభూతి క్షేత్రమున.’......ఏ గమ్యమును సాధించుటకై మనము సన్న్యసించితిమో, ఆ గమ్యము నప్పుడప్పుడు జ్ఞప్తికి తెచ్చుకొని, దాని వైపునకే సాగుచున్నామా అని పరీక్షించుకొనుచుండ వలయును.”

జూన్, 27.

స్వామి : “ఆయన (శ్రీరామకృష్ణుని) ఉపదేశము సామాన్యమైనదా! పారమార్థిక ప్రజ్ఞానమును ఆయన వెంటనే మేలుకొల్పువాడు. నాలుకపై ఏవో అక్షరములు వ్రాయువాడు. వెంటనే శిష్యుని ఆంతరంగికసీమయందేదియో పైకి ఉబుకుచున్నట్లు —తరంగముమీద తరంగమువలె —తోచును. ‘నీకు అభిషేకము (తాంత్రికోపదేశము) వలయునా’ అని నన్నడిగెను. నాకు తెలియదని బదులు చెప్పితిని. ‘అట్లయిన నీకది వలదు’ అని ఆయనపల్కెను. నేనొకసారి దేవికి ప్రణమిల్లి కాళీకాలయమునుండి వచ్చు

చుండగా ఆయన నన్నుగూర్చి ఇట్లనెను: 'ఇతని "స్వస్థలము"* నామరూపముల కుత్పత్తిస్థానమగు మహాశక్తి.'

"నాకు మోక్షముకై అత్యంతతీవ్రవాంఛ కలిగియుండెను. ఈ జన్మముననే ఈశ్వరసాక్షాత్కార మొందవలెనని నేను మిక్కిలి అర్థించుచుంటిని."

జూన్, 28.

స్వామి: "మేము స్వయముగా (మా కన్నులతోనే) చూచితిమి, (మా చెవులతోనే) వింటిమి. వివేకానందస్వామియొక్క అపారమగు ఈశ్వరదర్శనౌత్సుక్యము మమ్మాశ్చర్యచకితులనొనర్చునది. అది చూచి మా విషయమున మేము ఆసలు వదలుకొంటిమి. శ్రీగురుదేవు డెన్ని ప్రోత్సాహవాక్కులు చెప్పినను, మా కీ జన్మమున ఈశ్వరసాక్షాత్కారసిద్ధి లభింపదనియు, వ్యర్థజీవుల మగుదుమనియు తోచుచుండెను. కాని చివరకు శ్రీగురుదేవుని యనుగ్రహముచేత కాల మనుకూలింపసాగెను.

"వివేకానందస్వామియొక్క పరివ్రాజకజీవనకథ విన్నచో మీ రాశ్చర్యపరవశు లగుదురు. ఆ దినములలో ఆయన పాటించిన త్యాగము వర్ణనాతీతము. అప్పుడు నా

---

* ప్రతిశిష్యుని బుద్ధియొక్క నైసర్గికపు పోకడలనుబట్టియు, అతని యందు అప్రకటితరూపమున కానిపించు అంతర్నిహితశక్తినిబట్టియు, అతడు —ఎఱిగియో ఎఱుగకో —చేరజూచుచున్న ఆదర్శము సూచితమగును. ఆ ఆదర్శమే ఇచ్చటి "స్వస్థల" శబ్దమున కర్థము.

కొకయుత్తరములో 'భుక్తం మానవివర్జితం పరగృహే ష్వాశంకయా కాకవత్' (అభిమానమును విసర్జించి ఇతరుల ఇండ్లలో జంకుతో కాకివలె భుజించితిని) అను భర్తృహరి వైరాగ్యశతక వాక్యమున కనురూపముగా తాను జీవించుచున్నట్టు వ్రాసెను!"

జూన్, 29.

స్వామి : "నీ వెప్పుడు 'మ అెవ్వరును కాదు, ఆయన యొక్కడే నాకు సర్వము' అని తోచునో, అన్యాధారము నంతయు ఎప్పుడు విసర్జింతువో, అప్పుడే నీది సక్రమస్థితి. నీ విప్పుడు ఐహికవిషయములపై—ద్రవ్యము, మానవుడు, పాండిత్యము మొదలగువానిపై—ఆధారపడి యున్నావు. బుద్ధిలో నొక్క మర సడలినచో మహావిద్వాంసులు సైతము పిచ్చివా రగుదురు. మన ఆధారము భగవంతునిపై కాదు: మన ద్రవ్యము, మన బంధువులు, మన మిత్రులు—వీరి మీదనే మనము ఆధారపడునది. కాని 'రాజా, నిరుపేదల కాయనయే ధన మని ఎఱుంగుము.' నీకును ఆయనకును నడుమ నిలిచి అడ్డుపడున దేదియు లేకుండినప్పుడుగాని నీ కాయన సాక్షాత్కారము ప్రాప్తింపదు. శ్రీ కృష్ణుడు గోపికల బంధముల నన్నిటిని ఛేదించివైచెను. కాని వారి లజ్జాభావముమాత్రము మిగిలియుండెను. ఆ బంధమునుకూడ చివర కాయన ఛేదించెను. తనకొఱకై దేనిని పరిత్యజించుట మానవునకు దుర్లభముగా నుండునో, భగవంతు డది యెఱిగి తానే దానిని తొలగించును. 'ప్రభూ, సర్వమును

—నా హృదయాంతరాళగర్భమున గుప్తపఱచుకొనియున్న వానిని కూడ—నాయొద్దనుండి తొలగింపుము.' 'ఓ నరుడా, నీకీ సంసారసాగరమును తరించు వాంఛ కలదేని, ఐహిక విషయవాంఛలను విడనాడవలెను.'

"శ్రీ గురుదేవుడు 'అద్వైతజ్ఞాన మార్జించుకొన్న పిదప మీ రేది కోరిన దానిని చేయుడు' అనువాడు. అనగా, 'ఈశ్వరుడే మీ ఆత్మకు ఆత్మ, మీ ప్రాణమునకు ప్రాణము, మీకంటికి కన్ను' అని ఎఱిగి ఆయనను ప్రేమింపుడు అని యర్థము. ఇదియే యథార్థభక్తి. నీ కోరికలు తీర్చుమని ప్రార్థించుట భక్తి కాదు. మనస్సునందు వాంఛాలేశ మున్నను పరాభక్తి లభింపజాలదు."

'నా గురుదేవుడు' (అను శ్రీ వివేకానందస్వామి ఉపన్యాసము) చదువబడుచుండెను. అందలి "ఈ ప్రకృతి వికారదృశ్యముల వెనుక పరిపూర్ణానందమయ మగు—దాని ముందట ఈ ఇంద్రియసుఖము లన్నియు పసిపిల్లలకు పనికి వచ్చు ఆటవస్తువులుగా తోచునట్టి —సత్యవస్తు వొకటి కల దను దృఢవిశ్వాసము గలవాడు ...దానిని లభ్యపఱచు కొనుటకై పోరాడక తృప్తుడై యుండగలడా?" అను వాక్యము చదువబడినప్పుడు స్వామి ఇట్లు వ్యాఖ్యానించెను:

"చూడుము! మన అందఱ బుద్ధిలో గల భగవంతుడు వట్టి మాటలలోనివాడే. ఏదో కొంచెము ధ్యానము, కొంచెము జపము! ఎంత క్షుద్రజీవితము! అతనికొఱ కగు క్షుదావేశభరముతో హృదయము వ్రీలిపోవలెను. దుర్భర

మగు ఆవేదనతో, పరితాపముతో, హృదయము నిండి పోవలెను. అతని లేమిచే ప్రాణము లెగిరిపోవునట్లు తోప వలెను —అప్పుడుగాని నీవు సరియైనస్థితికి రాలేదు.

"పరిపూర్ణమగు శరణాగతి వినా, ఏమియు చాలదు. అతడు సర్వాంతర్యామి యనియు, సర్వజ్ఞు డనియు, సర్వ గతు డనియు పల్కుచునే ఆయన శరణుజొర భీతిలుదువు! నీ కపటపు భక్తిచే జగజ్జననీసాక్షాత్కారము నొందగలనని తలచుచున్నావా? అది వెట్టి! కేవలము వెట్టి! ఇది పసిబిడ్డ చేతి భక్ష్యపదార్థ మనుకొంటివా —మాయమాట లాడి గ్రహించుటకు? భగవంతుని మోసపుచ్చ జాలవు. ఆయన సర్వమును చూచుచుండును ...'కర్తవు నీవు, నేను కాదు; యంత్రచోదకుడవు నీవు, నేను యంత్రమాత్రుడను.' ... 'నేను పొరుపునై పని దేవుడను.' మఱేవస్తువు మీద నేని నీకు ప్రేమ యున్నచో, సర్వమును ఆయనకై పరిత్యజింపనిచో, నీ వాయనసాక్షాత్కారము నందజాలవు."

జూన్, 30.

స్వామి: "భగవంతు డెవరికిని అక్కఱలేదు. మను ష్యుని కక్కఱయున్నది తన వ్యథలను పోగొట్టుకొనుటయు, సుఖముగాజీవించుటయు. అకారణభక్తి సాధించుట మిక్కిలి దుర్లభము......ఏకాంతవాసముకొఱకు విలపించుచుండిన మనుష్యు నొకనిని నే నెఱుగుదును. అత డొకనాడు 'నన్ను మరల పెండ్లియాడుమందురా?' అని నన్నడిగెను!"

జూలై, 1

స్వామి : "స్వామిజీ (వివేకానందస్వామి) 'నేను' అని పలికినప్పుడెల్ల సర్వవ్యాపకమగు 'నేను'తో దాని నైక్య మందించుచుండెను. మనము 'నేను' అనునప్పుడు దానిని మనశ్శరీరేంద్రియములతో ఐక్యమందింతుము. కావున మనము 'దాసుడనగు నేను', 'భక్తుడనగు నేను' అనుట యుక్తము. స్వామిజీ తన 'నేను'ను జీవాత్మతో కాక, దేహ మనోబుద్ధుల కతీతమగు బ్రహ్మముతో సంబంధము కల్పించు వాడు. ఇది ఆయన సాధారణ, స్వాభావికస్థితి. ఈ స్థితి యందే ప్రాయికముగా ఆయన కాలమంతయు గడపువాడు. అట్టిస్థితి మనకు కలుగదు. మనము భగవంతునికి భిన్నులమై జీవించుచుందుము. కావుననే మనము భగవంతునిగూర్చి 'నీవు', 'నీది' శబ్దములు పలుకవలసియుండుట."

శిష్యుడు : "విశ్వాత్మకభావమగు 'నేను'ను సాధించుకో దలచు ద్వైతసాధకులు అద్వైతశాస్త్రములు పఠింపవలెనా?"

స్వామి : "'మొదట అద్వైతజ్ఞానసిద్ధి నార్జించుకొనుము. ఆ పిదప నీ యిష్టానుసార మేమి చేసినను సరే' అని శ్రీ గురుదేవుడు పలుకువాడు. యథార్థభక్తు డెప్పుడును 'నీవు', 'నీది' అనును. అనగా, 'ప్రభూ, సర్వము నీవే, సర్వము నీదే' అని యర్థము. దీనికిని అద్వైతమునకును భేదము కలదా? కాని 'నేను', 'నాది' అనుచు, భగవంతుడు వేఱు తాను వేఱు అనియు; తాను స్వతంత్రుడనియు తలచు

భక్తుని ద్వైతము మిక్కిలి హానికరమైనది. అట్టి భక్తుడు మహాభ్రాంతిలో చిక్కినవాడు. శ్రీగురుదేవుడు పలుమారు 'నాఽహం', 'నాఽహం' (నేను కాదు), 'త్వమేవ', 'త్వమేవ' (నీవే), 'దాసోహమ్', 'దాసోహమ్' (నేను నీ దాసుడను) అని పలుకుచుండువాడు. భక్తుడు మమతాహంకారములను ('నేను', 'నాది' అను భావములను) పూర్తిగా పరిత్యజింపవలెను. •రామప్రసాదు డెన్ని తడవలు జగన్మాతతో ప్రేమపూర్వకములగు జగడము లాడువాడు! ఎన్ని తడవ లామెను ఉబ్బించువాడు! ఎన్ని తడవ లామెను బుజ్జగించువాడు! అంత తీవ్రమును, అంత ఘనీభూతరూపమును అగు పారమార్థికభావము —మంచుగడ్డగా మారిన నీటివంటిది—అలవడవలెను. అప్పుడుగాని భగవద్రూపములు మనకు గోచరింపవు. 'గోపాలుని తల్లి'కి * తన వెనువెంట నడయాడుచు పొయ్యిలోనికి కట్టెపుల్ల లేరిపెట్టు బాల గోపాలుడు కానిపించువాడు. శ్రీరామకృష్ణునికి 'రామలాలా' † తన వెంట తిరుగుట కానిపించునది. పారమార్థిక భావతీవ్రతయే ఆవశ్యకము. సాకారారాధన చేసినను, నిరాకారారాధన చేసినను ఒక్కటే.

---

* ఈమె శ్రీరామకృష్ణుని ముఖ్య శిష్యురాండ్రలో నొకత, బాలగోపాలదర్శన మామెకు నిరంతరసంఘటనము.

† 'రామలాలా'ను (బాల్యదశలోనున్న శ్రీరామచంద్రుని) శ్రీరామకృష్ణుడు కొంతకాల మారాధించెను. ఆ కాలమున ఆయన కాతడు సర్వదా కానిపించుచుండువాడు. (శ్రీరామకృష్ణలీలామృతము—152వ పుట)

తామరా! నీదు కూర్మి చిత్రమ్ము సుమ్ము!
నగుమొగపు దర్శనమ నిజనాయకునకు—
లోకబాంధవునకు—నిత్తు; మాకరంద
మధురిమానుభవం బిత్తు మధుకరునకు! *

(పద్మమా, నీ ప్రేమ మెంత వింతమైనది! భర్తయగు సూర్యునకు నీ మొగపు చిఱునగవు మాత్రమిత్తువు; నీ తేనియను తేటి కిత్తువు!)

ఈశ్వరునితోడిదే లోకమై యుండువానికి ఐహికవిషయము లెట్లు రుచింపగలవు?"

జూలై, 3.

స్వామి: "ఆహారనిద్రాభయమైథునాదులు (భుజించుట, నిద్రించుట, భీతిలుట, కామోపభోగము)—పశువులకును నరులకును సమానమైనవే. మానవునం దుండు విశేషమేమనగా, అతడు నీతిని, అనీతిని గుఱుతింపగలడు. మానవుడెంత అధముడైన నంత యధికముగా నుండును అతని ఇంద్రియవిషయానందము. ఎంత ఉన్నతుడైన నంత యధికమతని జ్ఞానానందము—అతిసూక్ష్మరూపమగు ఈ జ్ఞానానందము అధమప్రకృతిగలవారికి బోధపడునది కాదు. వారు త్రాగుచు, వేటాడుచు, స్త్రీలవెంట పరుగిడుచు—కేవలము పశువులవలెనే— ఎట్లు కాలహరణము చేయుచున్నారో చూడుము. ఈశ్వరుడు ప్రసాదించిన మన మనశ్శక్తులను

* ఆంగ్లమూలమునకు పద్యరూపానువాదము.

నిర్మలమొనర్చుకొని, ఉన్నతమార్గమునకు త్రిప్పమేని, మనము మనుష్యజన్మమెత్తి ఏమి సాధించినట్లు? నిర్మల మానసులగువా రిట్టి నీచవర్తనమున కెన్నడును దిగరు.

"పాశ్చాత్యదేశములకు వెళ్ళవలె ననియా నీ సంకల్పము? మనస్సును బైటికి పోనిచ్చి ఏమి ప్రయోజనము? ధ్యాననిమగ్నుడవై ఈశ్వరునందు లీనుడ వగుము. శ్రీ గురుదేవుని ధ్యానమునందే బుద్ధి నిలిపి, ఐదేండ్లు గడపగలిగితివేని, ఎంత మహోత్కృష్టముగా నుండును! అప్పుడు ఇదియు పాశ్చాత్యదేశములును ఒకటిగనే ఉండును.

" 'చారిత్రకగ్రంథాదులు నాకు తృణప్రాయములు— సర్వము భగవంతుడే' అనునది ఎంత అద్భుతవాక్యము!... సచ్చిదానందజలరాశిపై 'అహము' అనెడు పుడక పడియున్నది. దానిచే నీరు భిన్నమైనట్లు కానిపించుచున్నది. 'అహము'నకు కోరికలే కారణము. అవియే మనలను భగవంతుని చేరనీయకున్నవి. కాని ఎప్పుడో యొకనాడు మనము వాని నూడబెఱికివైచి భగవంతుని చేరబోవలసియుండును. ఆ ప్రయత్నమున ఈ శరీరము పోయిననేమి?

"మానవు డెంత మహాపదవియం దున్నను, అత డెంతటి మహాకార్యములు చేయుచున్నను, ఏదోయొకనా డతడు నిష్కాముడు కావలసియుండును. ఆ పిదపకూడ నతడు మరల—భగవదిచ్ఛచే—కార్యోన్ముఖు డగుటయు కలదు. కాని భగవత్సాక్షాత్కారమంది నీ శ్రేయస్సు నర్థించు మహాపురుషుని శరణుసొచ్చి, అతని యానతిచే నీవు

కార్యోన్ముఖుడ వైతివేని, నీ కర్మబంధము లందుచేత బిగువు నొందవు. బిగియకపోవుటే కాక అవి విచ్ఛిన్నము లగును కూడ. 'నినెన్నడును మఱవకుందును గాక!' అని భగవంతునిగూర్చి సర్వదా ప్రార్థించుచుండుము. 'నిన్ను మఱవజేయునట్టిపనిని నాకు కల్పింపకుము. నీవు నన్నెచ్చట నుంచినను, నిన్ను సదా స్మరించుచుందునుగాక!'

"కాని 'ఇది యిమ్ము, అది ఈయవలదు' అని ఎన్నడును అనబోకుము. అది స్వార్థపరప్రార్థన మగును. నీకొకటి చేయ నిష్టము, ఇంకొకటి చేయ నిష్టములేమి, ఉండుచో, నీ 'అహము' నకు ప్రవేశ మిచ్చుచున్నావు. కొందఱికి కర్మాచరణ మన్ననే భయము. దాని నెప్పుడును తప్పించుకొనజూతురు. అట్టివారు శాశ్వతముగా బద్ధస్థితియందే, స్వార్థపరులుగనే, ఉందురు. భక్తికొఱకు ప్రార్థింపుము. ఈశ్వరేచ్ఛ నెఱవేర్ప నెప్పుడును సంసిద్ధుడవై యుండుము. 'సర్వకాలసర్వావస్థలందును నిన్ను స్మరించుచుందునుగాక! నీ భక్తుల సాహచర్యముతప్ప ఇతరసాహచర్యము నా కేర్పడకుండుగాక!' "

జూలై, 4.

స్వామి: "సర్వము ఈశ్వరేచ్ఛవలననే జరుగునని మనము నిస్సంశయముగా ఎఱుగవలెను. లోకమున బుద్ధిచాతుర్యముగలవా రెందఱో జన్మించిరి. కాని, వా రేమైరి? ప్రతిదియు ఈశ్వరేచ్ఛవలననే ఉత్పత్తియగును, ఈశ్వరేచ్ఛ

వలననే నశించును. ఈ మన సంస్థ —ఇదిమాత్రము శాశ్వతమా? కాదు. దీనికిని పతనకాలము వచ్చును. అంతట భగవంతుడు మరల అవతరింపవలసివచ్చును.

"బ్రాహ్మణుడు పారమార్థికుడగు యాచకుడు. రెండునాళ్లకుకూడ అతడు దేనినైనను, సేకరించి యుంచుకోరాదు. అతడు భగవంతునియందు పూర్తిగా విలీనుడై యుండవలెను.

"స్త్రీలతోకూడ నివసించువారిని (శ్రీ) గురుదేవుడు తుచ్ఛులనుగా చూచువాడు. వారు నిస్సారులని పలుకువాడు. . . .

"తార్కికశక్తియందంతగా సామర్థ్యము లేనివారు సులభముగా ఏదో యొక పక్షమునకు ఒగ్గుదురు. 'స్వామిజీ' కెంత వివరణశక్తి యుండెనో అంత స్వానుభవశక్తియు ఉండెడిది. ఇతరుల లోపము లెఱిగియు వారిని క్షమించువాడు."

శిష్యుడు: "మనస్సు తనంతటతానే జాగరూకమై, ఏ మాత్రము పరాకులేక యుండజాలదా?"

స్వామి: "ఆ స్థితి అప్రయత్నముగా లభించునా? సాధన వలయును. మొదట నిన్ను నీవు సంస్కరించుకొనుటకై ప్రయత్నింపుము. ఆ పిదప నీ మనస్సే స్వబోధక కార్యము పూనుకొన్నట్లు నీ కెఱుకపడును. ఆ స్థితిని వెంటనే అందుకొనవలెనని జనులు కోరుదురు. నీయందుగల పవిత్రభాగ మంతయు ఈశ్వరుడే. అపవిత్రభాగమవే నీవు.

'నేను' అని పలుకునప్పుడు నీవు నిజముగా సూచించునది ఆ అపవిత్రభాగమునే. ఈశ్వరునిగూర్చి నీవు చింతించుకొలది నీయందత డభివృద్ధియై చివరకు నీలోని అపవిత్రభాగము పూర్తిగా అదృశ్యమగును.

"మిక్కిలి అప్రకటనశీలు లగువారు కొందఱు కలరు. చుట్టును ఉన్నతములగు గోడలు నిర్మించుకొని వారి మన స్తత్త్వ మెవ్వరికిని గోచరింపనీయరు. ఇది మిక్కిలి హాని కరము. చిత్తశుద్ధియు ధారాళతయు లేనివా రీశ్వర సాక్షా త్కృతి నొందజాలరు."

జూలై, 7.

స్వామి: "అహంభావము నెంత విడనాడి, ఈశ్వరుని చేతిలోని సాధనమాత్రుడ వెంతపూర్తిగా అగుదువో, అంత ప్రశాంతత నీకు లభించును. భగవంతు డొక్కడే లోకమున గల ఏకైకకర్త యనియు, నీకు కర్తృత్వము లేనేలేదనియు, నీ కెంత పూర్తిగా తోచునో అంతగా నీ హృదయము శాంతిపూరిత మగును."

జూలై, 9.

స్వామి: "నిర్వాణమే అత్యున్నతపరమార్థసిద్ధి యని మాకును మొదట తోచినది. మే మట్లు తలచినందుకు శ్రీ గురుదేవునిచే ఎన్నిసార్లు చీవాట్లు తింటిమి! దానిని ఆయన క్షుద్రభావ మనువాడు. ఆ మాటవిని నేను ఆశ్చర్యమగ్నుడ నగువాడను."

జూలై, 18.

శ్రీ వివేకానందస్వామి "వేదాంతమతము" ను గూర్చి (షేత్రిలో) ఇచ్చిన ఉపన్యాసము చదువబడినది. స్వామి ఇట్లనెను :

"ఆయన పలుకులు గాలిలో ద్రవించి లీనమై పోయినవి. నీవు సాధించిన వైరాగ్యమువలనను, పాండిత్యమువలనను, నీ వేమి చేయుచున్నావు? కాలము గడచి పోవుచున్నది. కాని నీ వూరకే కాలహరణము చేయుచున్నావు. శ్రీ గురుదేవుడు ప్రతిదివసాంతమున 'అమ్మా, ఒక దినము గడచిపోయినది. కాని నాకు నీ దర్శనము ప్రాప్తింపలేదు గదా!' అని మొఱపెట్టుకొన్నట్లు ఎవ్వరైన, నెన్నడైన, పలుకుటగాని, ఆవేదనపడుటకాని కలదా? మీరు ఉత్సాహరహితులై, శక్తిహీనులై, నిర్వ్యాపారులై యున్నారు. 'జీవన్మృతు డెవ్వడు? అప్రయత్నశీలుడు' అను 'స్వామిజీ' మాటలు విన్నప్పుడు నీ రక్తము ఉడికిపోవు చున్నదా? నీ కిప్పుడు ఇరువదేడేండ్లు. తన ఇరువదితొమ్మిదవ ఏట తాను సర్వము సాధించెనని స్వామిజీ చెప్పినాడు.

"కాని నిన్ను అని ప్రయోజనము లేదు. నీకు ఎట్లు కానిపించుచున్నదో అట్లే నీవు ప్రవర్తించుచున్నావు. నీవు తగు పరిశ్రమయు చేయుటలేదు. 'మాకు వయస్సు ముదిరినది, మేము వ్యాధిగ్రస్తులము' అందుము. కాని అవన్నియు అర్థరహితములగు కుంటిసాకులు! 'స్వామిజీ' అవసానకాలము వఱకును కర్మాచరణమగ్నుడై యుండెను. చివరి జబ్బులో

ఊపిరి సరిగా తిరుగక కష్టపడుచు ఉపశాంతికై దిండు నొకటి రొమ్మునకు అదుముకొని — ఆ స్థితియందును, 'లెండు ("ఉత్తిష్ఠ")! మేలుకొండు ("జాగ్రత")! ఏమిచేయుచున్నారు!' అని గర్జించును. ఈ దేహము పోవలసియున్నచో, పనిచేయుచు పోవుగాక! నీలోని దివ్యత్వమును, ఇతరులలోని దివ్యత్వమును మేల్కొల్పుచుండుటే లక్ష్యము.

"ఇది నిజమేయని నీకు తోచెనేని, వెంటనే లేచి, కార్యమగ్నుడవు కమ్ము. వెంటనే బయలువెడలుము. తక్కిన దంతయు పిదప చూచుకొనవచ్చును. ఇప్పుడు తప్పినచో, ఎప్పటికిని తప్పినట్లే. ఉత్తరకాశి కేగి, గంగాతీరము నాశ్రయించి 'అమ్మా, నాకు కావలసినది నీవే. ఇంకేమియు అక్కఱలేదు' అని జగన్మాత నుద్దేశించి విలపింపుము. అట్లు జీవించుట కిప్పటినుండియు చిత్తమును ఆయిత్తపఱచుకొనుము. కార్యాదులవిషయ మంతయు పిదప చూచుకొనవచ్చును."

జూలై, 20.

స్వామి : "నీ మనస్సును సిద్ధపఱచుకొనవలసినది నీవే. అది ఇతరులు చేయజాలనిపని. శ్రీగురుదేవు డెన్నిసార్లో 'మీ స్వప్రయత్నము కొంచెము వలయును. ఆ పిదపనే గురువు మీకు సత్యబోధ నొనర్పగలడు' అని చెప్పువాడు. తన దెస కొక్కయడుగు వైచువాని దెసకు భగవంతుడు

పదియడుగులు వైచునని నేను నిస్సంశయముగా చెప్ప గలను. ఇది మే మనుభవపూర్వకముగా ఎఱిగిన విషయము. స్వయంకృషి లేనివాని కెవ్వరును తోడ్పడజాలరు.

"మహాపురుషులు మనకు త్రోవచూపుదురు. అది స్వల్పసాహాయ్యమా? మీకు కలిగిన చిక్కులు తెలిపితి రేని అవి తీర్చుకొను మార్గమును మేము సూచింపగలము. ఆ త్రోవ మేము నడచినదే కదా? కావున మా కది పరిచితము. చిలికి వెన్నతీసి తన నోటి కందీయమందురా ఎవ్వరైనను? అందిచ్చినను, నోరు మూసికొన్నచో! అట్టివానికికూడ మేము ఆకలి తీర్పవలెనా? ఇది యొక మానసికవ్యాధి. దీనిని 'స్త్యానము' (సోమరితనము) అందురు —మనస్సు ఎట్టి పరిశ్రమమును కైకొనదు, ఏమియు చేయదు.

"'తన భక్తునికై భగవంతు డేమియు చేయడా?' అని అడుగుదువా? చేయును. కాని, ముందు నీ వతని భక్తుడవు కావలెను. అతనియెడ నీకు భక్తి కలుగవలెను. భక్తి యనునది స్వల్పవిషయమా? నీ మనస్సు, నీ ప్రాణము, నీ సర్వము, అతని కీయవలెను. అట్లు చేయజాలవేని, అతనిని కాంచనందుకై, అతనిని ప్రేమింపనందుకై, అతనితో మొఱ యిడుకొనుచు విలపింపుము. ధనార్జనప్రయత్నములో నరులు అమితముగా కన్నీరు కార్తురు. భగవంతునికై నీ వట్లు చేయవేని, అతడు నీ కేల సహాయపడవలెను? అతని కేమి పట్టినది! అతనికొఱకై నీ వెప్పుడు ఆవేదనతో పరితపింతువో, అప్పు డతడు నీ కత్యంతసమీపస్థుడై యున్నాడని యెఱు

గుము —త్వరలోనే నీకతని సాక్షాత్కారము లభించును, త్వరలోనే నీకు అవ్యయానందప్రాప్తి కలుగును.

"నీ మనస్సును నీవు అతిజాగ్రత్తతో పరిశీలించుకో వలెను. 'నీ కామమును అపరిమితమొనర్చుకొనుము' అని శ్రీ గురుదేవుడు నాతో చెప్పెను. నేనామాట విని మిక్కిలి అచ్చెరువొందితిని. ఆ పిదప తన మాటను ఆయన విశదీకరించెను: ' 'కామము' అనగా ఏమి? ఆర్జించుకొను ఆశయే కదా! అగుచో అతని నార్జించుకొనుటకై ఆశింపుము; ఆ ఆశను పూర్తిగా బలపఱచుకొనుము.' ...

"ప్రతివాడును తన గుణములను ప్రకటించుకొని దోషములను కప్పియుంచుకొనగోరును. తన దోషముల నెవడు బాహాటముగా ప్రకటించుకొనగలడో, వాని నవి విడిచి పోవును. తన లోపముల నొప్పుకొనుట సులభకార్యము కాదు. అట్లు చేయగలవానియందు ఘనత కలదని ఎఱుగుము.

"ప్రతివానిని నీవు స్వకీయునిగా చేసికొనవలెను. నీవు భగవంతుని సమీపించుకొలది, నీ బోళాతనము, నీ చిత్తశుద్ధి, నీ ఔదార్యము, వృద్ధినందును. మా గురుదేవుడు అకృత్రిమత్వమునకును, త్రికరణశుద్ధికిని మూర్తీభావము.

"సగుణదైవసాక్షాత్కారము నొందినవాడు సంకల్పమాత్రమున నిర్గుణదైవసాక్షాత్కారముకూడ పొందగలడు.

కాని ప్రాయికముగా అతడు తన 'అహము'ను నిలుపు కొనును. అది లేనిచో అతడు భగవత్ప్రేమను, భగవదానందమును చవిచూడ జాలడుగదా! అందుకే దాని నుంచుకొనుట. అతని హృదయగ్రంథులు విచ్ఛిన్నములై యుండును. తన యథార్థతత్త్వముకూడ అతనికి ఎఱుకపడి యుండును. అతడు నిర్వాణ మొందగోరడు. ప్రపంచమతనిని వెఱపుగొల్పదు. నిర్వాణవాంఛ గలవాడు ప్రపంచమునుండి తన్నుదాను కాపాడుకొన పరిశ్రమించుచు, గమ్యము నధిగమింప పాటుపడును. కాని దేనికిని భీతిలకుండుట ఇంతకన్న శ్రేష్ఠముగదా!

"తన భక్తునియెడ భగవంతుడు కినుకపూనవచ్చును, సంతసింపవచ్చును. అహంకారాత్ములను చూచుటే తనకు దుస్సహాముగా నుండునని శ్రీగురుదేవుడు పలుకువాడు. నిర్వాణకాంక్షలేక యీశ్వరు నధిగమించువారు ఈశ్వర కోటులు."

ఆ దిన మొక భక్తునికి వ్రాసిన యుత్తరములో స్వామి యిట్లనెను: "భగవత్సాక్షాత్కారము లభింపనందుకై నీవు పరితపించుచున్నచో, ఆ పరితాప మభివృద్ధియగుగొలది, నీవతని కృప కర్హుడ వగుచుందువు. దానినింకను తీవ్రపఱచుకొనుము. కాని, నీ పరితాపము ఇతర హేతువులవలన కలిగినచో, దానిని దులిపివైచుకొన ప్రయత్నింపుము."

జూలై, 29.

స్వామి : "నీ కతఁ డేల సాక్షాత్కరింపఁడు? తప్పక సాక్షాత్కరించును. లేనిచో, నీ విచ్చటి కేల వచ్చితివి? అతనికై విలపింపుము. అతనికి ఆకులపాటు కలిగింపుము. హృదయావేదనను భరింపజాలక తల పగిలిపోవునట్లు నేలపై మోదుకొనుము. 'నీవు అంతర్యామివి; నా యంతరంగమును పరికింపుము; అం దేమైన కలదేమో చూడుము' అని యతనికి విన్నవించుకొనుము. ఇట్లాయననుగూర్చి ప్రార్థించుటలో గూడ కొంత గుణము కలదు."

జూలై, 30.

స్వామి : "శ్రీ గురుదేవు డొకనాడు తన కంఠవ్రణమునుగూర్చి ఇట్లు చెప్పెను. కంఠస్థితి మీకు బాధ కలిగించుచున్నదా అని ఆయన నెవరో ప్రశ్నించిరి. అందు కాయన ఇట్లు బదులుచెప్పెను : 'మూఢునివలె మాటలాడుచున్నావు! శరీరమున కెన్నడేని సాధుత్వము లభించునా? అది లభించునది చిత్తమునకుగదా.' చిత్తము నిశ్చలముగా, అవికారమై యుండవలెను. మేకపోతుగాంభీర్యము నిష్ప్రయోజనము—అనగా బాధ ననుభవించుచుండియు, దానిని వెలికి తోపనీయకుండుట. నొప్పులు, వ్యథలు దేహమువి కాని నీవి కావనియు, శరీరమునకు నీవు భిన్నుడవనియు నీకు దృఢభావము కలిగినప్పుడే నీవు సక్రమమార్గమున నున్నట్టు.

"ముదిమియు, క్షీణదశయు నిన్నెదుర్కొనుట కెంతో ముందుగనే నీ ఆధ్యాత్మికసాధనలను ముగించుకో

వలెను. ఇల్లు తగులబడిపోవుచున్నప్పుడా బావి త్రవ్వినది!

"కామక్రోధాదుల నణచిపెట్టుకొనినమాత్రమున అంతగా ప్రయోజనములేదు. ఇంద్రియనిగ్రహముతోపాటు ఒక యున్నతాదర్శముకూడ దీపించుచుండవలెను. అది లేనిచో నీ కామక్రోధాదులు మఱొక త్రోవ కల్పించుకొని వెలువడును. వాని గమనము నొక క్రొత్తదిశకు మార్చవలెను. అప్పుడవి తమంతటతామే అదృశ్యమగును. 'నా శరణు చొచ్చి ఇంద్రియములను నిగ్రహింపుము.' ఉదాహరణముగా కామవికారమును కైకొనుము. నీవు భగవంతుని బిడ్డ వని భావించుకొనుము—కామవికారము నొందునంత తుచ్ఛత నీ కెట్లుండగలదు? లేనిచో, నీవు నిత్యశుద్ధుడ వని భావించుకొనుము.

"విశ్వవ్యాపకమగు 'అహము' పై ఆధారపడుటయే స్వాతంత్ర్యసిద్ధి. నేను ఫలాని వాడను, ఫలాని పరీక్షల నిచ్చితిని మున్నగు తలంపులు గల అహముపై ఆధారపడుట నిష్ప్రయోజనము.

"కర్మాచరణము నొక యజ్ఞముగా, సమర్పణముగా, పరిగణింపవలెను. యజ్ఞ మెంత నిర్దుష్టముగా చేయుదురో, కర్మాచరణ మంతయు అంత నిర్దుష్టముగా చేయవలెను. ప్రతికార్యము నొక సాధనగా — భగవంతు నధిగమించు మార్గముగా—తలపవలెను. శీలనిర్మాణమున కది యే మార్గము."

స్వామి 'శి–' : "నిద్రపట్టుటకుముందే ధ్యాన మారంభించి, ధ్యానమధ్యమున నిద్రావస్థనొందుట మిక్కిలి ఉత్తమము. 'వ–' అగాధధ్యానమున నుండువాడు. కాని శ్రీ గురుదేవుడు స్పృశించిన క్షణముననే ఆయనవైపు చూచుచు మేలుకాంచును. నిత్యగోపాలుడు పలుమాఱు అగాధపారవశ్యస్థితుల నందువాడు. కన్నులు ఊర్ధ్వముఖములై, వక్షఃస్థలము రక్తవర్ణమగునది. అతడు ధ్యానించునప్పుడు ముఖమునకు రక్త మెగదట్టి ఎఱ్ఱబాఱును. శ్రీ గురుదేవు డతనికి 'అంత వలదు, అంత వలదు. సామాన్యమానవమార్గములనుకూడ కొంత అనుసరింప వలెను' అని బోధించువాడు."

స్వామి : "నా మనోగర్భమునుండి చెప్పుచున్నాను వినుడు. నే నీ క్షణమున, ఇప్పు డెట్లున్నానో అట్లే, తిరిగికూడ చూడక, ఏ స్థితిగతు లెట్లున్నవో లెక్కగొనక, వెడలి పోగలను. ఇప్పుడైనను ఆయువారమువలన జీవింపగలను. ఈ దృఢవిశ్వాసము లేనిచో నేను చెడుదును.

"మానవు డెప్పుడును అనుకూలస్థితి నపేక్షించుచుండును. ఈ జన్మముననేకాక పూర్వజన్మము లెన్నిటియందో ఇట్లే చేసియుండెను. ఈ అనుకూలతాపేక్షను విడనాడుటే ముక్తి. మానవుడు బాధలలో చిక్కక యుండగోరును ; ఎప్పుడును తప్పించుకొనుచుండును. వ్యర్థప్రసంగములు చేయుటే మానవుని కిష్టమని 'స్వామిజీ' చెప్పువాడు.

"ఈ (సన్న్యాస) జీవనము ఆటలాటకాదు. ఎంతో జాగ్రత్తతో నుండవలెను. ఏ మాత్రము ప్రమత్తత లేక, మిక్కిలి జాగరూకుడై యుండవలెను. ప్రతీకారభావమే పెట్టుకో కూడదు. అనంతసహనము వలయును. ప్రతీకార మొనర్చితివేని అది మరలివచ్చి నీకే హాని చేయును. సన్న్యాసజీవనము బాలక్రీడవంటిది కాదు. అది లోకాతీత జీవనప్రయత్నము. సద్భావరాశియందే నిరంతరము జీవించు చుండువాడు మాత్రమే తరించును."

ఆగస్టు, 20.

స్వామి : "ధ్యాత (ధ్యానించువాడు), ధ్యేయవస్తువు (ధ్యానింపబడువిషయము), ధ్యానక్రియ : ఈ మూడును ఏకీభావ మొంది, వానిలోని భిన్నత నశించినప్పుడుగాని, ధ్యాన ప్రారంభ మైన దనరాదు. జపము అప్రయత్నసిద్ధముగా ఏర్పడి, మనస్సులో నొక భాగ మెప్పుడును మంత్రోచ్చారణశీలమైయున్నప్పుడు, సాధకుడు కొంతవఱకు జప నిష్ఠలో పురోగమించినా డననగును. అందఱును 'అహము'ను మఱచిపోవలెను.

"నేను అడుగువేయుటసైతము అతని శక్తివలననే అనియు, నా కొక ప్రత్యేకపు ఉనికియే లేదనియు నా కొకప్పుడు తోచుచుండినది. ఆ భావము విస్పష్టముగా నుండెను. అది కొన్నాళ్లు నిలిచియుండెను.

"ఎప్పుడును ఇచ్చుచుండుము, ఇతరులయొద్దనుండి ఏదియు అపేక్షింపవలదు. లేనిచో శుష్కభావ మొకటి ని న్నావరించును. ఇట్లు శుష్కీభూతులైన సాధువుల నెందఱనో నే నెఱుగుదును. తాము సాధువు లైరిగనుక లోకులతో తమకు ప్రసక్తియే లేదని వారి భావము. ...కాని నీమనస్సును ఎవ్వరికి విప్పి చెప్పవలదు. ఈశ్వరు నెదుటమాత్రమే దానిని విప్పుము. కావుననే నీవు వివాహము మానుకొన్నది. 'ప్రభూ, నిండు మనస్సుతో నిన్ను ప్రేమింతునుగాక!' అని విలపించుచు అతనిని ప్రార్థింపుము. చేతులతో పనిచేయుచు, మనస్సును సర్వదా భగవంతునిపై నిలిపియుంపు డని శ్రీ గురుదేవుడు మాకు బోధించువాడు.

"భగవంతుడు పక్షపాతరహితుడు. వర్ష మన్నివిధము లగు ప్రదేశములలో సమముగనే కురియునట్లు ఆయన కృప సజ్జనదుర్జన తారతమ్యములేక అందఱిమీదను సమముగా ప్రసరించుచుండును. భూమిని దున్నుకొనువారికి పంట లభించును. భగవంతుడు తనయెడ అసమానప్రేమ గలిగి యున్నాడని పల్కువాని కది స్వబుద్ధిజనితమగు తలంపును, భావవైఖరియును. తన జీవితానుభవమునుబట్టి అత డట్లు చెప్పనుగాని, అది పొరపాటు.

"భగవంతుడు కొందఱిని దాస్యమున నుంచుననియు, కొందఱిని విముక్తుల నొనర్చు ననియు తలంచువారు కొందఱు కలరు. కాని ఈ భావము నెవరు పూనగలరు? సర్వైక్య భావసిద్ధి నొంది, మహావిపద్రాశిమధ్యమునగూడ అతని అనుగ్రహమునే చూడగలవాని కొక్కనికే ఇది సాధ్యము.

"మూడవ తెగకూడ నొకటి కలదు : 'శుభ మంతయు అతనికి సంబంధించినది, అశుభ మంతయు మన కర్మ ఫలము' అను వారిదే ఈ తెగ. ఈ భావమునే అనుసరించు చుండగలమేని, చివరకు మన 'అహము' నిర్మూలమగును."

సెప్టెంబెర్, 7.

స్వామి : "జ్ఞానుల ధ్యానస్థలము శిరస్సు, భక్తులది హృదయము. ఇది సామాన్యధర్మము. కాని హృదయసీమ యందలిధ్యానముచే పారమార్థిక ప్రజ్ఞానము విరివియయ్యేనేని, ఇక ధ్యానమున కొక నిర్ణీతస్థాన ముండదు.

"శ్రీ గురుదేవునికి రెండు తెఱగుల మనఃస్థితు లుండెడివి : ఒక్కొకప్పుడు దివ్యరూపములు — శ్రీ కాళికా రూపము సహితము — తన కిష్టములేదనియు, మనస్సు అఖండమునందే మగ్నమైయుండ గోరుచున్నదనియు పలుకు వాడు. మఱికొన్నితడవలలో, దివ్యరూపసందర్శనము లేనిది ఉండజాలననియు, జగన్మాతయొక్క రూపరహితభావము గాని, బ్రహ్మజ్ఞానముగాని, తన కక్కఱలేదని ఆమెకు విన్నవించుకొందుననియు చెప్పువాడు. సర్వము మిథ్యయని పల్కుచు, నిరాకారబ్రహ్మమునందే లీనుడై పోవువానిది పక్షపాతబుద్ధి. జ్ఞానికి పునర్జన్మమన్న భీతి. అజ్ఞానజాలము (వల)లో చిక్కువడిపోవునని అతని భీతి. కాని ఈ క్రీడయందు సమగ్రత్వము సాధించిన నిపుణుడు భీతి కతీతుడు. భగ వంతుని సరూపభావమునుమాత్రమే సాధించి, రూపరహిత భావమున కపరిచితుడగువానిదికూడ పక్షపాతబుద్ధియే.

"జగత్తంతయు ప్రళయ మొందిన పిదపకూడ దివ్య రూపములు నిలిచియుండునని పురాణములు నుడువుచున్నవి. మంచుగడ్డ కరుగనేకరుగకుండు స్థానములు కొన్నికలవని శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

"ఎవరియొద్దనుండియైనను దానములు పరిగ్రహింప వలదు. అవి నీకు ముప్పుకల్గించును: నీ స్వతంత్రతను కోల్పోవజేయును. పరిగ్రహణ మెవ్వని బాధింపదనగా, ఋణపడ్డభావ మెఱుగనివానిని; అందుచే మనస్సులో ఎట్టి మార్పునేని పొందనివానిని; దాత భగవంతుడే యని భావించువానిని. సజ్జనులయొద్దనుండిమాత్రమే —నీకు స్వాతంత్ర్యభంగ మే మాత్రము కలిగింపక, నీపై అధికారము నెఱపు యత్న మేమియు లేనివారియొద్దనుండి మాత్రమే— దానములను పరిగ్రహింపవచ్చును.

"సాధనలందు చాల దూరము పురోగమించినవానికి తప్ప మానవచిత్తముయొక్క రహస్యవర్తనములు, దాని లోని మెలికలు, తెలియవచ్చుట దుర్లభము. మనస్సు మనల నెన్నోవిధములందు భ్రాంతిపఱచును. అవి భ్రాంతులని యెవ్వరైన తెలిపినచో, కాదనుటకు మనము కారణములు వెదకి వాదింతుము. మనలో స్వప్రేమ మెన్నిరూపములతో చెలగుచున్నదో మనము గ్రహింపజాలము. ఎవ్వరికిని లొంగకుండుట — బాహ్యరూపమున కాదు, మానసిక ముగా —మిక్కిలి కష్టము.

"వివేకానందస్వామి యొకసారి బైబిలు చదువుచుండెను. అప్పు డాయన శాకాహారి. ఏసుక్రీస్తు మాంసాహారి యని చదివినప్పుడు ఆయనకు వెగటుతోచెను. కాని వెంటనే 'నేను శాకాహారినని ఎంత గర్వింపసాగితిని!' అని తలచెను. మన మెంతో చదువుదుము. కాని అందు అతి స్వల్పభాగముమాత్రమే అనుభూతముచేసికొని, మనలో నిలుపుకొని, ఇముడ్చుకోగలము. శ్రీ గురుదేవు డొకసారి గిరీశచంద్రఘోషుతో ఇట్లనెను: 'బ్రహ్మజ్ఞానమునుగూర్చి ఏ మనుచున్నావు! శుకదేవుడు సచ్చిదానందసాగరమును చూచి తాకగలిగెను. శివు డందులోని జలము మూడు పుడిసిళ్లు త్రావి శవమైపోయెను.' గిరీశుడు తల పట్టుకొని 'నిలుపుడు, మహాశయా, ఇకచాలును. నా తల తిరిగిపోవుచున్నది!' అని అఱచెను.

"పూర్వము నా నరము లతిసూక్ష్మత్వము కలిగి యుండెను. నా వివరణశక్తి మహితమైయుండెను. ఎవ్వరైనను న న్నొకప్రశ్న మడిగిరేని, ఆ విషయము ఆమూలాగ్రముగా—ఉత్పత్తి మొదలు వాక్యరూపము నందువఱకు—నాకు కానిపించుచుండెడిది. ఏ ఉద్దేశముతో, ఎందుకై, ఆ మాట లాడబడినవి, నాకు తెలిసిపోయెడిది. నా ప్రతిమాటలోను దేదీప్యమానమగు కాంతి యుండెడిది.

"నవరాత్రకాలమున పరిపూర్ణమౌన మభ్యసించువాడను. ఒకరీతి పారవశ్యస్థితియం దుండువాడను. మన స్సేకాగ్రమై యుండెడిది. మానవజన్మ మెత్తినందుచే కలిగిన

నా ధర్మమును నేను నిర్వర్తించుకొంటిని. నా జీవితమును పవిత్ర మొనర్చుకొనవలెనని నా యత్నము. అపరిమితముగా —ఎనిమిది తొమ్మిది గంటల కాలము —చదువు వాడను. అనేక పురాణములు పఠించి ఆ పిదప వేదాంతపఠన మొనర్చితిని. చివరకు నా మనస్సు వేదాంతముపై నిలిచి పోయినది. శ్రీ గురుదేవుడు వేడుకకు నాతో నిట్లనెను: 'వేదాంతమునుగూర్చి నాకు కొంచెము చెప్పుము. 'బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య' అనియేనా దాని బోధ? లేక వేఱేమైననా? అదియే యైనచో మిథ్యను విసర్జించి సత్యమును కైకొనుము.' ఆ మాటలతో నా జీవిత మంతయు మాఱి పోయినది.''

నొవెంబెర్, 4.

స్వామి: ''చిన్నతనమున నేను దేశాటన మెక్కువగా చేసితిని. నర్మదాతీరప్రాంతమునకు ఒంటరిగా, చేత నొక దమ్మిడీకూడ లేక, పయనించితిని. అన్ని రకముల తావులలోను నిద్రించితిని. ప్రయాగ, చిత్రకూటము, రేవా, జబ్బల్‌పూరు మీదుగా పోయితిని. అంతయు కాలినడకనే. ఎప్పుడు వెళ్ళినను ఒక పుణ్యక్షేత్రమును మదినుంచుకొని, త్రోవ విచారించుకొనుచు పోవుదును. పిదప హరిద్వారము, హృషీకేశము, ఉత్తరకాశి మున్నగు తీర్థములు దర్శించితిని. పర్వతములందే ఉండిపోవలెనని నా కోరిక. గార్‌వాల్ కొండలపై నా కెంతో సుఖముగానుండెను. ప్రపంచ మనునది ఒకటి కలదను మాటయే మఱచి భగవత్సాక్షాత్కార

సిద్ధినే గమ్యముగా నుంచుకొంటిని. ధ్యానమునందును గ్రంథావలోకనమునను చాలకాలము గడపువాడను. కాని స్వామిజీ నన్నచ్చటినుండి దిగివచ్చునట్లొనర్చెను. మీరట్‌లో ఆయనను నేను కలిసికొంటిని. ఢిల్లీలో మేము ఏడెనిమిదిమంది మొకటిగా నివసించితిమి. పిదప 'మహారాజ్' (బ్రహ్మానందస్వామి) జావాల్జీ దర్శింపవలెనని నన్ను తనవెంట రమ్మనెను. కావున నేనాయనవెంట జావాల్జీ, గోపీనాథపురము, వైద్యనాథము, పఠాన్‌కోట, ముల్తాన్, గుజ్రన్‌వాలా, మాంట్‌గొమరీ మొదలగు చోట్లకు వెళ్ళితిని. అచ్చటనుండి కరాచీమీదుగా బొంబాయికి వచ్చితిమి. బొంబాయిలో స్వామిజీని కలసికొంటిమి. ఆయన అమెరికా ప్రయాణ సన్నద్ధుడై యుండెను. షికాగోలో జరుగనున్న ప్రపంచసర్వమతమహాసభ తనకొఱకే జరుగుచున్నదనెను —భవిష్యత్తంతయు ప్రత్యక్షముగా చూచువానివలె! నన్ను మఠమునకు వెళ్లుమనియు, 'మహారాజ్'ను ఒంటరిగా పయనింపనిమ్మనియు, నన్నాయన కోరెను.

"ఆబు పర్వతమునొద్ద కొంతకాలము గడపితిని. అచటనుండి అజ్మీర్‌కు, పుష్కర్‌కు, పోయి చివరకు బృందావనముచేరి, అచట ఆఱుమాసము లుంటిని. ఆ పిమ్మటి ఆఱు మాసములు లక్నోలో గడపితిని. అచటనుండి అయోధ్య చేరితిని. అచట 'మహాపురుషులవారు' (శివానందస్వామి) నన్ను కలిసికొని మఠమునకు రమ్మనిరి.

"విస్తారముగా ప్రయాణములు చేయుచుండియు, విస్తారముగా చదువుకూడ సాగించుచునే యుంటిని. బృందా

వనములో భక్తిశాస్త్రము లెక్కువగా చదివితిని. సాధనలు కూడ సాగింపకుండినచో, ఎక్కువగా ప్రయాణము లొనర్చుచుండుట శ్రేయస్కరముకాదు.

"పూరిలోని జగన్నాథాలయమున హఠాత్తుగా నా చెవుల కొక నాదము వినిపించెను. తత్ఫలముగా నే నానంద భరితుడనై వాయుగమనము చేయువానివలె నైతిని. ఆ నాదము పెక్కు వైఖరులుగా వినిపించుచుండెడిది. నాహృదయము నంతయు అది ఆకర్షించినది. నే నంతకుమున్ను చదివియుండిన అనాహతధ్వని (ఓంకారనాదము) నా కప్పుడు జ్ఞప్తికివచ్చి, అదిగానుండునని భావించితిని.

"ఉజ్జయినిలో నే నొకరాత్రి యొక వృక్షముక్రింద నిద్రించుచుంటిని. ఝంఝామారుతము వీచుచుండెను. ఎవరో నా శరీరమును తాకిరి. నేను లేచితిని. వెంటనే నేను పరుండిన తావున నొక కొమ్మ విఱిగిపడెను.

"జీవన్ముక్తియే మానవజీవితపరమార్థ మను శ్లోకమును మొదట చదివినప్పుడు నే నానందముతో గంతులు వైచితిని. ఏలయన, అదియే నేను పరమార్థముగా నెంచుచుండినది.

'యోగస్యప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః,
నిరాశాచ నిరీహాచ నిత్య మేకాన్తశీలతా'

(మౌనము, ఇతరులసొమ్ము పుచ్చుకొనమి, వాంఛలనువీడుట, యత్నము (కడక) లుడుగుట, ఏకాంతవాసమందే ప్రీతి: ఇవి యోగాభ్యాస మొనర్పబూనువానికి ప్రథమద్వారములు)

అను (వివేకచూడామణిలోని) శ్లోకము నన్ను ప్రబలశక్తితో ఆకర్షించినది. అంతకు ముందు నే నెక్కువగా మాటాడు వాడను. ఈ శ్లోకము చదివినప్పుడు 'ఏమీ! యోగము లోని ప్రథమద్వారమునే నేను ప్రవేశింపలేదే!' అని తలచి, నా వాక్కును అదుపులో నుంచుకొనవలెనను దీక్ష వహించితిని. ఇతరులతో మాటలాడుట మాని, ఒంటరిగా నుండుచు, నాకు మంచిదని తోచినట్లు ప్రవర్తింప నారంభించితిని. నవరాత్రములు తొమ్మిదినాళ్లు ఒక్క పలుకైన ఉచ్చరింపలేదు.

"నా జీవితవైఖరి నేర్పఱచినది శంకరుడు. శ్రీ గురు దేవుని దర్శనపూర్వము శంకరుని ప్రతిశ్లోకము న న్నొక మెట్టు ఎక్కించి కాంతిపూరము నొసగెడిది. ఆ దినములందు నా కా శ్లోకములలో క్రొత్తక్రొత్త యర్థములు స్ఫురించు చుండెను. 'పరిగ్రహము' (ఇతరుల సొమ్ము పుచ్చుకొనుట) అనగా నేమి? ఏ సొమ్మును పుచ్చుకొనకపోయినను, 'పరి గ్రహము' ఉండవచ్చును. భవిష్యత్కాలమునకై యేర్పాట్లు చేసికొనుటయు పరిగ్రహమే. జననమరణము లన్నియు పరిగ్రహమువలననే కలుగును. భావికాలజీవితమున కిప్పుడే మన మేర్పాట్లు చేసికొనుచుందుము. మన మనస్సు ఎచ్చట నుండునో అచ్చటనే మనముకూడ ఉండునది. పరిగ్రహరహితులమై యున్నచో మన మన స్సెచటనుండును? ఆత్మ యందే కదా! ఈ అపరిగ్రహసాధన మొక్కటియే మన లను మహోన్నతస్థితికి కొంపోగలదు.

"నేనొకనాడు గంగాతీరమున నొంటరిగా కూరు చుండియుంటిని. నా సహచరు లప్పటికే వెళ్ళిపోయిరి. నేను ధ్యాన మారంభించితిని. కొంత సేపటికి రెండుగంటలు కొట్టిన శబ్దము వినవచ్చెను. అప్పు డెవరో 'లే, ఇంటికి పోవుదము' అని హఠాత్తుగా పలికిరి. ఈ మాటలు నా తలను మోదిన ట్లుండెను. అవి నా మనస్సునుండియే వెలువడినవని కను గొంటిని. నిజమునకు నాకు ఇ ల్లేదియు లేదు. కాని మనస్సు మాత్ర మొక యిల్లుకలదనియు, అచటికి నేను పోవలె ననియు తలంచుచుండినది. ఈ మానసవృత్తిని నిర్మూలింప వలెనని సంకల్పించుకొంటిని.

"ఆహా! ఆ దినములు నా జ్ఞప్తికి వచ్చుచున్నవి. శ్రీనగరఘట్టమున నున్నప్పుడు నేను మిక్కిలి పెందలకడనే లేచి స్నానము చేయువాడను. పిదప ధ్యానస్థితుడనై కొంత కాల ముండి, అంతట గ్రంథావలోకన మొనర్చువాడను. పదునొకండు గంటలకు లేచి యొకగంటకాలములో కొంత ఆహారము సంపాదించుకొందును. మరల జపధ్యానము లారం భింతును. ఇట్లే ప్రతిదినము జరుగును. అచ్చట నున్న కాలము ననే ఉపనిషత్తులలో ఎనిమిదింటిని కంఠపాఠము చేసితిని. చదివిన ప్రతి వాక్యమునుగూర్చియు ధ్యానించువాడను. అందుచే నాకు కలుగు ఆనందము వర్ణనాతీతము! శంకర భాష్యమును, జ్ఞానానందుని వ్యాఖ్యానమును చదువువాడను. ధ్యానముచే విషయ మింకను విశదపడునది.



## II

1919 వ సంవత్సరము అక్టోబర్, 9.

తురీయానందస్వామి తన గది వసారాలో నొక పడక కుర్చీలో పరుండియుండెను. బ్రహ్మచారియొకడు విసరుచుండెను. ఎన్నో సంవత్సరముల కాల మాచరించిన గాఢ తపశ్చర్యలచే ఆయన ఆరోగ్యము నశించి చివరకు అతిమూత్రవ్యాధిచే ఆయన కృశింప నారంభించెను. కావున ఆయన గాలిమార్పుకై కాశికి రావలసివచ్చెను.*

శిష్యుడు 'చ-' తో ప్రవేశించి, ప్రణామానంతరము ఆరోగ్యవిషయమై ప్రశ్నించెను.

స్వామి : "ప్రస్తుతము బాగుగనే ఉన్నాను. ఇచటికి వచ్చిన పిదప రెండు తడవలు ఇన్‌ఫ్లూయంజా జ్వరము తగిలి మిక్కిలి దుర్బలత్వము కలిగించినది. అదృష్టవశమున నా కలకత్తావైద్యుడు 'శ-' ఆ సమయమున నిచటికి పనిమీద వచ్చియుండెను. నన్ను చూచి ఈ మార్పు నా కుపకరింపదేమో యనెను. అప్పుడు నా పూర్వపు ఉబ్బసపు వ్యాధి లక్షణములుకూడ పొడచూపెను."

శిష్యుడు : "అష్టమీపూజాదినమున మీ రున్నప్పటి కంటె ఇప్పుడు బాగుగానున్నారు. మార్పువలని ఫలము

---

* ఈ కాలమున స్వామి వారణాసిలోని రామకృష్ణ సేవాశ్రమములో నుండెను.

ఆకస్మికముకాక, క్రమక్రమముగా కలుగుటయే మంచిదని నా భావము. ప్రేమానందస్వామి దేవఘుర్‌కు వెళ్ళినప్పుడు ప్రథమమున మంచి గుణము చూపినది. కాని ఆ గుణము విస్తారకాలము నిలిచియుండలేదు.''

స్వామి : ''అవును. ఆయనను కలకత్తాకు కొనిపోయి యుండుట పొరపాటేమో. త్రోవలో ఆయనకు 'ఇన్‌ఫ్లుయంజా' జ్వరము తగిలి శ్వాసకోశములు రెంటికిని 'న్యుమోనియా' వచ్చినది. ఆయన కలకత్తా చేరినప్పుడు శారదానందస్వామి చూచి 'ఈయనపని ముగిసినది' అనెను. పూర్వపువ్యాధిచే కాదు ఆయన మరణించినది.''

'చ-' : ''మేము ఐహికవిషయమగ్నులమై యుండుట మీరు చక్కగా ఎఱుగుదురుగదా. మేము భగవత్సాక్షాత్కారమొందు మార్గ మేది ?''

స్వామి : ''అందు కొక నిర్ణీతమార్గ మేదియు లేదు. 'బహుజన్మసుకృతఫలముగా గాని మానవునికి చిత్తశుద్ధి కలుగదు' అని శ్రీరామకృష్ణు డనువాడు. 'డబ్బిచ్చి కొనుగొనుటకు ఈశ్వరుడు చేపలు, కూరగాయలు మున్నగువాని వంటివాడు కాడు' అని స్వామిజీకూడ చక్కగా చెప్పెను. మహర్షులు తాము భగవత్సాక్షాత్కారము గన్న వివిధ మార్గములను మన శాస్త్రములలో వివరించియున్నారు. ఫలాని ఫలాని విధముగా పూజ చేయవలె నని యొకరు చెప్పిరి. జపము నభ్యసింపవలయు నని యొకరు చెప్పిరి. ఇతరు లితరమార్గములు చెప్పిరి. 'నదులు సముద్రసంగ

మార్గము తన్ముఖములై, ఆ మార్గము నేమాత్రము వీడక, ఏకాగ్రతతో, నెట్లు ప్రవహించునో, అట్లే ఈశ్వరసాక్షాత్కార మర్థించువారు తదభిముఖులై, ఇతరవ్యాపారములన్నియు విసర్జించి, గమ్యైకదృష్టితో పురోగమింపవలెను' అని నారదుడు నుడివియున్నాడు. 'అనన్యచింతతో నన్నెవరు పర్యుపాశింతురో, ఆ నిత్యాభియుక్త మానవుల యొక్క యోగక్షేమములను నేను వహింతును' అని భగవానుడు గీతలో పలుకుచున్నాడు.

"భక్తిలో రెండు విధములైనవి కలవు: మొదటిది విధ్యుక్తకర్మకలాపరూపమగు 'వైధిభక్తి'. ఇంత జపము చేయవలెను, ఈ యీ తెఱగులుగా అర్చన మొనర్పవలెను, మొదలగు నిర్ణయములు గలది. రెండవది ప్రేమభక్తి. ఆ స్థితికి వచ్చిన భక్తుని భగవచ్చింతనము అతితీవ్రముగ నుండును. అన్యచింత లతనికిరుచింపవు. అన్నిటికన్న అచంచల దీక్ష అవసరము. కొంచెము ప్రయత్నించి అందుచే ఇష్టసిద్ధి లభింపనిచో సాధన మానరాదు. అత్యుగ్రసాధనలందు మగ్నుడై యున్న యొక సాధకునిపై వల్మీకము(పుట్ట) పెరిగెనందురు!"

'చ-': "మహారాజ్, జపమనగా నేమి? వివరించి తెలుపుడు."

స్వామి: "ఈశ్వరనామము నుచ్చరించుచు, అతని మూర్తిని ధ్యానించుచు, అతనిని తలంపులో నిడుకొని ప్రేమించుచుండుట. మనస్సున ప్రాపంచికవిషయానురక్తి

కలిగియున్నచో, నట్టి భగవన్నామోచ్చారణమువలన నేమి ఉపయోగము కలుగగలదు? మన మతని నేదోయొక విధమున స్వకీయు నొనర్చుకొనవలెను. ఇదియే అత్యంత ముఖ్యము.''

శిష్యుడు: ''శ్రీరామకృష్ణుడు చెప్పినట్లు: 'ద్వారపాలకునితో పోరాడియో, గోడ దాటియో, ఎట్లో ఇంటి యజమానుని చేరుకోవలెను.' ''

'చ-': ''కొందఱు 'నేను శ్రీ గురుదేవుని దర్శించితిని, నేను శ్రీ మాతృదేవిని దర్శించితిని, నా కిక సాధనలతో నిమిత్తము లేదు' అని తలచుచుందురు. వారివిషయ మేమి?''

స్వామి: ''అది నా కెట్లు తెలియును? వారి విషయము వారికే తెలియవలెను.''

శిష్యుడు: ''శ్రీ మాతృదేవి తమ బాధ్యత నంతయు వహించినదిగనుక తా మిక నెట్టి సాధన లొనర్ప నవసరము లేదు అని నమ్మువారు కొందఱు కలరు. తమ చేయి యొకటి ఆమెచేత నున్నదిగనుక రెండవచేతితో తమ యిచ్ఛానుసారము తా మేమైన చేయవచ్చును, తమకు ముక్తి సిద్ధము: అని తలచువారు కొందఱు కలరుగదా. 'చ-' బహుశః వారిని గూర్చి అడిగియుండును.''

స్వామి: ''యథార్థముగా ఇట్లు విశ్వసించువాడు గమ్యము నిప్పటికే చేరినాడు. కాని అట్టి విశ్వాసము సాధించుట సులభమా? తమ కట్టి విశ్వాసము కల దను భ్రాంతి

పొందువారును కలరు. కావున జాగ్రత్తపడవలెను. భగవంతునియందు పరిపూర్ణవిశ్వాసమును సాధించినవారు, అంతకుముందు ఎట్టి ఘోరపాతకము లొనర్చియున్నను, ఆయన అనుగ్రహముచేత తత్క్షణముననే పవిత్రులగుదురు. కొండంత దూది కొక్క నిప్పురవ నంటింపుము. క్షణమాత్రమున అదంతయు దగ్ధమైపోవును. వేయేండ్లుగా అంధకారమయమైయున్న గదిలోని కొక దివ్వెను తెమ్ము. ఆ అంధకారము క్రమేణ నశించునా, వెంటనే నశించునా? 'అత్యంత దుర్మార్గుడైనను, పరిపూర్ణ తత్పరతతో నన్ను భజించువానిని సాధు వనియే ఎన్నదగును. ఏలన, వాడు సరిగా నిశ్చయించుకొన్నాడు. వాడు శీఘ్రకాలముననే ధర్మాత్ముడగును. శాశ్వతశాంతిని పొందును. నా భక్తు డెన్నటికిని నశింపడని లోకమునకు చాటుము' అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునితో చెప్పియున్నాడు. ఎంతటి మహాపాపిష్ఠుడైనను, పూర్ణముగా భగవంతునికి ఆత్మార్పణ మొనర్చుకొన్నచో, అతనిని భక్తునిగనే పరిగణింపవలెను. అతడు 'శీఘ్రకాలముననే ధర్మాత్ముడగును.' ఈశ్వరానుగ్రహముచే నతడు పాపవర్తనము మాని పవిత్రుడగును. నృత్యమునందు పూర్ణనైపుణ్య మార్జించినవాడు తప్పటడుగు వేయునా? పూర్వమెన్ని దురితము లొనర్చినవాడైనను, ఈశ్వరశరణ మందినవాడు ఆ పిదప తప్పుచేయజాలడు. గిరీశబాబు చేయని పాపమే లేదు. ఆయన నాతో నిట్లొకసారి చెప్పెను: 'నా జీవితకాలములో నేను త్రాగిన సారాయిబుడ్ల నొకదానిపై నొకటి నిలిపిన, ఎవరెస్టుపర్వతాగ్రమంత ఎత్తగును!' అతడు

కవి. కావున ఆలంకారికముగా అట్లు చెప్పెను. కాని నిజమున కత డంతటి త్రాగుబోతే. భగవన్నామమును ప్రాతస్సాయంకాలములం దుచ్చరింపు మను శ్రీ గురుదేవుని ఆనతి నతడు నిరాకరించెను. 'నే నట్లు చేయగలనని చెప్పజాలను. ఆ వేళలలో నే నెచ్చట నుందునో, ఏ స్థితియం దుందునో, ఎఱుగను' అని పలికెను. 'పోనీ, భోజనవేళ భగవంతుని స్మరించి భుజింపుము' అని ఆయన చెప్పగా 'అదియు చేయుదు నని గట్టిగా చెప్పజాలను. నే నెప్పుడును దావాలపనిలో మునిగియుందును. ఎన్నెన్నో విధములగు పనులుకూడ నాకుండును. కావున నా కిదియు సాధ్యముకాదు' అని యతడు బదులిడెను. 'సరే, అట్లైనచో నాకు "వకాలతునామా" ఇచ్చివేయుము' అని ఆయన చెప్పెను. ఈ సంఘటనమును గూర్చి కాలాంతరమున గిరీశుడు మాతో నిట్లనెను : 'అట్లు చేయుటకు నేను నిరభ్యంతరముగా అంగీకరించితిని. కాని "వకాలతు" ఇచ్చివేయు టెంత కఠినవిషయమో నాకు పిదప తెలియవచ్చెను. సాయంకాల మొక్కతడవయైన భగవన్నామ ముచ్చరింపజాల నని చెప్పినవాడను, పిదప అట్లు చేసిగాని ఏ అత్యల్పకార్యమునుగూడ చేయజాలనిస్థితికి వచ్చితిని. ప్రతిక్షణ మతడు స్మృతిలోనికి వచ్చుచుండెను.' పదియేనేండ్లుగా నల్లమందున కలవాటుపడినవా డొక్కనా డున్నట్టుండి దానిని తినుట మానుకొనెను. 'మొదటి మూడు నాళ్లు చాల కష్టపడితిని. శరీర మంతయు జడత్వము వహించెను. నాలవనాడు మరల సామాన్యస్థితికి వచ్చితిని'

అని మాకు చెప్పెను. మఱికొన్నాళ్ల కతడు హుక్కా పీల్చుట కూడ మానుకొనెను.''

'చ-' : ''భగవంతుని దెసకు సాగుచున్నది, లేనిది, సాధకున కెట్లు తెలియగలదు?''

స్వామి : ''సాధకున కది తనంతటతానే తెలిసిపోవును. ఇతరులకుకూడ విదితమగును. అతని కామక్రోధలోభా దులు క్షీణింపజొచ్చును. ఇంద్రియవిషయానురక్తి తగ్గి పోవును. మనశ్శాంతి చేకూరును.''

శిష్యుడు : ''మహారాజ్, భగవత్సాక్షాత్కారసిద్ధి కలుగకపూర్వమే శాంతి సిద్ధించునా?''

స్వామి : ''సిద్ధింపదు. యథార్థశాంతి సిద్ధించుటకు చాలకాలము పట్టును. కాని ఎవని విషయభోగవాంఛలు తఱుగజొచ్చి, ప్రేమ సర్వభూతముల నావరింపజొచ్చునో, అట్టివాడు ఈశ్వరాభిముఖుడై సాగుచున్నాడని కనుగొన వచ్చును. కేవల మంత్రజపమాత్రమున ప్రయోజన ముండదు. మనస్సులో విషయాసక్తిరూపమగు నొక్క రంధ్ర ముండెనేని నీ జపఫల మందుగుండ కాఱిపోవును. ఒకడు పొలమునకు దినమంతయు నీరు కట్టెను కాని, సాయంకాల మునకు అందులో నొక్క బొట్టైనను నిలిచియుండలేదు; అంతయు నొక నెఱ్ఱెలోనుండి కాఱిపోయెను.

''నాగమహాశయుని చక్కని వాక్యొకటి నాకీ సందర్భమున తలపునకు వచ్చుచున్నది. నే నతని ఇంటి

కరిగితిని. అతని తండ్రి యొకమూల కూర్చుండి జపముచేయు చుండెను. 'నా తండ్రికి యథార్థభక్తి లభించునట్లాశీర్వ దింపుము' అని నాగమహాశయుడు నన్నడిగెను. 'అది అతని కిప్పటికే కలదుగదా, నిరంతరభగవన్నామోచ్చారణ మొనర్చుచున్నాడుగదా, ఇం కేమి కావలెను?' అని నే నంటిని. అందుపై నత డిట్లు పలికెను: 'లంగరు దింపియున్న పడవకు తెడ్లువైచిన నేమి ఉపయోగము? ఆయనకు నాపై అమితమగు మమకారము కలదు. ఈ జప మాయన కెట్లు ఉపకరింపగలదు?' అందుపై నేను 'నీ వంటి కుమారుని ప్రేమిం పనిచో మఱి దేని నాయన ప్రేమింపదగును?' అని అడిగితిని. 'అట్లనకుము. నాయెడ గల మమకార మంతయు నశించు నట్లు ఆశీర్వదింపుము' అని యతడు పలికెను.

"ఆహా! నాగమహాశయు డెంత మహనీయుడు! 'లంగరు దింపియున్న పడవకు తెడ్లువైచుట' అను మాట కర్థము నీకు పూర్తిగా తెలిసినదా? కొందఱు త్రాగుబోతు లొక చీకటిరాత్రినాడు పడవప్రయాణము చేయ సంక ల్పించిరి. ఏటియొద్దకు పోయి పడవ నొకదాని నెక్కి తెడ్లు వేయ నారంభించిరి. తెల్లవాఱినప్పుడు చూచుకొనగా బయలుదేఱినచోటనే ఉన్నామని వారు కనుగొనిరి! నిండు కైపులో నుండుటచే లంగరు నెత్తుమాటనే వారు మఱచి పోయిరి."

అక్టోబర్, 12.

స్వామి తన గదిలో విశ్రమించియుండెను. కొలది మంది సన్న్యాసులును గృహస్థభక్తులును ఆయనతో నుండిరి. సెర్ జార్జ్ వుడ్ రాఫ్ రచించిన **'Is India civilized?'** (హిందూదేశము నాగరికత నొందినదేనా?) అను గ్రంథపు ద్వితీయముద్రణ మప్పుడే మిక్కిలి విస్తృత రూపమున వెల్వడియుండెను. దానిని గూర్చి వారు మాటాడుచుండిరి.

శిష్యుడు: "వ్రాయుపనియం దొక అనుకూలత కలదు. పని సుస్థిరముగాసాగుచుండును. దినమున కొక గంటసేపు మాత్రమే వ్రాసినను సంవత్సరాంతమున నెంతో వ్రాయబడి యుండును. కాని ఆధ్యాత్మికసాధనవిషయ మట్టిది కాదు. దినమునకు రెండుమూడుగంటలసేపు జపధ్యానసాధనములు పదేండ్లపాటు జరిపినను, పురోగమనము లెక్కింపదగినంత కానరాదు. ప్రారంభస్థానముననున్నట్టే యుండును."

స్వామి: "అ వేమి మాటలు? ఆధ్యాత్మికసాధనలు నిష్ఫలము లని ఎవరుచెప్పిరి? తప్పక ఫలము కలుగును. దానినిగూర్చి సంశయస్పర్శయే లేదు.

"తమకై పాటుపడినవారికి లోకులే ప్రతిఫల మిచ్చు చుండగా, తనకై పాటుపడినవారికి భగవంతుడు ఏమియు ఇయ్యకుండునా? ఆత డంత నిర్దయుడా? కాని, మనము సరియైనబుద్ధితో పనిచేయవలెను. 'తోచీ తోచని' పని నిరుప యోగము. ఒక సారాయిబట్టీకి సమీపమున నొక పిచ్చి

వాడు నివసించుచుండెను. ప్రతిమధ్యాహ్న వేళ అత డా బట్టీ యొద్దకు పోయి, సారాయి దింపిన పిదప పాఱవేయబడిన కుండల నొక్కొక్కదాని నొక కఱ్ఱతో పగులగొట్టి జోరు చెమటలు కాఱుచు 'అబ్బ! నే నిక పనిచేయజాలను!' అని అఱచువాడు. కొంచెము అలసటతీర్చుకొని మరల అదే కార్యమునకు కడగువాడు!

"ఈ విధముగా నీ వెంత శ్రమించినను నిష్ప్రయోజనము. నీవు పొలమునకు దినమంతయు నీరు పెట్టుచుండ వచ్చును. కాని పొలమున నొక కంత యున్నచో నీ శ్రమ మంతయు వ్యర్థమగునుగదా. సాయంకాలము చూచుకొనగా, పొలములో ఒక చుక్క నీరుకూడ నిలిచియుండదు! అంతయు కంతలోనుండి కాఱిపోయినది. ఇంద్రియవిషయానురక్తియే ఈ కంత."

శిష్యుడు: "మహారాజ్, కంతను గుర్తింపజాలని వాడు ఏమిచేయవలెను? అది గురుకటాక్షముపైనిగదా ఆధారపడియుండును? 'జగన్నాథయాత్రకు బయలుదేఱి తప్పుత్రోవ పట్టినవానికి ఎవడోయొకడు సరియైనత్రోవ తప్పక చూపును' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. భగవదన్వేషణచేయువాడు సరియైనత్రోవ పట్టకపోవచ్చును కాని, అతని గమ్యము భగవంతుడే యనుట నిస్సంశయము. అగుచో, అతని ప్రయత్నము నిష్ఫల మెట్లు కాగలదు!"

స్వామి: "నిజమే. అతని గమ్యము నిజముగా భగవంతుడే అయినచో నిష్ఫలము కాజాలదు. అట్టివానికి

ఎన్నడో యొకనాడు భగవత్కృపాస్పర్శ సోకకపోదు. 'ఎవడైనను భగవంతునివైపునకు ఒక్క యడుగు వైచినచో, భగవంతు డతనివైపునకు పదియడుగులు వైచును.' ఇవి వట్టి ఉబుసుపోని మాటలు కావు. అతని కృప నార్జించుటకై యే స్వల్పశ్రమ పడినవానికికూడ ఇది అనుభవసిద్ధమై యుండును. ('అ-' వైపు తిరిగి) నీ వేమందువు?"

'అ-' : "అవును, తప్పక అట్లే."

స్వామి : "'నిజమాడుట, విధేయతాప్రవర్తనము, స్త్రీ లందఱియెడ మాతృభావము : ఇవి మానవునికి ఈశ్వర సాక్షాత్కారము కల్పించునని తులసీదాసు పూచీగా పలుకగలడు.' అక్కటా! లోకమున నిజమాడువారి సంఖ్య ఎంత కొంచెము! విధేయత అనగా నేమి? పరిపూర్ణ శరణాగతియే. మఱియు ఇతరుల భార్యల నందఱిని తల్లులుగా చూచుకొనవలెను. ఈ గుణములు గలవా రందఱకును భగవత్సాక్షాత్కారము లభించును. ఇందుకు తులసీదాసు పూచీ.

"'సదా ఇతరులసొమ్మును దొంగిలించుచుండువాడు, ఎన్ని ధర్మకార్యములు చేసినను, అవి యన్నియు చేయనట్లే. సదా ఇతరుల నాశ్రయించుకొని బ్రతుకువాడు ఎంతకాలము జీవించినను, అతడు జీవింపనట్లే. సదా ఇతరులను నిందించుచుండువాడు ఈశ్వరనామోచ్చారణ మెంత చేసినను చేయనట్లే' అని కబీరు పలుకుచున్నాడు.

"ఇతరులయొద్దనుండి ముచ్చిలించిన సొమ్ము ఎంత దానముచేసిన నేమి ప్రయోజనము? ఇతరుల దానముపై

ఆధారపడి ఎంత దీర్ఘకాలము జీవించినను, అది యంతయు మరణతుల్యమే. పరనిందచేయువారికి భగవన్నామస్మరణము నిష్ప్రయోజనము. అందుచేతనే ఏసుక్రీస్తు ఇట్లు ప్రవచించెను: 'కావున నీవు పూజావేదికకడకు నివేదనపదార్థము ఏదేని కొనివచ్చినప్పుడు, నీ సోదరమానవుని కెవరికైనను నీయెడ కోపకారణము కలదని జ్ఞప్తికి వచ్చినచో, నీ నైవేద్యము నచ్చట నుంచి, ముందుగా వెళ్లి నీ సోదరునితో చెలిమి చేసికొని, పిదపవచ్చి ఆ నైవేద్యమును సమర్పింపుము.' "

శిష్యుడు: "ఇదియంతయు వినుటకు ఆహ్లాదకరముగనే యున్నది. కాని ఇట్లు ప్రవర్తించుట ప్రాణము సమర్పించునంతటి కష్టకార్యము. ఈ సిద్ధాంతములు గ్రహించుట సులభమేకాని, వాని ననుష్ఠించుట మిక్కిలి దుర్ఘటము."

స్వామి: "నిజమే. అయినను వానిని మనస్సున కెక్కించుకొనుటలోకూడ కొంత గుణముగలదు. ఈ దేశములోమాత్రమే ఇది సాధ్యము. ఇచ్చట అపరోక్షానుభూతిచే బ్రహ్మజ్ఞానము నొందినవారు అనేకులు ఉండిరి. వారి అనుభూతులు ఈ దేశస్థులలో 'ఇమిడిపోయి, అస్థిగతమైనవి' అనవచ్చును. కావుననే ఇచ్చటి మానవులు పసివారైనను ముసలివారైనను, స్త్రీలైనను పురుషులైనను, వీనిని సులభముగా గ్రహింపగలుగుచున్నారు."

'అ—': "మతేజాతివారును భగవంతుని యొక్క సగుణనిర్గుణభావములను రెంటిని ఒక్కుమ్మడిగా గ్రహింపలేదు కాబోలును."

స్వామి : “లేదు. ఈ భారతదేశపు ఋషులు ఒక్కరే నిర్గుణబ్రహ్మజ్ఞానము నొందగలిగిరి. కాని ఒక్క మహమ్మదీయుడుమాత్రము ఆ జ్ఞానము పడసి 'నేనే బ్రహ్మమను, నేనే అతడను' అని గ్రహించెనట. అత డిట్లు ప్రకటించి నప్పుడు మహమ్మదీయగురువులు మిక్కిలి ఆగ్రహించిరి. వారు అల్లీ సంతతివారు కావున మతగురువృత్తి నవలంబించు వారు. వా రందఱును ద్వైతులు. చక్రవర్తి కొమార్తకు ఒక తడవ అసాధ్యమగు వ్యాధి వచ్చెను. వైద్యు లెవ్వరును కుదుర్పజాలకపోయిరి. ఈ సిద్ధపురుషుని పిలువు డని ఎవడో సూచించుచు, 'అతనికి అద్భుతశక్తులు కలవు. తప్పక అత డీ వ్యాధిని కుదుర్పగలడు' అని పలికెను. అంతట ఈ సిద్ధపురుషుడు పిలిపింపబడెను. అతడు రాజుకొమార్తతో ఇట్లనెను : 'నీకు వ్యాధి నిమ్మళించిన దని భగవంతునిపేరిట పలుకుచున్నాను. కావున లెమ్ము!' కాని ఈ మాటలవలన ఏమియు ఫలము కలుగలేదు. అంతట నతడు బిగ్గరగా, ఉద్రేకముతో, 'నీకు నిమ్మళించినదని నేను చెప్పుచున్నాను. కనుక లెమ్ము!' అని అఱచెను. వెంటనే ఆమె స్వస్థురాలై లేచి కూర్చుండెను. చక్రవర్తి ఆనందభరితు డయ్యెను. కాని మతగురువులు 'అల్లాకన్నను తాను అధికశక్తిమంతుడని అతడు పలుకుట వింటిరా!' అని ఉద్రేకముతో రాజునకు నివేదించిరి. అందుపై ఆ సాధుపురుషుని విచారణచేసి, అతని చర్మమును ఒలిపించిరి. ఆ మహాదుఃస్థితిలో అతడు ఇంటింటికి పోయి ముష్టి అడిగెను. కాని అందఱును తలుపులు మూసికొని, ముష్టి పెట్టక పోయిరి. ఒక కసాయివాడుమాత్రము ఒక మాంసపుకండను

అతనికి విసరివైచి, తలుపుమూసికొనెను. పిదప ఆ మాంస మును పచనముచేసికొనుటకై నిప్పుకొఱకతడు యాచించెను. కాని ఎవ్వరును పెట్టలేదు. అందుపై నతడు ఆ మాంసపుముక్కను సూర్యునియెదుట నుంచెను. అతనికి వలసినంత వేడిమి నిచ్చుటకై సూర్యుడు క్రిందికి దిగివచ్చె నట! కావుననే ముల్తానులో తక్కినచోట్లకన్న సూర్యుడు క్రిందనుండునట!"

ఒక బ్రహ్మచారి: "ఇది ఎప్పుడు జరిగెను?"

స్వామి: "పదియేనవ శతాబ్దపు ప్రాంతమున."

బ్రహ్మచారి: "'నేనును నాతండ్రియు అభిన్నులము' అని ఏసుక్రీస్తుకూడ పలికెను."

స్వామి: "న్యాయాధిపతియెదుట' ఆయన మిక్కిలి జాగ్రత్తతో జవాబు లిచ్చెను. 'నీవు యూదులకు ప్రభువవా?' అను ప్రశ్న కాయన 'మీరే అట్లనుట' అని బదులుచెప్పెను. ఆయన శక్తిసామర్థ్యములను చూచి మత గురువు లందఱును కోపోద్రిక్తులైరి. సర్వజనులును మాఱు మాటాడక ఆయన యానతిని శిరసావహించుటచే వారికి వచ్చు రాబడి తఱిగిపోవుటయే యిందుకు కారణము. సైమన్ అను నతడును, అతని సోదరుడును, చేపలు పట్టు చుండగా చూచి, వారితో 'నా వెంట రండు, మీరు మను ష్యులను పట్టునట్లు చేసెదను' అని ఆయన పలుకగా, వెంటనే వారు తమ వలలను విడనాడి, ఆయనవెంట నడచిరి. ఆయన శిష్యులలో నొకరు 'స్వామీ, నా మృతజనకుని సమాధిచేసి

పిదప వచ్చుటకు అనుజ్ఞ యిండు' అని వేడుకొనగా ఏసుక్రీస్తు 'వలదు. నా వెంట రమ్ము. మృతులను మృతులే సమాధిచేసి కొందురుగాక' అని ఆజ్ఞాపించెను. తమ రాబడిని ఆయన నశింపజేయుచుండుటచే మతగురువులు న్యాయస్థానములో ఆయనపై అభియోగమును తెచ్చిరి. కాని ప్రజాపరిపాలకునికి ఆయనయందు నేరమేమియు కనిపింపక ఆయనను విడుదలచేయ సిద్ధపడెను. ఐనను ప్రజ లాయనకు మరణ దండన విధింపవలెనని పట్టుపట్టిరి. అందుచే ఆయనను కొఱత వేయుటకై వారికి అప్పగించుచు, అత డిట్లనెను : 'ఈ సన్మార్గ వర్తనుని రక్తపాతమునకు నేను బాధ్యుడనుకాను. ఇది జ్ఞప్తి పెట్టుకొనుడు.' "

శిష్యుడు : "ఆయనయందు భక్తిప్రపత్తులుగల శిష్యులు స్వర్గలోకముననున్న జగత్పిత ప్రత్యక్షముగ దిగి వచ్చి భూమిపై తన రాజ్యమును స్థాపించు నని తలచిరి."

స్వామి : "కాని ఆయన 'జగత్పిత ఏల దిగిరావలెను? ఆయన మీ హృదయసీమలందే కలడు!' అని వారికి తెలిపెను."

శిష్యుడు : "క్రైస్తవ సిద్ధపురుషులలో 'సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి' యొక్క జీవితము ఎంత అద్భుతమైనది!"

స్వామి : "అవును. అతడు ఏసుక్రీస్తును గూర్చి అత్యంత తీవ్రముగా ధ్యానము చేయుటవలన, అతని అఱ చేతులమీదను, పాదములమీదను (ఏసుక్రీస్తుకు కొఱ్ఱుపై

కలిగినట్లు) గాయము లేర్పడెను. అవి అతని జీవితకాల మంతయు అట్లే నిలిచియుండెను!''

శిష్యుడు : ''మహమ్మదీయులలోను మహాపురుష లెందఱో జన్మించిరి.''

స్వామి : ''అవును, సత్యము. ఇట్టి మహాత్ములు ప్రతిమతమునందును పుట్టి సత్యానుభూతి నొందుటచేతనే, ఆ మతములు ఇన్ని తరములుగా నిలువగలిగియున్నవి.

'' 'ప్రతివారును వచ్చి ''మాకు మార్గము చూపుడు,'' ''మాకు మార్గము చూపుడు'' అనుచుందురు గాని, ఒక్కరైనను చెప్పినమాట నాదరించి అనుసరింపరు' అని స్వామిజీ పలుకువాడు.

'' 'మనఃపూర్తిగా ప్రార్థించినను, భగవంతుడు డాలకింపడు' అను మాట అసత్యము. భగవంతుని 'సోదరా, మధుసూదనా' అని యొక బాలుడు పిలిచెను గదా. ఆ బాలుని పేరేమి?''

శిష్యుడు : ''జటిలుడు.''

స్వామి : ''అవును, అవును, జటిలుడే. అతడు అరణ్యమార్గమున ఒంటరిగా బడికి పోవ వెఱచుచుండగా, అతని తల్లి 'నీకు మధుసూదను డను సోదరు డొకడు కలడు, భయము కలిగినప్పుడెల్ల అతనిని పిలువుము. నీకప్పుడు భయ కారణ ముండదు' అని చెప్పెను. ఆ బాలు డిది నమ్మి మధుసూదనుడు తనకు నిజముగా సోదరుడే అనుకొని

అడవిలో భయము పుట్టినప్పుడెల్ల 'సోదరా, మధుసూదనా' అని పిలుచువాడు. వెంటనే మధుసూదనుడు వచ్చి అతనిని తోడ్కొనిపోవువాడు. ఉపాధ్యాయు డిది విని, 'నీ సోదరుని నాకు చూపగలవా' అని ఆ బాలు నడిగెను. బాలుడు 'తప్పక చూపుదును' అని పలుకగా, వారిరువురును అరణ్యమున కేగిరి. బాలుడు మధుసూదనుని పిలిచెను. అతడు వచ్చెను. కాని ఉపాధ్యాయునకు అతడు కనిపింపలేదు. కాలి గజ్జెల చప్పుడుమాత్రము వినబడెను. ఈ భాగ్యముకూడ తల్లికి లభింపలేదు. కుమారుని భయము పోగొట్టుటకై అట్లామె చెప్పెనే కాని ఆమె కందేమియు విశ్వాసము లేదు.

"గోపస్త్రీ సంసారసాగరమును దాటిన కథ నెఱుగుదువా? ఒక బ్రాహ్మణపండితుని ఇంట ఆ స్త్రీ పాలు పోయుచుండెను. ఆమె యొక నదిని దాటి రావలసియుండెను. రేవుపడవ సకాలమున దొరకనందున ఆమె రాక ఒక్కొక్కసారి మిక్కిలి ఆలస్యమై పండితుని పిల్లలు పాలకై మిక్కిలి యిబ్బందిపడుచుండిరి. అందుచే అతడు ఆమె నొకనాడు బాగుగ చీవాట్లు పెట్టెను. 'నే నేమి చేయుదును? రేవుపడవ ఒక్కొక్కనాడు సకాలమునకు అందుట లేదు. కావుననే ఆలస్యము అవుచున్నది' అని ఆపె బదులుచెప్పెను. ఆ పండితు డంతట 'ఈ కొద్దిపాటి ఏటినే దాటజాలవా? ఇక సంసారసాగరమును ఎట్లు దాటుదువు?' అని పల్కెను. నిరక్షరకుక్షియగు ఆమె 'సంసారసాగర' మను మాటనే అప్పటికి వినియుండలేదు. ఆమె స్తబ్ధురాలై నోట మాటరాక

నిలిచెను. 'భగవన్నామస్మరణచే సంసారసాగరమునే దాట వచ్చును. ఈ స్వల్పనది మాట చెప్పవలయునా' అని పండితు డనెను. ఆమె హర్షమునంది వెడలిపోయెను.

"అప్పటినుండియు, ఆమె పాలు సకాలమున తే నారంభించెను. జాగు అనుమాటయే లేదు. ఇట్లుండగా నొక నాడు పండితు డామెను ఇట్లు ప్రశ్నించెను: 'ఇప్పు డేమియు జాగుచేయక సకాలములో వచ్చుచున్నావే. ఎట్లు నదిని దాటుచున్నావు?' 'అట్లడిగెద రేల? దాటుమార్గమును మీరేగదా చెప్పితిరి? ఆ మార్గ మవలంబించుటచే, నేను రేవుపడవకై వేచియుండ నవసరము తప్పినది, కేవు ఇచ్చు టయు తప్పినది' అని ఆపె బదులుచెప్పెను. 'నా కర్థ మగుట లేదు. నిన్నెవరు ఇప్పుడు దాటించుచున్నారు?' 'నన్ను ఇతరులు దాటింప నేల? నేను ఏటియొద్దకు నడచివచ్చి, హరినామస్మరణ చేయుచు, ఏటినీటిలో నడచివచ్చు చున్నాను.' 'ఎట్లు దాటుచున్నావో నాకు చూపగలవా?' 'అదేమి కష్టము? తప్పక చూపెదను రండు.' పండితుడు ఈ మాటలు నమ్మజాలక, సంశయబుద్ధితో ఆమె వెంట నడచెను. గోపస్త్రీ ఏటియొద్దకు పోయి హరినామస్మరణ చేయుచు ఆ ఏటి నీరు మోకాలిబంటిలోతువే అయినట్లు దాట నారంభించెను. ఆవలిగట్టు చేరి, పండితుడు యథా స్థానముననే ఆశ్చర్యమగ్నుడై నిలిచియుండుట చూచెను. 'అట్లు నిలిచియున్నా రేల? హరినామస్మరణ చేయుచు దాటి రండు' అని ఆమె అఱచెను. పండితుడు విస్మయముతో మంత్రముగ్ధునివలె హరినామస్మరణ చేయుచు నడువ నారం

భించెను. కాని, నీరు లోతగు కొలదిని, అతడు రెండు చేతులతో గుడ్డను ఎత్తుకొనెను. అతని పెదవులు హరినామ ముచ్చరించుచుండినను, అతని హృదయమున విశ్వాసము లేదు. పండితుని దుఃస్థితిని చూచి, గోపస్త్రీ 'హరినామ స్మరణ చేయుచుకూడ గుడ్డ నెత్తుకొనుచున్నా రేల? అట్లు చేయరాదు' అని పలికెను.

"కొంచెము ఆత్మవిచారముచే అంతయు స్పష్ట మగును. ఇటీవల నా శరీరములో నే నొక వింతపోరాటమును చూచితిని. మొన్నటి జబ్బులో నేను శల్యావశిష్టుడనైతిని. ఈ కండ (పిక్కకండను చూపుచు) అంతయు అదృశ్య మైనది. ఇప్పుడు నీకు కనుపడున దంతయు ఆ పిదప పెరిగెను."

శిష్యుడు: "పోయిన తడవ మీకు వచ్చిన ఇన్ఫ్లూయెన్జాజ్వరమును గూర్చియేనా మీరు మాటాడుచుండుట?"

స్వామి: "కాదు. ఇది పూరీలోని విషయము. అప్పుడు నా శరీరములో ఎముకలు, చర్మము మాత్రమే యుండెను. పక్కలకు పొర్లుటకుగాని, కాలుసేతులు కదలించుటకుగాని, శక్తిలేదు. మాటలాడుశక్తిమాత్రమే నిలిచి యుండెను. ఒకనాడు నా శరీరములోనున్న ప్రాణము, వెలుపలనున్న మఱొక ప్రాణముతో గాఢముగ పోరాడు చుండుట చూచితిని. ఇది చాలసేపు జరిగినది. అవి రెండును సమబలముతో పోరాడుచుండగా, ఒక్కొక్కసారి యొకటియు, మఱొకసారి రెండవదియు గెలుచుచ నుండెను.

వెలుపలిప్రాణము లోపలిదానిని లాగివైవ జూచుచుండెను కాని అది రాకుండెను. చివరకు వెలుపలిది ఓడిపోయి వెళ్ళెను. అందువల్ల ప్రాణము దక్కినది. అది జయించి యుండినచో, లోపలి ప్రాణము వెడలిపోయియుండును. అనగా శరీరము నిర్జీవమైయుండును, నేను మృతినొంది యుందును. ఈ పోరాటమును నేను తటస్థుడనుబోలె చూచుచుంటిని. వెలుపలిప్రాణము ఓడి వెడలిపోవుటతోడనే, నా ప్రక్క నున్నవారితో 'ఈ సారికి చావు తప్పినది' అని నేను చెప్పితిని. ఆ పిదప ఈ కండ లన్నియు మరల పెరిగినవి. ఈ సంఘటనమునకు ముందుగనో వెనుకనో (చక్కగా జ్ఞప్తి లేదు) 'స్వామిజీ' (వివేకానందస్వామి) నాకు అగపడి 'ఇదేమి, లెమ్ము!' అని వెంటనే పలికెను."

అక్టోబర్, 13

స్వామి గదికి కొందఱు సన్న్యాసులును, బ్రహ్మచారులును రాగా, ఆయన వారితో సంభాషించుచుండెను.

స్వామి: (ఒక సన్న్యాసివైపు చూచి) "భగవంతుడు కలడని నీకు నమ్మకమేనా? (సన్న్యాసి మౌనముగా నుండెను.) ఈ నిరీశ్వరభావమే నాకును ఒకసారి కలిగి యుండెను."

సన్న్యాసి: "మహారాజ్, నిజమే. ఒకొక్కసారి నాకును భగవంతుడు లేడనియే తోచును."

స్వామి: "ఉన్నవాస్తవము నేను బయటపెట్టుకొంటిని గనుక నీకును నిజము చెప్పివేయు ధైర్యము కలిగి

నట్లున్నది. నిజము చెప్పినయెడల నీ గుట్టు బయటపడిపోవు నని వెఱచితివా? అట్లేమియు లేదు. అట్టి సంశయదృష్టి అనేకులకు పైకొనుచుండును. భగవత్సాక్షాత్కారమార్గ మున నిట్టి స్థితి యొకటి కలదు. నాకు ఒకసారి యొక పుస్తక పఠనమువలన నిరీశ్వరభావము కలిగినది.''

ఒక బ్రహ్మచారి : ''ఆ గ్రంథకర్త యూరప్ దేశస్థుడా?''

స్వామి : ''అవును. అప్పుడు నే నెంతటి మనోవేదన ననుభవించితినో ఎఱుగుదువా? ఏమిచేసినను శాంతి లభింప లేదు. ఆ అవస్థ ఒకటిరెండునాళ్లుమాత్రమే ఉండెను. ఆ గ్రంథము అనాత్మవాదభావములతో నిండియుండెను. ఎంతో ప్రయాసమీదట దాని బారినుండి తప్పించుకొంటిని.

'''అ–' కూడ అట్టి యవస్థను కొంతకాల మనుభ వించెను. ఆయన నూటికి నూఱుపాళ్లు వేదాంతి యని మీ రెఱిగియుందురు. 'య ఏనం వేత్తి హన్తారం, యశ్చైనం మన్యతే హతమ్। ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి న హన్యతే.' (ఈ ఆత్మను ఎవడు చంపునదిగ తలచునో, ఎవడు దీనిని చంపబడినదిగ తలచునో, వారిరువురును ఎఱు గనివారే. ఏలయన ఈ ఆత్మ ఎవరిని చంపదు, తాను చంప బడదు) అని భగవద్గీతలో చెప్పబడియున్నది.

'''అ–'కు ఈ భావము మిక్కిలి దృఢముగా నాటు కొనినది. శ్రీ గురుదేవు డొకనాడు ఆతనిని పిలిపించి 'నీ

వే మానవునైన చంపగలవా?' అని అడిగెను. 'అ దెంతటి పని? సులభముగా చంపగలను' అని అతడు బదులుచెప్పెను. 'పాపభీతి నిన్ను బాధింపదా?' 'ఏల బాధించును? ఎవరు ఎవరిని చంపుదురు?' 'సరే. అట్లే కానిమ్ము. ఆ మార్గమున నే సాగిపొమ్ము. ఒక గదిలోనుండి మఱియొక గదిలోనికి చొచ్చినట్లు—ఇదియును ఒకదశ. కాని నీ వింతటితో ఆగకూడదు. ఆగితివేని చెడుదువు. అట్టి బుద్ధితో గృహస్థుడవు అగుదువేమో జాగ్రత్త.'

"భగవత్సాక్షాత్కార మొందుట మిక్కిలి కష్టము. అత్యల్పవాంఛకూడ అందుకు అడ్డువచ్చును. 'ఎంత సూక్ష్మమగు పోగు బయటనిలిచినను, దారము సూదిబెజ్జములో చొరదు' అని శ్రీ గురుదేవుడు పెక్కుతడవలు పల్కువాడు. 'మా వారికి అన్నవస్త్రములు ఏ కొద్దివిధముగనో లభించుచుండునట్లు అనుగ్రహింపుమని అంబికను ప్రార్థింపుడు' అని స్వామిజీ (వివేకానందస్వామి) శ్రీగురుదేవు నొకసారి ప్రార్థించెను. నీవే పోయి ఆమెను ప్రార్థింపుమని శ్రీ గురుదేవు డతనిని కాళికాలయమున కంపెను. కాని స్వామిజీ వివేకవైరాగ్యములుతప్ప మ ఱేమియు కోరజాలకపోయెను. ఎట్లు కోరగలడు, ఆయన కేవలము ముక్తసంగుడు! శ్రీ గురుదేవున కత డీ విషయమును తెలిపినప్పుడు 'అత డెంతటి మహాత్ముడో తెలిసినదా' అని ఆయన మాతో అనెను. వివేకవైరాగ్యములుతప్ప అంబిక నత డేదియు అడుగజాలక పోయెను!"

అక్టోబర్, 14.

స్వామి తన గదిలో విశ్రమించియుండెను. కొందఱు బ్రహ్మచారులును సన్న్యాసులునుకూడ అచ్చట నుండిరి.

స్వామి : "చూడుడు నా చర్మము ఎట్లు ముడుతలు పడిపోయినదో! ఇది వార్ధక్య లక్షణము. యయాతిప్రభునికి కూడ ఇట్లే జరిగెను. ఉన్నట్టుండి ఒక్కనాడు అతని చర్మమంతయు ముడుతలు పడి, తలయంతయు నరసి, శరీరమంతయు దుర్బల మయ్యెను.

"ఏ కార్యమునందైనను విజయము సాధింపగోరితివేని, దానినే గమ్యముగ ఎంచుకొనవలయును. నీకొకటిరెన్నాళ్లు ఒక కార్యముపై మనసుపోవును, కాని ఆ బుద్ధి నశించుటతోడనే దానిని నిలిపివేయుదువు. ఇది నిష్ప్రయోజనము. శశిమహారాజ్ (శ్రీ రామకృష్ణానందస్వామి) కార్యాచరణమార్గమును తన జీవితమున ప్రదర్శించి చూపెను. ఒకేచోట, ఒకేవిధమగు కార్యకలాపమును, అతడు పదియేడులు విసుగులేక నిర్వర్తించెను! ఆ కార్య నిర్వహణమున నొక్కొక్కసారి అపారమగు విపత్తులపాలై, శ్రీ గురుదేవుని, శ్రీ వివేకానందస్వామిని, గాఢముగా నిందించువాడు! కాని తనకు అప్పజెప్పబడిన కార్యమును మాత్రము విడనాడలేదు!"

'అ' : "జ్ఞాన, భక్తి, కర్మ, (రాజ) యోగములు నాలుగింటిలో ఏది అధికమని శ్రీ వివేకానందస్వామి నొకరు

ప్రశ్నించిరి. 'నీకీవితర్కమేల? నీకందు దేనిపై ఇచ్ఛ గలదో దానిని నీచేత నైనంతవఱకు అనుసరింపుము' అని ఆయన బదులుచెప్పెను."

స్వామి: "ఏ కార్యమునైనను నిష్కామముగా చేయుము. నీ బుద్ధియంతయు ఆకార్యముమీాదనే ఏకాగ్రము కావలెను. అదియే నీ ఆదర్శము, నీ జీవితలక్ష్యము, నీ పరమార్థము, కావలెను. జయాపజయముల విషయమునే తలప వలదు."

అక్టోబర్, 15.

స్వామి కొలదిమంది సన్న్యాసులతోను, బ్రహ్మచారులతోను, తన గదిలో కూర్చుండియుండెను. ఆయనకు శరీరము స్వస్థముగా నుండలేదు. పాలవిషయము ప్రస్తావన వచ్చెను.

స్వామి: "ఉపమన్యున కొకసారి పాలుత్రాగవలెనను కోర్కె కలిగెను. అత డప్పుడే తన మేనత్తయింట పాలరుచి చూచియుండెను. పాలు తెచ్చియిమ్మని తల్లిని కోరెను. నిజముపేదవితంతు వగుటచే, కుమారునికి పాలు కొని తెచ్చు శక్తి ఆమెకు లేదు. కాని అతడు పట్టుపట్టినందున, బియ్యపుపిండి నీటిలో కలిపి ఇచ్చెను. తన మేనత్తయింటి పాల రుచి దీనియందు లేకపోవుటను ఉపమన్యుడు కనుగొనెను. 'ఇవియే పాలు' అని తల్లి చెప్పెనుగాని అతనికి నమ్మకము పుట్టలేదు. అంతట ఆమె 'నేను బీదదానను.

నీకు పాలు ఎట్లు తెచ్చి యియ్యగలను' అని విలపించుచు, 'శివుడు సంపత్ప్రదాత. నీ వాయనను తపఃప్రార్థనలచే సంతుష్టినొందింపగలిగితివేని, నీ కాయన ఎన్ని పాలు కావలె నన్నను లభించునట్లు వర మీయగలడు' అని చెప్పెను. ఉప మన్యుడు గాఢతపస్సుచేసి, శివుని మెప్పించి, తాను కోరిన వర మతనియొద్ద బడసెను. కాని అతడు తన జీవితమున నను ష్ఠించిన తప మిది యొక్కటే కాదు. మహాభారతములో ప్రశంసింపబడిన మహర్షులలో నతఁ డొకడు.

"ద్వారకలో శ్రీకృష్ణుని భార్య లందఱిలో జాంబ వతికిమాత్రము పుత్రులు లేరు. 'మీ అనుగ్రహముచేత తక్కిన భార్య లందఱికిని పుత్రులు ప్రసాదింపబడిరి. దుర దృష్టురాలనగు నాకొక్కదానికే ఆ భాగ్యము కలుగలేదు. నాకును ఒక పుత్రు ననుగ్రహింపుడు' అని ఆమె వేడు కొనగా, శ్రీకృష్ణుడు ఒకింత తడవు ఆలోచించి, ద్వారక నుండి వెడలి, ఉపమన్యుని శిష్యు డయ్యెను. ఉపమన్యుని యొద్ద మంత్రదీక్షగైకొని, అతనిచే శిక్షితుడై శివుని మెప్పిం చుటకై గాఢతపస్సాధన లొనర్చెను. అంతట శివుని యను గ్రహముచే జాంబవతికి సాంబు డను పుత్రుడు కలిగెను. చూచితివా, శ్రీకృష్ణుడుసహితము పుత్రదానముకొఱకై శివుని అర్చింపవలసివచ్చెను! శివపూజావిధానము మహా భారతములో పెక్కు చోట్ల ఉదాహరింపబడియున్నది. కావుననే 'మహాభారతపు దేవుడు శ్రీకృష్ణుడుకాడు, శివుడు' అని శ్రీ వివేకానందస్వామి పలికెడివాడు.

"బత్తెపాలు నాకిష్టములేదు. అవి క్రొవ్వును వృద్ధి పఱచును. అన్నిటిలో ఆవుపాలు శ్రేష్ఠము. యుధిష్ఠిరునికి చిన్ననాటినుండి ఆవుపాలమీదను, దుర్యోధనునికి చిన్ననాటి నుండి బత్తెపాలమీదను, ప్రీతి. వారి ప్రకృతులలో ఇందు చేత ఎట్టి భేదము కలిగెనో చూడుము!

"ఎంత క్షుద్రమైన వస్తువునైనను, వ్యర్థపఱుప కూడదు. ఒక నిమ్మకాయను అవసరమైనంతకన్న లోతుగా కోసినందుకు మాలో నొకరిని శ్రీ గురుదేవుడు చీవాట్లు పెట్టిన విషయ మెఱుగుదువా! భోజనము చేసిన పళ్ళెములో అన్నము కొంచెమైనను మిగిలిపోయినయెడల, శశిమహారాజ్ (రామకృష్ణానందస్వామి) మిక్కిలి చిరాకుపడువాడు."

'క-': "అవును, నిజమే. 'ఆ మిగిలిపోయిన అన్నమును కుక్కలకు వేయరాదా' అని ఎవరైన అన్నచో, ఆయన ఆగ్రహముతో 'ఏమి! భగవంతునికి సమర్పించిన అన్నమునా కుక్కలకు వేయుట!' అని పలుకువాడు."

'మ-' వచ్చి స్వామికి నమస్కరించి కూర్చుండెను.

స్వామి: "నీ వెట్లున్నావు?"

'మ-': "మంచి ఆరోగ్యస్థితిలోనే ఉన్నాను. ఈ కాశివంటి స్థలము లేదు. దీని మహనీయతను గూర్చి నాకిన్నాళ్లును అంతగా తెలియదు. కాని కాశీఖండపఠనము చే నా అజ్ఞత విరిసిపోయినది."

'క-': "సత్యమే. కాశి వంటి స్థలము లేదు. ఇచ్చట నివసించువారి మనస్సులు స్వభావసిద్ధముగనే ప్రశాంతములై,

విశ్వనాథుని పాదారవిందములమీద నిలుచును. తెల్లవాఱు జాము మూడుగంటలు మొదలుకొని ఇచ్చట జనులు 'విశ్వనాథా' అని అఱచుచు పోవుచుందురు."

స్వామి : "అవును. ఇచ్చట నివసించుటే ఒక పారమార్థికసాధన. ప్రతిదినమును గంగాస్నానము చేసి విశ్వనాథ దర్శనము చేసికొనవలెను. కాని, దురదృష్టవశాత్తుగ నా కాలికి నొప్పి కలుగుటచే, నేను విశ్వనాథదర్శనము చేసికొనజాలకున్నాను. ఒక్కసారిమాత్రమే నేనాయన గుడికి వెళ్లితిని."

'మ-' : "అనుదినమును ఆలయదర్శనము చేసికొను అలవాటు పడుటచే, ఇప్పుడు ఒక్కనాడు తప్పినను నాకు కష్టము తోచుచున్నది."

శిష్యుడు : "ఎట్టి నిర్భాగ్యుడనో కాని, నాకు అట్లెన్నడును తోపదు. నేను దేవాలయమునకు వెళ్లినప్పుడొక శిలావిగ్రహము కనిపించునేకాని, మఱేమియు కనిపింపదు. మీవలె నన్నచ్చట ఏదియు ఆకర్షింపదు."

స్వామి : "ఏమి! ఏమనుచున్నావు? అందఱికిని 'మ-'కు వలెనే తోచును. నీకట్లేల తోపదు?"

శిష్యుడు : "తోపనిది తోచినట్లు చెప్పుటవలన ఏమి ప్రయోజనము? అనాదికాలమునుండియు స్త్రీపురుషులు విశ్వనాథదర్శనార్థము కాశికి వచ్చుచున్నారు. అది నిష్కారణముగ నుండదని నేనెఱుగుదును. కాని, నామట్టుకు నాకేమియు విశేషము తోచుటలేదు."

స్వామి : "భక్తిచే కన్నీరు కార్పనివాడు నూనె, కారము, కంటిలో నుంచుకొనియైన కన్నీరు కార్పవచ్చును. శ్రీ చైతన్యుల కాలమున ఒకడు నిజముగా అట్లొనర్చెను. శ్రీవాసుని ఇంటిలో శ్రీ చైతన్యులు సంకీర్తన మొనర్చి నప్పుడు ఎల్లరును భక్త్యుద్రేకముచే కన్నీరు కార్చిరి. ఒక్కనికిమాత్రము అట్లు కన్నీరు రాలేదు. అందుచే అతడు మిక్కిలి చింతించి, ఒకనాడు కంట కారము నుంచుకొని కీర్తనకాలమున కన్నీరుకార్చెను. శ్రీ చైతన్యులవారికి ఈ విషయము తెలిసి, అతనియొద్దకు పరుగిడిపోయి కౌగిలించు కొనిరి. అతనికి ఎంతో భక్తి ఉండినగాని, కన్నీరు రానందుకు అంతగా పరితపించియుండడని ఆయనకు తోచెను."

'క—' : "అతడు (శిష్యుడు) నిష్కపటముగా మాటాడుచున్నాడు. విశ్వనాథుడు తన మనస్సును ఆకర్షింప నందుకు అతనికికూడ పరితాపముగనే ఉన్నదని నాకు గట్టి నమ్మకము."

స్వామి : "నీకు ఆ అనుభూతి సిద్ధించును. భగవత్కృపచే అది తనంతట తానే సిద్ధించును."

అక్టోబర్, 16

'క—' అను బ్రహ్మచారి రంగూనునుండి వ్రాసిన ఉత్తరము నొకదానిని స్వామి చదువుచుండెను. కఱవు చేతను, వరదలచేతను బాధితులైనవారికొఱకై ఉపశమన కేంద్రములు స్థాపింపబడినవనియు, అందుకై నెలకొక వేయి

రూపాయలు వెచ్చింపబడుచున్నవనియు, అందు వ్రాయబడి యుండెను. ఇది కాక ఒక ఉదారపురుషుడు ఒసగిన 400 మణుగుల బియ్యముకూడ పంచిపెట్టబడుచుండెను. ఈ పని నంతయు మఱియొకరి సహాయముతో 'క-' ఒక్కడే నిర్వహింపవలసియుండెను. నూఱు చదరపుమైళ్ల విస్తీర్ణముగల ప్రదేశములో ఈ ఉపశమన కార్యము జరుపబడుచుండెను. 16,17 మైళ్ల దూరమునుండికూడ మనుష్యులు వచ్చుచుండిరి.

స్వామి : " 'ఎవరి అనుగ్రహముచేత ఇదియంతయు సాధ్యమైనదో, ఆ మహనీయుడు భౌతికశరీరముతో దీనిని చూచుట లేదే' యని 'క-' పరితపించుచున్నాడు. అతడు ప్రేమానందస్వాములవారినిగూర్చి , ఇట్లనుచున్నాడు. ఆయనయే ఇతనిని ఈ జీవితమార్గమునకు ఆకర్షించినది. 'భౌతికశరీరముతో దీనిని చూచుట లేదే' యని 'క-' చక్కగా వ్రాసినాడు. అనగా, ఆయన 'చూచుచున్నాడు, కాని భౌతిక శరీరముతో కాదు' అని యర్థము. 'క-'యొక్క పూర్వజీవిత చరిత్ర నీకేమైన తెలియునా? అతడు మిక్కిలి కార్యదక్షుడు. అంత విస్తారమగు పనిని అత డొంటరిగా నిర్వహించుచున్నాడు!"

శిష్యుడు : "అతడు మిక్కిలి శ్రమించి పనిచేయగలడు. ఏ కార్యము తలపెట్టినను భగవత్కృపచే మనకు ద్రవ్యలోపము కలుగుటలేదు. వసూలుచేయుట ఒక్కటే మనము చేయవలసిన పని. కాని ఈ పని చేయువారైనను,

చాలినంతమంది లేరు. ఎక్కడచూచినను నాకు కనిపించునది ద్రవ్యలోపము కాదు, పనిచేయుమనుష్యుల లోపమే.''

స్వామి : ''అవును. కనఖాల్ సేవాశ్రమము 150 రూపాయలమాత్రముతోనే ప్రారంభింపబడినది. శాశ్వత స్థలము పిమ్మట లభించినది. ధనికుడగు నొక వర్తకునిచే మిక్కిలి గౌరవింపబడుచున్న ఒక సాధువు అచ్చట పనిచేయు వారి నెఱిగియుండెను. ఆ వర్తకుడు ఒకసారి సాధువుయొక్క దర్శనమునకువచ్చినప్పుడు ఆ సేవాశ్రమమునకు సాహాయ్యము చేయుమని ఆయన కొంచెము సూచనగా అతనికి చెప్పెను. అందుపై అతడు పోయి చూడగా, సేవాశ్రమము స్థాపింప బడిన గుడిసెలలోనికి కోతులు ప్రవేశించి, మందులను పాడు చేయుచున్నవనియు, ఆ చెఱుపును నివారింపవలెనన్నచో, శాశ్వతగృహ మొకటి సేవాశ్రమమునకు కావలసియున్న దనియు, అతడు కనుగొనెను. శాశ్వతగృహనిర్మాణమునకు ఏ మాత్రము ద్రవ్యము కావలసియుండునో తెలుపుడని అత డడిగి వెళ్లిపోయెను. కాని ఆ పని చేయుటకు ఆలసించిరి. కావున అతడు మఱొకనాడు వచ్చి వారిని తొందరచేసెను. 'నేను గృహస్థుడను. కొంచెము ద్రవ్యదానము చేయుట కిపుడు బుద్ధికలదు. కాని ఇంటికి పోయినపిదప నా బుద్ధి మాఱవచ్చును. అట్లయ్యేనేని, నేను ఏమియు ఈయజాలక పోవుదునేమో' అని అతడు చెప్పెను. ఔషధాలయమును, పనిచేయువారి నివాసములును 6,000 రూపాయల ఖర్చుతో ఆ పిదప నిర్మింపబడెను.

"న్యాయాధిపతి యొకడు సేవాశ్రమమునకు ప్రతి మాసము పదియేనురూపాయల విలువగల ఆహారపదార్థములు పంపుచుండెను. ఆయనతో ఎవరో సేవాశ్రమ కార్యమునుగూర్చి విరుద్ధముగా మాటలాడిరి. అటుపై అత డొకనాడు హఠాత్తుగా వచ్చి తనిఖీచేసి రోగులు మిక్కిలి జాగ్రత్తతోను, అక్కఱతోను విచారింపబడుచుండుటను చూచెను. ఒక సాధువు ఒక రోగికిగల అసాధ్యవ్రణమును శుభ్రపఱచుచుండుట చూచెను. అటుపిదప తాను అట్లేల వచ్చినది వారికి తెలిపి, 'మీరు కృతార్థులు, నా ఈవికూడ కృతార్థమైనది అని నేనిప్పుడు ప్రత్యక్షముగ కనుగొంటిని' అని పలికెను.

"సేవాశ్రమము చక్కని స్థలములో నిర్మింపబడి యున్నది. దానికి ఎట్టఎదుట కాలువకు ఆవలిగట్టున హృషీకేశము కలదు. ఇచ్చట (కాశిలో) 'క–'యును, ఇతరులును నాలుగణాలుమాత్రము చేతబట్టుకొని ఈ సేవాశ్రమమును ప్రారంభించిరి.



# III*

1920, జూలై 1

ప్రసంగము శ్రీరామకృష్ణునిగూర్చి నడచుచుండెను.

స్వామి : " 'అమ్మా, నాకు కామవికారము కలిగె నేని, ఆత్మహత్య చేసికొందును' అని శ్రీరామకృష్ణుడు అంబికతో విన్నవించుకొనెను. ఏమి మహావాక్కులు! ఒక తడవ అట్టిది కలుగు సూచన ఆయనకు తోచెను. భయ కంపితుడై అంబికకడకు పరుగిడి ఆమె పాదములపై వ్రాలెను. ఆయనకు యథార్థముగ కామోద్రేకమే కలిగియుండినచో, తాను అన్నమాటను ఆయన నిస్సంశయముగ జరిపియుండు వాడు. అట్టిది ఆయన మనఃస్థితి! అన్నమాటను అక్షరాల నిర్వర్తించువాడు. అట్లు పలుకగలిగినవారికి, అట్టి మనో వికారముల నెన్నటికిని జగదీశ్వరి కలుగనీయ దని దృఢముగా నమ్మియుండుము. అట్టి మనోనిశ్చయము గలవారికి ఆదర్శ సిద్ధి అవశ్యము కలిగితీఱును. 'కామాదిదోష రహితం కురు మానసఞ్చ'—మనస్సును కామాదిదోష రహితముగా చేయుము. ఎంత అద్భుతభావము! †

"వార్ధక్యమున కామోద్రేకము కలుగుట ఎంత భయంకరము! అట్టి కోరికలు వార్ధక్యముననే అధికమగు నని చెప్పుదురు. మనోవికారము కలదుగాని ఇంద్రియ

---

* స్వామి ఈ కాలమున కాశీసేవాశ్రమమున నుండెను.

† ఇది తులసీదాసువాక్యము.

పటుత్వము తప్పినది—ఎంత దుఃస్థితి! మఱియు నిగ్రహాశక్తి కూడ ఆ కాలమున మిక్కిలి తగ్గిపోయియుండును.

"ఇంతకును కామోద్రేక మనగా నేమి? అది మానసికావస్థలలో నొకటియే కదా?"

ఒకరు : "అది ఇంద్రియసుఖములలో నొకటి అని తోచుచున్నది."

స్వామి : "దీని కేదోయొక ఆధ్యాత్మిక కారణము ఉండవలెను. అది ఏది? అది ఐక్యము సాధించుకొను కోరికయే. కాని, మానవులు తప్పుత్రోవను త్రొక్కుదురు. వారు స్థూలపదార్థముతో నారంభింతురు. కావున అత్యంత సూక్ష్మ మగు పరమపావనవస్తువును (అనగా భగవంతుని) చేరువలకును దానిని కొనిపోవజాలరు. కాని ఈ మార్గమున కూడ భగవత్సాక్షాత్కారము పొందినవారు కొందఱు కలరు. ఇందుకు ఉదాహరణముగా చండీదాసును* పేర్కొనవచ్చును. అతనినిగూర్చి నీవు తప్పక వినియుందువు. అతడు తన ప్రేయసిని గూర్చి 'చాకలిది. కాని యౌవనావస్థయందున్న రాధాదేవి యొక్క ప్రతిబింబము. కామకళంకమునే ఎఱుగనిది' అని వ్రాసెను. 'కామకళంకమునే ఎఱుగనిది' — ఎంత అద్భుతభావము! బిల్వమంగళునిగూర్చియు తులసీదాసును

---

* బెంగాలీ పద్యకావ్యమూలపురుషులలో నిత డొకడు. ఇతడు అనుసరించిన వైష్ణవసాధనలో స్త్రీలతోడి రహస్యసాంగత్యము ఆదర్శీకరింపబడి, ధ్యానమునందు పవిత్రప్రేమగా మాఱి, సాక్షాత్కారమును చేకూర్చును.

గూర్చియు నీవు వినియుందువు. భార్యకు తులసీదాసు కేవలము దాసుడు. ఆమె తల్లిగారింటికి పోయినప్పుడెల్ల ఇతడామె వెంట పోవుచుండువాడు. ఈ చర్యకు అసహ్యించుకొని ఆమె 'ఈ అనురాగములో వేయవపాలు భగవంతుని యెడ చూపినచో, నీ కాయన అవశ్యము సాక్షాత్కరించును' అని అతనితో పలికెను. వెంటనే అతని వివేకశక్తి ప్రదీపించెను. ఇట్టి మానవులు అత్యల్పకారణములచేతనే జాగ్రత్స్థితికి వత్తురు. ప్రేమయు కామాతురతయు మిక్కిలి సమీపసంబంధముగల రెండు వేర్వేఱు వస్తువులు. కావుననే శ్రీరామకృష్ణుడు 'కామాతురత గ్రుడ్డిది, ప్రేమము పవిత్రము, ప్రకాశవంతము' అని పలుకువాడు. నీ ప్రేమపదము నందు నీకు మానవభావ ముండెనేని, అది కామాతురత; దైవభావ ముండెనేని అది ప్రేమ."

ఒకరు: "కాని గోపికలు స్థూలవస్తువునే మొదట కామించినది. భగవద్భావమే వారికప్పుడు లేదు. ఇది సరికాదా?

స్వామి: "సరికాదు. భాగవతములోని గోపికా గీతికలనుబట్టి వారికి ప్రప్రథమమునుండియు భగవద్భావమే శ్రీకృష్ణునియందు ఉండెనని తెలియుచున్నది. వారిని ఆయన వెళ్లిపొండని చెప్పగా, వారు 'మా భర్తలను, తండ్రులను, బంధువులను, సఖులను, బిడ్డలను, సర్వమును విడనాడి నీ యొద్దకు వచ్చితిమి. కావున మే మిప్పు డెచ్చటికి పోగలము? సర్వమందును నీవు అంతర్యామివై యుండుట లేదా?' అని విన్నవించిరి.

"గోపికలు శ్రీకృష్ణునిపై ఏకాగ్రచిత్తతను సాధింపగలిగిరి. ఏదేని ఒక్కపదార్థముపై ఏకాగ్రత కలిగెనేని అందు భగవద్భావము గోచరించును. కామము, క్రోధము, భయము, అనురాగము: వీనిలో ఏదైనను ఏకాగ్రతను చేకూర్పగలదు. కామమునకు గోపికలును, క్రోధమునకు కంసుడును, భయమునకు శిశుపాలుడును, అనురాగమునకు యశోదయు ఉదాహరణములు.

కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృద్యమేవ చ
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే॥ *

(కామము, క్రోధము, భయము, ప్రేమ, ఒద్దిక, చెలిమి—వీనిలో దేనినిగాని భగవంతునియెడ నెల్లప్పుడును కలిగియుండువారికి ఆయనతో తన్మయత లభించుట సిద్ధము.) కాని మనస్సు పరమపారిశుద్ధ్యము కలిగియున్నగాని ఇట్టి సిద్ధి కలుగుట సాధ్యమా? కానే కాదు...

" 'ప్రేమ కలచోటనెల్ల ప్రేమపదము కూడ నొకటి ఉండితీరవలెను. ఆకలి ఉండి, దానిని తీర్చు ఆహారము లేకుండుట అసంభవము.' "

జూలై, 2

కొందఱికి వేదాంతపాఠము చెప్పుచుండిన ఒక మఠసన్న్యాసితో స్వామి మాటలాడ నారంభించెను.

స్వామి: "ఈ దినము వేదాంతపాఠము చెప్పినావా?"

---

* భాగవతము 10. 19. 15.

'అ–' : "చెప్పితిని."

స్వామి: "నేటి విషయ మేమి? 'తత్తు సమన్వయాత్'* — ఆ బ్రహ్మమును (ప్రపంచ సృష్టిస్థితిలయ కారణభూతుడగు నతనిని) శాస్త్రములమూలముననే ఎఱుగవలెను; ఏలయన వేదాంతసూత్రము లన్నిటియొక్క ముఖ్యభావ మా బ్రహ్మమే గదా!"

'అ–' : "అవును. వ్యావహారిక సత్యమును, పారమార్థిక సత్యమును గూర్చి విచారముచేసితిమి."

స్వామి: "'వ్యావహారికసత్యము' అను మాటయే 'వేడి మంచు' అనుటవలె ధ్వనించుచున్నది. అది సాంఖ్యుల భావ మని నా నమ్మకము. ప్రకృతి సత్త్వ రజ స్తమో గుణముల మూడింటియొక్క కూడిక. వీనిలోని మార్పుల వలననే సృష్టి కలుగుచున్నది. డాక్టరు 'స–' నన్నొక నాడు ఇదే ప్రశ్న అడిగెను. 'ఈ మూడు గుణములును చేరి ప్రకృతి యగునుగదా. కావున వానిలో మార్పుగలిగెనేని, ప్రకృతియొక్క స్వభావమే మాఱిపోదా?' అని అతడనెను. దానికి నే నిట్లు బదులుచెప్పితిని: 'ప్రకృతి యంతయు మాఱిపోదు. దానిలో నొక భాగముమాత్రమే మాఱును. 'మార్పుచెందిన ప్రకృతి' కాక అసలు ప్రకృతికూడ ఉండును. ఇందుకు ఒక ఉదాహరణము: ఎచ్చటనో ఒకచోట పాలు తోడుపెట్టి పెరుగుగా మార్చినయెడల, అట్లు మాఱని పాలు లోకమున ఎన్నిచోట్లనో ఉండవా? ప్రకృతిపురుషులు

* వేదాంత సూత్రములు 1-1-4.

అభిన్నులని వేదాంతము పలుకును. ఇచ్చటకూడ .(తన శరీరమును చూపుచు) ప్రకృతిపురుషులు ఒకటిగా నుండ లేదా? *

"ఒకే గింజలోకూడ రెండు బేడలు ఉండును గదా.

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు॥ †

(ప్రకృతియందు సంస్థితుడగు పురుషుడు ప్రకృతి యొక్క గుణముల ననుభవించుచుండును. ఈ గుణముల తోడి సంగమే ఆత్మ (దేవతాది) ఉత్తమజన్మములు, (పశ్వాది) అధమజన్మములు, పొందుటకు కారణము)

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైఃసహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయో ఽభిజాయతే॥ ‡

(ఎవ డిట్లు పురుషుని, గుణసహితమగు ప్రకృతిని గ్రహించునో, అత డెట్లు జీవించినను పునర్జన్మ నందడు).

"సాధన యనగా నేమి యని నీ యభిప్రాయము? అది యీ ప్రకృతిని పవిత్రీకరించుటయే కదా! కృష్ణు డొక్కడే పురుషుడు అనియు, త దితర మంతయు

---

* క్షేత్రక్షేత్రజ్ఞులుగా. శరీరమానసములు నిరంతరము మాఱు చుండును. కాని ఆత్మ ఈ మార్పులవలన నే మాత్రము మాఱక నిర్వికార ముగ నుండును.

† భగవద్గీత XIII-21.

‡ భగవద్గీత XIII-23.

ప్రకృతి* యనియు వైష్ణవులు చెప్పుదురు. 'ప్రకృతి యగువాడు మఱొక ప్రకృతిని† ఏల మాటాడింప వలె' నని చైతన్యుడు పలుకువాడు. ప్రకృతి ప్రకృతినే యాచించుట కలదా? మనకు పురుషునితో కూడిన ప్రకృతి కావలెను. మీరాబాయి బృందావనమునకు వెళ్లినప్పుడు సనాతనుని‡ చూడగోరెను. కాని ఆమె స్త్రీ అను కారణము చేత అతడు ఆమెను చూడ నంగీకరింపలేదు. అతడు మహా వైరాగ్యనిధి యని నీవు ఎఱిగియుందువు. అందుపై 'బృందా

---

* సాంఖ్యమత పరిభాషలో పురుషు డనగా ఆత్మయనియు, ప్రకృతి యనగా (విశాలార్థమున) ఈ జగత్తుయొక్క భౌతికకారణ మనియు అర్థము. పురుషుడు ఎఱుక గలవాడు, పరిణామరహితుడు, శాశ్వతుడు, అనంతసంఖ్యాకుడు, అజ్ఞతచే ప్రకృతితో నేకీభావము నూహించుకొని సుఖదుఃఖ భోక్తయగువాడు. ప్రకృతి మూఢము, నిత్యపరిణామ యుతము, శాశ్వతము. పురుషుని అనుభూతులకు ఇదియే ఆధారము. ఇవి రెండును పరస్పరస్వతంత్రములు. తన అనుభవపరిపాకదశయందు, తన కును ప్రకృతికినిగల శాశ్వత విభిన్నత పురుషునికి తెలియవచ్చును. ఇదియే కైవల్యము లేక ముక్తి.

ప్రకృతి పురుషశబ్దములకు మఱొక అర్థముకూడ కలదు—స్త్రీ పురుషులని.

† శ్రీ చైతన్యులవారు తమ శిష్యులలో నొకడగు చినహరిదాసు ఒక వృద్ధభక్తురాలియొద్దకు పోయి బియ్యము పెట్టుమని యాచించినప్పుడు వారతనిని చీవాట్లుపెట్టిన మాటలలోనివి ఇవి.

‡ ఇత డొక వైష్ణవభక్తాగ్రణి. శ్రీ చైతన్యులవారి భక్తుడు. పూర్వాశ్రమములో నితడు వంగదేశపు నవాబునొద్ద మంత్రిగా నుండెను. కాని భగవంతునికొఱకు సర్వసంగపరిత్యాగ మొనర్చెను.

వనములో ఒక్క పురుషుడు మాత్రమే కలడనియు, అతడు శ్రీకృష్ణుడనియు నే నెఱుగుదును. ఈ రెండవ పురుషు డెవ్వడో నేను చూచితీఱవలెను' అని మీరా పలికెను. వా రంతట కలిసికొనిరి. ఇరువురును మహాసాధకులు కావున వారి ఆనందమునకు మేర లేకుండెను. 'శ్రీకృష్ణుడు ఎవరి ద్వారమున తన దివ్యలీలను ప్రదర్శించునో, ఎవరినుండి నేను ఉద్భవించితినో, ఆమెవే నీవు' అను మాటలతో అతడు ఆమెకు ప్రణమిల్లెను.

"తాను గ్రంథములలో చదివినదానిని తన అనుభవముతో సరిపోల్చి చూచుచుండువానికి తప్ప ఇతరులకు వేదాంతగ్రంథావలోకనము నిష్ప్రయోజనము."

తూరుపువంగ దేశస్థుడగు ఒక యువకుడు స్వామి దర్శనముకై వచ్చి ఆయనకు నమస్కరించెను. తమ ప్రాంతపు మహాపురుషులలో నొకరియొద్ద అతడు మంత్ర దీక్షను, బ్రహ్మచర్యమును, కైకొని కడచిన పదునొకండు ఏండ్లుగా సాధన లభ్యసించుచుండెను. అతడు సాధుసాంగత్యముకొఱకును, సాధన లభ్యసించుకొఱకును ఇటీవలనే కాశికి వచ్చినవాడు.

స్వామి: (ఆగంతుకునితో) "నీయందు వైరాగ్య లక్షణములు కాన్పించుచున్నవి. కాని, అదియెట్టి వైరాగ్యము? అది యథార్థమగు వైరాగ్యమా, ఏదో యొక భావోద్రేకమూలమున కలిగిన వైరాగ్యమా? తాత్కాలికకారణములవలన కలిగిన వైరాగ్యము ఆ కారణము

నశించుటతోడనే అదృశ్యమగును. నిన్ను 'రాజకీయఖైదీ' గా ఉంచిరా?"

యువకుడు : "లేదు."

స్వామి : "ఎట్లైనను, ఈ వైరాగ్యభావము కలుగుట అదృష్టవిషయమే. వైరాగ్య మనగా నేమి? ఆత్మకును అనాత్మకును గల భేదమును విచారించుటేకదా. 'ప్రకృతి పురుషులకు గల భేదమును విచారించుట' అనియును ఈ భావమునే తెలుపవచ్చును."

"కాశిలోనే ఉండిపోవుదువా" అను ప్రశ్నకు అతడు స్థితిగతు లనుకూలించెనేని ఉండిపోవలెననియే ఉద్దేశ మని బదులు చెప్పెను.

స్వామి : "యోగ్యమును, నైతికమును అగు విధమున జీవించెనేని, మానవుడు హిందూదేశముననేకాక ఎచ్చట నైనను ఉండగలడు. 'భూలోకమంతయు భగవంతునిదే గదా. అగుచో, ఎచ్చటనేని, ఎవరికేని 'ఆటంక' మెట్లుండ గలదు? మనస్సునందు సంకోచములు గలవానికే ప్రపంచ మున ఆటంకములు కలుగుచుండును.'

"ఒక మహనీయుడు చెప్పినమాట యిది. ఆయన ఎవరైనది నీవు ఎఱుగుదువా? రంజిత్ సింగుక్రింద సైన్యాధి పతిగా పనిచేయుచుండిన హరిసింగుయొక్క మాట యిది. ఆఫ్ఘనులు పొలిమేరగ్రామములలో గడిబిల్లుచేసి, తఱుమ బడినప్పుడు పాఱిపోయి, 'ఆటక' గ్రామమునకు ఆవల

నిలుచువారు. ఆటక గ్రామమును దాటినచో హిందువులకు కులభ్రష్టత కలుగును. కావున ఆఘనులను ఎట్లు అదపులోనుంపవలెను అనునది గాఢసమస్య యయ్యెను. అట్టి స్థితియందు హరిసింగును పిలిపించి, అతని సలహా అడుగగా, అతడు పై మాటలు చెప్పెను. అతడు ఆటక గ్రామమును దాటిపోయి, పితూరీదారులను కఠినముగా శిక్షించెను. హరిసింగు వైష్ణవుడు; కాని మహాజ్ఞానికి ఉచితమగు ఈ వాక్యమును పలికెను. యోగ్యతయు, నీతియు ఉండెనేని, నీ వెచ్చట నైనను సుఖముగా జీవింపగలవు. భగవంతు డొక్కడే సత్యము. అత డొక్కడే శ్రేయస్కరుడు. లోకమున ఇంకేదియు సత్యముగాని, శ్రేయస్కరము గాని, లేదు.

"ఒక చిన్న కథ వినుము. సీతాపహరణానంతరము రామలక్ష్మణులు దండకారణ్యములో సంచరించుచుండగా, వారి కొక మనోహరప్రదేశము కానవచ్చెను. వానకాలము నాల్గు నెలలపాటు అచ్చటనే నివసింప సంకల్పించి, రాముడు 'సోదరా, పోయి ఇచ్చట నెవరైన కలరేమో చూచిరమ్ము. భూస్వామి అనుమతి లేనిది మన మిచట నివసించుటకు అధికారము లేదుగదా' అని లక్ష్మణునితో చెప్పెను. లక్ష్మణుడు ఆ అడవిలో కొంతదూరము తిరిగిచూడగా, ఒక శివాలయముమాత్రమే కానిపించెను. మానవ స్పర్శయే కానరాలేదు. అతడు తిరిగివచ్చి ఈ విషయమును అన్నకు తెలుపగా 'బళీ! ఈ స్థలమునకు శివుడే అధిపతి. ఆయన అనుమతిని కైకొనిరమ్ము' అని

చెప్పెను. అన్న ఆజ్ఞప్రకారము లక్ష్మణుడు వెళ్ళి శివుని ఆజ్ఞకై అర్థింపగా, శివలింగమునుండి ఒక దేదీప్యమాన మూర్తి బయలుదేఱి మనోహరభంగిమతో కొంతసేపు నృత్యముచేసి అదృశ్యమయ్యెను. లక్ష్మణునకు దీని అర్థమేమియు తెలియక నివ్వెఱపాటుతో అన్నయొద్దకు పోయి, జరిగిన దంతయు తెలిపెను. రాము డంతయు విని 'కుటీరము నిర్మింపుము. ఆజ్ఞ లభించినది' అని చెప్పెను. 'అది ఎట్లు' అని లక్ష్మణు డడిగెను. 'జిహ్వాచాపల్యమును, కామవికారమును, నిగ్రహింపగలిగితివేని, నీ విచ్చటనే కాదు, ఎచ్చటనైనను సుఖముగా జీవింపవచ్చును' అని రాముడు బదులు చెప్పెను.

పృథివ్యాం యాని భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।
జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యాం కిం ప్రయోజనమ్ ॥

(భూమిపైనుండు సర్వజీవులును జిహ్వయొక్కయు కామముయొక్కయు కోరికలను తీర్చుకొనజూచును. ఈ కోరికలు విసర్జించినవానికి ఈ ప్రపంచములో దేనితో నేమి పని ?)

"మన కష్ట మంతయు వీనివలననే—జిహ్వావలనను, ఉపస్థ (మర్మాంగము) వలనను. హిమాలయపర్వతములందు పారమార్థికసాధనల కర్హమగు ఏకాంత ప్రదేశములు ఎన్నియో కలవు. సాధువులు అచట ఏల స్థావరముగా ఉండరాదు ? జిహ్వాచాపల్యమువలననే. రుచిరాహారములపై గల వాంఛలే వారి నట్టి స్థలములనుండి తఱిమివైచును.

సాధువులు ప్రశాంతముగ ఏదో ఒక్క స్థలముననే ఏల ఉండ జాలరు? వారి నోరు మంచిదికాక ఇతరులతో కలహింతురు; లేక, మధురాహారములపై కోరికలు పాఱుచుండును; లేక, కామవికారము రేకెత్తుచుండును. కావున పండ్రెండేండ్ల పాటు నిశ్చలముగా, ప్రశాంతముగా, ఒకేచోట ఉండగలిగిన సాధువు 'ఆసనసిద్ధి' సాధించె నని చెప్పుదురు. పండ్రెండేండ్ల పాటు నిగ్రహము కలిగియుండుట వేడుకయా!

"కామప్రేరణలను పరిపూర్ణముగ నిగ్రహించుట అతిదుర్లభము. 'స్త్రీ మృతినొందిన, ఆమె బూడిద గాలిలో ఎగిరిపోయినప్పుడే ఆమెను స్తుతింపవచ్చును.' * దీనినిగూర్చిన కథ యొకటి కలదు. అక్బరుపాదుషా ఒకనాడు తన మంత్రి బీర్‌బల్‌ను 'మీ తల్లికి కామవికారము నశించినదేమో కనుగొని రమ్ము' అని ఆదేశించెను. ఆమె యప్పుడు ఎనుబది ఏండ్లకు పైబడిన వృద్ధురాలు. మఱియు ఇట్టి ప్రశ్న తల్లి నత డెట్లు అడుగగలడు? కాని అది పాదుషా ఆజ్ఞ! బీర్‌బల్‌కు దిక్కు తోపలేదు. చింతాక్రాంతుడై నిద్రాహారములు మానుకొనెను. ఆమె మిక్కిలి ప్రాజ్ఞురాలు—బీర్‌బల్‌ను కన్న తల్లిగదా!—కావున విషయము నంతను గ్రహించెను. అందుపై ఆమె బీర్‌బల్‌తో 'నాయనా, విచారింపవలదు. లేచి భోజనముచేసి, కొంచెము విశ్రమింపుము. నీవు దర్బారుకు పోవునప్పుడు నా ప్రత్యుత్తరమును కొనిపొమ్ము' అని చెప్పెను. అతడు దర్బారుకు పోవు సమయమున అతని

---

* ఇది వంగదేశపు సామెత.

తల్లి 'ఇరువది పెట్టెల జత్తు'* నొకటి యిచ్చి దానిని పాదుషాకు సమర్పింపు మని చెప్పెను. ఆ పెట్టెను పాదుషా తెఱచిచూచెను. దానిలో ఒక పెట్టెలో నొకటి వంతున ఎన్నియో పెట్టె లుండెను. ఏ పెట్టెలోను ఏమియు లేదు. అన్నిటికన్న లోపలిదానిలోమాత్రమే ఒకించుక బూడిద ఉండెను! జవాబుయొక్క అర్థము విస్పష్టముగనే ఉండెను గదా!

"జిహ్వోపస్థలు జయింపబడినచో కష్ట మంతయు తీఱినట్లే. శ్రీ చైతన్యులవారు కేశవభారతియొద్దకు సన్న్యాసాశ్రమార్థియై పోయినప్పుడు, 'నీవు నడి యౌవనములో నున్నావు. మిక్కిలి చక్కనివాడవుకూడ. నీ కెవ్వరు సన్న్యాసాశ్రమదీక్ష నీయ సాహసింతురు?' అని అనెను. చైతన్యులవారు ఆయన కిట్లు బదులు చెప్పిరి: 'మీరు సన్న్యాసార్థమై వచ్చినవారిని అందుల కర్హులా కారా అని పరీక్షింతురుగదా. న న్నట్లు పరీక్షించి నే నందుకు అర్హుడ నని తోచిననే సన్న్యాసదీక్ష ప్రసాదింపుడు.' భారతి 'నీ నాలుక చాపుము' అని (శ్రీ) చైతన్యుని అడిగెను. అత డట్లే చాపగా గురువు కొంచెము చక్కెరను ఆ నాలుకపై ఉంచెను. ఆ చక్కెర మొదటివలెనే ఏ మాత్రమును తడి కాక పొడిగానే ఉండి, ఊదుటతోడనే అంతయు ఎగిరి

---

* ఇది కాశీప్రాంతమున వాడుకలోనుండు ఒక ఆటవస్తువు. ఒక పెట్టెలో నొక పెట్టెగా ఇరువదిపెట్టెలు ఉండును. అన్నిటి లోపలనుండు పెట్టె బటాణీగింజంత చిన్నదిగా నుండును.

పోయెను. ఆ పిదప కామమును పరీక్షించుటకే అవసరము లేకపోయెను.

> తావజ్జితేన్ద్రియో న స్యాద్విజితాన్యేన్ద్రియః పుమాన్ ।
> న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే ॥ *

(జిహ్వనుతప్ప తక్కిన ఇంద్రియముల నన్నిటిని జయించిన వానిని జితేంద్రియు డనరాదు. జిహ్వ జయింపబడినప్పుడు సర్వమును జయింపబడినట్లే.)

"జిహ్వాచాపల్యమే నిగ్రహింపబడినప్పుడు కామము కూడ జయింపబడినట్లే. ఇంద్రియములు అన్నియు జయింప బడినప్పుడుగాని ఆధ్యాత్మికపురోగమనము సాధ్యముకాదు. భగవద్గీతయందంతటను ఈ విషయము పెక్కుతడవలు చెప్ప బడియున్నది. 'తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భర తర్షభ । పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥' (కావున అర్జునా, ఇంద్రియములను మొదట నియమింపుము. అందుచే కామ మను దుష్టభావమును నశింపజేయుదువు. ఇదియే జ్ఞానమునకును సిద్ధికిని వైరి.)

"ఒక్క ఇంద్రియము నిగ్రహింపబడకుండినను, తప స్సంతయు, సాధన లన్నియు, నిష్ప్రయోజనములగును. కుండలో ఒక్కచిల్లి యున్నచో నీరంతయు దానిలోనుండి కారిపోవునుగదా. పొలమునకు నీరుపెట్టిన కాపునుగూర్చి శ్రీరామకృష్ణుడుచెప్పిన నీతికథను ఎఱుగుదువుకదా.

---

* భాగవతము, 11-8-21.

నీరంతయు ఒక నెత్తెలోనుండి భూమిలోనికి పోయి పొలమునకు ఒక్క చుక్కయైనను పాఱలేదు!

ఇన్ద్రియాణాం హి సర్వేషాం యద్యేకం క్షరతీన్ద్రియం।
తదస్య క్షరతి ప్రజ్ఞాం దృతేః పాత్రాదివోదకమ్॥ *

(ఇంద్రియములలో నొక్కదానిని పాఱిపోనిచ్చినను, సాధకునియొక్క జ్ఞానమును అది యొక్కటియే నశింపజేయును. పగులుచూపిన తోలుతిత్తియందు నీరు నిలుచునా?)

" 'రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' (సాధకుడు భగవత్సాక్షాత్కారమును పడసినప్పుడు ఇంద్రియ విషయాసక్తికూడ అతనిని విడిచిపోవును). ఇంద్రియనిగ్రహము బలాత్కారముగా చేకూర్చుకొనుట సాధ్యముకాదు. భగవత్సాక్షాత్కారమును గాంచు మూలముననే దానిని పూర్ణముగా సాధించుకొనవచ్చును. కాని ఇందుకు ఎంతో ప్రయత్నము వలయును. ఆ పిదప అది స్వాభావిక మగును. ఐనను, ఈ విషయమున అంత నిర్భయముగా నుండరాదు. బుద్ధిమంతుడగు వేటకాడు తాను పట్టుకొన్న జింకను బంధించి పదిలపఱచి యుంచునట్లు మానవుడు ఇంద్రియ నిగ్రహము సాధించినపిమ్మట ఆ ఇంద్రియములను, మనస్సును, ఆపుదలలో నుంచుటకు ఏ మాత్రమును ఏమఱక ఎల్లప్పుడు కనుపెట్టి యుండవలెను.

"(ఆగంతుకులలోని యువకుని చూపి) ఇతడు సాధన లభ్యసింప నారంభించిన బాలుడుగా నున్నాడు. మీ కందఱ

* మను. 2-99

కును అది స్పష్టముగా ఉండలేదా? నాకది స్పష్టముగా కానిపించుచున్నది. మనస్సుయొక్క నిశ్చలత్వమునకు చూపుయొక్క నిశ్చలత్వము ఒక నిదర్శనము. మనస్సు సుస్థిర మగుటతోడనే చూపుకూడ సుస్థిర మగును. తదుపరి సాధకుని చూపులందుగాని, చలనములందుగాని, అశాంతి యుండదు.

"(యువకునితో, చిఱునగవుపూని) నీ కేమి కావల యును? సిద్ధులు కాదుగదా?

"(ఇతరులతో) 'కార్యాంతము చక్కగానున్నచో కార్య మంతయు చక్కగా జరిగినట్లే'. చివరివఱకును జాగ్రత్త పూని ఒకే విధముగ పరిశ్రమించుట మిక్కిలి కష్టము. సాధ కునికి ఒక్కొక్కసారి సిద్ధులు తమంతటతామే లభించును. కాని ఆతడు వానిపై నేమాత్రము ఆసక్తిచూపినను, అతని కథ ముగిసినట్లే. అతని పురోగమనమునకు అదియే అంతము. ఈ సిద్ధులయినను శాశ్వతముగా నిలిచియుండవు. స్వార్థ ములకై ఉపయోగించుట అటుండ, ఇతరవిధముల నుపయో గించినను, అవి అదృశ్యములగును. ఒకడు సముద్రములో గల రత్నరాశికొఱకై ఇంటినుండి బయలువెడలెను. సముద్రతీరము చేరగానే అచ్చట విధవిధములగు రంగులుగల గవ్వలను, గుండ్రనిరాళ్లను కనుగొని వానితో తన జేబులను నిండించుకొనెను. సముద్రములోని రత్నముల మాటయే మఱచెను. జగన్మాత లోకు లందఱను తన మాయచే కప్పి వైచును. తత్ఫలముగా వారు తమ ఆదర్శములను మఱతురు.

కఠోపనిషత్తులో యముడు నచికేతునకు ఇట్లు చెప్పెను: 'ఈ స్త్రీరత్నములు, ఈ రథములు, ఈ వాద్యములు మానవునికి లభ్యముకానివి. వీనిని నీ భోగార్థము ఇచ్చుచున్నాను. కాని మరణానంతరవిషయమునుగూర్చి ప్రశ్నింపకుము.' అందుకు నచికేతుడు ఇట్లు బదులుచెప్పెను: 'నీవు పేరుకొన్న భోగము లన్నియు నేడున్న రేపుండనివి. ఇంద్రియముల తేజస్సంతయు ముదిమికి బలియగును. అతి దీర్ఘజీవితము కూడ స్వల్పమే. కావున నీ అశ్వములు, నీ నృత్యగీతములు, నీవే ఉంచుకొనుము. మనుష్యుడు విత్తముచే ఎన్నటికిని తృప్తినొందడు. నీ దర్శన మబ్బినవారు విత్తము నుంచుకొనగలరా? మా జీవితము నీ యిచ్ఛ కధీనము. నేను కోరిన వరమునే నాకు ప్రసాదింపుము.'

''యముడు నచికేతు నెట్లు భ్రాంతిపఱుప చూచెనో అట్లే జగన్మాత మనల నెల్ల భ్రాంతిపఱుప జూచుచుండును. ఈ సిద్ధుల కేమి విలువ కలదు? 'చాకలి ఇతరుల బట్టలు తన యొద్ద నున్నందుకు గర్వించినట్లు ఈ సిద్ధులవిషయమై సాధకుడు గర్వించుట' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. వీని వలన నీ కేమి ఉపయోగము? అవియన్నియు భగవంతునివి. వానిని నీ ద్వారా నడువనిచ్చుచున్నాడు. అంతయే. ఇది ఏనుగును చంపి మరల బ్రతికించినవాని విషయమై శ్రీరామకృష్ణుడు చెప్పుచుండిన నీతి కథవంటిది. * (యువ

* ఒక సాధకుడు కొన్ని సిద్ధులు ఆర్జించి, అందుచే గర్వితుడయ్యెను. కాని అతడు నిష్కపటి. కావున ఈశ్వరు డతనియొద్దకు ఒక బ్రాహ్మణరూపమున వచ్చి అతని సిద్ధులను ప్రశంసించి, వానిని తనకు

కునితో) ఇట్టి తలంపులే ఉండరాదు. మనకు కావలసినది భక్తి. భక్తి యొక్కటి కలిగెనేని ఇంక ఏమి కొదువ? నారదుడు ఒక తడవ ఘోరతపస్సు చేయుచుండి ఆకాశవాణి ఇట్లు పలుకుటను వినెను: 'అన్తర్బహిర్యది హరి స్తపసా తతః కిం। నాన్తర్బహిర్యది హరి స్తపసా తతః కిమ్॥' (లోపలను బయటనుకూడ హరి నిత్యప్రసన్నుడై యుండుట నిజమైనచో, నీ వేల తపస్సు చేయవలెను? శరీరమునకు ఈ క్లేశమునెల్ల ఏల కలిగింపవలెను? ఆయన లోపలను బయటను లేనిచో ఈ తపస్సువలన ఏమి ప్రయోజనము?) అనగా, మనము భగవంతునిపై ఆధారపడి తపస్సు చేయవలెను. కాని ఈ కాలమున మన దేశమునందు తపోనిష్ఠలే అపురూపమైపోయినవి. పూర్వకాలమునందువలె గాఢతపోనిష్ఠల విషయమే ఎచ్చటను వినిపించుట లేదు. ఇదంతయు వేదాంతమును జీర్ణించుకొనజాలకపోయినందున కలిగిన ఫలము. తపశ్చర్యలు లేనిది వేదాంత సత్యములు గ్రహిం

---

చూపుమనెను. ఒక ఏనుగు ఆ దారిని నడచుచుండెను. అతడు ఆ ప్రశంసలకు ఉబ్బిపోయి కొంచెము దుమ్మును తీసికొని మంత్ర మేదియో ఉచ్చరించుచు ఆ ఏనుగుపై చల్లెను. వెంటనే ఏనుగు క్రిందపడి మృతినొందెను. దీనిని మరల సజీవ మొనర్పగలవా అని బ్రాహ్మణు డడిగెను. అదియు ఆ సాధకుడు అట్లే యొనర్చెను. ఇది అంతయు జరిగినపిమ్మట బ్రాహ్మణుడు ఇట్లనెను: "బాగుగా నున్నది. ఆ ఏనుగు చచ్చెను. మరల బ్రతికెను. నిజమే. కాని ఈ సిద్ధులచేత నీ కేమైనను పారమార్థికరూపమగు ఉపయోగము కలిగినదా?" ఈ మాటలు పలికి అతడు అంతర్ధాన మయ్యెను. సాధకునికి తెలివివచ్చెను.

చుట సాధ్యమా? 'విచారసాగరము'* అనుమాటకే ఇప్పుడు అర్థము లేదు. మాయావేదాంతులు దేశమును పాడు చేసినారు. వారు ఊరక గంభీరముగ 'అత డొకడే కలడు', 'ప్రపంచము మును పెన్నడును లేదు, ఇప్పుడును లేదు, ఇక మీదటను ఉండదు'—ఇట్టి పెద్ద పెద్ద మాటలు పలుకుదురు. ఇవన్నియు వట్టి ప్రలాపములు. ఆ మాటలలో ఏమైన అర్థము కలదా? వేదాంతము గాఢతపోనిష్ఠలవలనగాని లభ్యముకాదు."

జూలై, 3

'స–': "'యుక్తమగు విద్యయు, అనుకూల వాతావరణమును కల్పించినచో, వేర్వేఱు స్థితిగతులలో జన్మించిన బాలురు ఇరువురు ఒకే విధమున పురోగమన మొందుదురు' అను భావము ఎలిజబెత్ హేమన్సు అను నామెయొక్క కావ్య మొకదానియందు కాన్పించుచున్నది. పూర్వ సంస్కారములయందు ఆ దేశస్థులకు నమ్మకము లేదు గదా!"

స్వామి: "సరియేగాని, ఇది సర్వకాల సర్వావస్థలందును సత్యమా? ఐదుగురు బాలురు ఒకటిగా నివసించు చుండియు, అయిదు వేఱువేఱు విధములగు స్వభావములు

---

* నిశ్చలదాసుచే రచియింపబడిన ఒక ప్రసిద్ధ హిందీకావ్యము యొక్క పేరు ఇది. ఈ అద్వైతగ్రంథమును పల్లెటూళ్ళలోని సాధువులు విస్తారముగా చదువుచుందురు. కాని అపార్థము చేసికొని ఆచరణలో మిక్కిలి ఎగుడుదిగుడుగా ప్రవర్తించుచుందురు.

ప్రదర్శింతురు. పాశ్చాత్యదేశీయులు పునర్జన్మవిషయమునే ఎఱుగరు. కావున పూర్వార్జితములగు సంస్కారములు అను మాటయే వారికి అర్థముకాదు. ఎవరైనను పూర్వసంస్కార శూన్యమగు బుద్ధితో లోకమున జన్మింతురని నీవు నమ్మగలవా?''

ఈ సందర్భమున నొకరు డార్విన్‌చే ప్రతిపాదింపబడిన పరిణామసిద్ధాన్తమును పేర్కొని, అచ్చట నున్న సత్ప్రవర్తనుడగు నొక బ్రాహ్మణబాలుని (వేడుకకొఱకు) మర్కటవంశజనితుడని పలికెను.

స్వామి: ''ఏమి అవివేకప్రసంగము! ఆ బాలుడు సత్సంస్కారరాశితో జనించిన బ్రాహ్మణుడు. అతడు మర్కటవంశీయు డెట్లగును? ఈ పాశ్చాత్త్యులు ఎంత చక్కని బుద్ధికుశలతను ప్రదర్శించుచున్నారు! భౌతికశాస్త్రము నిజమునకు ఏమి కనుగొనినది? నేడు నిశ్చితార్థములుగ నిర్ణయింపబడిన సత్యములు రేపు ఎగిరిపోయి, అసత్యము లగును. డార్విన్ సిద్ధాంతములను ఒప్పుకొనదలచువారు ఒప్పుకొందురు గాక! మానవసృష్టినిగూర్చి మన శాస్త్రసిద్ధాంతములు రెండు గలవు: 84 లక్షల జన్మముల అనంతరము మానవజన్మ లభించును అనునది ఒక సిద్ధాంతము. ఇది డార్వినుసిద్ధాంతమునకు చాల పోలిక కలిగియున్నది. రెండవది, జన్మము భగవంతునియొద్దనుండి లభించుననుట. సృష్టికర్తయగు బ్రహ్మ సనత్కుమారాదులను పుట్టించి వారిని సాంసారికజీవనము సల్పుమనెను. వారు అప్పుడేగదా భగవంతుని

యొద్దనుండి అవతరించినది! కావున వా రట్లు చేయుటకు ఏ మాత్రమును అంగీకరింపలేదు. అటుపిమ్మట బ్రహ్మ ప్రజాపతులను సృష్టించెను. సాంసారిక జీవనమును నడుపుటకు వారు అంగీకరించిరి. ఇది మనము ప్రతిదినమును కాంచుచుండు విషయమే. నేడును అనేకులు వివాహమాడి సాంసారిక జీవనము నడుపుటకు ఇచ్ఛగింపనివారు గలరు. వీరే 'కుమారులు'. ఈ రెండవ సిద్ధాంతము మిక్కిలి చక్కనిది. మనము అమృతపుత్త్రులము గదా. మర్కటవంశస్థుల మెట్లగుదుము? "యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి"— బ్రహ్మమునకై వారు బ్రహ్మచర్యమును అభ్యసింతురు. హోమపక్షినిగూర్చి శ్రీరామకృష్ణుడు చెప్పుచుండిన నీతికథ నెఱుగవా? అది ఆకాశమున గ్రుడ్లుపెట్టును. ఆ గ్రుడ్లు క్రింద పడుచుండి భూమి చేరకముందే, నడుత్రోవలోనే, పిల్ల బయటికివచ్చి ఆకాశముననుండు తన తల్లిని జ్ఞప్తికి తెచ్చుకొనును. వెంటనే అది సూటిగా పైకెగురును. అది ఇక భూమిపై పడుటలేదు. అట్లే అనేకులు కొంచెము బుద్ధి వచ్చుటతోడనే ప్రపంచ సంగమునే విడనాడి, సూటిగా భగవంతుని వైపుకు దారితీయుదురు.

"(ఆ బాలునితో) నీకు సాధువ వగుట ఇష్టమా, లేక గృహస్థుడవుగనే ఉండుట ఇష్టమా?"

బాలుడు: "సాధువు నగుదును."

స్వామి: "తప్పక అట్లే కానిమ్ము. ఏలకారాదు? ఇప్పటినుండి ప్రయత్నించితివేని నీకు భగవత్సాక్షా

త్కారము తప్పక కలుగును. అతనిని చెందితీఱవలె నను దృఢసంకల్పము ఉండవలెను. ఇప్పటినుండియు నీవు పూర్ణ మగు ఇంద్రియనిగ్రహమును సాధించితివేని నీ కతని దర్శన భాగ్యము లభించును. లేక అందఱివలె గృహస్థుడవుగా నుండదలచితివేని, ఎట్లో కొంతద్రవ్య మార్జించుకొని కొంచెము కడుపుకు తిని పిల్లలతో జీవనము గడపుచు మృతి పొందుదువు. అంతటితో నీ విషయము పరిసమాప్తి. కావున ఇప్పుడు చెప్పుము : గృహస్థుడవుగా నుందువా? సాధువ వగుదువా?''

బాలుడు : ''సాధువులకు మాత్రము ప్రతిష్ఠ లేదా? వారికిని కలదు.''

స్వామి : ''సత్యము. సాధువులకును ప్రతిష్ఠ కలదు. శ్రీ వివేకానందస్వాములవారు ఎంత గౌరవము నార్జించిరో చూడుము! యోధాగ్రేసరునివలె ఆయన ప్రపంచవిజయమును సాధించెనుగదా! ఎంత ధీరమగు స్వభావము! ఎంత పరిపూర్ణమగు ఇంద్రియనిగ్రహము! అట్లు కాగలిగినయెడల మానవుడు సర్వమును సాధించినట్లే. ఆయనకు కామస్పర్శయే లేదు. ఆయనబుద్ధి ఎప్పుడును అత్యున్నతవిషయములందే నిలిచియుండుటచే, దానికి క్షుద్రవస్తువులమీదికి దిగివచ్చు అవకాశమే లేకపోయినది. సామాన్యమానవుల బుద్ధి సుషుమ్నానాడియందలి క్రింది మూడు కేంద్రములందే నిలిచియుండు ననియు, పారమార్థిక సాధకునియొక్క బుద్ధి హృదయకేంద్రమునకు ఎగసి, అచ్చటి

నుండి ఇంకను పై కెగసి, మెడయందుగల కేంద్రమునకు చేరి, చివరకు తలయందుండు కేంద్రమునకు ఎగసి, సమాధి నిమగ్న మగుననియు శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. సమాధిస్థితియందు మూడువారము లున్నచో, శరీరము పతన మొందును. బంగారు ఒక గదియందు పదిలపఱచినను, ఊచ్చుకాలువలో పాఱవేసినను, ఒకటిగనే—బంగారుగనే— ఉండుననికూడ ఆయన పలుకువాడు. శక్తి ప్రచ్ఛన్నరూపమున ఎవరియందుండునో, అట్టివానిని ఎచట నుంచినను, ఆ శక్తి వెలువడియే తీఱును.

"భగవంతునియందు విశ్వాసముంచి భక్తి ఇమ్మని అతనిని ప్రార్థింపుము.

"('స–'తో) ఇతడు శివునియొద్దనుండి పాశుపతాస్త్రము ఆర్జించుకొనవలెనని కోరుచున్నాడు.

"(బాలునితో) పాశుపతాస్త్రముతో ఏమి చేయుదువు? నీవు క్షత్రియుడవు' కాదు. బ్రాహ్మణుడవు. నీవు అతనిని మెప్పించి, బ్రహ్మజ్ఞానము నిమ్మని కోరవలెను. బ్రాహ్మణునికి అంతకన్న బలిష్ఠమగు ఆయుధము లేదు. వసిష్ఠ, విశ్వామిత్రులకథ నీ వెఱుగుదువా? విశ్వామిత్రుడు ధనుర్బాణములను పూని వసిష్ఠుని నూర్గురు పుత్త్రులను చంపి ఆయనయొక్క దివ్యగోవును * తోలుకొనిపోయెను. వసిష్ఠుడు ఇదంతయు చూచుచుండియు, తన బ్రహ్మదండమును చేత పూని ఏమియుపలుకక నిశ్చలముగా కూర్చుండియుండెను.

---

* అది అడిగినవస్తువుల నెల్ల ఈయగల కామధేనువు.

ఆ మీఁద విశ్వామిత్రుఁడు కరములు మోడ్చి వసిష్ఠుని పాదములపై పడి 'క్షత్రియపరాక్రమము తుచ్ఛమైనది. బ్రాహ్మణునికి గలదే యథార్థబలము' అని పలికెను."

ఆ బాలుఁడు సెలవుగైకొని తన సాయంకాలప్రార్థనాదు లొనర్చుటకై పోయెను. అంతట స్వామి ఇట్లనెను :

"ఈ బాలునికి అతిశ్రేష్ఠములగు పూర్వసంస్కారములు లభించినవి. అతనికి ఒకించుక రజోగుణస్పర్శ గల సత్త్వగుణము కలదు, 'అ—'కు కేవలసత్త్వగుణమే గలదు. ఈ బాలుఁడు అకలంకమగు జీవితమును గడపెనేని, మిక్కిలి అభివృద్ధి నొందును. లేనిచో, సామాన్యబాలురవలెనే తేలును. విధినిర్ణీత మైన దేదియు లేదు. ఒక విధమున సర్వము మనయత్నముమీఁదనే ఆధారపడియుండును. యోగవాసిష్ఠము దీనిని మిక్కిలి అధికముగా కొనియాడియున్నది. విధి యను మాటయే కల్లయని కాదు నేను చెప్పుట. 'దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా'—నీ స్వశక్తిచేత విధిని పరిమార్చి నీ పౌరుషమును ప్రకటింపుము. స్వయంకృషి చేయు శక్తి గలవానికి విధికూడ అనుకూలించును. ఆత్మసాహాయ్యము చేసికొనువానికి భగవత్సాహాయ్యముకూడ లభించును. విధిమీఁదనే ఆధారపడియుండువారు పలుమఱు అధోదిశాగమనము నందుదురు. ఈ స్వయంకృషిక్రిందనే స్వతంత్రేచ్ఛకూడ చేరును. తమ పొరపాటుచే తప్పులుచేసి మానవులు విధిని దూఱుదురు. త్రోవలో కుంటుపడుట అసాధారణము. చక్కఁగా నడచుటే మామూలు. తప్పులు

చేయుట ఆకస్మికసంఘటనము—క్రమక్రమముగా ఉన్నతి నొందుట సామాన్యమార్గము.''

'స–' : ''కత్తెరయొక్క రెండు వాదరలలో వస్తువు దేనివలన తెగినది మనము చెప్పజాలము. అట్లే పని యేదైన జరిగినప్పుడు అందు ఎంతవఱకు స్వయంకృషివలనను, ఎంత వఱకు విధిచేతను, జరిగినది మనము కనుగొనజాలము. కాని రెండును చేరియే సమబలముతో పనిచేసినవని మనము భావింతుము. స్వయంకృషిచేయుటే మన కర్తవ్యము. అది మన చేతిలోని పని. విధి తోడ్పడు నని కాచుకొనియుండ రాదు.''

స్వామి : ''సరిగా పలికితివి. అదియే మార్గము. అట్లు చేసినగాని ఏమియును జరుగదు. ఇదంతయు నిజమే కాని, భగవంతునిమ్రోల శరణుచొచ్చుట అనునదిగూడ యొకటి కలదుగదా. 'ఈశ్వరా, నీ ఇచ్ఛప్రకారమే జరుగు గాక!' అనుట బలహీనతాసూచకము కాదు.''

జూలై, 4.

ఆసక్తిమై వినువారితోడ గది నిండియుండెను. ఒక గృహస్థుడు వచ్చి స్వామికి చాగిలిమ్రొక్కి కూర్చుండెను. అతడు గృహస్థాశ్రమమును పరిత్యజించి సన్న్యాసమును స్వీకరింప గోరి తన సంకల్పమును స్వామికి నివేదించెను.

స్వామి : ''అనగా, అందఱిని విడనాడి వచ్చితి వన్న మాట! నీవుమాత్రము సుఖము లన్నియు అనుభవించి వచ్చి వేసితివి. కుటుంబమునకు జరుగుబాటు ఏర్పఱుపక వచ్చి

వేయుట క్రూర మనియు, పిఱికితనమనియు నీవు గ్రహింప జాలవా? గృహస్థజీవనమును హఠాత్తుగా విడనాడి వచ్చి వేయు స్వతంత్రత మానవునికి కలదనియేనా నీ భావము?''

ఆ గృహస్థుడు: ''అది కేవలము ద్వంద్వములలో చేరిన విషయముగదా—అజ్ఞానజనితము?''

స్వామి: ''నీవు ప్రపంచమునుండి పాఱిపోయివచ్చుట ద్వంద్వాతీతసత్యము కాబోలును—జ్ఞానజనితము! గృహస్థాశ్రమమున ఉండిన మాత్రముననే ఆధ్యాత్మికజీవనమునకు అడ్డు గలుగునా? నారదు డొకసారి నీ భక్తు లందఱిలో శ్రేష్ఠు డెవడని భగవంతుని అడిగెను. అందుకు భగవంతు డిట్లనెను: 'ఫలానిగ్రామములో నొక సేద్యగాడు గలడు. అతడు నా భక్తు లందఱిలో శ్రేష్ఠుడు. పోయి వానిని చూచిరమ్ము.' నారదు డచ్చటికి పోయి ఆ కాపు పొలమునకు వెళ్లెనని విని, కాచుకొని ఉండగా, చీకటిపడి అత డింటికి వచ్చి, భగవంతుని నామము ఒకసారి స్మరించి, పరుండుటకు వెళ్లెను. ఇదంతయుచూచి నారదుడు మరల వచ్చి భగవంతునితో నిట్లనెను: 'దేవా, ఇదెట్లు? అతడు—దినమంతయు క్షుద్రములగు ప్రాపంచికవ్యవహారములందు గడపి ఒక్కసారిమాత్రము నీ నామము స్మరించినవాడు—నీ భక్తు లందఱిలో శ్రేష్ఠు డెట్లగును?' అందుకు భగవంతు డిట్లు బదులు చెప్పెను: 'నీ ప్రశ్నకు కొలదికాలముననే ఉత్తరము లభించును. ఇప్పుడు ఈ గిన్నెను తీసికొని, దీని అంచువఱకును నిండుగానుండు నూనె తొనకకుండునట్లు చూచు

కొనుచు, భూప్రదక్షిణము చేసిరమ్ము.' నారదుడు అత్యంత జాగరూకతతో భూప్రదక్షిణము చేసి మరల భగవంతుని యొద్దకు వచ్చెను. అప్పుడు భగవంతు డతనిని 'సరియేకాని, ఈ భూప్రదక్షిణకాలమున నా పేరు ఎన్నిసార్లు స్మరించితివి' అని అడిగెను. నారదు డందుకు 'మీ నామస్మరణకు నా కెప్పుడు తీఱినది? నా బుద్ధి యంతయు నూనెమీఁదనే ఉండెను గదా!' అని మనవిచేసికొనెను. భగవంతు డందుపై ఇట్లనెను: 'నూనె చిందు నను భయమువలన నీవు నన్నొక్కసారి యైనను తలచుకొనకపోయితివిగదా! ఇక ఆ కాపును చూడుము. దిన మంతయు కష్టించియు ఒక్కసారి దివసాంత మున నన్ను తలచుకొనుచున్నాడు! ఇప్పుడు అతడు మహా భక్తుడని గ్రహించితివా?'

''ముఖర్జీ అనునొకడు ఇల్లు, వాకిలి విడిచిపెట్టి వచ్చి దక్షిణేశ్వర కాళికాలయద్వారమున నెప్పుడును దొరకు చుండు దానములచే కొన్నాళ్లు జీవించుచుండె నని శ్రీ రామ కృష్ణుడు చెప్పువాడు. శ్రీరామకృష్ణుడు ఒకసారి అతనిని 'నీకు వివాహమైనదిగదా, బిడ్డలు గలరా?' అని ప్రశ్నించెను. కల రని అతడు బదులు చెప్పగా, వారి నెవరు పోషించుచున్నా రని ఆయన అడిగెను. భార్య పుట్టింట కృశించుచున్న దని ముఖర్జీ చెప్పుటతోడనే, ఆయన 'నిర్భాగ్యుడా, పెండ్లిచేసికొనినది, బిడ్డలుకనునది నీవును; వారిని అన్నవస్త్రములిచ్చి పోషించునది ఆ మెతండ్రియునా? బీదలకై ఉద్దేశింపబడిన ఇచ్చటి అన్నదానము చేతనా నీవు బ్రతుకు నది?' అని తీవ్రముగా పలికెను. ఈ చీవాట్లు తిని ముఖర్జీ

ఇంటికి వెళ్ళి ఆలుబిడ్డలను జాగ్రత్తగా చూచుకొన నారంభించెను.

"శాస్త్రములు మానవజీవితములోగల నాలుగు ఆశ్రమములను పేర్కొనుచున్నవి. ఇందు మొదటిదానిలో విద్యార్థులు గురునింట బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించి విద్య నభ్యసింపవలెను. ఆ కాలమున గురుశుశ్రూష, కఠిన బ్రహ్మచర్యము, విద్యాభ్యాసము మొదలగునవి వారి కర్తవ్యములు. ఈ కర్తవ్యములు నిర్వర్తించినపిదప వారికి ఇంకే బాధ్యతయు లేదు. గురునింట విద్యాభ్యాసము పూర్తి చేసికొనిన పిదప ఆ విద్యార్థులు తాము గృహస్థాశ్రమమునకు మరల వచ్చుటకు అర్హత నార్జించిరా అని పరీక్షించుకొనువారు. ప్రాపంచికభావముల యధీనమున నున్నట్లు తోచినవారు బ్రహ్మచర్యాశ్రమాంతమున నాచరించు క్రతువు లొనర్చి గృహస్థాశ్రమమున ప్రవేశించువారు. ఈ ఆశ్రమమునకూడ వారికి పెండ్లాడుట, బిడ్డలనుకనుట, అతిథిసత్కారముచేయుట, కుటుంబమునుపోషించుట మొదలగు కర్తవ్యములు కలవు. ఈ కర్తవ్యములను నిర్వర్తించినపిదప ఆ తరువాతి యాశ్రమమును స్వీకరించు స్వేచ్ఛ వారికుండును. ఒకే వస్తువుపై ఎప్పుడును ప్రీతి ఉండదు. విషయవాంఛలు తీఱినపిదప, వానితోడనే గృహస్థాశ్రమధర్మములు కూడ తీరినపిదప, వారు అడవులకు పోయి వానప్రస్థాశ్రమమును స్వీకరించువారు. వారు భార్యలనుకూడ వారివెంట తీసికొనిపోవచ్చును. కాని అచ్చట వారితో కాముకసంబంధమేమియు లేక సోదరులవలె జీవింపవలెను.

"ఉపనిషత్తులలో మైత్రేయీ యాజ్ఞవల్క్యుల సంభాషణ మొకటి గలదు. యాజ్ఞవల్క్యుడు వివాహానంతరము క్రమమార్గమున సన్న్యాసాశ్రమదశకు వచ్చెను. అప్పు డతడు తన ఇరువురు భార్యలను పిలిచి ఇట్లు చెప్పెను: 'నేను సన్న్యాసాశ్రమము తీసికొనవలసిన తరుణము వచ్చినది. కావున నా ఆస్తి నంతయు మీ రిరువురును పంచుకొనుడు.' అంతట మైత్రేయి 'అమృతత్వమును ఈయని దానితో నా కేమి పని?' అని పలికెను. అందుపై యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో 'నిన్ను నే నిన్నాళ్లును ప్రేమించుచునే యుంటిని. ఇప్పుడు నీ మాటలు విన్న పిదప అంతకన్న ఎంతో అధికముగా ప్రేమించుచున్నాను' అని చెప్పి ఆమెకు వలయు బోధ లన్నియు చేయగా, ఆమెయు ప్రపంచజీవనమును విడనాడెను.

"కాని గృహస్థాశ్రమముపై విరక్తి జనించుటతోడనే దానిని విడనాడ దగునా? ఆలుబిడ్డలవిషయ మేమి? వారి గతి ఏమి? అది కేవలము స్వార్థపరత. గృహస్థాశ్రమము నందే యుండి, కుటుంబమును పోషించుచు, తన ధర్మముల నన్నింటిని నిర్వర్తించుచు, జీవించుటయు పారమార్థిక జీవనమే. సర్వమును హఠాత్తుగా పరిత్యజించుటవలన ఏ మాత్రమును ఉపయోగము లేదు. ఒకే గంతున ఇంటి మిద్దెపైకి ఎగురుట సాధ్యమా? ఒక్కొక్క మెట్టుగా ఎక్కవలసి యుండును గదా. 'పచ్చికాయ తెచ్చి పడవేయ ఫలము అగునా? కుళ్ళిపోవును. కురుపుపై గల చెక్కు తొందరపడి లాగివేసినయెడల, రక్తము కాఱును. కురుపు మానిన

పిమ్మట ఆ చెక్క తనంతట తానే రాలిపోవును' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. ఎంత చక్కని ఉదాహరణ ములు చూడుము! సర్వము మనస్సుపైనే ఆధారపడి యుండును. ఎవడైనను పెండ్లి చేసికొనుట తటస్థించి, ఆ పిదప పశ్చాత్తాప మొందెనేని, అట్టివానితో 'తాళుము ; ప్రపంచ మును విడనాడకుము. నీవు చిత్తశుద్ధితో వ్యవహరించు చున్నావేని, సర్వమును చక్కబడును. విధ్యుక్తమార్గము లను అనుసరించుచు జీవించుచుండుటయే నీ పని' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. ప్రపంచమును విడనాడుట నీకు మంచిది కాదు. నీకు బిడ్డలు కలరు. వారియెడ నీకుగల విధులను అస్వార్థబుద్ధితో నడుపుచుండుము. భగవంతుని కొఱకై ప్రపంచమును విడనాడుచున్నానని చెప్పుట కేవలము అసత్యముగా నుండును. ఆధ్యాత్మిక సాధనలు చేయవలసినది నిజమే. అందుకు సమయముకూడ ఇదియే......

"స్వార్థతయే అపవిత్రము. కులధర్మప్రకారమును తన ఆశ్రమధర్మప్రకారమును తన కేర్పడు విధులను ప్రథమమున నిర్వర్తించుట మనుష్యుని కర్తవ్యము. మనసు ఇట్లు పరిశుద్ధపడిన పిమ్మట అతడు అర్హుడగు గురువునొద్దకు పోయి ఆత్మజ్ఞానభిక్ష ప్రసాదింపుమని వేడుకోవలెను. తన విధ్యుక్తధర్మములను నిర్వర్తించినపిదపగాని వెలువడుత్రోవ లేదు. ఒక ఆశ్రమమునకు సంబంధించిన ధర్మములు నెఱ వేర్చుటతోడనే పిమ్మటి ఆశ్రమపు ధర్మములు తమంతట తామే పొడచూపును. కాని చిన్ననాడే ప్రపంచమును విడనాడి లౌకికజీవనమే ఎఱుగనివారి విషయము వేఱు.

'అనేకాని సహస్రాణి కుమారబ్రహ్మచారిణామ్।
దివం గతాని విప్రాణా మకృత్వా కులసన్తతిమ్॥' *

(చిన్నతనమునుండియు బ్రహ్మచారులుగా నుండిన వేనవేలమంది బ్రాహ్మణులు వంశమును నిలుపకయే స్వర్గలోకమును చేరిరి.)

"(అచ్చటనున్న సన్న్యాసులతో) మీరు ప్రపంచ జీవనములో ప్రవేశింపకపోవుట మీ పూర్వజన్మసుకృతము వలన కలిగినది. మీరు ఇదంతయు (పూర్వజన్మముననే) ముగించితిరి. ఇప్పుడు మరల ప్రపంచజీవనముతో ఏమి పని? అది అంతయు మీకు తెలిసిపోయినదిగనుకనే మీరు దానిని విడనాడితిరి. మీ పుట్టుకతోడనే మీకు ఈ భాగ్యమునకు అర్హత లభించియుండెను. లోకము ఇంద్రియభోగములకై ఎట్లు 'వెంపరలాడు' చున్నదో చూచుటలేదా? పెండ్లికై మనుష్యులు అప్పుచేయుదురు. ఆ అప్పు తీర్చుటకుమునుపే వారు మరణించుటయు కలదు. ప్రపంచమును విడనాడు భావమును తెలిపినవారందఱకును శ్రీరామకృష్ణుడు 'మీకు హృదయపూర్వకముగా ఈ భావము కలిగియున్నచో, తగు వాతావరణము ఏర్పడక తప్పదు' అని చెప్పువాడు. 'అంతయు విడనాడి వచ్చివేయుడు' అని ఆయన ఎవ్వరికిని బోధించియెఱుగడు. ప్రతివాని మనస్సులోని భావములు ఆయనకు తెలిసియేయుండెను. కావున ఆయన 'మీకు హృదయపూర్వకముగా ఈ భావము కలిగి

* మను. 5-159.

యున్నచో' అనువాడు. ఈ ప్రాపంచికవిషయము లన్నింటిలో నీ ఇచ్ఛ, భగవదిచ్ఛ, అనునవి రెండు ఉండును. కావున స్వాభావికమగు మొండితనముచే ఏ పనినైనను చేయుట తప్పు. అతడు అందఱియందును అంతర్యామియై ఉండుట నిస్సంశయము. శ్రీరామకృష్ణుడు ఒక పురుషునిపై మరులుగొన్న స్త్రీవిషయము ఒక నీతికథ చెప్పువాడు. ఆమె ఇంటి పనుల నన్నియు చేయుచుండును గాని, బుద్ధిని ప్రియుని మీదనే లగ్నమొనర్చియుండును. ఈ ప్రకారము కొన్నాళ్లు జరిగి, హృదయ మంతయు ప్రియునిమీదనే లగ్నమైపోయి నప్పుడు, ఆమె కుటుంబబంధముల నన్నిటిని విడనాడి, ప్రియుని యొద్దకు చేరును. ఈ నీతికథ మిక్కిలి మనోహరమైనది గదా! ఒక చేతితో పని చేయుము, రెండవచేతితో భగవంతుని సేవింపుము. కాలము పరిపక్వమైనప్పుడు నీవతనిని రెండు చేతులతో సేవింపగలిగియుందువు. మానవుని చిత్తము నిష్కపటమై యున్నచో, ఆ తరుణము వచ్చియేతీఱును.

"మనసు, మాట, ఒకటిగనే ఉండవలెను. మనసు అంగీకరింపని మాటలు పెదవులనుండి ఉచ్చరించుట తప్పు. మనస్సునందు ఏమి ఉన్నదో దానినే పెదవులు ఉచ్చరింపవలెను. అట్లే పెదవు లేవి ఉచ్చరించునో మనస్సునందు అదియే ఉండవలెను. పెదవి దాటిన మాటను బ్రహ్మాండము తలక్రిందులయినను జరిపియే తీఱవలెను. ఇట్లు చేయువానికి సర్వము అనుకూలమే యగుచుండును. నిన్న నీవు విధి నిర్ణయమునుగూర్చి చెప్పిన మాటలు అర్థరహితములు. ఆ మాటలు సత్యమైనచో, ప్రపంచమున నేదియు సాధింప

సాధ్యముకాదు. పుణ్యపాపములుకూడ అదృశ్యములగును. 'భక్తాగ్రేసరునియొక్క శరణాగతి విషయమున మాత్రమే విధి నిర్ణీతము' అను మాట చెల్లును. అతడు అప్రయత్నముగనే పనిచేయును. వాని ఇచ్ఛకును, భగవదిచ్ఛకును భిన్నత యుండదు. కాని దీనికిని ఒక తార్కాణము కలదు—దుష్ట కార్య మేదియును అతడు చేయజాలడు. అతడు తప్పటడుగు వేయనేవేయడు. 'మానవుడు తన మనస్సుయొక్క సాహాయ్యముతో తన ఆత్మను ఉద్ధరించుకొనవలెను. మనస్సును హీనస్థితికి తెచ్చుకోరాదు. అతనికి మనస్సే బంధువు; మనస్సే శత్రువు. ఎవని మనస్సు జ్ఞానవిజ్ఞానములచేత తృప్తి నొందునో, జితేంద్రియత్వము సాధించి నిర్వికారుడై యెవ్వడుండునో, ఎవడు మట్టిపెళ్లను, రాతిని, బంగారమును, సమముగా చూచునో, అట్టివానినే యోగారూఢుడైన యోగిగా పరిగణింతురు.' *

" 'అమ్మా, వీరికి జ్ఞానతేజము కలుగుగాక ! వీరికి తమ యథార్థతత్త్వము గోచరించుగాక !' అనునదియే శ్రీరామకృష్ణుడు చేయు ఆశీర్వాదము. ఆ కాలమున రాఖాల్ మహారాజ్ (బ్రహ్మానందస్వామి) ఆయనతోకూడ నివసించుచుండువాడు. అతనియొక్క బంధువులే అతనిని శ్రీ గురుదేవుని యొద్దకు పిలుచుకొని వచ్చినది. కాని అతడు సన్న్యసించు బుద్ధిని చూపినప్పుడు వారికి కష్టముతోచినది. వారు అంతట మొదట శ్రీరామకృష్ణునితో మాటలాడి

---

* గీత VI-6,8.

చూచిరి. కాని ఆయన ఆ మాటల నంతగా సరకుచేయ లేదు. శ్రీరామకృష్ణుని పరివేష్టించియుండు శిష్యగణము యొక్క సౌకర్యార్థమై సురేశబాబు కొంత ధనము నిచ్చు వాడు. శ్రీరామకృష్ణుని భక్తుడును, రాఖాల్ మహారాజ్ యొక్క బంధువును, అగు మనోమోహనుడు ఒకనాడు 'రాఖాల్ ఇచట నుండుట సురేశబాబుకు ఇష్టములేదు' అని పలికెను. ఈ మాటలు విని శ్రీరామకృష్ణుడు బిగ్గరగా యిట్లనెను : 'ఎవరక్కడ! ఈ సురేశు డెవడు? అతనికి ఇచ్చట ఏమిపని? ఆ పలుపు మున్నగువానిని వెంటనే ఇచ్చటనుండి తీసివేయుము. (గురుదేవునకు ఉద్రేకము కలిగి నప్పుడు అందఱును భయకంపితు లగుదురు. సమీపింప నెవరును సాహసింపరు.) ఈ బాలురకు కొన్ని పారమార్థిక సూచకములగు శుభలక్షణము లుండుటచే వారిని ఇచటికి చేరనిచ్చుచున్నాను. వారిని అనుగ్రహించి పారమార్థికసిద్ధిని కలిగింపుమని జగన్మాతను ప్రార్థించుచుందును. మొదట వారు ఆత్మసాక్షాత్కారము నొంది ఆ పిదప తమ ఇచ్ఛ వచ్చినచోట ఉందురుగాక యని నా కోరిక.' ఈ మాటలు విని సురేశబాబు కన్నీరు కార్చుచు ఆయన పాదములపై వ్రాలి, తా నట్టి మాటల నెన్నడును పలుకలేదనియు, అవి యన్నియు కేవలము అసత్యము లనియు విన్నవించుకొనెను.

"నీవు ఇప్పుడు ప్రపంచముయొక్క యథార్థ స్వభావము నెఱుగనందువలన క్రమక్రమముగా అధోగమనము నందుచున్నావు. మొదట దానిని గ్రహింపుము, పిదప దాని

యందు నివసింపుము. అప్పుడు నిన్నది బంధింపజాలదు. ప్రపంచము నిజముగా దుష్టమా? నీ కష్టమున కంతటికిని కారణము దాని స్వభావమును నీవు గ్రహింపకుండుటయే. ఎచ్చటికి పాఱిపోవలెనని నీ ఉద్దేశము? అట్లు చేసినచో, నీవు ఉభయభ్రష్టుడ వగుదువు. నీ కప్పుడు భగవంతుడుగాని ప్రపంచముగాని దక్కదు. విశ్వామిత్రుడు దశరథునొద్దకు వచ్చి, తన వెంట రాముని పంపుమని అడిగినప్పుడు, దశరథుడు 'రాముడు దినదినమునకును చిక్కిపోవుచున్నాడు. వైరాగ్యము అతనికి పైకొనుచున్నట్లున్నది. ఇట్టి స్థితియందు అతనిని రాక్షసులతో పోరాడుటకు మీ వెంట పంపు టెట్లు?' అని పలికె నని యోగవాసిష్ఠములో నున్నది. రాజు పిలిపింపగా రాముడు ఆస్థానమునకు వచ్చి, ఎల్లరకు నమస్కరించి, కూర్చుండెను. విశ్వామిత్రు డతనితో ఇట్లు చెప్పెను: 'రామా, నీకు వైరాగ్యము కలిగినచో, అది సంతసింపవలసిన విషయము. అది సామాన్యులకు లభించునది కాదు గదా. కాని నీవు దినదినమునకును చిక్కిపోవుచు, విషాదము నొందుచు, ఉండుటకు కారణ మేమియో చెప్పుము. అందు విషాదకారణ మేమియు లేదు.' పిదప రాముని హృదయాంతరాళమున నుండు భావములను గ్రహించి, విశ్వామిత్రుడు వసిష్ఠునితో ఇట్లనెను: 'మన కలహము పిదప బ్రహ్మదేవుడు మన ఇరువురకును సలిపిన బోధను రామునికి చెందజేయుము. అప్పు డతడు సత్యమును గ్రహించి ప్రపంచమునందే నివసింప నిచ్ఛగించును.'

"'బంగారుగా మారితి అపరిశుభ్ర ప్రదేశమందున్నను నీవు బంగారుగనే ఉందువు. కావున బంగారుగా మారుము' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు.

"ప్రాపంచిక జీవనమునందు విజయము సాధింపలేదు అను కారణముచేత లోకమును విడనాడుట తప్పు. జనులు కొందఱు నిద్రనుండి మేలుకొందురుగాని మరల వెంటనే నిదురింతురు. 'నిజముగా నిద్రించుచున్నవానిని లేపుట సాధ్యము; కాని నిద్ర నభినయించుచుండువానిని లేపుట అసాధ్యము.'

"సత్యదృష్టితో చూడగా పారమార్థికసిద్ధి నొందుటకు విస్తారమగుకాలము పట్టదు. కాని మానవుని పట్టుదలకు సడలిపోవు స్వభావము అధికము. పూర్వసంస్కారము లాతనిని లొంగదీయుటే ఇందుకు కారణము. పని నెఱవేర్చుటయో, ఆ ప్రయత్నమున మరణించుటయో, గమ్యముగా నుంచుకొని మానవుడు తన యావచ్ఛక్తిని మేలుకొలిపి ఉద్యమమునకు కడంగవలెను. ఒక డొక స్త్రీనిగూర్చి కలగాంచుచుండవచ్చును. కాని తద్వ్యతిరేక భావములు పూర్ణశక్తిమంతములై మనస్సునాక్రమించియుండుటచే, అతనికి ఆ కలలోనే (తనచర్యకై) కోపము రావచ్చును. ఆ కలలో కూడ అతని జాగ్రత్త పూర్తిగా నశింపలేదు. మనము కేవలము యంత్రతుల్యులముకాము. సర్వకాలసర్వావస్థలయందును మనము జాగ్రత్త కలిగియుండగలము. మానవునకు సిద్ధి లభించునా, లభింపదా అనునది అతనికి గల పట్టుదలపై ఆధారపడియుండును. అదియే అందుకు ప్రమాణము.

"నీకు నీవే సాక్షివి. జరిగిపోయిన తప్పులనుగుఱించి చింతించుచుండవలదు. 'అట్లికమీఁదట ప్రవర్తింపను' అని పలుకుము. ఆ మాటను జరుపుకొని, ఆ పూర్వరీతిగా ప్రవర్తించుట మానితివేని, నీ ప్రయత్నము సిద్ధించినట్లే. 'ఒక జీవన విధానము చెడ్డదని మనస్సునకు గట్టిగా తోఁచినచో, అట్లు నడచినందుకు మనఃపూర్తిగా పశ్చాత్తాపమొంది, మరల దుష్టకార్యములు చేయకుండవలెను.' దుష్టకార్యములయెడ అసహ్యత కలుగ నారంభించినప్పుడు, వానిని చేయకూడదని గట్టిగా నిశ్చయించుకొనవలెను. ఆ పిదప అవి మరల చేయు తలంపు అతనియందు కలుగదు. నిశ్చితబుద్ధితో మనోబలము నంతయు వినియోగించి, 'ఇక నెప్పటికిని ఇట్లు చేయను' అని పలుకవలెను. ఇప్పటికి చేసిన పాపములకై పశ్చాత్తాపమొంది, మరల వానినే సల్పుచుండుట నిష్ప్రయోజనమార్గము. నియమబద్ధముకాని కార్యవిధానమును శ్రీరామకృష్ణుడు ఖండించువాడు. శ్రీ వివేకానందస్వామిని గూర్చి ఆయన 'అతని దెంత ధీరబుద్ధియో చూడుము, దేనిమీఁదనైనను బుద్ధి నిలిపెనేని, అది చేయుటకు పరిపూర్ణశక్తి సామర్థ్యములు వినియోగించును' అని అనువాడు. స్థితిగతులు అనుకూలముగా నుండవచ్చును, ప్రతికూలముగా నుండవచ్చును. కాని అవి ఎట్లున్న ఎవరి కేమి? కార్యసాధనకు మనము సర్వశక్తిని వినియోగింపవలెను. 'ఏమైననుకానీ, అది చేసితీఱుదును' అను నిశ్చయబుద్ధితో కార్యమును చేయఁబూనుకొంటివేని, ప్రథమమున అనుల్లంఘ్యములుగా తోఁచు విఘ్నములుకూడ చివరకు సహాయకారులుగా

పరిణమించును. కాని ప్రయత్నమునుమాత్రము మనః పూర్తిగా, నిష్కపటముగా, చేయవలెను. ఎవ్వరికిగాని స్థితిగతులు సర్వకాలములందును అనుకూలించియే ఉండునా? నీవు చేయవలసిన పనిని అవశ్యకర్తవ్యముగా భావించి కార్యారంభుడ వగుము. నీవు సర్వదా అక్షయుడవును, అమృతుడవును కాదా? అగుచో నీవు అనుకూలస్థితిగతులకై వేచియుండు టేల? ఈ అఖిలమును నీలోనుండి నీవే వెలి జిమ్మితివి.

> య ఇచ్ఛతి హరిం స్మర్తుం వ్యాపారాన్తగతైరపి।
> సముద్రే శాన్తకల్లోలే స్నాతు మిచ్ఛతి దుర్మతిః ॥

(తన కున్న పను లన్నియు తీఱిన పిమ్మట భగవంతుని స్మరింపగోరువాడు సముద్రములోని అల లన్నియు శాంతించిన పిమ్మట స్నానముచేయ గోరుమూఢుని వంటివాడు.)

"సముద్రస్నానము చేయగోరువాడు అలలు శాంతించువఱకు వేచియుండెనేని, సర్వదా అట్లు వేచియే యుండవలెను! ఎంత మూఢత! అట్టి తరుణము ఎన్నటికైనను వచ్చునా! అట్లు చేయుటకు బదులు అలల నెదుర్కొని పోరాడి స్నానము చేసి రావలెను. సముద్రము ఎప్పుడును ఒకే విధముగా నుండును. కావున ఈ ప్రపంచమునందు ఈ కల్లోలమధ్యముననే నీవు భగవంతుని ధ్యానించుటకు అవకాశము కల్పించుకొనవలెను. అనుకూలతరుణముకై వేచి యుండుట వెఱ్ఱి. ఈ క్షణముననే ఆపనిని చూడవలెను. తప్పినచో, ఎప్పటికిని లేదు! పూర్ణప్రయత్నధూర్వహుడవు

కమ్ము. ప్రతికూలవిషయము లన్నియు అనుకూలముగా పరిణమించును.

"'జగన్మాతృ పాదారవిందములందు నివసింప నపేక్షింతువేని ప్రాపంచిక సుఖవాంఛలు వీడుము......కర్మాచరణమునందు అజ్ఞత నేల ప్రదర్శింపవలెను? పూర్ణ ప్రయత్నముచేయుము, మహాఫలము సిద్ధించును' అని రామప్రసాదుడు తనకుతానే బోధించుకొనెను.

"ఎంత మనోహరముగ పలికినాడు! నీ కర్తవ్యము లన్నియు నిర్వహించుటకు నీకు స్వాతంత్రత లేదు, తీఱిక యును ఉండరాదు. నీవు చేయక నిలిపియుంచిన కార్యము నీకొఱకై వేచియుండును—మరల అది పొడచూపియే తీఱును. మృగము నెదుర్కొనుము! పాఱిపోవుట నిష్ప్రయోజనము. అందుచే నిన్ను నీవు రక్షించుకొనజాలవు. సన్న్యసించుట అనుకూలము; సాంసారిక జీవనముచేయుట ప్రతికూలము: ఇట్టి ఆలోచనలు వ్యర్థములు. పూర్వాశ్రమ ధర్మముల నన్నింటిని నిర్వహించినగాని పిమ్మటి ఆశ్రమము నకు రాజాలవు. ఇప్పటి కర్తవ్యములలో దేనియెడలను, ఎన్నడును, ఏమాత్రమును అశ్రద్ధ చూపవలదు. కాని ఇంకను ఉత్తమములగు విషయములపై బుద్ధిని నిలుపుము. పసితనమునుండియు బ్రహ్మచర్యజీవనమునే సలుపుచుండువారి విషయము వేఱు. వారి సంస్కారములు అత్యుత్తమములు. కనుక వారు ప్రపంచమునందే యున్నను, సన్న్యాసబుద్ధి కలిగియుందురు. నీవు ఇప్పు డున్న స్థితిలోనుండి హఠాత్తుగా

ఒక్కగంతు వైచి ఉత్తమస్థితికి చేరజాలవు. ప్రస్తుతస్థితి తోడనే నీ విప్పటికి తృప్తిపడి యుండవలెను. దానిని తప్పించు కొనజూచుట యుక్తముకాదు, సాధ్యముకూడ కాదు. ఇచ్చట నీకుగల కర్తవ్యముల నన్నిటిని నిర్వహించుచునే సర్వదా భగవంతునిగూర్చి తలంచుచుండుము. ఇంటిపను లన్నియు చక్కగా చేసికొనుచునే, బుద్ధినిమాత్రము ఎల్లప్పు డును తన ప్రియునిమీదనే నిలిపియుంచు స్త్రీ యిందుకు నిద ర్శనము. భగవంతునియెడ సుస్థిరభక్తికొఱకై నిండు మనసుతో ప్రార్థింపవలెను. అర్హత నార్జించుకొనుటకై సాధువుల సాహచర్యము కలిగియుండుట, అప్పుడప్పుడు ఏకాంతనివాసము చేయుట, ముఖ్యము. నిండు మనసుతో ప్రయత్నముచేయువానికి భగవంతుడే కార్యసిద్ధి మార్గమును కల్పించును. నీ అకలంకబుద్ధిని భగవంతునికి సమర్పింప వలెను. వెన్నను మొదట చిలికి తీసినగాని అది నీటిలో కలియక నిలిచియుండదు. సాధువుయొక్క ఘనతకు తార్కా ణము అతడు చేసికొన్న ఆత్మపరీక్షయు, తన స్వభావములోని లోగుట్టుల నన్నింటిని అతడు పరిపూర్తిగా గ్రహించియుండు టయును. ఆత్మపరీక్ష మిక్కిలి దుర్లభకార్యము. మనసు చేయు వంచనల నన్నింటిని గ్రహించుట మిక్కిలి కష్టము. ఈశ్వరా, నీవెంత మహనీయుడవు!"

జూలై, 5

నేడు కొంచెము చినుకులు పడుచున్నవి. కాని వేడి మాత్రము దుస్సహాముగా నున్నది.

స్వామి : "ఈ వసారాలో నిదురించుట మిక్కిలి కష్టము. గాలి అను మాటయే లేదు. ('అ–' తో) ఈ అగచాట్లన్నియు పడుటవలన ఫలమేమి? ఈ శరీరపు సుఖమునకై వారు ఇంత శ్రమపడుచున్నారు. కాని దాని కేమైన సుగుణము కలిగినదా? 'శరీరం క్షణభఙ్గురమ్.' "

సేవాసంఘములోని అనాథశరణాలయమును గూర్చియు, అచ్చటి బాలురయొక్క చదువునుగూర్చియు, ప్రస్తావము వచ్చినది.

స్వామి : "సేవాశ్రమభావము దేశముయొక్క మనస్సున కెక్కినది. ఎన్ని సేవాసమితులు నిర్మింపబడుచున్నవో చూచుటలేదా! ఇక మనము వైదొలగి వెనుకనిలిచి యుండవచ్చును. దీనినిగూర్చి శారదానందస్వామితో మాటలాడితిని. విద్యావిషయమున మన మింతవఱకు ఏమియును చేయగలిగియుండలేదు. ఈ కార్యము నిప్పుడు కైకొనవలెను."

స్వామి'అ–' : "విద్యార్థివసతిగృహముయొక్క వసారాలో మనము పాఠములు చెప్ప నారంభింపవచ్చును. కాని ఇం దొక చిక్కుగలదు. ఇచ్చట జీతములుగాని, జరిమానాలుగాని, కట్ట నవసరములేదని విద్యార్థులకు తెలియుటతోడనే తమ అభివృద్ధివిషయమే వారు మఱచి, పాఠములకై వచ్చుటలో మిక్కిలి అశ్రద్ధ చేయుదురు."

స్వామి : "వారిని హెచ్చరింపవలెను; అవసరమైనచో తఱిమివేయవలెను. 'ద–' బాబుకు కూడ అట్టి బడి

యొకటి ప్రారంభింపవలెనని కోరికగా నున్నది. '—' ఇందుకై కొంత భూమి నీయ వాగ్దానముచేసినాడు. ఇప్పటికే బాలికా పాఠశాల స్థాపించినాడు. బాలురబడికి అర్హులగు ఉపాధ్యాయులు అతనికి లభింపకున్నారు.

"నిజముగా సామర్థ్యముగల ఉపాధ్యాయులు నాకెవరును కాన్పింపలేదు. పట్టభద్రు లనేకులు కలరు గాని, వారియందు సముచితభావము ఏకోశమునను లేదు. వారందఱికి కలసివచ్చు నిందావాక్యము నాడుట నాకిష్టము లేదు, గాని అనేకులు కొంచెము శ్రద్ధావిహీనులై యున్నారని మాత్రము చెప్పెదను. వారి అభిప్రాయము 'ఇల్లు విడిచి పెట్టి వచ్చితిమిగదా, ఇక మనమెట్లైనను పని తప్పించుకొనుచుండవలెను' అని. వారి కీయబడిన కొద్దిపనిని ఎట్లో చేయుదురుగాని, అంతకుమించి అణుమాత్రమైనను చేయరు. ఇవన్నియు వివేకానందస్వామి భావములు కాని, శ్రీరామకృష్ణునిభావములు కావని పలుకువారు కలరు. ఎంత విపరీత వాక్కులు! స్వామిజీ భావములును శ్రీరామకృష్ణునిభావములును భిన్నము లట! ఎవరికైనను సందేహము లుండెనేని, బయటపడి అడిగి, వాని నేల తీర్చుకొనగూడదు? చర్చలందు ఎప్పుడును గుణముగలదు.

"'—' ను నీ వెఱుగుదువా? అతని యభిప్రాయము కూడ ఇదియే. నేను తీవ్రవ్యాధిగ్రస్తుడనై కలకత్తాలో శ్రీ మాతృదేవిగృహమున నున్నప్పుడు అతనితో ఈ విషయమునుగూర్చి దీర్ఘచర్చలు చేయుచుంటిని. 'మనము

మొదట ఆలోచించి, సత్యము కనుగొని, అటుపిమ్మట కార్యారంభుల మగుదము' అని అతడు పలుకువాడు.

"'నేను జపధ్యానముల నభ్యసింతును' అని ప్రతి వాడును పలుకును. కాని ఎవ్వరైనను అవి నిజముగ చేయుదురా? పారమార్థికసిద్ధి నొందుటకు ఇది యొకటే మార్గమని వారికి నమ్మిక లేదు. ఈ సంప్రదాయములో నుండియు, తద్విధేయమార్గము నంగీకరింపకుండుట మిక్కిలి తప్పు. విధేయమార్గ మేది యని మొదటనే చూడవలెను. సేవా సంఘములో నుండుటచే కలుగు లాభము లన్నియు వారికి కావలెను; కాని అందలి విధేయమార్గములు వారికి గిట్టవు! 'నేను లోకసేవచేయుటకు వేయిమాఱులైనను జన్మింతును' అను వివేకానందస్వామియొక్క భావమే మన సేవాసంఘము యొక్క మతము. ఈ మతమును అంగీకరింపనివారు ఈ సంస్థలో ఏల ఉండవలయును? సన్న్యాసులు ఎందఱు లేరు! వారివలెనే వీరును భిక్షాటనముచేసి ధ్యానము చేయుచుందురు గాక!"

జూలై, 6

స్వామి వసారాలో కూర్చుండియుండెను. ఆయన చుట్టును బ్రహ్మచారులు, సన్న్యాసులు కూర్చుండియుండిరి.

స్వామి: "ఎంత దుష్టసంస్కారములు గలవాడైనను, సాధుసంగముచే వృద్ధికివచ్చును. అత్తరు దుకాణమునకు పోయినయెడల ఆ వాసన నీ కిష్టమున్నను, లేకపోయినను

నీ ముక్కులలోనికి పోవునుగదా. జనులబుద్ధి సాధుసంగముపై అంతగా పోదు. అట్టి సంగమున వసించు శక్తియు అనేకుల కుండదు. శ్రీరామకృష్ణుడు ప్రసంగించుచుండగా, భక్తులు ఆలకించుచుందురు. కాని ఆ భక్తుల వెంటవచ్చిన వారు 'పోదము రండు, ఎంతసేపు ఈ వినుట!' అని గుసగుసలాడుచుందురు. భక్తులు అప్పటికిని ఆలకించుచునే కూర్చుందురు. కాని వారి మిత్రులు విసిగి చిరాకుతో 'సరి! మీరిక్కడనే యుండుడు. మేముపోయి పడవలో కూర్చుండి మీకై వేచియుందుము' అని పలుకుదురు. ఈ విషయమును శ్రీరామకృష్ణుడు ఎంత మనోహరముగా వర్ణించువాడు!

"సాధుసంసర్గముచే శ్రేయస్సు చేకూరక తప్పదు. సజీవవస్తువేగదా జీవశక్తిని ఇతరుల కీయగలదు? గుండ్రని పదార్థమునుండితప్ప గుండ్రని నీడ కలుగదు గదా. సజీవ వస్తువునుండి ఉత్పత్తియగునంత ఫలము వ్రాతలోనుండి కలుగ జాలదు. ఉపన్యాసమును వినుటకును, చదువుటకును, ఎంత అపారభేదము కలదు! వ్రాతలోకూడ ఎంత ప్రాణము ఉంచిన అంత బలము దానికి చేకూరును. వివేకానందస్వామి యొక్క వ్రాతలకును తక్కినస్వాములయొక్క వ్రాతలకును ఉండు తారతమ్యమును పరికింపుము. మూర్తిమత్త్వమే ప్రధానవిషయము! ఈ ప్రపంచమునకు మార్గదర్శకులై యుండువారు కొలదిమందిమాత్రమే. తక్కినవా రందఱును గొఱ్ఱెదాటుగా వారి ననుసరింతురు. ప్రపంచపర్యటనానంతరము వివేకానందస్వామి మరలివచ్చినప్పుడు ఇట్లనెను:

'ప్రజాస్వామ్యపరిపాలన మను మాట కల్ల. అంతటను పరి పాలనాకార్యము కొలదిమంది చేతులలోనే ఉండును.'

"తన పని నిర్వహించుదక్షత గలవారి నుత్పత్తి చేయని దేశము నాశమొందును. మనది పారమార్థికబుద్ధి గల దేశము. ఇందు ప్రథమమునుండియు సిద్ధపురుషులు జన్మించుచున్నారు. మనదేశచరిత్రములో ఇట్లు జరుగని కాలము నొక్కదానినైనను చూపుము. ఒక్కని జీవితము వేనవేలమందిని ఉజ్జీవింపజేయుచున్నది—అదియును శతాబ్దములపాటు! నానక్‌ను చూడుడు! కబీరును చూడుడు! ఈ 'సంయుక్తరాష్ట్రముల'పై * ఎంతకాలముగా తులసీదాసు యొక్క ప్రాభవము చెల్లుచున్నదో చూడుడు!

"ఇటీవలనే వైధవ్యమొందిన యొక స్త్రీ నేడిచ్చటికి వచ్చెను. ఆమెతో నేను శ్రీరామకృష్ణునిగూర్చి మాట లాడితిని. ఆమెబంధువులు ప్రేమానందస్వామిని వారి యూ రికిరమ్మని ఆహ్వానించి యుండిరి. ఆమె పెనిమిటియొక్క సోద రుడు పట్టభద్రుడు. వారి గ్రామములో నత డొక బడిని నడు పుచున్నాడు. అతడు ధనముకై కాక కేవలము ఉదారబుద్ధితో పనిచేయువాడు. దేశములో నొక క్రొత్త బుద్ధి ఉత్పత్తి యైనది. దీని ఫలము కాన్పించుటకు కొంతకాలము పట్టు ననుట నిజమే కాని, తన్మూలముగా దేశమునందు ఒక సంచలన మిప్పుడే ప్రారంభించినది. ఇప్పటియంత నిర్భయ ముగా మాటలాడు వాడుక మునుపు లేదు."

---

* ఈ కాలపు "ఉత్తర ప్రదేశము."

జూలై, 8

స్వామి: "దుష్టశక్తి యొకటి మనస్సుపై అధికారము చెల్లించుకొన నారంభించెనేని, దాని బారినుండి తప్పించు కొనుట దుర్లభము. సుశీలత శ్రేయస్కర మనియు, దుశ్శీలత నాశనహేతువనియు, యువకులు గ్రహించినచో, ఆ పిదప వారు వివాహమాడి ఉత్తమపౌరులు కాగలరు. సౌశీల్యమే పారమార్థికతకు మూలాధారము; కావున పార మార్థికబుద్ధి గలవారు దుష్టమార్గములలో కూలు నవకాశ ముండదు. సౌశీల్యముగలవారికి తప్ప ఇతరులకు మనఃస్థైర్య ముండదు. 'శరీరము మహాభూతకల్పితము. అది బుద్ధి యొక్క పరిపాలనములో నుండును. చిత్తమునందు కలత కలిగెనేని, ఆభూతములు నశించును. కావున దానిని జాగ్ర త్తగా కాపాడవలెను. సుస్థిరముగానుండు చిత్తమువలననే ఉత్తమమగు గ్రహణశక్తి కలుగును.' *

"మనశరీరములోని అత్యుత్తమపదార్థము సౌశీల్య ముచే పోషిత మవును. సౌశీల్యములేనిచో చిత్తము కలక బారును. అప్పు డందు ఇష్టదైవము స్పష్టముగా ప్రతిబిం బింపడు. 'అద్దమునకు పూసియుండు పాదరసపుపూత చక్కగా నుండెనేని, ఆ అద్దమునందు ప్రతిబింబము చక్కగా నుండును. కాని అం దేమైనను మధ్య సందులున్నచో ప్రతి బింబము చక్కగా నుండదు' అని శ్రీరామకృష్ణుడు చెప్పెడి వాడు. చిత్త మనగా నేమి? చింతనము ఉత్పత్తియగుచోటు.

* వివేకచూడామణి.

అందే, అచ్చటనే, బాహ్యాస్పర్శ ప్రథమమున ప్రవేశించును. కావున చింతనమున 'కుత్ప్రత్తిస్థానమే కలతనొందినచో, ధ్యానము అసాధ్య మగుననుట స్పష్టము. మనము 'చిత్తము, మనస్సు, బుద్ధి' అని చదువుచుందుము, కాని అందు ఏదేది ఏదైనది కనుగొనుటకు అగాధమగు అంతరవలోకనము అవసరము. చిత్తము దుష్టసంస్కారమయమై యుండినచో ఇది కష్టసాధ్యము. కావుననే భగవానుడు గీతలో ఇట్లు చెప్పి యున్నాడు :

తస్మాత్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥

(కావున అర్జునా, ఇంద్రియములను ప్రథమము నుండియు నిగ్రహింపవలెను. జ్ఞానవిజ్ఞానములను నశింపజేయునట్టి ఈ పాపపదార్థమును—కామమును—పరిమార్చుము) ఇది (కామము) ఎంత ఘోరమగు దురితమో చూడుడు.

" 'కావున బాహ్యాగమనముగల మన మనస్సు ఏ మాత్రము ఆదర్శమునుండి తొలగింపబడినను, అది మెట్ల వరుసకు పై భాగమున జాఱవిడువబడిన బంతి ఎట్లు ఒక మెట్టు నుండి మఱియొక మెట్టుపైకి దుమికి దుమికి క్రిందికి పడిపోవునో అట్లే ఈ మనస్సుకూడ క్రమపతన మందును!' * అట్టడుగును చేరువఱకది యట్లు పతన మందుచునే ఉండును."

ప్రశ్న : "పంద్రెండేండ్లు నిరంతరాయముగ బ్రహ్మచర్యమభ్యసించుచున్నచో బ్రహ్మజ్ఞానము అలవడునా?"

* అవధూతగీత

స్వామి: "నిస్సంశయముగా! ఓజోబలము*వలన బ్రహ్మజ్ఞానము ప్రకటితమగును. ఆ బ్రహ్మజ్ఞానము మనలో ఇప్పటికే కలదు. మనము దానిని వెలిపుచ్చుటయే కోదువ. నీవు బ్రహ్మచర్యమును పండ్రెండేండ్లు చెక్కుచెదరకుండ నిలుపుకొనగలిగియుంటివేని, మనస్సు సుస్థిరమై జ్ఞానము ప్రకటితమగును. వివేకానందస్వామి లోకమును తలక్రిందులు చేయుటకు సామర్థ్యము నిచ్చినది ఈ శక్తియేకదా! కేశవ చంద్రసేనునుగూర్చి 'ఇతడే సాంసారికజీవనమును పరిత్యజించి యుండినచో, లోకమున కింకను ఎంతయో అధికోపకారము చేయగలిగి యుండెడువాడు' అని శ్రీరామకృష్ణుడు పల్కువాడు.

"వివేకానందస్వామి 'నేను ఉత్త ఉపన్యాసములిచ్చుటతోమాత్రమే తృప్తినొందుచున్నా ననియా మీ భావము? వారికి నేను కొంత దృఢ (శాశ్వత) వస్తువు నిచ్చుచున్నాను. కొంత దృఢవస్తువు లభించుచున్న దని వారును ఎఱుగుదురు' అని పలుకువాడు. న్యూయార్కులో స్వామిజీ యొక పాఠము చెప్పుచుండెను. ఎంత మహాద్భుతమగు ప్రభావమో ఆ పాఠము శ్రోతలపై చూపినది!

"ధ్యానకాలమునందువలె ఏదోయొకశక్తి తన కుండలినిని పైకి ఎగయ జేయుచున్న ట్లా పాఠము వినునప్పుడు తనకు తోచె నని 'కా–' చెప్పెను. ఆ పాఠము ఒక గంటసేపు నడచెను. ఆ పిదప 'కా–' తా నొక ప్రశ్నోత్తరపాఠము

---

* పారమార్థికబలరూప మొందిన రేతశ్శక్తి.

నారంభింతునని పలికెను. వివేకానందస్వామిపాఠము ముగి యుటతోడనే శ్రోతలలో ననేకులు లేచిపోయిరి. 'ఈ పాఠము తర్వాతనా ప్రశ్నోత్తరపాఠము? దాని గుణమును పాడు చేయుటకా?' అని స్వామిజీ అతనిని మందలించెను. శ్రీరామ కృష్ణుడు లోకమునకు స్వామిజీరూపమున ఎట్టి మహాశక్తిని సంక్రమింపజేసెనో చూడుము! ఆయన లోకపు భావసరణినే మార్చలేదా? దేనిచేతను ఆకర్షింపబడని ఆయన యొక్క మహాబలము ఎట్టిదో ఆలోచింపుము! ఒక సాధువు తాను పదునెనిమిది ఏండ్లనుండియు వేదాంతమును నూటిపోసికొను చున్నను, కామవ్యామోహమును జయింపలేకపోయితినని నాతో దాపటికముపీడి చెప్పెను. అతని మనస్సునందు కొన్ని భావములు జీర్ణించి నిలిచెననుట స్పష్టము. సంస్కారములను నిర్మూల మొనరించుట అత్యంత దుర్లభకార్యము. కాని 'నేనొకతడవ తప్పుచేసిన నేమి? అది తప్పు అని నాకిప్పుడు తెలిసినది; కావున అట్లింక నెన్నటికిని చేయను' అని పలుక గలుగు దృఢసంకల్పము కలవాడు తప్పించుకొనగలుగును. సన్న్యాసులనుగుఱించి స్వామిజీ ఇట్లు చెప్పువాడు: 'సాధువు యొక్క సర్వదోషములును మన్నింపదగినవే; కాని వ్యభిచార మొక్కటిమాత్రము కాదు. బ్రహ్మచర్యమును నిష్ఠురముగా అతడు పోషించుకోవలెను. సౌందర్యరాసులును, ధనవంతు రాండ్రును, బుద్ధిబలముగలవారును అగు స్త్రీలతో స్వామిజీ మెలగువాడు. కాని వారెవ్వరును ఆయన నాకర్షింపజాలక పోయిరి. వారి నందఱిని ఆయన తనవైపునకు ఆకర్షించెను. అది నీకు భావించుటకైన సాధ్యముగా నున్నదా!

"ఒక గృహస్థభక్తునకొకసారి ఒక యద్భుతమగు అనుభవము కలిగెను. అతడు తప్పత్రాగి మిక్కిలి ఆవేశ పూరితుడై యుండెను. ఒక వేశ్యాగృహమునెదుట బండి నిలిపి, మెట్లెక్కి పైకి పోయెను. ఆ మెట్లవరుసపైన, వాకిటి యెదుట, అతనికి శ్రీరామకృష్ణుడు కనిపించెను! అతడు లజ్జాక్రాంతుడై, అచటనుండి పాటిపోయెను! భగవంతుడు రక్షించినగాని మనకు గత్యంతరము లేదు. దుష్టసంస్కారములు లేకయుండువారు అదృష్టవంతులు. వారు భగవంతునిచే రక్షితులు. వారుమాత్రమే మోక్షసిద్ధి నందగలరు. స్వప్రయత్నములచేత ఎవరుగాని ఇందునుండి తప్పించుకొనజాలరు. కాని శ్రీరామకృష్ణుడు 'మీకు చిత్తశుద్ధి కలిగియుండెనేని, జగన్మాత సర్వమును సరిచేయును' అని చెప్పువాడు. నిష్కపటత్వము అత్యావశ్యకము. ఒకటి చెప్పుచు మఱొకటి తలంపరాదు. ఇతరులు నిన్ను నీతిపరు డనుకొనవచ్చును గాని, నిన్ను నీవు మోసము చేసికొనజాలవుగదా. నీ నిజము నీకు తెలిసియుండకపోదు. నీకు నీవే సాక్షివి. కావున నిండుమనస్సుతో భగవంతుని ప్రార్థించితివేని, నీ ప్రార్థనను అతడు ఆలకించి తీఱును. ఇది సత్యము. నామాట నమ్ముము. కాని నీవు కపటివిగా నుండరాదు. 'అట్టివాడు తనంతట తానే వలలో చిక్కుకొని, తన దుర్గతికై పిదప చింతించును' అని స్వామిజీ చెప్పువాడు. జరిగిపోయిన పనికి ఎంత దుఃఖించినను ఏమి ఫలము? ధీరుడవై 'నేనిక నెన్నటికిని అట్లు చేయను' అని పలుకుము. అప్పుడుగాని నీకు భగవంతుని సాహాయ్యము లభింపదు.

"కామోద్రేకమునకు దాసుడై యుండువానికన్న అధమమానవుడు లేడు. అతడు ఎట్టి అవమానములకు పాలు పడును! దానికి నీవు లోబడనందుకు ఆనందింపుము. బుద్ధి కుశలత గలవారును, అధికారపదవియందున్న వారును, కూడ దానికి లోబడుదురు. భార్యాదాసుడగు రాజు కథ యొకటి కలదు. ఒక మిత్రు డొకనాడు అతనియం దుండు ఈ దోషమునుగూర్చి సూచనగా మాటలాడెను. అప్పటి నుండి అతడు దానిని సరిపఱచుకొనజూచెను. అంతఃపురము లోనికి వచ్చి రాణితో మాటలాడెను గాని, ముఖ్యవిషయ ములనుగూర్చిమాత్రమే ఏవో రెండుమాటలు మాటలాడెను. ఏ మాత్రమును ముఖముయొక్క గాంభీర్యము వీడలేదు. రాణికి సర్వము తెలిసిపోయెను. రాజు భోజనముచేయు చుండగా రాణియొక్క పెంపుడుపిల్లి భోజ్యవస్తువులలో కొంచెకొంచెము కొఱికి తినుచుండెను. దాని నతడు పాఱ దోల చూచెను కాని అది పోలేదు. ఇది చూచి రాణి 'దానిని ఇప్పటికే మీఱబెట్టినారు. ఇప్పుడు తఱిమిన పోవునా' అని ఎత్తిపొడుపుగా పలికెను. చనవు ననుభవించిన దుష్టవస్తువునుండి తప్పించుకొనుట అసాధ్యము. కళ్లెములను తన చేతియందు గట్టిగా బిగియలాగి పట్టుకొని ఉండవలెను. లేనిచో ఆశ లేదు.

"'ఏ క్షణమైనను ఆసక్తి, ఏ క్షణమైనను అనాసక్తి నీ స్వాధీనములో నుండవలెను' అని స్వామిజీ చెప్పువాడు. మనము ఒక పనిని ప్రారంభించి, దానియం దాసక్తుల మగుదుము — తదనంతరము దానియెడ అనాసక్తులము

కాజాలము. కాని ఇది అనుచితము. ప్రపంచములో గల దేదియు మనది కాదు. కావున సర్వమును పరిత్యజించుశక్తి మన కుండవలెను. అది మన ఇచ్ఛాధీనముగా నుండవలెను. శ్రీరామకృష్ణుని చూడుము. హృదయుడు దక్షిణేశ్వరము నుండి వెడలిపోవునట్లు ఉత్తరువు చేయబడెను. ద్వారపాల కుడు వచ్చి 'మీరును వెడలిపోవలెను' అని శ్రీరామ కృష్ణునితో చెప్పెను. 'ఏమీ! హృదయునిగదా వెళ్లి పొమ్మనినది, నన్ను కాదే!' అని ఆయన అనెను. అందుపై నతడు 'మా యజమానుడు మిమ్ము నిద్దఱిని వెడలిపొమ్మ న్నాడు' అనెను. ఈ మాట వినుటతోడనే ఆయన మాఱు మాటాడక చెప్పులు తొడుగుకొని ద్వారమువైపు పో నారం భించెను. రాణిరాస్మణియొక్క మనుమడగు త్రైలోక్యబాబు ఇది చూచి, పరుగిడివచ్చి ఆయనపాదములపై వ్రాలి 'తా మేల వెళ్లుచున్నారు? తమ్ము వెళ్లుడని నేను చెప్పలేదే' అని విన్నవించుకొనెను. వెంటనే శ్రీరామకృష్ణుడు వెనుకకు తిరిగి తనగదికి వచ్చివేసెను. చూడుము, ఆయన త్యాగము నందు వైరలేశమైనను కలదా! కాని ప్రతివిషయము నందును మనమెంత దుమ్ము రేగగొట్టుచుందుమో చూడుడు! అదే స్థితియందు మనము ఉండియున్నచో త్రైలోక్యబాబును ఎన్ని మాట లనియుందుమో! కాని శ్రీరామకృష్ణుడు అతనిని పల్లెత్తుమాట యైనను అనలేదు. ఎంతసిద్ధముగా వెడలిపోయెనో, అంత సిద్ధముగా మరలి వచ్చెను.

"ఆయన బికారి వేషముతో నుండువాడు. అందుచే ఆయన నొకడు తోటమాలిగా భ్రమించి పుష్పము నొకదానిని

కోసి తెమ్మని ఆజ్ఞాపించెను. ఆయనయు వెంటనే ఆ యాజ్ఞను నెఱవేర్చెను! అతడు కొన్నాళ్లపిదప తన ప్రమాదమును గ్రహించి ఆయనను డగ్గుత్తికతో క్షమాపణ వేడుకొనెను. అందుకు 'నీ వేమి తప్పు చేసితివి? ఏదైనను సహాయము కావలసినవానికి సర్వవిధముల నందఱును సహాయము చేయవలసినదేగదా' అని శ్రీరామకృష్ణుడు బదులుచెప్పెను! ఎంత అద్భుతసంఘటనము! ఇక స్వామిజీ సంగతి చూడుము. ఆయన తన సర్వస్వమును సోదరశిష్యులకు—తన శిష్యులకు కాదు—ఇచ్చివేసెను. మఠమునకు ప్రథమమున ఏర్పఱచిన ధర్మకర్తలలో ఆయనశిష్యు డొక్కడైనను లేడు. అందఱును సోదరశిష్యులే! ఒకరిద్రవ్యములో ఆయన నివసించువాడు. తనకు కలదంతయు అంతకుముందే పరిత్యజించెను! 'నా సర్వస్వము మీ కిచ్చివేసితిని గనుక నే నిప్పుడు మనశ్శాంతి ననుభవించుచున్నాను' అని ఆయన యొకసారి నాకు వ్రాసెను. ఎంత అపురూప మైనవాడు! నీవు పాశ్చాత్య దేశములకు వెళ్లియుండినచో, ఆయన యెంత పలుకుబడి సంపాదించినది నీకు తెలిసియుండును. 'నేను చేయవలసిన పని ముఖ్యముగా పాశ్చాత్యఖండములో నుండును; అచ్చటి నుండి మన దేశముపై అది తన బలము చూపును' అని ఆయన పలుకువాడు.

"ఒకనాడు ఆయన మిక్కిలి విసుగుచెంది ఇట్లనెను: 'ఇతరుల తోడ్పాటు ఏమియు లేక ఈ కార్యము నంతయు నే నొక్కడనే చేయవలసివచ్చుచున్నది చూడుడు—వాద్యము వాయించుటయు, నోట పాడుటయు: సర్వమును.'

"శ్రీరామకృష్ణునికి ఎన్నియో విషయములందు మంచి పరిజ్ఞాన ముండెను. 'మీరు సర్వవిషయములందు —చెడువానియందుకూడ —నాకన్న శ్రేష్ఠులు' అని గిరీశ బాబు ఆయనతో నొకతడవ చెప్పెను. 'కాదు, కాదు. ఇచ్చట (నాయందు) సంస్కారము లేమియు లేవు. స్వానుభవముచేత నొకవిషయము నెఱుగుటకును, చదివిగాని పరీక్షామూలమునగాని దానిని గ్రహించుటకును, కావలసినంత భేద మున్నది. అనుభవమువలన మనస్సుపై నేర్పడు భావ చిహ్నములు సులభముగా మాసిపోవు. తక్కిన రెండువిధముల నార్జింపబడిన జ్ఞానమున కీమాట వర్తింపదు' అని శ్రీరామకృష్ణుడు చెప్పెను."

జూలై, 9

స్వామి ఒక బాలునితో మాటలాడుచుండెను. ఆయన యతని నిట్లు ప్రశ్నించెను:

"నీవు ధ్యాన మభ్యసించుచున్నావు. లేదా? దివ్య రూపములపై ధ్యానముచేయవచ్చును, ఓంకారమును గూర్చియు ధ్యానముచేయవచ్చును. ధ్యానము ముదురుకొలది మనసు ఓంకారమునందు లయింపనారంభించును. 'తజ్జప స్తదర్థభావనమ్' (ఓంకారమును ఉచ్చరించుచు తదర్థమునుగూర్చి చింతించుచుండుకొలది మనస్సు సుస్థిరత చెందును. అనగా మనస్సు ఆ చింతనమును వదలకుండును. 'భగవంతుని శరణుచొచ్చినయెడల మనస్సుయొక్క కేంద్రీ

కరణము నడ్డగించు కారణము లన్నియు నశించి ఆత్మసాక్షాత్కారము లభించును.'

"ఆ పిదప పతంజలి యోగమునకుగల విఘ్నములను గూర్చి చెప్పుచున్నాడు. ఆ విఘ్నము లెవ్వి? అవి ఈక్రిందివి: (1) వ్యాధి. అనగా మతిభ్రష్టతయో, తీవ్రమగు జాడ్యమో కలిగి అభివృద్ధికి అడ్డుపడవచ్చును. (2) మనస్సుయొక్క జడత్వము. అనగా మనస్సు సోమరితనమును చూపుచుండుట. (3) సంశయము. ఒకవస్తువు ఇట్టిదా, అట్టిదా, అను ఆలోచన. ఒకవిధముగా ప్రవర్తించినచో ఇష్టార్థము సిద్ధించునో సిద్ధింపదో అను సందేహము. (4) ప్రమాదము. అనగా సమాధి లేక యోగమునకు దారితీయు మార్గమును అనుసరింపకుండుట. (5) అలసత. తమోగుణాధిక్యమువలన శ్రద్ధాప్రయత్నములు లోపించుట. (6) సంగత్వము. అనగా ఇంద్రియవిషయములచేత ఆకర్షింపబడుట. (7) భ్రాంతి. అనగా ఒక వస్తువును ఇంకొకటిగా పొరపడుట. (8) భూమికల నందుకొనజాలకపోవుట. అనగా సమాధి స్థితిలోని అత్యున్నత క్షేత్రముల కెగయజాలకపోవుట. (9) సమాధిస్థితిభ్రంశము. అనగా సమాధిస్థితి నందుకొనియు, ఆ స్థితియందు మనస్సును నిలిపియుంపజాలకపోవుట. ఈ తొమ్మిదియు మనస్సును చలింపజేసి, యోగమునకు అడ్డు తగులును. ఈ అడ్డంకు లన్నియు ఓంకారమునుగూర్చి ధ్యానించినచో నశించును. కాని ధ్యానించుటకే బుద్ధి పుట్టకపోవచ్చునుగదా!

"పైత్యోద్రేకము కలిగినప్పుడు కలకండకూడ చేదుగా నుండును. కాని, దాని కదియే ఔషధము. దానిని వదలక సేవించుచు వచ్చినయెడల, జాడ్యము నశించుటయే కాక, కలకండయు తియ్యగా నగును. భగవన్నామవిషయముకూడ ఇట్టిదే. అవిద్యాంధకారమున మునిగియున్నవాడు ప్రతిదినము ఔషధసేవవలె భగవన్నామమును స్మరించినచో, కాలక్రమమున అది మధురముగా తోచును. తనయందుగల అవిద్య నశించుటే కాక భగవన్నామమందుగల మాధుర్యమునుకూడ అతడనుభవింపగలడు. అవిద్యావ్యాధిని అది సమూలముగా నశింపచేయును. కావున మనస్సున కెంత యిష్టములేకున్నను, సాధకుడు భగవన్నామస్మరణము చేయుచునే యుండవలయును. దానిని త్యజించువాడు పతనమందును. 'అర్జునా, మనస్సు అభ్యాసము వలనను, వైరాగ్యమువలనను, అదపులోనికి వచ్చును' అని గీతలో చెప్పబడియున్నది. మఱియు 'వివేకసాధనచే మెల్లమెల్లగా మనస్సును ఇంద్రియవిషయములనుండి మరల్చి, ఆత్మసంస్థ మొనర్చి (ఆత్మయందే పూర్తిగా నిలిపి), అటుపిమ్మట తదితరవిషయములనుగూర్చి తలపనే కూడదు' అనియు అందు చెప్పబడియున్నది.

" 'అభ్యాసము జాగ్రత్తతో నిరంతరము దీర్ఘకాలము సాగించుచుండినచో, చిత్తము ఏకాగ్రమై సుస్థిరమవును' అని యోగసూత్రకారుడు పలికియున్నాడు. చిత్తమును సుస్థిరమగు ఏకాగ్రత నొందించుట అతిముఖ్యము. లేత మొక్కచుట్టును కంచెవేయవలెను. కాని అది పెరిగి మహా

వృత్తి మైనపిదప అట్టి సంరక్షణ దాని కవసరములేదు. ఆదర్శవిషయమై మనకు సుస్థిరత యుండుట అత్యావశ్యకము. ఏదో ఒక మార్గము సరియైనదని మన బుద్ధికి ఎప్పుడు నిశ్చయము కలుగునో, అప్పుడు దాని ననుసరించుటకై ప్రాణములైన అర్పింప సిద్ధపడి యుండవలయును. మన శీలమునందు నిశ్చయాత్మికత్వ మత్యావశ్యకము.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్

(నిశ్చయాత్మిక మగు బుద్ధి ఒక్కటిగనే నిలుచును. కాని చపలచిత్తుల బుద్ధులు అనేక శాఖలుగ చీలి అనంత ములై యుండును) అని గీతలో నున్నది. ఏదో యొక మార్గమును నిర్ణయించుకొనవలయును. అప్పటినుండియు మన జీవితము నంతయు దాని ననుసరించుటయందు ధార పోయవలయును.

" 'బ్రహ్మచర్యాద్వీర్యలాభః' (బ్రహ్మచర్యమువలన బలము చేకూరును). మనము బలమునార్జించుకొనవలెను. ఏ కార్యమునైనను పూనులోపల దానికి వలయు సామర్థ్య మును ఆర్జించుకొనుము. మోటారుబండి పరుగిడుచున్న ప్పుడు రామమూర్తి ఆపినాడని నేనుకూడ ఆ పని చేయ బూనుకొనవచ్చునా? అది మూర్ఖత యగును. కాని అది బొత్తిగా అసాధ్యమగు మహాకార్యము కాదు. అతని చర్యను జాగ్రత్తగా పరిశీలించి, దానికి తగు బలమును క్రమ క్రమముగా సంపాదించుకొనినచో, ఎవరైనను అట్లొనర్ప

వచ్చును. గోబరు ఇప్పుడు అట్లు చేయుచున్నాడుగదా. మానవులలో ననేకులు తమకు గల శక్తినే ఎఱుగరు. హనుమంతునియొక్క శక్తిని బయటికితీసినది జాంబవంతుడు. 'మీలో ఎవరు శ్రీరామకార్యార్థులై సముద్రమును దాటి విజయముసాధించి మరల రాగలరు?' అని అంగదుడు వానరుల నడిగెను. అం దొకడు 'నేను పోగలనుగాని, మరల రాజాలను' అనెను. అందుపై జాంబవంతుడు హనుమంతుని చూపి 'ఇత డా పనిని సాధింపగలడు' అనెను. హనుమంతుని యొక్క ధీరకార్యముల నతడు అంతట ప్రశంసించెను: జన్మించినతోడనే సూర్యునొద్దకు లంఘించి ఆ బింబమును గ్రహింప యత్నించిన విషయము నుగ్గడించెను. తత్ఫలముగా హనుమంతునియొక్క ఆత్మవిశ్వాసము మేలుకాంచినది. ఆయన వాయుమార్గమును బట్టెను. త్రోవలో సురమ (సురస?) సర్పాకృతిని దాలిచి అతని నెదుర్కొని 'నా నోటి గుండగాని నీవు పోజాలవు' అనెను. హనుమంతు డామెకు ప్రథమమున నమస్కరించి 'నే నిప్పుడు రామకార్యార్థినై పోవుచున్నాను. మొదట నా పని తీర్చుకొని మరల వచ్చు నప్పుడు నీ ఆజ్ఞను నెఱవేర్తును' అని బదులుచెప్పెను. అతడు ఎంత మర్యాదగా ప్రవర్తించెనో చూడుడు. సాధ్యమైనంత సులభమార్గ మది. కాని సురమ 'అట్లు వలను పడదు. ఇప్పుడే నా నోటిగుండ పోవలెను' అని చెప్పెను. హనుమంతుని కేమియు కర్తవ్యము స్ఫురింపలేదు. అతడు తన శరీరమును పెంచెను, కాని సురమ తన శరీరమునుకూడ పెంచెను. ఈ ప్రకారము ఒకరికన్ననొకరు అధికముగా

శరీరమును పెంప నారంభించిరి. చివర కిది నిష్ప్రయోజన మని కనుగొని, హనుమంతుడు హఠాత్తుగా అత్యణురూప శరీరమును దాలిచి ఆమెనోటిగుండ వెళ్లెను.

"యజమానుని యాజ్ఞ యగుటకుమున్నె అతని యభిమతమును గుర్తించి తదనుసారముగ ప్రవర్తించు సేవకుడు అత్యుత్తముడు; ఆజ్ఞ యైనపిమ్మట దానిని పరిపాలించువాడు మధ్యమజాతిసేవకుడు. ఆజ్ఞ నొందికూడ తత్పరిపాలనమున అజాగ్రత్త వహించువాడు అధమజాతి సేవకుడు.

"సీతాన్వేషణార్థమై సందేశహరులు పంపబడు చుండిరి. ప్రతివాడును బయలుదేఱెను. కాని హనుమంతుడు మాత్రము విశ్వాసయోగ్యతాసూచకమగు చిహ్నమును దేనినైనను తన కిమ్మనెను. దీనినిబట్టియే విజయము సాధింప గలిగిన ధితడే యని రాముడు కనుగొనెను. అతని చెవిలో తన సందేశమును రహస్యముగా చెప్పెను. లంకచేరి హను మానుడు రావణుని పరిభవించి, తన అపార సామర్థ్యమును ప్రదర్శించెను.

"మనయందు సర్వశక్తియు ప్రచ్ఛన్నమై యున్నదని యోగశాస్త్రములు చెప్పుచున్నవి. చిత్తమును మనము యుక్తసాధనలచే నిరోధింపవలెను. అప్పుడుగాని దానిలో గల శక్తి ప్రదర్శితముకాదు. పారమార్థికశక్తిని కూడబెట్టు కొనుటకు నిష్ఠురబ్రహ్మచర్యము అత్యావశ్యకము.

"శిష్యుడుగానుండుట మిక్కిలి కష్టము. నీవీ కథను వినలేదా? ఒకడు శిష్యుడుగా నుండగోరెను. అత డొక గురునియొద్దకు పోయి 'స్వామీ, నన్ను మీ శిష్యునిగా అంగీకరింపుడు' అని ప్రార్థించెను. 'నీవు శిష్యుడవుగా నుండ గలవా? శిష్యుడు నీళ్లు చేదవలెను, సమిధలు ఏరుకొని రావలెను, గురుని సేవ చేయవలెను. ఈ పను లన్నియు నీవు చేయగలవా?' అని గురువు అడిగెను. అందుపై నతడు 'సరియే, గురువు చేయవలసిన దేమి?' అని మాఱుప్రశ్న వేసెను. గురువు ఇట్లు బదులుచెప్పెను: 'చెప్పదగినంతపని అతనికి లేదు. అతడు సుఖముగా కూర్చుండి అప్పుడప్పుడు రెండు బోధన వాక్యములు పలుకును. అంతయే.' ఈ మాటలు విని అతడు 'శిష్యుడనుగా నుండుట నాకు కష్టమని మీకు తోచినచో, గురువుగా ఏల ఏర్పఱుపరాదు?' అని ప్రశ్నించెను! ఎంత హాస్యాస్పదము! ప్రతివాడును, విత్తు నాటకయే ఫలము నొంద గోరును! అర్హు డగువాడు తన లోపములను కొంచెకొంచెముగా పరిహరించుకొనును. ఉన్నట్టుండి అట్లొనొర్పజూచితివేని, నీ కపజయము సిద్ధము. ఆ లోపములు నిలిచియే యుండును. కావున మనస్సును మెల్లమెల్లగా మరల్పజూడవలయును.

"'న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః
తమేవ భాన్తమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి.'

(అచ్చట సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్ర ములుగాని, మెఱపులుగాని ప్రకాశింపవు. ఇక అగ్నిమాట చెప్పవలయునా? ఆ వస్తువు ప్రకాశించుటచేతనే సర్వమును దాని ననుసరించి ప్రకాశించును. దాని వెలుతురే ఈ సర్వ మునను వెలుగుగా కాన్పించుచున్నది). మనము విషయీ విషయములను భ్రాంతిచే కలిపివేయుచున్నాము. వానిని వేఱుచేయవచ్చును. నేను విషయిని, విషయమును కాను. బుద్ధివఱకు గల అఖిలప్రపంచము విషయముక్రింద చేరును. 'మూలేమూలాభావాత్ అమూలంమూలమ్' (అంతకుమించి కారణభూతమైనవస్తువు లేనందున మూలకారణము కారణ రహితము). ఈ సత్యములను ప్రథమమున కనుగొనినవారు ఎంత గాఢవిచారము చేసిరో గదా!

"వివేకము సమగ్రమైయుండవలెను. లేనిచో అది నిష్ప్రయోజనము. 'ఇందుకు దైవమేసాక్షి' అని బాలురు పలుమాఱు పలుకుచుందురు. ఎంత వేడుకయైన భావము! వారీ మాటలను ఎచ్చటనో విని పట్టుకొందురు. దానిని గూర్చి వారు ఆలోచింపరు. కావుననే వారట్లనుట.

"పక్షి రెండురెక్కలతో నెట్లు ఆకసమునకు ఎగురునో, అట్లే మనముకూడ మోక్షసౌధమును చేరుటకై వివేకవైరాగ్యము లనెడు రెండు ఱెక్కలు కలిగియుండ వలెను. ఇవి రెండును యథార్థముగా గలవానికి భయము లేదు. వాడు సురక్షితుడే. ఎండమావులను నీరుగా భ్రమించుచుండునంతదనుకనే గదా మానవుడు నీటికై వాని

యొద్దకు పరుగిడును? ఆ భ్రాంతి నశించినపిమ్మట ఎండ మావులయొద్దకు నీటికై పోవువారు ఎవ్వరైన నుందురా? ఇందు సత్యమేమనగా, జగన్మాత ఎవరిని చేయిపట్టుకొని నడిపించునో వాడుమాత్రము తప్పించుకొనును. 'కాటుక మంచి దైనప్పుడు వ్రేలిముద్ర విస్పష్టముగా నుండును; అది మంచిదికానిచో ముద్రయు విస్పష్టముగానుండదు' అని శ్రీరామకృష్ణుడు చెప్పెడువాడు. వివేకవైరాగ్యములు గలవారియందు ఆధ్యాత్మికబోధలు చక్కగా నాటుకొనును. అవి తక్కువగా నుండువారియందు అవి నాటుకొనుటయు తక్కువగనే యుండును."

అపరాహ్ణము.

ఏకాగ్రత, ధ్యానము మున్నగు ఆధ్యాత్మికసాధనలనుగూర్చి స్వామి యిట్లనెను: " 'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్' (ఒక్కవస్తువునుండితప్ప తక్కిన అన్నిటి నుండియు మనస్సును మరల్చి దానిమీదనే ఏకాగ్రము చేసినచో ఆ వస్తువువలన కలుగు భావపరంపరను ధ్యానమందురు). 'ఒక పిండిముద్ద మీదనో, అట్టి ఇతరవస్తువు మీదనో, బుద్ధిని పూర్ణముగా నిలిపినచో, దానిని ధారణ యందురు' అని వివేకానందస్వామి చెప్పువాడు.

"ఉన్నట్టుండి ఆకాశమునుండి ఏదియు రాలిపడదు. అందఱికిని ధారణ ఏల ఉండదు? ఏలయనగా దానికి ఆవశ్యకమగు నిష్ఠురబ్రహ్మచర్యము వారవలంబింపరుగనుక. దీనినే బలము అందురు. ఈ బలము లేనివాడు ఏమైనను

చేయగలుగునని తలంతువా? అంతటికిని ప్రధానము పరిపూర్ణమగు ఆత్మనిగ్రహము. గీత ఇట్లు చెప్పుచున్నది: 'అసంయతాత్ములకు (ఆత్మనిగ్రహము లేనివారికి) యోగము దుష్ప్రాపము(అసంభవము) అని నా భావము. కాని ఇంద్రియ నిగ్రహము సాధించిన వశ్యాత్ముడు సరియగుమార్గము నవలంబించి ప్రయత్నించినచో దానిని పొందగలడు'.

"మానవులు తమ తమ ఇష్టానుసారముగా ప్రవర్తించి, తగుఫలము నందజాలక పోవుదురు. శాస్త్రములున్నవిగాని వారు వానివైపుననే చూడరు. గురువుయొక్క ఆజ్ఞప్రకారముకూడ ప్రవర్తింపరు. చివరకు యోగాభ్యాసమునకు వారు అనర్హులగుదురు. 'ఆహారవిహారములందును, కర్మములందును, నిద్రాజాగరణములందును మితి నవలంబించువానికి యోగము సర్వదుఃఖములను నశింపజేయును'.

"ఏదైన వ్యాధి వచ్చినచో, అది కొన్నాళ్లకు నివారణమగును. కావున ఆధ్యాత్మికసాధనలుమాత్రము సాగించుచునేయుండవలెను".

జూలై, 10

"అమ్మా, సర్వము నీ యిచ్ఛమీదనే ఆధారపడియుండును. నీవు నీ ఇచ్ఛప్రకారమే ప్రవర్తించుచుందువు" అను నర్థముగల ఒక పాట పాడుచు, స్వామి యిట్లనెను: "నాకిప్పుడు ఈ భావము మిక్కిలి ఇష్టముగా

మన్నది. దినములు జరుగుకొలది ఈ భావము నన్ను క్రమాధిక బలముతో ఆకర్షించుచున్నది. మేలుకీళ్లు — ఈ రెండును నీవే. అవి రెండును నీ సంకల్పానుసారముగనే జరుగుచుండును. భగవంతుడు ఎవరిని ఉద్ధరింపదలచునో, వారిచేత నతడు సత్కార్యములు చేయించును; ఎవరిని పతన మొందింపదలచునో వారిచేత దుష్కార్యములు చేయించును. 'నీవు కుంటివారిచేత కొండ లెక్కింతువు. ఏనుగును చిత్తడినేలలో గ్రుచ్చుకొనిపోవ జేయుదువు'. 'ఇందుకు మనస్సు పాపము! ఏమిచేయగలదు? దాని తప్పేమియు లేదు. కాళికాదేవి 'గారడివానికూతురు'. తనఇష్టప్రకారము దాని (మనస్సును) నామె ఆడించును'. ఈ సర్వమునకు మూలమై, దీని నంతటిని నడపించు శక్తి యొకటి కలదను భావము మనకు కొంత ఆప్యాయత నిచ్చును. కాని హేతువాదులు దీని నంగీకరింపరు. 'కారణము లేనిది కార్య మెట్లు సంభవింపగలదు?' అని వారు ఆక్షేపింతురు. అందుకు రెండవపక్షమువారు 'సర్వకారణములకును అతడే మూలకారణము' అని బదులు చెప్పుదురు.

"పూర్వమొకప్పుడు నేనును దీనిని అంగీకరించువాడను కాను; దీనిని గూర్చి అద్భుతానందస్వామితో నెక్కువగా తీవ్రచర్చలు చేయువాడను. 'భగవంతుడు తన యిష్టప్రకారమే ప్రవర్తించునెడల అతడు నిరంకుశపరిపాలకుడగునుగదా. అతడు రష్యాదేశపు 'జారు'(czar)వంటి నిరంకుశుడా? అతడు న్యాయశీలుడు, దయాళువు, అనుకూల స్వభావముకలవాడు' అని వాదించువాడను. అందుకు ఆయన

'నీ ఈశ్వరునియందు దోష మేమియు లేదని నీ వతనిపక్షమున వాదించుచున్నావు. ఇది మంచిదే' అని బదులు చెప్పెను. ఎంత చక్కని జవాబు! ఆయన మాటలాడినది తర్కాతీత మగు దృక్పథమునుండి. కాని హేతువాదదృక్పథమునుండి దానిని ఆక్షేపించుటకు అవకాశముకలదు. అది స్వాతంత్రేచ్ఛకు మూలవిచ్ఛేదనకారి. అనుభవజ్ఞానము లేనివానికి ఇట్టి భావము అపాయకరము. అట్లు మాటలాడుటకు నిజముగా అధికారము కలవాడు తప్పటడుగునే వేయడు.

"చిన్ననాడు తోలుబొమ్మలాటను చూచి, అందాక తోలుబొమ్మ అఱచుటను విన్నప్పుడు, నిజముగా ఆ బొమ్మయే అఱచె నని నేను తలచువాడను. ఆ బొమ్మలు తమంతట తామే ఆడుచున్నట్లు తోచెడిది. కాని పిదప ఆ భ్రాంతి వదలినది. తెర వెనుకనుండి ఎవడో ఒకడు దారమును చేతబూని వానిని ఆడించు చున్నాడని కనుగొంటిని.

"ఇప్పుడు సర్వమునకును కారణభూతురాలగు మహామాయ, లేక విశ్వశక్తి, కల దను భావము నా బుద్ధికి మిక్కిలి నచ్చుచున్నది. అది నా కెంత ఇష్టముగా నుండునది మాటలతో తెలుపజాలను. ఇందుకు కారణము మనస్సునకు దీని సత్యత్వము అంగీకృతమగుటయే. స్వామిజీకూడ అనంతరకాలమున మహామాయయందు అపారవిశ్వాసము కలిగియుండెను. ఆమె చేతిలో మనము కీలుబొమ్మల మని చెప్పుట సులభమే కాని, అట్లు విశ్వసించి, ఆచరించుట

కష్టము. మనము ఆమె నాశ్రయించితిమేని మనలను ఆమె సర్వదా రక్షించును. ఎన్నడును విడనాడదు. పెద్దవార మగుకొలది హేతువాదముపై ఆధారపడక, జగన్మాతపై ఆధారపడుకాల మొకటి స్వాభావికముగనే వచ్చును.''

జూలై, 11

స్వామి : '''భూలోకమును భగవంతుడే స్వయముగా పరిపాలించు కాలము వచ్చును' అను భావము ఒక వేళ అసంభవమే అయినను, అది మిక్కిలి ప్రశంసనీయమైనది. 'పురుషులకు స్త్రీస్వభావము కలిగినప్పుడుగాని అట్టి కాలము ప్రాప్తింపదు' అని సురేంద్రనాథమజుమ్దార్ అను కవి చెప్పి యున్నాడు. అతడు మిక్కిలి చక్కని కవి. మీకు ఈ వాక్యము పరిహాసనీయముగా నుండునేమో కాని, నేను చిన్ననాడు అది చదివినప్పుడు నాకది హాస్యాస్పదముగా తోపలేదు''.

అచ్చట నున్నవారిలో నొకరు ఈ వాక్యము స్త్రీల యొక్క హృదయమార్దవమున కన్వయించునుగాని, వారి ఆడంగితనమునకు అన్వయింప దనిరి.

స్వామి : ''అవును, సరిగా చెప్పితివి. 'మానవుడు బరువులుమోయు పశువువంటివాడు; అట్టివాడు గర్వించి అధికుడ ననుకొనుట ఎంత బుద్ధిహీనత!' అని ఆ కవియే పలికియున్నాడు. కవి భావ మిది : 'మానవుడు కుటుంబ భారము నెప్పుడును మోయుచుండు కష్టజీవి. అట్టివాడు

స్త్రీజనసహజమగు కోమలతామాధుర్యములను ప్రదర్శించుట సులభసాధ్యముకాదు' ".

ఒకరు : " 'స్త్రీలు నరకద్వారములు' అనియు, ఇట్టి మాటలే ఇంకేవేవియో పలుకుదురు. స్త్రీలే పుస్తకములు వ్రాసియుండినయెడల, పురుషులనుగూర్చి వారును అట్లే పలికి యుందురేమో".

స్వామి : "వారు అట్లే ఇప్పుడు చేయుచున్నారు! పాశ్చాత్యదేశములలో వారు అన్నివిషయములలోను బదులుకు బదులు చేయుచున్నారుగదా! శాస్త్రములు స్త్రీజాతి నంతటిని సమష్టిగా నిందింపలేదు. వారలలో కొందఱికి ఉత్తమపదవిని, కొందఱికి హీనపదవిని ఇచ్చియున్నవి. శ్రీరామకృష్ణుడును అట్లే పలుకువాడు. పురుషుని నెప్పుడును కామోపభోగమువైపు లాగు స్త్రీ అధమురాలనియు, ఈశ్వరునివైపు త్రిప్పు స్త్రీ ఉత్తమురాలనియు ఆయన యనువాడు. ఇందు మొదటితరగతి స్త్రీల విషయమే శాస్త్రములు హేయమని వ్రాసినవి. ఇంద్రియభోగమువైపునకే ఎల్లప్పుడును ఈడ్చుచుండు స్త్రీలను నీవు ప్రశంసింతువా? అట్టి స్త్రీలయొద్దనుండియు, వారితో సహకరించు ఇతర స్త్రీలయొద్దనుండియు, దూరముగా నుండుమని సాధకులకు శాస్త్రములు బోధించుచున్నవి. సంసర్గమునందుగల అత్యద్భుతప్రభావమును నీవు ఎఱుగవా? మేము బడిలో చదువుచున్నప్పుడు కొందఱుబాలురు బంగిత్రాగు కూటములలోనికేగి మద్యపానము చేసినవారివలె అభినయించువారు. బంగి

త్రాగువారికి మద్యపానము చేయువారు అనిన మిక్కిలి వెఱపు గదా! ఇట్లు అభినయించుచుండిన బాలురలో నొకడు తానే బంగిత్రాగుటకు అలవాటుపడెను! ఎంత భయంకర మగు ఫలముకలిగినదో చూడుడు!

“మనస్సులో నాటుకొనిన భావములను పెకలించివైచుట మిక్కిలి కష్టము. ఒకొక్కసారి అవి నిద్రలోనడచు రూపమునుకూడ ధరించును. ఈ దశయందు కలుగు విచిత్రప్రవర్తనమును స్వామిజీ ఒకసారి వర్ణించెను. ఒక పాశ్చాత్యస్త్రీ నిద్రలో లేచి సమాధులను త్రవ్వి అందులోని వస్తువులను తెచ్చి తన పఱపుక్రింద పెట్టుకొనుచుండెనని ఆయన చెప్పెను. నిద్రమేల్కాంచిన పిమ్మట, తన నిద్రాచర్య లేవియును ఆమెకు జ్ఞప్తి యుండునవికావు. అక్షరములు కూడ రాని యొక బాలిక నిద్రలో చక్కని ఉపన్యాసము లిచ్చునది. ఇట్టి సంఘటనలు మన దేశముననే జరిగియుండిన యెడల, అవి గ్రహచేష్టలుగా భావించియుందురు. కాని ఇది పాశ్చాత్యదేశమునందు జరిగినది కావున, వారు ఇట్టి సంఘటనలకు హేతు వేమని విచారించుట ఆరంభించి, ఆబాలిక అప్పటికి పదిపండ్రెండేండ్లనాడు ఒక భౌతికశాస్త్రజ్ఞునియొద్ద చాకిరి చేయుచుండె ననియు, అతడు గట్టిగా చదువుట, ఉపన్యాసములిచ్చుట కలదనియు తేలెను. అందుచేత వారీ విషయమున కార్యకారణసంబంధము కనుగొనగలిగిరి.

“కలకత్తాలో నొక యువకుడు దుశ్చరితలగు స్త్రీలను బాగుపఱచు కార్యమును పూనెను. అతడు సౌశీల్యముగల

వాడు, విద్యావంతుడు, బుద్ధిశాలి. ఒక బాలిక తన విషాద కరమగు చరిత్రము నతనికి తెలుపగా, అతని హృదయము కరగి, ఆమెపై అపారమగు అనురాగము వహించి, తప్పించు కొని రా జాలకపోయెను. ధైర్యములోకూడ—మితిమీరిన యెడల—అపాయము కలుగు నవకాశము కలదు.

"మిక్కిలి విచిత్రమగు మఱొక సంఘటనముకూడ నే నెఱుగుదును. అది పుస్తకములలో చదివిన విషయము కాదు, నేను ప్రత్యక్షముగాచూచిన విషయము. ఒక బెంగాలీ పట్టభద్రుడు, సన్న్యాసాశ్రమము నవలంబించినవాడు, మిక్కిలి విరక్తిగలవాడు, స్వామిజీకి సహాధ్యాయియైయుండెను. అతనినిగూర్చి స్వామిజీవలన మేము వినియుంటిమి. అతడు జితేంద్రియుడ నని గర్వోక్తులు పలుకువాడు. కుష్ఠవ్యాధి పీడితులకొఱకును, ఇతరదుస్సహవ్యాధులు గలవారికొఱకును, అతడు ద్రవ్యమును యాచించి తెచ్చి, వారికి సేవ చేయు వాడు. 'మీలో స్వామిజీ ఒక్కనికే బుద్ధికుశలత కలదు. మీ రందఱును సాధువులు నిజమే, కాని మీ కెవ్వరికిని బుద్ధి కుశలత లేదు' అని యతడు మాతో చెప్పువాడు. అతనికి శాస్త్రవిశ్వాస మేమియు లేదు. 'మనమును అంత చక్కని గ్రంథములు రచింపవచ్చును' అని చెప్పువాడు. అతనికి వాద ప్రతివాదములందు మిక్కిలి ఆసక్తి. అతని ధైర్యముకూడ అసాధారణము. అతనిని జనులు చాల శ్లాఘించుచుండిరి. ఆశ్లాఘకు అతడు అర్హుడుకూడ. నేను అతని నొకసారి అలహాబాదులో చూచుట తటస్థించెను. తా నప్పుడే పతన మొందె నని అతడు నాతో చెప్పివేసెను. అంత వయసు

ముదిరినపిమ్మట ఇంద్రియములకు లోబడి, చెడిపోయినందుకు నే నతనిని మందలించితిని. అంతట నతడు—తన ఇంద్రియ నిగ్రహమును నమ్ముకొని—ఒక దుష్టస్త్రీయొక్క వలలో చిక్కినవిషయము సవిస్తరముగా తెలిపెను. అతనిగర్వమే అతనికి పతనకారణ మయ్యెను. అట్టి విషయములందు ఎవ్వరును సాహసముపూనరాదు. కావుననే శాస్త్రములు వానివిషయమున జాగ్రత్త వహింపుమని విస్పష్టముగా పలుకుచున్నవి''.

జూలై, 13

స్వామి : ''స్వామిజీ శ్రీరామకృష్ణునియొద్దకు అన్ని విధములవారిని తెచ్చుచుండువాడు. దీనినిగూర్చి శ్రీ రామకృష్ణుడు 'ఎంత నిర్భాగ్యులను తెచ్చుచున్నావు —కన్ను లొట్టపోయినవారిని, కుంటివారిని, అట్టివారిని! మంచివారెవ్వరైనది, చెడ్డవా రెవ్వరైనది, నీ కేమియు తెలియదు. వివక్షత లేక ప్రతివారిని పిలుచుకొనిరావద్దు' అని యతనిని మందలించువాడు.

''స్వామిజీ ఎప్పుడును బలహీనులకు ఉపకారము చేయువాడు. 'ఎంత బలహీనుడైన, అంత సహాయమున కతడు అర్హుడుగదా. బ్రాహ్మణబాలునికి ఒక్క బోధకుడు చాలినచో, హీనజాతివానికి నలుగురి నేర్పాటు చేయవలెను' అని అతని వాదము. ఎంత అద్భుత మగు మాట!

''శ్రీరామకృష్ణుడు ఒకసారి ఒక భక్తురాలిని మిక్కిలి కోపగించుకొనెను. 'ఆమె యింటికి పోవలదు, ఆమె

చేతి అన్నమును తినవలదు' అని యమ్మనందఱను ఆదేశించెను. ఆమెను దక్షిణేశ్వరము రావద్దు అనియు నిషేధించెను. ఆయన ఇట్లు తీవ్రనిషేధము చేసినపిమ్మట ఆమె యింటి కెవరు పోవుదురు? కాని, స్వామిజీ ఒకనాడు శివానంద స్వామితో 'షికారు పోవుదము రమ్ము' అని పలికెను. త్రోవలో ఆ స్త్రీ యింటికి పోయి, తినుటకేమైన పెట్టుమని ఆమె నడిగెను. ఆమెకు సంతోషపారవశ్యము కలిగి, చక్కని తినుబండారములు పెట్టెను. ఆ పిమ్మట శ్రీరామకృష్ణుని యొద్దకు పోయి, తనచర్య నాయనకు నివేదించెను. 'ఏమి! అచ్చటికి వెళ్లవద్దనిగదా నేను చెప్పితిని? అందుకు వ్యతిరిక్తముగా వెళ్లితివి' అని శ్రీరామకృష్ణు డనెను. అందుపై 'నేనేమి తప్పుచేసితిని? ఆమెను ఇచ్చటికి రమ్మనికూడ ఆహ్వానించితిని' అని స్వామిజీ పలికెను!

"స్వామిజీ ఒకతడవ హాజ్రా పక్ష మవలంబించి శ్రీరామకృష్ణుని ఒక వర మడిగెను. శ్రీరామకృష్ణు డపుడు కాశీపురమం దుండెను. స్వామిజీ ఆయనను వదలలేదు. 'మీరు అతని నెట్లయినను అనుగ్రహింపవలెను' అని పట్టుపట్టెను. శ్రీరామకృష్ణు డందుకు 'అతని కిప్పు డేమియు ఈయజాలను, కాని మరణకాలమున అతనికి ఫలముకలుగును' అని బదులు చెప్పెను. అట్లే జరిగెను. స్వామిజీకి దైవానుగ్రహము మొదలగువానియందు మానసగర్భమున విశ్వాసము కలదు.

"'లా-' ప్రొద్దుపోవకముందే నిద్ర పోవువాడు. శ్రీరామకృష్ణునకు ఇందుకై మిక్కిలి కోపమువచ్చెను.

అతనిని దక్షిణేశ్వరమునుండి పంపివేయదలచెను. కాని స్వామిజీ అతనిపక్షమున మాటలాడి ఆయనను శాంతపఱచెను. ఈ కారణముచేతనే 'లాటు' 'నాకు నిజమైన సోదర శిష్యుడు వివేకానందు డొక్కడే' అని అనువాడు.

"ఒకసారి ఒక బాలుడు మఠములో నివసించుటకై వచ్చెను. మఠస్థులందఱును అందు కాక్షేపించిరి. 'శ్రీరామ కృష్ణునికి మానవునిహృదయము తెలిసిపోవునది. కావున ఆయన ఎవరినైనను చేర్చుకొనదగునా, తగదా అని సరిగా తీర్మానించువాడు. ఆ శక్తి నాకు లేదు. కావున ప్రతివారికిని నేను అవకాశమిత్తును. శ్రీరామకృష్ణునివలె మీకును హృదయమును గ్రహించుశక్తి యుండెనేని, మీ రతనిని పంపివేయవచ్చును' అని స్వామిజీ వారితో పలికెను.

"ఆ విషయమునుగూర్చి మాలో ప్రతివారిని తన యభిప్రాయమును చెప్పుమనెను. నన్నడిగినపుడు నేను 'శ్రీరామ కృష్ణు డెవరిని పరిగ్రహింపనొల్లడో వారు ఇచ్చట నుండజాల రని నేను చక్కగా గ్రహించితిని. ఇచ్చట ఉండిపోవలసినవారే ఉందురు; తక్కినవారు చాలించుకొని వెళ్లుదురు' అని చెప్పితిని. అందుపై స్వామిజీ 'చక్కగా చెప్పితివి. ఇది చక్కని పదకము' అనెను. ఆ బాలుడు చేర్చుకోబడెను గాని, కొలదినాళ్లలోనే వెడలిపోయెను.

"గిరీశబాబువంటి దుశ్చరితులకుకూడ శ్రీరామ కృష్ణునియొద్ద స్థానము కలిగియుండెను. ఏలయన, ఆయన అన్నివిధములవారితోను సరిపుచ్చుకొనగలడు. కాని మనము

చేయునది ప్రతివారిని మనభావములకు అనుగుణముగా మార్చజూచుట. ఆయనమార్గ మిట్లు కాదు. ప్రతివారిని వారు ఏ దశయం దున్నది చూచి, కైకొని, ఆ దశనుండి ముందుకు జరుపువాడు. ఆయన ఎవ్వరికిగాని ఆశాభంగము కలిగింపలేదు. వారి దృక్పథముప్రకారమే వారిని పురోగమింప జేయువాడు. ప్రతిభక్తునితో ఆయన యొక్కొక్క ప్రత్యేకరూపమగు సంబంధము నేర్పఱచుకొని, ఆ సంబంధము నెప్పుడును పాటించు చుండువాడు. వేడుకగా చేయు సంభాషణలమూలముననే వారికి ఎంతో బోధచేయువాడు. అహో! ఎంత అద్భుతగురువు ఆయన! అట్టి గురువు ఎచ్చట దొరకును!

"స్వామిజీకూడ చమత్కారవాక్య)వీను. నే నొక నాడు ఒక కత్తితో పనిచేయుచుండగా దాని మొన విఱిగి పోవుటచే విచారించుచుంటిని. అది చూచి స్వామిజీ 'కత్తుల కెప్పుడును ఇట్టి అంతమే కలుగును. వానికి విషూచి, విష జ్వరము తగులదు!' అని పలికెను. అంతట నేను గట్టిగా నవ్వితిని. ఈ మాటలు ఎంత మనోహరములో చూడుము!

"తల్లి బిడ్డకు ఏదైన నేర్పునప్పుడు అది ఎంత చక్కగా నాటుకొనును! తాను ఒక విషయమును బోధించు చున్నట్లు పలుకదు గాని, ఆ మాటలవలన ఎంతయో బోధము కలుగును. ఇందుకు కారణము ఆమె మాటలకు మూలముగానుండు మహాప్రేమమే. గురువు శిష్యుని మానసిక స్థితిని గ్రహించి, తదనుగుణముగా తన బోధనమార్గమును

ఏర్పఱచుకొనవలెను. అప్పుడుగాని ఆ బోధనలో ప్రభావ ముండదు.

"ఒకతడవ జెబ్బల్‌పూరునుండి యొక పురుషుడు శ్రీరామకృష్ణుని దర్శనార్థము వచ్చెను. అతడు విద్వాంసుడు, ఎమ్. ఏ. పరీక్ష నిచ్చినవాడు, మనసువిచ్చి మాటలాడువాడు, కాని అజ్ఞేయవాదవైఖరి కలవాడు. కావున అతడు శ్రీరామకృష్ణునితో చాలసేపు చర్చ సాగించెను. తాను మిక్కిలి అశాంతచిత్తుడని అతడు ఒప్పుకొనెను, కాని భగవంతుని యునికికి తగు నిరూపణ మేదియు లేమిచే, ఆయననుగూర్చి ప్రార్థింప మనస్సొగ్గొల్పదని చెప్పెను. శ్రీరామకృష్ణుడు అతనితో ఇట్లు చెప్పెను: 'స్వామీ, నీవు కల వనుమాట నిజమే అయినచో నాప్రార్థన నాలకింపుము'అని ప్రార్థింప నీ కేమియు ఆక్షేపణ ఉండదని నాకు తోచుచున్నది. ఏమందువు? ఇట్లు ప్రార్థించితివేని, నీకు శ్రేయస్సు కలుగును'. అతడు కొంతతడవు ఆలోచనచేసి ఆ విధముగా ప్రార్థించుటకు తన కేమియు ఆక్షేపణలేదని చెప్పెను. ఈ ప్రకారము నడచుకొని ఆ పిదప తన యొద్దకు మరల రమ్మని శ్రీరామకృష్ణుడు చెప్పెను. అట్లే అతడు మరల వచ్చినప్పుడు అతనివైఖరియే మాఱియుండెను. శ్రీరామకృష్ణుని పాదములంటి కన్నీటితో నతడు 'నన్ను రక్షించితిరి' అని విన్నవించుకొనెను. స్వామిజీకూడ 'కిడీ'కి * స్పర్శమాత్ర

* ఈ 'కిడీ' అనునది సింగారవేలుముదలియారు అను పేరుగల తన శిష్యునికి స్వామిజీ పెట్టిన ముద్దుపేరు.

మున దైవభక్తి కలిగించెను. అంతకు పూర్వము భగవంతుడు అజ్ఞేయు డని వాదించువారిలో 'కిడీ' ప్రధానుడు.

"ఇతరులకు సహాయముచేయు శక్తి స్వామిజీకి ఉండెను. ఆయనకు ఈర్ష్య లేనేలేదు. కాని అచ్చటనే మాబోటివారికి వచ్చుకష్టము! ఇతరులు మాకన్న నేర్పుతో మాటలాడుదురేమో అని మాకెప్పుడును భీతి! స్వామిజీది అట్లు భయపడునట్టి స్వల్పబుద్ధి కాదు. ఆయనలో ఈర్ష్యాస్పర్శయే లేదు. ఇతరులకు గల లోపములను గుర్తించి వానిని తీర్పగలిగితిరేని తీర్పుడు. అట్లు చేయజాలరేని ఊర కుండుడు. వారిని మీాస్థితికి వచ్చునట్లు క్రిందికి దిగలాగకుడు. ప్రతివానిని వాడున్నచోటినుండి ముందునకు సాగించుటే మనకర్తవ్యము' అని ఆయన పలుకువాడు.

"ప్రతివానికి గల లోపములు సమసిపోవునట్లు ఎంతో అద్భుతముగా శ్రీరామకృష్ణుడు బోధించువాడు. ఇందు కుదాహరణముగా ఆయన ఇట్లు చెప్పువాడు: 'తల్లి ఒక చేపను తెచ్చి దానితో పెక్కు విధములగు కూరలు చేయును. అందఱికిని ఒకే విధమగు కూర చేయదు. ప్రతి వానికిని అతని జీర్ణశక్తి కనుకూలించువిధమగు కూరచేసి పెట్టును'. శ్రీ గురుదేవుడు ఈ మార్గమునే అనుష్ఠించు చుండెను.

"యోగానందస్వామి యొకతడవ శ్రీరామకృష్ణుని కొందఱు దూషించుచుండగా, ఆమాటలు వినెను. ఆ మాట లకు ఆయన ఏమియు బదులాడక విషయమును ఆయనకు

తెలిపెను. అందుపై ఆయన 'నన్ను వారు దూషించుచుండగా విని యూరకుంటివా!' అని అతనిని చీవాట్లు పెట్టెను.

"ఆ పిదప కొన్నాళ్లకు నిరంజనానందస్వామి దక్షిణేశ్వరమునకు ఒక పడవలో వచ్చుచుండెను. ఆ పడవలో అనేకులు శ్రీరామకృష్ణుని దూషించుచుండిరి. నిరంజనానంద స్వామి అసాధారణబలము గలవాడు. తాను కూర్చుండియున్న గదిలోనుండి ఆయన వెంటనే వెలుపలకు వచ్చి, కాళ్లను పడవ ఇరుప్రక్కలను నిలిపి, పడవ నూగులాడించుచు 'మీరు శ్రీరామకృష్ణుని దూషించుచున్నారు. ఇప్పుడు ఈ పడవను నేను ముంచివైచెదను. ఎవ్వరు నన్నడ్డగింప సాహసింతురో చూచెదనుగాక' అని బెదరించెను. అందఱును వెఱచి ఆయనను అట్లు చేయవలదని వేడసాగిరి. శ్రీరామకృష్ణుడిది విని 'మూఢుడా, వారు నన్ను తిట్టినచో నీ కేమి? ఎవరి యిష్ట ప్రకారము వారు పలుకుదురు. నీ వేల అందులో ప్రవేశింపవలెను?' అని పలికెను!

"ఈ వేడుక చూచితివా! శిష్యుని కనుగుణముగా బోధ మార్పబడినది. అట్టి గురువు నీ కెచ్చట లభించును?"

జూలై, 14

స్వామి : "సర్వమును భ్రాంతియే — మాయావిలాసము! పరేచ్ఛావశీకరణవిద్యా (Hypnotism)ప్రదర్శనములు ఎప్పుడైన చూచితివా? వశీకృత మానవుడు నేలపై ఈదుమనినచో ఈదసాగును! మహామాయ మనల నందఱిని అట్లే సమ్మోహితులను చేసినది. జ్ఞాన మొసగు విద్యామాయయు,

అజ్ఞానముగొల్పు అవిద్యామాయయు రెండును ఇట్టి సమ్మోహ కారణములే. జ్ఞానము అజ్ఞానమునకు విరుద్ధము గనుక, మనము మొదటిదాని సహాయముతో రెండవదానిని నశింప జేసికొనవలెను. స్వామిజీ చెప్పు నొక కథను నీ వెఱుగుదువా? 'ఒక మహమ్మదీయుని అన్నములో కొంతభాగ మొక నక్క తినెను. మహమ్మదీయమతములో నక్క మిక్కిలి అపవిత్రజంతువు. కావున నతడు ఒక మతగురువునొద్దకు పోయి ఇందుకు పరిహారమార్గ మడిగెను. అందుపై ఆ గురువు 'కుక్కలు నక్కలకు శత్రువులు, కావున నీ అన్నమును ఒక కుక్కచేతకూడ తినిపించితివేని, అది మరల పవిత్రమగును' అని సలహాయిచ్చెను. అవిద్యను విద్యచేత నశింపజేయవలెను' అనగా అజ్ఞానమును జ్ఞానముచేత నశింపజేయవలెను''.

ప్రశ్న : ''విద్యనుగూడ నశింపచేయుటకు ఏమైన చేయవలయునా?''

స్వామి : ''అక్కఱలేదు. విద్య జ్ఞానమును కలిగించి తాను అదృశ్యమవును. ముగ్గురు దొంగల కథ * నొకటి శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. అది నీకు జ్ఞప్తియున్నదా?''

* ఒకడు అడవిలో ముగ్గురు దొంగలకు చిక్కెను. వారు అతని సొత్తు నంతయు దోచుకొనిరి. అం దొక దొంగ అతనిని చంపబూనెను. కాని రెండవవాడు వల దనగా, అతనిని కాలుసేతులు కట్టి అచ్చటనే వదలివైచిరి. ఆ పిదప కొంచెముసేపటికి మూడవదొంగ వచ్చి వానిబంధములను వదల్చి, రాచబాటయొద్దకు కొనిపోయి, అతని యింటికి సమీపమున

జూలై, 15

స్వామి : "మహాభారతమందు ఉత్తరాయణము ప్రస్తావింపబడియున్నది. భీష్ముడు ఉత్తరాయణపు రాకకై వేచియుండెను. దీనినిబట్టి ఏదో ఒక కాలముకొఱకని అర్థము చేసికొనకూడదు, ఆయనకు స్వచ్ఛందమరణప్రభావము కలదని గ్రహింపవలెను. ఉత్తరాయణ మనునది ఒక కాలమును సూచింపదనియు, ఆ కాలమునకు అధిదేవతను సూచించుననియు శాస్త్రములు తెలుపుచున్నవి. ఇది ప్రఖ్యాతపురుషునికి స్వాగతముచెప్పుటకై జనులు వచ్చుట వంటి దని మనము గ్రహింపవచ్చును. ఈ సందర్భమున నాకొక సంఘటనము జ్ఞప్తికి వచ్చుచున్నది.

"'బ-'కు తన తండ్రి వ్యాధిగ్రస్థుడై యున్నాడని వర్తమానము వచ్చెను. అత డచ్చటికి చేరకముందే తండ్రి మరణించెను. అతడు ఆ గదిలోనికి పోయినప్పుడు ఒక తేజోమూర్తి కానిపించెను. ఆ దృశ్యము తనకై ఎదురు వచ్చుచున్న తన తండ్రిదే యని తాను మొదట భావించినట్లు

---

వదలెను. అతడు ఈ దయాళువగు దొంగకు తన కృతజ్ఞత చూపుటకు వానిని తన ఇంటికి రమ్మనెను. కాని అతడు 'అట్లు వచ్చినయెడల నన్ను రక్షకభటులు పట్టుకొందురు కావున రాను' అనెను. శ్రీ గురుదేవుడు త్రిగుణములను (తమస్సు, రజస్సు, సత్త్వము) ఈ ముగ్గురు దొంగలకును పోల్చెను. తమస్సు చంపును, రజస్సు బంధించును, సత్త్వము విమోచన మిచ్చును. కాని అదికూడ దొంగయే. కావున భగవత్సాక్షాత్కారము ప్రోల నదియు నిలువ జాలదు. ఇచ్చట విద్యను సత్త్వమునకు పోల్ప వచ్చును.

అతడు నాకు వ్రాసెను. కాని వెంటనే మఱియొకతలంపు — వెడలిపోవుచుండు ఆత్మను తీసికొనిపోవ వచ్చిన దేవదూత కానోపునను తలంపు — కలిగెను. 'బ—' అసత్యము పలుకునా? అత డట్టివాడు కాడు. ఇదికాక ఈ గీతా వాక్యమువలన ఇట్టి సంఘటనములు జరుగుట నేను నమ్మ గలను: 'ఆత్మ శరీరమునుండి వెడలిపోవుటను, దానియందు వసించుచుండుటను, గుణాన్వితుడై విషయములను భోగించు చుండుటను, విమూఢులు చూడజాలరు. కాని జ్ఞానచక్షువు గలవారు వీని నన్నిటిని అతడు చేయుటను చూడగలరు.'

" 'పిశాచమును చూచినవాడైనను కేవల పుస్తక జ్ఞానము కలవానికన్న ఉత్తముడు. ఏలన, మరణానంతర జీవిత మొకటి కలదని అతనికి విశ్వాసము కలుగు నవకాశ మేర్పడుచున్నదిగదా' అని స్వామిజీ చెప్పవాడు."

జూలై, 16

స్వామి: "నేను ఈ దినము భోజనము చేయునప్పుడు రొట్టె నాకు ప్రతికూల మగునేమో యని స్ఫురించెను. కాని దానిని కైకొంటిని. ఇది ఎంత చిత్రమైన సంగతి! ఒక కార్యము తప్పు అని మనకు తెలిసియు, దానిని చేయుచునే యుందుము! ఇది జగన్మాత కల్పించు భ్రమచే కలుగును. మరల, ఒక్కొక్కపనిని చేయనారంభించినపిదప అది మనకు ఇంపుగానుండును. 'తినుకొలది నాకిప్పుడు చక్కగా నున్నది' అను కథను నీ వెప్పుడును వినలేదా? ఒకడు ఉద్యోగస్థలము నుండి తన యింటికి వచ్చెను. అతని ముసలితల్లి అతనికై పెక్క

కూరలు వండియుండెను. కాని అతడు 'అమ్మా, ఏమి వంట యిది! ఎంత అసహ్యముగా నున్నది! ఏమాత్రమును బాగుండలేదే' అని పలికెను. అప్పుడే అతనిభార్య ప్రవేశించి 'ఏమి! అట్లనుచున్నారు! అవి యన్నియు నేను వండినవే' అని పలికెను. 'అట్లనా' అని ఆ యువకుడు ఆశ్చర్యముతో పలికెను. కొంచెము సేపటికి అతడు 'తినుకొలది నా కిప్పుడు చక్కగా నున్నది' అనెను!

"ఈ ప్రపంచములో ఏదియును ఉపకరించునది లేదు. కాని జనులు ఉన్మత్తులై దీనికొఱకును, దానికొఱకును, పరుగిడుచుందురు. అవి తమకు లభించునని వారి కొక వెఱ్ఱి ఆశ యుండును.

"జనకుని రాజ్యమున నొక వేశ్య యుండెను. ఒక రాత్రి యామె ఎంతయో తడవు తన కడకు ఎవరైనను వత్తురని నిరీక్షించుచుండెను. రెండుగంటలు కొట్టినను ఎవ్వరును రాకపోవుట చూచి ఆమె నిరాశ చేసికొనెను. 'ఈ రాజ్యములో నాకన్న దురదృష్టవంతురాలు ఎవ్వరును లేరు. ఆశలో చిక్కి భ్రాంతురాలనై ఎట్టి మనోవ్యథల ననుభవించితిని! ఇక చాలును! పోయి పరుండెదను' అని తలచెను. ఇట్లు అనుకొని ఆమె వెళ్లి నిదురించెను. సమీపములో నొక యవధూత యుండెను. అత డిది యంతయు చూచి ఆమెను తలచుకొని 'నీవు ఆశాపాశములను త్రెంచుకొని సుఖముగా నిద్రించుచున్నావు. నీకు నా ప్రణామములు. నీవు నాకు గురువవు' అని యనుకొనుచు వెడలిపోయెను.

"సెర్ జేమ్స్ మెస్టన్‌కు కలిగిన యొక 'దురవగాహ సమస్య'నుగూర్చి నేను వార్తాపత్రికలలో చదివితిని. అతనికి కలిగిన సమస్య యిది: 'అంత మహోర్ఝంఝామారుతము (మహమ్మదీయరాజ్యాగమనము) హిందూసంఘముపై వీచెను. కాని అది ఆ సర్వమును తనలో నిముడ్చుకొని తన వ్యక్తిత్వమును ఎట్లు నిలుపుకొన్నది? ఇంత జీవశక్తి దాని కెచ్చటనుండి వచ్చెను? మహమ్మదీయులు ఖడ్గము చేతబూని తమ మతములో ఎందఱనో చేర్చుకొనినను, హిందూ సంఘమున కేమియు అపకారము కలుగలేదు! ఏమి చిత్రము!'

"మన (భారతీయుల) సంబంధమంతయు బ్రహ్మము తోడనే. కావున మనకు ప్రాణశక్తి యుండుట సముచితము. 'ఈ హిందువులు ప్రజాస్వామ్యప్రభుత్వమార్గమునుకూడ ఇముడ్చుకొగలరు' అని సెర్ జేమ్స్ తలచెను. బహుశః ప్రజాస్వామ్యప్రభుత్వము నిచ్చినచో హైందవసంఘము తన శక్తినంతయు పోగొట్టుకొని దుర్బలమగునని ప్రభుత్వమువారు తలచిరి కాబోలును! కాని విధినిర్ణయ మదికాదు."

ఒకరు: "మనలను క్రీస్తుమతములో కలియునట్లు అంతగా చేయజాలకపోయినను, మొత్తముపై మన భావములను క్రైస్తవమతాభిముఖ మగునట్లు చేయజాలితి మని[illegible]రనుచున్నారు."

స్వామి: "జాతిభేదభావము మిగుల ప్రబలిపోవు చున్నది. కొన్నాళ్లకు ఏసుక్రీస్తునుకూడ ఆసియాదేశస్థు డని

వీరు విడనాడుదురేమో! వారిప్పుడు 'మానవాతీతులు' అను భావము నొకదానిని సృష్టించుకొన్నారు. మొన్నటి యుద్ధములో చూచితివిగదా, మానవాతీతులు ఎట్టి స్థితిగతులను కల్పింపగలిగినది!

" '—బాబు' కడనుండి నాకొక ఉత్తరము వచ్చినది. తన కుమారుని మరణసందర్భమున నతడా జాబు వ్రాసెను. గీతాకారుడు 'శోకసంవిగ్నమానసః' * అనుటలో ఎట్టి మనఃస్థితిని సూచించెనో అది నాకీ జాబువలన స్పష్టపడినది. అతడిప్పుడు 'తంత్రములను' చదువుచున్నాడు. తంత్రములు అనుష్ఠానయోగ్యములైనవి; ఉపనిషత్తులు అట్లుగాక కేవల సిద్ధాంతరూపములైనవి. ఉపనిషత్తులను తంత్రములు పెక్కువిధముల మించియున్నవి. తంత్రములలో అత్యద్భుతరూపమగు ఉపాసనము (ధ్యానము, లేక పూజ) విధింపబడియుండుట ఇందొక నిదర్శనము. శక్తి (భగవంతుని ప్రభావమును) లేదనువాడు ఎవరు కలరో నాకు తెలుపుము. 'అవతారపురుషులుకూడ శక్తి నుపాసించి ఆ పిదపనే— ఆమె యనుగ్రహముతోనే—మతబోధ చేసిరి' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు.

"శంకరునికిగూడ శక్తియందు పూర్ణవిశ్వాసము కలదు. ఆయన ఆమెనుగూర్చి ఎన్నియో స్తోత్రములు రచియించి యున్నాడు. నీకీ కథ తెలియునా? శంకరుడొకనాడు గంగాస్నానము చేసి, తిరిగి వచ్చుచుండెను. అప్పటికి

---

* దుఃఖముచే సంక్షోభపఱుపబడిన మనస్సు.

ఆయనకు శక్తియం దంతగా విశ్వాసము లేదు. శక్తి యొక వృద్ధస్త్రీ రూపమున అతని మార్గమున కడ్డుగా పరుండి యుండి, తన దుఃస్థితి నతనితో చెప్పుకొనెను. శంకరుడు ఆమెను తాకెను. వెంటనే అతనిలో గల ప్రభావ మంతయు అదృశ్య మయ్యెను. అప్పు డతడు ఆమె శక్తియగుట గ్రహించి, ఆమెను స్తోత్రరూపముగా సంకీర్తింప నారంభించెను. అదియే 'ఆనందలహరి'కి మూలము. ఆ స్తోత్రముచే ఆమెను సంతుష్టిపఱచి, తన ప్రభావము తిరుగ పొందెను. స్తోత్రము లన్నిటిలో మహిమ్నస్తోత్రము అత్యుత్తమమైనది. కనఖాల్‌లో నున్నప్పుడు నేను దానిని అనుదినము పఠించుచుండువాడను. దానిపై మధుసూదనుని వ్యాఖ్యానముకూడ నేను చదువువాడను. పుష్పదంతు డను నొక గంధర్వుడు శివనిర్మాల్యము లగు పుష్పములను త్రొక్కి వాయుగమన శక్తిని కోల్పోయెను. అందుపై నతడు శివమహిమ్నస్తోత్రమును రచించి సంకీర్తింపగా, మరల అతనికి ఆ శక్తి వచ్చెను. అది అత్యద్భుతమగు స్తోత్రము."

జూలై, 19

కాశిలో నివసించుచున్న ఒక సుప్రసిద్ధసంయమీంద్రుడగు చామేలిపురి మరణించెనని స్వామితో నొకరు చెప్పిరి.

స్వామి : "ఎప్పుడు మరణించెను?"

ఒకరు : "నిన్న మధ్యాహ్నము."

స్వామి : "మీ కెవరికైనను ఆ విషయము వివరముగా తెలియునా? అతడు కడు వృద్ధుడు —108 ఏండ్ల

వాడు; అఱువదేండ్లుగా ఆ తోటలోనే నివసించుచుండెను. ఎంత ధీరుడు! ఆ ధీరత్వమునకు కారణము అతని నిష్ఠుర బ్రహ్మచర్యము. అతని నొకసారి నేను దర్శింప వెళ్లితిని. అతడు 'శివ కేదార్! శివ కేదార్!' అని ఉచ్చరించుచుండెను. ఆ ఉచ్చారణలో ఎంతో అపారబల మిమిడియుండెను. అట్టివారి మరణము మదురమాగి తనంతటతానే పడిపోవు పండువంటిది. వారి కేమాత్రమును బాధ యుండదు. నాకిప్పుడు 54 ఏండ్లు మాత్రమే, కాని నాకే ఈ ప్రపంచము ఎంతో పురాతనముగ కాన్పించుచున్నది! అతనికి 108 ఏండ్లు — నా వయస్సునకు రెండింతలు; అతనికి అది ఇంక ఎంత పురాతనముగా కాన్పించియుండవలెను! కాశియొక్క పురాతనచరిత్ర యెంతయో అతనికి తెలిసియుండును. 'అ–'బాబు ఆయనను మూడునాలు గేండ్లపాటు పోషించెను. ఆ సంయమీంద్రుని చూచుటకు తాను మొదటితడవ వెళ్లినప్పుడు, ఆయన 'నేను ఈ దిన మంతయు ప స్తు పడియున్నాను. జగన్మాత నీ ద్వారా నాకై ఏమి పంపినది? దాని నిమ్ము భుజించెదను' అని యడిగె నని అతడు నాకు చెప్పినాడు. అప్పటినుండియు అతడే ఆయనకు భోజన మంపుచుండెను. అతని యుద్యోగియగు 'పండిత—' ఆ యతీశ్వరుని యొద్దకు అనుదినమును భోజనము తీసికొని పోవువాడు.

"ఆ పండితునికి మిక్కిలి పొడుగగు ముక్కు గలదు. పొడువగు ముక్కు దేనిని సూచించునో నీకు తెలియునా? 'కొలదిమందికే పొడుగుముక్కులు కలవారు దొరకి

యుండినచో, నేను సర్వమును సాధించియుందు' నని నెపోలియను పలికెను. ఈ విషయము అతని జీవితచరిత్ర ములో నీవు చదివియుందువు. పొడుగుముక్కు మిక్కుటమగు స్వామిభక్తిని సూచించును.

"అసీఘట్టమున 'మగ్నబాబా' అను మఱొక సాధువు కలడు. అతడుకూడ మిక్కిలి వృద్ధుడే. అతడు ఎన్నో ఏండ్లుగా కాశిలో నున్నాడు; నైష్ఠికబ్రహ్మచారి; మంచివిద్వాంసుడు; కాని మిక్కిలి పూర్వాచారపరా యణుడు. 'విద్వత్సన్న్యాసము' అనుపేర శాస్త్రములలో పేర్కొనబడియున్న దశకు అతడు వచ్చెను. ఆ దశయందు సన్న్యాసాశ్రమము మానవునికి స్వాభావికముగా లభించును. అతనికి అద్భుతమగు ప్రాణబలము కలదు. ఎట్టి జబ్బుచేసినను సులభముగా స్వస్థతచెందగలడు. అత డొకసారి తీవ్రవ్యాధి గ్రస్తుడై, బ్రహ్మచర్యాశ్రమకృత్యముల నన్నిటిని పాటింప జాలక పోయెను. అప్పు డతడు గంగాతీరమునకు పోయి శాస్త్రోక్తముగా తనంతటతానే సన్న్యాసదీక్ష గైకొనెను. అతనిని నేను పెక్కుసారులు చూచితిని. అత డెప్పుడును ధ్యానమగ్నుడై యుండును. కావుననే కాబోలును అతనికి 'మగ్నబాబా' యనుపేరు పెట్టబడినది. పూర్వాచారపరా యణత కొన్నివిధముల అనుకూలమైనది, మఱికొన్నివిధముల ప్రతికూలమైనది.

"నేడు హీరానందుని జీవితమునుగూర్చి చదివితిని. అది నాకు మిక్కిలి మనోజ్ఞముగా నుండెను. అతడుకూడ

శ్రీరామకృష్ణుని శిష్యులలో నొకడు. శ్రీరామకృష్ణునికి అతడు మిక్కిలి ప్రియుడు. ఆయన అంత్యవ్యాధికాలమున సింధూదేశమునుండి హీరానందుడు వచ్చి ఆయనను దర్శించెను. అతడు కొన్ని మధురభక్ష్యములను, ఒక వదులు చల్లాడమును ఆయనకు తెచ్చియిచ్చెను. ఆ చల్లాడమును ఆయన ఒకనాడు ధరించెను. హీరానందు నొకదిన మాయన స్వామిజీతో ఏదో ఒక విషయమునుగూర్చి చర్చింపుమనెను. స్వామిజీ జ్ఞానదృక్పథమునుండియు, హీరానందుడు భక్తి దృక్పథమునుండియు మాటలాడువారు. చర్చ ఏమియు జరుగలేదు. అతడు కేశవబాబునకుకూడ శిష్యుడే.''

మైదానముపై కొన్ని పక్షులు ఆహారార్థమై తిరుగుచుండెను. వానిని చూచి స్వామి యిట్లనెను: ''వానికి పిల్లలు కలవు. కావుననే ఈ ఆహారముకై వెదకులాట. ఎంత యద్భుతము! అవి తాము తినక, ఆ దొరకిన ఆహారమును తమ పిల్లలకు కొనిపోయి ఇచ్చును. ఆ పిల్లలే కొంచెము పెద్దవైనపిమ్మట వానిని ముక్కుతో పొడిచి అవలకు పంపివేయును. అవి జగన్మాతృకార్యము నొనర్చుచున్నవి. చూచితివా, ఆమె తన పనిని వానిమూలముగ ఎట్లు జరుపుకొనుచున్నదో! 'అమ్మా, నీ పనిని నీవే నిర్వహించుకొనుచుందువు. కాని జనులు తాము అది యొనర్చుచున్నట్లు డంబము లాడుదురు!'

''జంతుశరీరములు దాల్చుట పూర్వకర్మఫలమగు కష్టసుఖములను అనుభవించుటకొఱకే. ఆ శరీరములతో

ఫలాభిసంధిగల క్రొత్త కర్మమేదియు చేయ శక్యముకాదు. ఆ శరీరము నశించినపిదప, అవి తమ సంచితకర్మములో నుండి మఱికొంత కర్మముయొక్క ఫలమును అనుభవించుటకై మఱొకశరీరమును ధరించును. జంతువులకు ధర్మాధర్మ విచారణశక్తి లేదు. కావున వానికి పాపపుణ్యములు లేవు. వానికి కొంత తెలివి ఉండుట స్పష్టమేకాని, అంతకు మించి ఏమియును ఉండదు. క్రొత్తకర్మము కల్పింపగలవారు మనుష్యులుమాత్రమే. వారికి ధర్మాధర్మవిచారణశక్తి యున్నది గనుక అట్లు చేయగలరు. బద్ధులమను భావము వారికిమాత్రమే కలదు; జంతువుల కది లేదు. బద్ధతాభావము కలవారికే నిజమగు మోక్షప్రయత్న ముండుట సాధ్యము. కారాగృహములో బంధింపబడినవాడు విడుదలకై ఎట్లు పోరాడుచుండునో ఎఱుగవా? ఈ ప్రపంచము కారాగృహమను భావము కలిగినవానికే మోక్షమునకై పోరాడు ఆసక్తి కలుగును. ఈ సత్యము నెఱుగకపోవుటయే జననమరణ పరంపరలో నతడు చిక్కియుండుటకు కారణము.

"శ్రీరామకృష్ణుడు చెప్పుచుండిన హోమపక్షి కథ నీ వెఱిగియే యుందువు. గ్రుడ్డులోనుండి ఆ పక్షిపిల్ల వెలువడి, కన్నులు తెఱవగలిగినంతనే, తాను భూమిపై పడుచున్నసంగతి గ్రహించి, ఱివ్వున పైకెగిరిపోవును. అదియే క్షేమము నార్జించుకొను మార్గము. మానవులలో కూడ కొందఱు తమ స్థితిని గ్రహించుటతోడనే ఉత్తమస్థితికి పోవ జూచువారు కలరు.

"(శ్రీ)రామకృష్ణుడు చెప్పినట్లు 'తల్లి'కి ఆట నడచు చుండుట యిష్టము. నే నాయనతో 'ఆమె యిష్టముతో నా కేమి పని, నే నేల ఆట చాలించుకొనగూడదు?' అని అంటిని. అందు కాయన న న్నిట్లు చీవాట్లుపెట్టెను: 'బళీ! ఎంత స్వార్థపరుడవు! ఆట జరుగుచుండుటలో కదా వేడుక యంతయు! ఆటలో చేరక తనయొద్దనే తిరుగుచుండువారిపై 'తల్లి'కి ఇష్టములేదు. కాని ఆటలో మిక్కిలి పరిశ్రమించి ఆ పిమ్మట తనను తాకుటకై వచ్చువారికొఱకు ఆమె చేతులు చాచును. పాచికలాటలో నిపుణు డగువాడు ఒక్కొక్క సారి తాను ఆక్రమించుకొనియుండు దుర్జయస్థానమును—కావలెననియే—విడనాడుట నీ వెప్పుడును చూడలేదా? అతడు కొంచెముసేపటికి తన పాచికలను అత్యద్భుత నిపుణతతో జరిపి మరల తన పూర్వస్థానమునకు వచ్చును'.

"ఇది సాధ్యమా యని నే నాయన నడిగితిని. ఆయన అందుపై నిట్లనెను: 'అవును, తప్పక సాధ్యమే. భగవంతుని అనంతశక్తిని మానవుడు విశ్వసింప బనిలేదా? చేపయెముక గొంతులో ఇఱుకుకొన్నప్పుడు దీనతతో పిల్లికాలిని తాకుట, ఈతచెట్టుకు నమస్కరించుట, * మున్నగు హీనకార్యములు చేయు మానవుడు భగవంతుడు లేడని పలుక సాహసింప వచ్చునా? నీ భావము ఏమి? జ్ఞానమునుగూర్చి నీవు వదరుదువు. కాని భగవంతుడు మానవుని నిద్రయను దుఃస్థితికి లోబఱచి, ఆ స్థితిలో తనను కుక్క కాలితో

---

* అట్లు చేసినచో ఎముక వెలువడునని యొక నమ్మకము కలదు.

తన్నినను, ఎఱుగజాలకుండు దశను కల్పించినాడు గదా!'

"మా మనస్సులలో ఎంత గాఢముగా నాటుకొను నట్లు ఆయన బోధలు సలుపువాడు!"

(శ్రీ) మాతృదేవి శరీరస్థితి మిక్కిలి అపాయదశకు వచ్చుచున్నదని ఆ సమయమున మాకు వార్తవచ్చెను. ఆ ఉత్తరము చదివి వినిపించినప్పుడు స్వామి కొంచెముసేపు ఆలోచనానిమగ్నునివలె నుండి, ఆ పిదప ఇట్లనెను : "ఈ ప్రపంచమున సర్వవస్తువులకును ప్రళయము కలదు. ఏదియు ఈ విధిని అతిక్రమింపగలిగినది లేదు. మరణ మనగా, ప్రళయ మునకు మఱియొక పేరు. ఉత్పత్తి గలదాని కంతయు మృతియు ఉండునని శాస్త్రములు చెప్పుచున్నవి. యాస్క మహర్షి చెప్పినట్లు ప్రతివస్తువునకును పుట్టుక, ఉనికి, పెరుగుదల, ముదిమి, క్షీణత, అంతము ఉండును. పుట్టుక గల ప్రతిదియు—అది జంతువైనను, వృక్షజాతిలోనిదైనను—ఈ ఆఱు మార్పులకు లోబడియే ఉండును. ఈ విధికి భిన్నముగా నుండుట నీ కెక్కడనైనను కాన్పించినదా? మన శాస్త్రకారులు ఇట్టి ఇతరవిషయము లన్నిటిని గూర్చి పలికి నట్లే ఈ విషయమునుగూర్చియు తుదిమాట పలికిరి. వారు ప్రతిపాదించిన పునర్జన్మసిద్ధాంతము మహోత్కృష్టమైనది. క్రీస్తుమతములో ఇట్టి సిద్ధాంతము లేదు. మనుష్యుడు మర ణించి, భూమిలో పూడ్చిపెట్టబడినపిదప, చాలకాలము అతని ఆత్మ దానిలోపలనే జీవించియుండు నని వారిభావము. ఈ జగత్తు నశించినపిదప 'తీర్పుదిన' మొకటి వచ్చును. ఆ

నాడు భగవంతుని కుడిప్రక్కన ఏసుక్రీస్తు కూర్చుండును. దేవదూతలు ప్రతి ఆత్మను సమాధిలోనుండి అచటికి కైకొని వత్తురు. అందులో ఏసుక్రీస్తు తా నెఱుగుదునని ఎవరెవరిని గూర్చి చెప్పునో, వారు స్వర్గలోకమునకు పంపబడుదురు. ఆయన ఎఱుగ నని చెప్పువారు అనంతనరక మనుభవింప పంపివేయబడుదురు. ఇది క్రీస్తుమతసిద్ధాంతము. ఎంత భయంకర విషయమో! 'జ్ఞానస్నాన' సంస్కారము (Baptism) జరుగక మునుపే మరణించిన బిడ్డలకొఱకై పాశ్చాత్య ప్రాటెస్టెంటు క్రైస్తవస్త్రీ లెందఱో ఈ కారణమున దుఃఖింతురు. వారి నమ్మకముప్రకారము జ్ఞానస్నాన సంస్కార మొందనివాడు అనంతనరకము అనుభవింపవలసి యుండునుగదా. క్రైస్తవులలో రోమన్ క్యాథొలిక్ శాఖకు చెందినవారి మతప్రకారము 'పర్గేటరీ' అను నొక ప్రదేశము కలదు. దానిద్వారా స్వర్గలోకమునకు జ్ఞానస్నానము నొందనివారుకూడ పోగలరు. వేదాంతమతము పాశ్చాత్య దేశీయుల నెంత చక్కగా నుద్ధరించినదో, వారికే తెలియును.

"వా రిప్పుడు జన్మాంతరసిద్ధాంతమును యుక్తియుక్తమని అంగీకరించుచున్నారు. ఏలన, దాని ప్రకారము సర్వజనులకును సమానావకాశములు కలవు. ఈ జన్మములో గమ్యమును చేరజాలనివాడు మఱుజన్మములో గాని, ఆ పిమ్మటి జన్మములోగాని, తన స్థితిని చక్కబెట్టుకొను అవకాశముకలదు. ప్రపంచములో స్వామిజీ ఎంత ఆశ్చర్యకరమగు మార్పును కలిగించెనో, ఇచ్చటనుండు మీకు తెలియనే తెలియదు. పాశ్చాత్యదేశపు భావప్రవాహమార్గమునే

ఆయన త్రిప్పివైచెను. ఆ సిద్ధాంతములను ఆయన వివరించిన పిదపనే ఇప్పటి 'నూతనభావోద్యమము' (New Thought Movement) ఉత్పత్తియై పూర్ణవికాసము నొందినది. పాశ్చాత్యతత్త్వశాస్త్రము మన హైందవతత్త్వశాస్త్రమునకు ఏ మాత్రమును దీటురాదు. ఆ విషయమునుగూర్చిన పరమ సత్యములను మన ఋషులు ఎన్నడో నిర్ణయించిరి.

"ఆల్మోరాలోని క్రైస్తవమతబోధకప్రముఖు డొకడు ఈ హిందువులను మన మేమియు మార్పజాలకుండుటకు వారి తత్త్వశాస్త్రమే కారణము' అని చెప్పువాడు. మన తత్త్వ శాస్త్రమువంటిది ప్రపంచమున మఱి యెచ్చటను కానరాదు.

"మన శాస్త్రకారులు ఏకత్వమును అధిగమించిరి. దానిని దాటి ఇంకెట్టి పురోగమనము కలుగగలదు? స్వతంత్ర బుద్ధి వినియోగించుట అలవడుకొలదిని మానవులు బైబిలును విశ్వసింప సంకోచించుచున్నారు. 'యూనిటేరియన్' అను పేరిట నూత్నశాఖ యొకటి ఎమర్సన్‌తో ప్రారంభమైనది. ఆ శాఖవారికిని చక్కని వాఙ్మయ మొకటి కలదు. 'ఏసుక్రీస్తు భగవంతుని కుమారుడైనచో మనముకూడ ఆయన కుమారులమే' అని ఈ శాఖవారు వాదింతురు. పాశ్చాత్యుల భావము లే మార్గమున నడచుచున్నది ప్రపంచ మహాయుద్ధమువలన విస్పష్టమైనది. వీరికి సుఖానుభూతియే గమ్యము. అనాత్మసిద్ధాంతమూలమున నిత్య శ్రేయస్సు చేకూరదని నీ వెఱుగుదువుగదా!

"తులసీదాసు ఈక్రింది వాక్యములలో ఎంత చక్కని సత్యమును వివరించెను! 'రాము డుండుచోట కామము లుండవు; కామము లుండుచోట రాము డుండడు. ఈ రెండును—వెలుగు చీకట్లవలె—ఎప్పటికిని ఒకటిగా నుండ నేరవు'. వంగదేశమునకూడ ఇటీవల ఒక శాఖ ఉత్పత్తి యైనది. వారు యోగ భోగములను—అనగా జడవాదమును, పారమార్థికతను—సమ్మేళన మొందింప జూచుచున్నారు."

వార్తాపత్రిక యొకదానిలో నొక వ్యాసము వెలువడిన దనియు, అది తులసీదాసు భావమును ఖండించుచు, శంకరునికూడ తప్పుపట్టుచున్నదనియు అచ్చటివారిలో నొకరు పలికిరి. పారమార్థికతకును, జడవాదమునకును, పొత్తు కుదుర్పజూచు లేఖ మఱొక వార్తాపత్రికలో ప్రకటింపబడినదని కూడ అతడు తెలిపెను. ఆ లేఖ చదువగా విని స్వామి ఇట్లనెను: "దానిలో చివరిభాగము నా కిష్టముగా నున్నది. కాని ఈ విలేఖకునికి మాయ అనగా నేమియో తెలియదు. వేదాంతశాస్త్రము సాధించిన అత్యున్నతవిషయము మాయాసిద్ధాంతమే. శంకరుని జాగ్రత్తగా పఠించి ఆయన భావములు గ్రహించుటకై శ్రమపడరు; కాని ఆయనయందు తప్పులు పట్టుదురు! ఆ లేఖయందు గీతాశ్లోకములు రెండు ఉదాహరింపబడియున్నవి. ఆ రెంటియందును తప్పులు కలవు. ఇసుమంత సద్విషయమున్నచో, దానితోకూడ ఎంతయో చెత్తచెదారమును వ్యాప్తినొందించు వాడుక. కాని అట్లుచేయువారినికూడ పశ్చాత్తాపము చెందింప మనుష్యులను కలరు. నిజమునకు వారిభావ

మేమో నే నెఱుగజాలకున్నాను. శంకరునిభావము ఇసుమంతయైన గ్రహింపక, ఆయనను విమర్శించు అవివేకులు ఎందఱో కలరు. ఇది వ్రాసినవాడు ఎంత బుద్ధిహీనత చూపినాడు! మన మందఱమును అడవులపాలు కావలెనని శంకరుడెచ్చటను చెప్పలేదు. అతడు స్వయముగా లోకమునకు అపారమగు మేలు చేసినాడు. అతనిజీవితచరిత్రమును చదివిచూడుము. మన మందఱమును లోకములోనే ఉన్నాము. దీనిని వీడి యెచ్చటికి పోగలము? కాని లోకమునకు హితము చేయుటయే ఒక పరమార్థము కాదు. ప్రపంచము ఏ మాత్రమును మాఱక ఎప్పటియట్లే ఉండును. 'అది కుక్కతోకవంటిది: ఏమిచేసినను, చక్కగానిలువదు' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. లోకహితము చేయబూను ప్రయత్నమున నీకు నీవే హితముచేసికొందువు—నీ ముక్తినే సాధించుకొందువు. శంకరుడు తర్కవాదము లొనర్చినచోట్లనెల్ల తనతో చర్చలకు దిగినవారి నందఱిని అతిసులభముగా ఓడించెను. కాని అతడుమాత్రము శాక్తేయుడు—అతనికి శక్తియందు పరిపూర్ణ విశ్వాస ముండెను. అతని స్తోత్రములే ఇందుకు నిదర్శనము. శంకరుని అర్థముచేసికొనుటకు అతి తీక్ష్ణమగు బుద్ధికుశలత వలయును. అది లేనివారి పలుకు లన్నియు శిశుప్రలాపమాత్రములు."

జూలై, 21

శ్రీ మాతృదేవి నిర్యాణవార్త ఈ దినము ఉదయము తెలియవచ్చెను. అందుచే అందఱును అపారముగా

చింతాక్రాంతులైరి. స్వామికూడ ఏమియును మాటలాడక మౌనముద్ర ధరించియుండెను. ఆయన ఆరోగ్యముకూడ సరిగాలేదు; ఇంతవఱ కేమియు లోపలికి పుచ్చుకొనలేదు. ఆయనగదిలో మామూలుగావచ్చువా రందఱును కూడి యుండిరి గాని, అందఱును మౌనముగా నుండిరి. ఈ నిశ్శబ్దతలో స్వామి యొక బెంగాలీపాట పాడెను. దాని యర్థ మిది: " 'మనసా! నీ దుష్క్రియలచే కలిగిన పాపభారమును నీవు మోయుచున్నావు'. ఎక్కడ చూచినను దుఃఖమేకదా! వ్యర్థసంభాషణ మంతటిని నిలిపివైచి మౌనవ్రతమును పూను భావము నాకు గాఢముగా కలుగుచున్నది. మనస్సులోని భావమును నిజముగా వెలిపుచ్చజాలని మాటల వలన ఏమి ప్రయోజనము?

" 'మన కన్నుల ఎదుటనే మన జీవితము తఱిగిపోవు చున్నది. యౌవనము క్షీణించుచున్నది. కడచిపోయిన దినము మరల రాదు. .కాలము జగత్తును అణగద్రొక్కి వైచుచున్నది. కలిమి అతిచంచలము, బుద్బుదప్రాయము. జీవితముకూడ మెఱుపువలె క్షణికము. కావున దేవా! సర్వజనశరణ్యా! నీ దివ్య పాదాబ్జాతములందు శరణాగతుడనగు నన్ను—మించిపోవకమునుపే—రక్షింపుము'.

"మధురలో నొక ధనికు డుండెను. అతడు క్రొత్తగా గ్రామములోనికి వచ్చు సాధువుల నందఱను సత్కరించు వాడు. తన యింటికి వారిని తోడ్కొనిపోయి, వారిని ఇష్టమృష్టాన్నములతో నాదరించును. నే నచ్చటికి పోయి

నప్పుడు అచ్చటి సాధువులు ఆ ధనికునియింట భోజనవసతి చక్కగా నుండుననియు, కావున నన్నచ్చటికి పొమ్మనియు చెప్పిరి. అచట ఇతరసాధువులుకూడ నుండిరి. భోజనానంతరము అట్టి సందర్భములలో పారమార్థికవిషయ మేదియో సాధువులతో ప్రసంగించు వాడుక. ఆ యాచారము ననుసరించి నన్నతడు 'స్వామీ! వైరాగ్యమును ఆర్జించుట ఎట్లు?' అని ప్రశ్నించెను. 'అది నాకు లభించియుండినచో, దాని నార్జించుమార్గము నీకును చెప్పియుందును. నాకది యున్నచో, మీ ఇంటికి భిక్షార్థినై వచ్చియుందునా?' అని నేను వెంటనే బదులుచెప్పితిని. నా యుత్తరమును విని సాధువులు మిక్కిలి హర్షించి 'మనోజ్ఞముగ బదులుచెప్పితి' వని పలికిరి. అతడుకూడ ఆ పై మరేమియు ప్రశ్నింపలేదు.

"ఎచ్చట చూచినను, స్వార్థపరత్వ మొక్కటే కానవచ్చును. అందుకు నా విషయమే ఉదాహరణముగ గైకొనుము. బహుశః నాకు స్వార్థపరత లేదని నేను చెప్పుదును; అట్లే తలంతునుకూడ. కాని ఏమిచెప్పినను, అది అచ్చట నుండియేయున్నది. సర్వేశ్వరా, ఏమిచిత్రము!"

జూలై, 25

వంగదేశపు వైశ్యయువకు డొకడు ఇటీవల తన కుటుంబమును విడనాడి కాశికి వచ్చెను. ఎవ్వరి అనుమతిని పొందకయే కాషాయవస్త్రములు ధరించెను. అతనితల్లి జీవించియున్నది. అతడు ఐహికజీవనము త్యజించుటకు ఆమె

అనుజ్ఞ వేడగా, 'నాకు కావలసినది నీ సుఖ మొక్కటే. నీవు కోరిన మార్గమును అనుసరించుటకు నా ఆక్షేపము లేదు' అని చెప్పెను. ఆ యువకుడు స్వామిని దర్శించుటకై వచ్చెను.

అతని విషయ మంతయు విని స్వామి ఇట్లు చెప్పెను : "వైరాగ్యము మహావిషయమే. నీ తల్లికూడ నీకు అడ్డు రాలేదు. నీవు అవివాహితుడవు, లోకబంధములు నీకు మిక్కిలితక్కువ. నీవు యౌవనములో నున్నావు, ఆరోగ్య వంతుడవు, నీ శరీరలక్షణములనుచూడ, నీకు ఆత్మనిగ్రహము కలదని తోచుచున్నది. కామకళంకము నెఱుగనివారు ఒక ఏబది ఏండ్లకు ఆ భావమును నిర్మూలించుకోగలుగుదురు ; కాని అంత పరిశుద్ధజీవితము గడపకుండినవారు పెక్కు జన్మములకుగాని దానిని నిర్మూలించుకోజాలరు. అది మహాకష్ట సాధ్యమగు పని ! నీవు కాషాయము ధరించినావు. కావున చాతుర్వర్ణ్యమువారు నీకు మ్రొక్కులిడుదురు. అందుచే నీకు పారమార్థికహాని కలుగును. కావున దానిని విసర్జింపుము. ఇక ఉపదేశము అన్ననో, మిక్కిలి సమర్థుడగు గురువునొద్ద దానిని కైకొనవలెను. లేనిచో అపకారము కలుగును. ఉపదేశ మనగా నేమి ? భగవంతుని నామములలో నీకు ఏది ప్రీతికరముగా నుండునో, దానిని కైకొనిన చాలును. హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థింపుము. అతడు నీకు ఏది హితమో దాని నంతయు చేకూర్చును. నీయందు నాకు అక్కఱకలిగినది గనుకనే నీకు ఇంతగా చెప్పు చున్నాను.

"ఒక విషయమును గమనింపుము. నీ తల్లి నీ సుఖమును కోరుచున్నది గనుక, నీవును ఆమె సుఖమును కోరవలెను. ఇంటికి వెళ్లి, ఆమెను సుఖపెట్ట యత్నింపుము. మనముకూడ పసిబిడ్డలమై యుంటి మను మాటను మఱచుట మనకు అలవాటు. తల్లిగర్భములో నున్న కాలమున మన అసహాయస్థితిని మనము జ్ఞప్తికి తెచ్చుకొనుటయే తక్కువ. అప్పుడే పుట్టిన దూడ తనంతటతానే తల్లిపాల నెట్లు కనుగొనినదో చూడుము! అది గంతులు వేయుటకును, తన జీవనాధారమగు గడ్డిపోచలు కొఱుకుటకును, ఎట్లు స్వప్రయత్నము మీదనే ఆధారపడి, ఎంత వేగిరముగ నేర్చుకొన్నది! మానవు డొక్కడే అసహాయుడు! తల్లి శిశువును ఇంచుక సేపైనను కప్పియుంచుట ఏమఱెనేని, దానిగతి మూడినట్లే!

"ఆదర్శము అత్యున్నతముగా నుండవలసినదే; కాని స్వాతిశయభావమును పెట్టుకొనరాదు. మన అర్హత నెంత యధికముగా ప్రదర్శింతుమో, మన శక్తియు అంతగా అధికమగుచుండును.

"సన్న్యసించుట వేడుక కాదు. 'కాలుసేతులు కదల్పక తాటిచెట్టుపైనుండి పడుటకు సాహసింపగలవాడే సన్న్యాసమున కర్హుడు' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. అది సులభకార్యమా? నూఱు విధములగు బంధములు మనలను అడ్డగించుటను నీవు చూచుటలేదా? ఇంటికి వెళ్లి, మీ తల్లిని సేవింపుము. అందుచే నీకు పారమార్థికశ్రేయస్సు కలుగును."

జూలై, 26

స్వామి: "గీత అత్యద్భుతగ్రంథము. అది స్మృతియే యైనను పెక్కండ్రు దానిని ఉపనిషత్తులలో చేర్తురు. వాని సార మంతయు దానియం దుండుటయే ఇందుకు కారణము. ప్రతి అధ్యాయముచివరను అది ఉపనిషత్తుగా పేర్కొనబడి యుండుట నీవు ఎఱుగవా? గీతకు 'శ్రీమద్భగవద్గీతోపనిషత్తు' అని పేరు. కావుననే 'గీతాజలములో నొక్కసారి స్నానమాడినవారికి జన్మజన్మాంతరములనుండి సంచితమైన సంసారమలమంతయు విమోచనమగును' అని మనఋషులు పలికిరి. మన మనశ్శరీరములు జన్మజన్మాంతరములనుండి పేరుకొన్న మాలిన్యముతో నిండియున్నవి. అదంతయు ఒక్క గీతాజలస్నానముతో నశించిపోవును... దానిని పైపైన చదివినచాలదు. లోతునకు పోవలెను. నీవు ఉపనిషత్తులను మొదట పఠించితివేని, గీత నీకప్పుడు మిక్కిలి చక్కగా అర్థమగును."

అఖండస్థితినిగూర్చియు, అట్టి ఇతరవిషయములను గూర్చియు, మాటలాడుకొలది స్వామి ఉత్సాహపూరితుడై, అచ్చటివారిపై హఠాత్తుగా దృష్టిపఱపి ఇట్లనెను: "అందుచేతనే 'కవితాస్వారస్యస్పర్శ నెఱుగనివానితో సరసకవిత్వమునుగుఱించి మాటలాడు దౌర్భాగ్యము నాకెన్నడును కలుగకుండుగాక!' అని యొక కవి వ్రాసికొనెను." అచ్చట నున్న ప్రతివాడును తమ జీవితమున నెంత స్వల్పఫలము ఆర్జించినది జ్ఞప్తికి తెచ్చుకొని, లజ్జించి మౌనముగానుండెను.

అప్పు డేర్పడిన భావతీవ్రతను స్వామి గుర్తించి మఱియొక విషయమునుగూర్చి మాటాడనారంభించెను. "ఇప్పుడు చల్లగా, హాయిగా నున్నది. ఇన్నాళ్లు ఎంత దుర్భరమగు మిడిమెండ వేడిమి ననుభవించితిమి! వాతావరణపు శీతోష్ణములు శాశ్వతములు కావు. అవి వచ్చుచు పోవుచుండునవి. 'మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః। ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥' (ఇంద్రియములకు వస్తువులతో సంబంధము కలుగుటచేతనే శీతోష్ణములు, సుఖదుఃఖములు చేకూరుచున్నవి. ఇవన్నియు వచ్చుచు పోవుచు ఉండునవి; అనిత్యములు. కావున వీనిని సహింపుము) అని గీతలో నీవు చదువలేదా? ఇవి ఇంద్రియానుభవమాత్రములే కనుక వానిని లక్ష్యపెట్టవలదని భగవానుని బోధ. 'బెంగాలీలో ప్రతిశబ్దమును సూచించుటకు ఒకటియో, రెండో అక్షరములుమాత్రమే కలవు. కాని 'శ' వర్గమున మూడక్షరములుకలవు. దీనియర్థము మనకు 'సహనము' —క్షమ— ఉండవలయునని.* సహనము కలవాడు బ్రతుకగలడు. తద్విరుద్ధప్రవర్తనముకలవాడు కడగండ్లపాలగును' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడుగదా. ఇన్నాళ్లు ఎంత భయంకరమగు వేడిమి ననుభవించితిమి! ఇప్పుడు సుఖముగా, చల్లగా నున్నది. సముద్రముదాటిన

* బెంగాలీలో శవర్గములోని అక్షరత్రయము నొకేవిధముగ నుచ్చరింతురు. మఱియు సహానశబ్దముయొక్క మధ్యమపురుషముకూడ ఆ భాషలో 'స' అనియే ఉండును. దానిని కూడ ఈ అక్షరములవలెనే పలుకుదురు.

వానికి ఆ పిదప అది యొక చిన్న అడుసుగుంటమాత్రముగా తోచును. వ్యాకులత, కష్టము, ప్రథమదశయందే.''

ఒకింతతడవు ఊరకుండి స్వామి మరల నిట్లు చెప్పెను: ''మాటలాడుట మిక్కిలి కష్టకార్యము. ఏలన ఒకే మాటను ఒక్కొక్కరు ఒక్కొక్కవిధముగా అర్థముచేసికొందురు. తత్ఫలముగా కొందఱు వ్యథలనుకూడ చెందుదురు. యథార్థ సన్న్యాసులును, సిద్ధపురుషులును ఇతరుల మనస్సును నొప్పించు మాట లేవియు పలుకరు. జనసామాన్యమునకు హితములగు సార్వజనీనసత్యములనుమాత్రము పలుకుదురు. కాని అట్టి పలుకులచేతకూడ ఒక్కొక్కతడవ చిక్కులు కలుగుట నీవు చూచియుందువు. చమత్కారవాక్కులను గ్రహింపనివా రెందఱో కలరు. కావున మనము మాట లాడునపుడు కొంత జాగ్రత్త కలిగియుండవలెను.

''ఆహా, శ్రీరామకృష్ణుని వాక్చమత్క్రియాశక్తి ఎంత అపారము! అది అసామాన్యము. ఒకనాడు కేశవబాబు దక్షిణేశ్వరమునకు రావలసియుండెను. కాని నిర్ణీతకాలమునకు ముందుగనే శ్రీరామకృష్ణుడు ఎఱ్ఱంచుపంచ నొకదానిని కట్టుకొని మంచి ఉత్తరీయమును కప్పుకొని పెదవులు తాంబూలరక్తిమతో శోభిల్లుచుండగా, తన గది వసారాలో ఇటునటు తిరుగనారంభించెను. ఆయనను ఈ వేషముతో చూచి, కేశవుడు 'ఆహా, నేడు ఎంత చక్కని వేషము ధరించితిరి! విశేషమేమి?' అని యడిగెను. 'అట్లేల యడిగెదవు? నేడు నేను కేశవుని రంజింపజేయవలెనుగదా!

కావుననే ఇంత జాగ్రత్తతో వేషము ధరించుట' అని శ్రీరామకృష్ణుడు చిఱునగవుతో బదులుచెప్పెను. కేశవుడు ఈ మాటలు విని నవ్వ నారంభించెను.

"స్వామిజీకూడ వాక్చమత్కృతియానిపుణుడే. కాని ఆయన చమత్కారశక్తి శ్రీరామకృష్ణునిశక్తికి సాటిరాదు. శ్రీరామకృష్ణుని భాషణములవలన పొట్టలు పగుల నవ్వుదురు. 'ప్రాపంచికవిషయములను ఎత్తి నేను వినువారిని సరియైన మనోనైఖరిలో నుంతును' అని ఆయన చెప్పువాడు. ఒక తడవ కేశవుని, ప్రతాపచంద్రమజుమ్‌దారును ఉద్దేశించి, వారు గౌరాంగనిత్యానందులవలె ఉన్నారని, యొక బ్రాహ్మ సమాజభక్తుడు పలికెను. శ్రీరామకృష్ణుడు సమీపముననే ఉండగా కేశవు డాయనను 'అగు-చో, మీ రెట్టివారు?' అని అడిగెను. శ్రీరామకృష్ణు డందుకు వెంటనే 'నేను మీ పాదధూళిని' అని బదులిడెను. కేశవుడు ఆ మాట విని 'ఈయన ఎప్పుడును మనకు దొరకడు!' అనెను.

"సరియైన విధమున నమస్కరించు టెట్లో బ్రాహ్మ సామాజికులకు నేర్పినది శ్రీరామకృష్ణుడే. భగవంతుని మాతృభావముతో చూచుటకూడ బ్రాహ్మసామాజికులకు నేర్పినది ఆయనయే.

"శ్రీరామకృష్ణునిమాట లన్నింటిలోను అత్యద్భుత మగు శక్తి యుండెడిది. ఆయన శ్రోతల హృదయములను లాగుకొనుచున్నట్లు కనిపించువాడు. అమెరికా దేశస్థులకు

ముఖాముఖిని మాటలాడుట ఎంతయో యిష్టము. ఉపన్యాసములకన్న ఇది వారిపై ఎక్కువ ప్రభావవంతము.''

క్రమక్రమముగా, భక్తినిగూర్చియు, భక్తులను గూర్చియు సంభాషణ ప్రారంభమయ్యెను.

స్వామి : ''పార్వతీపరమేశ్వరులనుగుఱించిన కథ యొకటి కలదు. కైలాసపర్వతముపై వారిరువురును పాచికలాడుచుండిరి. శివుడు మధ్యలో ఆట నిలిపివైచి వెళ్లిపోయెను. ఆయన మరల వెంటనే వచ్చెను. ఇట్లు హఠాత్తుగ వెడలిపోయి మరలవచ్చుటకు పార్వతీదేవి కారణ మడిగెను. 'నా భక్తు డొకడు తనపై దొంగలు పడగా, మొదట నా శరణు చొచ్చెను. కాని నే నచ్చటికి పోవుసరికే అతడు స్వయంకృషిపై ఆధారపడి, ఒక రాయి కైకొని దొంగలపై, విసరివేయుట చూచితిని. అంతట తిరిగి వచ్చితిని' అని శివుడు బదులిడెను. పరిపూర్ణశరణాగతి నందినవానియెడనే భగవత్కృప ప్రసరించును. భగవంతునిమ్రోల—పరిపూర్ణముగా—శరణుచొచ్చుట సులభకార్యము కాదు. భక్తుడు సర్వదా భగవంతుని కాంచుచుండు నని చెప్పుదురు. ఈ మాట పూర్తిగా నిజము. బైబిలులో ఇట్లు పలుకబడి యున్నది : 'ఎవనికి కలదో, వాని కియ్యబడును ; వానికి ఇంకను సమృద్ధి కలిగింపబడును. కాని ఎవనికడలేదో వాని కడనుండి అంతకుమునుపు ఉన్నదికూడ కైకొనబడును'. ఇదంతయు పూర్ణముగా సత్యము. ఈ విషయమును విశాల

దృక్పథమునుండి చూడుము. దేహారోగ్యవిషయమును కై కొందము. మంచి ఆరోగ్యముకలవాడు క్రమక్రమముగా ఆరోగ్యాభివృద్ధి నొందుచుండును. కొద్దిపాటి పొరపాట్లవలన అతనికి సామాన్యముగ జబ్బుచేయదు. కాని అనారోగ్యవంతుడు ఎంతజాగ్రత్తతో ప్రవర్తించినను, అతనికిగల కొలది ఆరోగ్యమునైనను కాపాడుకో జాలకపోవును. కొద్దిపాటి పొరపాటైనను అతనికి మిక్కిలి అపకారము చేయును. ఇది అన్ని విషయములయందును వర్తించును. ప్రకృతినియమములలో నిది యొకటి.

"కాని ఈ విషయమును మఱొక పక్షమునుండికూడ చూడవచ్చును. వినమ్రత కలవారికి భగవంతుని తోడ్పాటు కలదు—అతడే వారికి చెలికాడు, తోడునీడ. కాని వినమ్రత కలిగియుండుట మిక్కిలి కష్టము. అహంభావస్పర్శ కలిగియుండునంతవఱకు వినమ్రత లభింపదు. శ్రీరామకృష్ణుడు పాకీదానినిగూర్చి పెక్కుసారులు పలుకువాడు : దాని కార్యము అతినీచమైనదిగదా; కాని దాని కొక ఆభరణము లభించెనేని, ఇక దానిని పట్ట పగ్గము లుండవు. ప్రాపంచిక పదవిలోని అధమత్వమువలన కలుగు వినమ్రతకును, భగవద్భక్తుని వినమ్రతకును హస్తిమశకాంతరము కలదుగదా. భగవద్భక్తుడు తాను గడ్డిపోచకన్నను అధముడని భావించుకొనునట్టి వినమ్రభావము కలిగియుండును. 'ప్రభూ, నీవు నా చేయి పట్టుకొని నన్ను నడుపుచున్నావు' అనుమాట వట్టి కవితాభావమాత్రమైనది కాదు.

"'గీతలో 'ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహు రవ్యయమ్, ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్' (సంసారవృక్షమునకు వేళ్లు పైనను కొమ్మలు క్రిందను ఉండును. ఇది అనాదియైనది; అవ్యయమైనది. దీని ఆకులే వేదములు. దీనిని గ్రహింపగలిగినవాడే వేదముల నెఱిగిన వాడు) అని ఉన్నదిగదా. ఇచ్చట బ్రహ్మముయొక్క ప్రస్తావమే లేకపోవుటను గమనింపుము. ఈ ప్రాపంచిక (సంసార)జీవనము నెఱిగినవాడు వేదముల నెఱిగినవా డెట్లగును? ఈ విషయము నిప్పుడు అర్థముచేసికొన జూచెదము గాక. 'ఊర్ధ్వమూలము' అనగా పరమాత్మలోనుండి పుట్టి నది అని అర్థము. అశ్వత్థ మనగా రేపటివఱకును స్థిరముగా నుండనిది. అనగా క్షణికమైనది. కావున ఈ శ్లోకమున కర్థము: 'ఈ సంసారజీవనము నిత్యమైనదికా దన్న, అనగా క్షణికమైనదని, గ్రహించినవాడు వేదముల నెఱిగినవాడే'. విషయ మిప్పుడు స్పష్టమైనదిగదా."

ఆ పిమ్మటిశ్లోకమును చదివి ఈ సంసారవృక్షమును నఱికివేయుటకు వైరాగ్యము ఆవశ్యకమని స్వామి చెప్పెను. పిదప నాలవశ్లోకమును గైకొని, "'తతః పదం తత్పరిమార్గి తవ్యమ్ యస్మిన్ గతా న నివర్తన్తి భూయః' (ఎచటికి పోయినవారు తిరిగిరారో, ఆ బ్రహ్మపదమునుపిమ్మట అన్వేషింప వలయును) అనిగదా ఉన్నది; కాని ఇచ్చట నొక్క చిక్కు కలదు. వారు ఏల తిరిగిరారు? మన మెల్లరమును బ్రహ్మము నుండియే ఉత్పన్నమైతి మని చెప్పుదురుగదా! అగుచో

మన మచ్చటనుండి ఈ సంసారక్షేత్రమునకు తిరిగివచ్చుటను తప్పించుకొనుట ఎట్లు? అఖండపదార్థముతో ఐక్యమైయున్న స్థితినుండి ఈ సంసారస్థితికి దిగిన పిమ్మట, ఆ స్థితికి మరల చేరినను, తిరుగ ఈ సంసారక్షేత్రమునకు వచ్చు అవకాశము తప్పునా?''

స్వామి ఈ ప్రశ్నకు ఆధికారికపురుషుల విషయము ప్రస్తావించుటమూలమున సమాధానము చెప్పెను. ఆధికారికపురుషు లనగా ఈ ప్రపంచపరిపాలనాధికారము నొందిన వారు. స్వామి ఇట్లు చెప్పెను: ''వారి విషయమే వేఱు. వారికి జన్మించినప్పటినుండియు పరిపూర్ణజ్ఞానముండును. వారే బ్రహ్మైక్యస్థితినుండి మరల ఇచ్చటికి రాగలరు. ఇట్లు చేయుటకై వారు తమ మనస్సునందు వాంఛాస్పర్శను నిలుపుకొందురు. *

''ఆ 'బ్రహ్మపదము' ఏది? ఆహా, భగవానుడు దీనిని 'న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః, యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ' (అది సూర్య చంద్రాగ్నుల వెలుగువలన ప్రకాశింపదు. అది నా పరమ ధామము. దానిని చేరినవారు మరల రారు) అని ఎంత చక్కగా నిర్వచించియున్నాడు!

* అనగా, ఒక యర్థమున వారు బ్రహ్మముతో పూర్తిగా ఐక్యమొందరు. ఇతరులు జ్ఞానసిద్ధి కలిగి శరీరము పతనమొందినప్పుడు, అనగా విదేహముక్తి కలిగినకాలమున, బ్రహ్మముతో పరిపూర్ణముగా ఐక్యము నొందుదురు. కావున వారికి పునర్జన్మ ముండదు.

"ప్రతి మానవుని జీవితమందును దీర్ఘకాలపు ఇంద్రియవిషయభోగానంతరము వెక్కసపాటు కలుగును. ఆ తరుణమునందు అతనికొక మహాపురుషసందర్శనము లభించెనేని, అతడు గమ్యమువైపు పురోగమించును. ఇంద్రియ విషయముల నంటుకొనియుండు కీడును చూచుటచేత వైరాగ్యోదయము ప్రథమమున కలుగును. జీవితములోగల ప్రతికూలపక్షమును చూచువఱకును పారమార్థికబోధల వలన అతని కెట్టి ఉపకారమును గలుగదు."

జూలై, 27

స్వామి: "సమాధియందు మనస్సు పరిపూర్ణముగా నశించి పోవును. కాని ఇది నిర్వికల్పసమాధివిషయము. మనస్సును అతికరించినగాని బుద్ధి పూర్తిగా వ్యక్తముకాదు. ఈ మాట కర్థము మనస్సు తుదముట్ట నశించు నని కాదు—ప్రకృతి వికారములతో సంబంధము కలిగియుండిన మనస్సు నశించు ననియే. పరిశుద్ధచిత్తము, పరిశుద్ధాత్మ ఒకటియే అని శ్రీరామకృష్ణుడు చెప్పవాడు. తనలోని ఐహికాభిముఖత్వము నశించినవెంటనే చిత్తము పరిశుద్ధమగును. ఆత్మయొక్క ఏకత్వమును పూర్తిగా విశ్వసించి, సర్వభూతములందును ఆ ఆత్మనే చూచుచు, తదనుసారముగ ప్రవర్తించుచుండువానినే పరిశుద్ధచిత్త మందురు. గీతలోను ఉపనిషత్తులలోను 'ధీరః', 'ఆత్మవాన్', 'ప్రశాన్తధీః' (అనగా సుస్థిరతను, సమత్వమును గల బుద్ధి కలవారు) మున్నగు శబ్దములు తఱుచు ఉపయో

గింపబడియున్నవి. చిత్తము పరిశుద్ధమైనప్పుడే అట్టి స్థితి వచ్చునది."

జూలై, 28

స్వామి : "మరణకాలమందు బాహ్యశక్తి యొకటి అంతరశక్తితో పోరాడును. ఈ రెండు శక్తులును భిన్నములు కావు : ఒకే కేంద్రముగల రెండు వలయాకృతులవంటివి. వానిలో పెద్దది చిన్నదానిని నశింపజేయజూచుచుండును. నేనొకసారి పూరీలో తీవ్రవ్యాధిగ్రస్తుడనై మరణద్వారమున నున్నప్పుడు దీనిని స్పష్టముగా జూచితిని; ఒక కాలు వాకిటి బయటను; రెండవకాలు వాకిటిలోపలను ఉంచుకొని యున్నట్లు తోచినది. రెండువైపులును నాకు కానిపించుచుండెను. దేనియందును ఆసక్తిలేనివానికి మరణము భయంకరముకాదు. ఆసక్తిని విడనాడుట ఆవశ్యకము. ప్రేమము కొన్నికొన్ని వస్తువులమీదమాత్రమే నిలిపియుండుటయే సర్వకష్టములకు హేతువు. మనము గంగానదిలో మునిగినపుడు మనపై ఎన్నియో బారువుల నీరు నిలిచియున్నను, మనకే మాత్రమును బరువు తోపదు. కాని, తలపై నొక నీటికుండ నెత్తుకొనినమాత్రముననే భారముతోచును. వెన్నెముకకూడ విఱుగవచ్చును. నీకు ప్రపంచమున గల భూతము లన్నిటియందును అనురక్తి కలిగినప్పుడు బద్ధుడవుకావు; కాని ఆ యనురక్తిని ప్రత్యేక జీవులపై నెప్పుడు నిలుపుదువో, ఆ క్షణముననే నీవు బంధములో చిక్కుదువు. ఈ భారములను త్రోసివైచుకొన్న

గాని నీకు మోక్షము చేకూరదు. నిరంతరవివేచనము బుద్ధికి తీవ్రత కలిగించును. సత్యాన్వేషణప్రయత్నమున నిరంతర వివేచన మొనర్చువానికి సత్యము స్వయంవ్యక్త మగును. వివేకఖడ్గమును సర్వదా చేతబూని సిద్ధముగా నుంచుకొన వలయును. వేళ్లు దిగియున్న సంసారమనియెడు అశ్వత్థ వృక్షమును వైరాగ్యఖడ్గముతో ఖండించి పరమపదమును (ఎచ్చటికి చేరినవారు మరల తిరిగిరారో ఆ పదమును) చేర బ్రయత్నింపవలెనని భగవానుడు గీతలో చెప్పియున్నాడు.

"పావుర మొకటి తన తోడిపావురము లన్నియు వలలో పడుటను చూచి, భ్రాంతినొంది, తానుకూడ కావలె ననియే దానిలో చిక్కుకొనెను. మానవులు భ్రాంతులై మరణించునది ఇట్లే. 'మహామాయ కల్పించిన వ్యామోహమువలన, అందఱును దానిలో చిక్కుకొందురు. క్షుద్రులగు మానవులమాట అటుండగ, మహాప్రభావ వంతులగు బ్రహ్మవిష్ణువులుకూడ భ్రాంతులగుదురు'. పామరులగు సామాన్యమానవులు సరియేకదా, జ్ఞానులుకూడ జగన్మాత సంకల్పముచే వివేకమును కోల్పోవుదురు."

జగన్మాత తన అనిర్వాచ్యశక్తిచే ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయముల నొనర్చుటయేకాక, అత్యంతమహనీయు లనుకూడ మాయలో త్రోయుననియు, మరల అనుగ్రహము చూపి మానవులకు ముక్తిని ప్రసాదించుననియు తెలుపు కొన్ని శ్లోకములను దుర్గాసప్తశతినుండి స్వామి చదివెను. అటుపిమ్మట ఆయన ఇట్లనెను: "మనస్సును పరిశుద్ధపఱుచు

కొన గలిగితిరేని సర్వమును చక్కబడును. పరిశుద్ధమన స్కులకు బాహ్యప్రపంచమునందు సర్వమును సమకూర్పబడి, సిద్ధము చేయబడియుండును.

"స్వామిజీ అమెరికాకు ప్రథమపర్యాయము వెడలినప్పుడు నేను ఆయన వెంట ఆబూపర్వతమునుండి బొంబాయి వఱకును పయనించితిని. రైలు నడచుచుండగా, స్వామిజీ నాతో ఇట్లనెను: 'ఇప్పుడు అమెరికాలో జరుగుచుండు ఉద్యమ మంతయు దీని (తన్ను చూపుకొనుచు) కొఱకే. నా చిత్తము నాకిది తెలుపుచున్నది. వేగిరముగనే ఈ మాటల లోని సత్యము నీ కెఱుకపడును'. ఈ మాటలు పరిహాస రూపముగా కాక నిశ్చయబుద్ధితోనే చెప్పెను.

"ఇందు కుదాహరణముగా శ్రీరామకృష్ణునివిషయమును కైకొందము. దక్షిణేశ్వరములోని కాళికాలయము ఆయనకొఱకై సిద్ధపఱుపబడియుండెను. ఆ ఏర్పాటులన్నియు ముందుగనే ఆయనకై చేయబడెను." •

డిసెంబర్, 8

ఈ ఉదయమున శ్రీరామకృష్ణసంప్రదాయమునకు చేరినవారు కొందఱు స్వామియొద్ద కూడిరి. ప్రసంగము స్వామిజీనిగూర్చియు ఆయన మన దేశమున కిచ్చిన సందేశమునుగూర్చియు నడచుచుండెను.

స్వామి: "స్వామిజీ ఇట్లు చెప్పువాడు: 'ఆస్తిక ధర్మమే హిందూదేశమునకు ప్రాణము. నేడును ఇది సత్యమే.

సిద్ధపురుషులను ఉత్పత్తిచేయుటతప్ప హిందూ దేశము ఇన్నాళ్లు ఏమిచేయుచున్నది? హిందూదేశము ప్రపంచమంతటికిని ఆస్తికధర్మమును బోధింపవలెను'. స్వామిజీ వాక్యములు సత్యము లయితీఱును. హిందూదేశము మరల ఉన్నతినొందుట సిద్ధము. 'ఈసారి నేనేదియు మఱవక చెప్పవలసిన దంతయు చెప్పితిని' అని స్వామిజీ యొకసారి పలికెను. సత్యమే. ఆయన సర్వమును చెప్పివేసినాడు. ఆయన భావములే ఇప్పుడు కార్యరూపమున ఆచరింపబడు చున్నవి. ఈ దేశములో నిష్కామకర్మాచరణమును ప్రవేశ పెట్టుట స్వామిజీ చేసిన అత్యద్భుతకార్యము. హిందూ దేశము తప్పక ఉన్నతినొందునని నా నమ్మకము. దానిని మన జీవితకాలమున చూచుభాగ్యము మనకు లేకపోయినను, పిదప అది తప్పక సిద్ధించును. లేనిచో శ్రీరామకృష్ణుడు, స్వామిజీ మున్నగు మహాపురుషుల ఆగమనము అర్థరహితమగును. హిందూదేశముయొక్క భవిష్యదౌన్నత్యమును గూర్చి స్వామిజీ వినిశ్చయరూపమగు వాక్కుల నెన్నిమార్లో పలికెను. అవి రిత్తపోవుట సాధ్యముకాదు. ఇప్పటికే ఆ కార్యము ఆరంభమైనది.''

మధ్యాహ్నముమీదట స్వామి గదిలో కొందఱు కూడిరి. వాడుకప్రకారము భాగవతపాఠము నడచెను. పాఠము ముగిసినపిదప స్వామి ఇట్లు చెప్పెను: ''పాపములు మూడు విధములు. ఇవి మనో వాక్కర్మల మూలమున నుత్పత్తియగునవి. ఈ పాపములవలన మానవులు

పశువులుగా, మృగములుగా, మానవశ్రేణిలో అధమాధములుగా, జన్మింతురు.

"మానవశరీరముననే మోక్షద్వారము కలదు. కావున ప్రతివాడును జాగ్రత్తపడి తనజీవితమును ఫలప్రదము చేసికొనవలయును. సుఖానుభవములు ఇతరశరీరములద్వారా కూడ సాధ్యమే; కాని మోక్షముమాత్రము సాధ్యముకాదు.

"బంధము లన్నిటిలో మన దేహములపై మనకు గల అనురక్తి అగ్రతమమైనది, అత్యంతబలిష్ఠ మైనది: కోతులకు తమ పిల్లలపై అపారమగు మాతృప్రేమ కలదు. మృతినొందినపిల్లయొక్క మాంస మంతయు కుళ్ళి, రాలిపోయి, అస్థిపంజరముమాత్రమే మిగిలియున్నను, తల్లికోతి దాని నెత్తుకొనియేయుండును. కాని అవియు, ఇతరజంతుసామాన్యమువలెనే, తమ స్వజీవితరక్షణ కవసరమైనప్పుడు సర్వమును మఱచును."

డిసెంబరు, 20

స్వామి: "మానరూపమగు నిరంతరధ్యానప్రార్థనలచే, మనోగర్భమున నొక అజ్ఞాతదైవీప్రవాహమును కల్పింపవలెను. అది ఎల్లప్పుడును —నిద్రలోకూడ —సజీవాకృతియై యుండును. కలలు రాకుండునని కాదు దీని యర్థము. కాని ఇట్లు ఉత్పత్తియైన అంతర్వాహిని మహోత్కృష్టశక్తితో, ప్రచ్ఛన్నరూపమున, ప్రవహించుచుండును. సాధనకాలమున జనసంపర్క మెంత తగ్గించిన నంత శ్రేష్ఠము. వ్యర్థప్రసంగములను మానవలెను."

డిసెంబరు, 21

స్వామి : "స్త్రీసంయోగ మెన్నిసార్లు చేసిన, అన్ని సార్లు మానవుడు పునర్జన్మ మందునని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. ఆ ప్రతిజన్మమునందును అట్టి సంయోగము లింకను ఏర్పడుచుండు నవకాశ మెంతో కలదు. కావుననే జననమరణచక్ర మనంతముగా సాగుచుండుట. దీని కొకే చికిత్స కలదు: భగవంతుని శరణ మర్థించి, ఈ సాంగత్యా సక్తిని విడనాడి, 'ఇక ఈ ప్రసక్తిని పెట్టుకొనను' అని నిశ్చయ బుద్ధితో పలుకుట. అట్లొనర్చువానియొక్క పూర్వదోషము లన్నియు క్షమింపబడును. కాని ఇందు వంచన మేమాత్ర మును ఉండరాదు. వంచకుని పూర్వదోషము లన్నియు అతనిపై మరల వ్రాలి, వడ్డి మొదళ్లతో తీర్చవలసిన శ్లేర్పడును. యథార్థభక్తునికి శాశ్వతపతన ముండదు. పతన మొందినను, భగవత్కృపచే నతడు మరల కోలుకొనును. 'శాశ్వతనరకము' అనుమాట అర్థరహిత మైనది. అట్టిది కల దని నేను విశ్వసింపను. భక్తు డప్పుడప్పుడు పొరపాటులో కూలినట్టు తోచినను, అందుచేతకూడ భగవత్కార్యము సిద్ధించును."

ఆ పిదప ప్రసంగము కారుణ్యానురాగములపై పుకు మరలెను.

స్వామి : "కారుణ్యమునకును అనురాగమునకును చాల భేదముకలదు. సాధువునకు కారుణ్య ముండవలెను; అనురాగము —మమతాహంకారరూపమైనది— ఉండ

రాదు; బంధకారణ మది. (శ్రీ) గురుదేవునికి స్వామిజీ యందును, అట్టివారియందును, మిక్కిలి యనురాగ ముండెడిది. ఇతరులందుకన్న వారియందు భగవద్భావ మధికముగా గోచరించుచుండుటే ఇందుకు కారణము. ఇది ఆయనకు విస్పష్టముగా తెలిసియుండెను. కావున ఆయనకు బంధ మేర్పడు నను భీతి లేదు.

“సిద్ధపురుషులుకూడ భ్రంశ మొంది బద్ధులు కావచ్చును. జడభరతుని* విషయ మిందు కుదాహరణము. బంధవిముక్తి సాధించుకొనుటకు స్వయంకృషి ఆవశ్యకము. స్వయంకృషివలనగాని శీఘ్రకాలమున ఫలము కలుగదు. అది లేనిచో, ఫల మెప్పటికి లభించునో తెలియదు. ‘చివరి జన్మము’ అనగా, భగవత్సాక్షాత్కారము ఆ జన్మముననే సిద్ధించు నని యర్థము. అవిద్య అనాది యందురు. అది ఎప్పుడు ఉత్పత్తియైనది కనుగొనుటకు శక్యముకాదు. కనుకనే ఇట్లనుట.

---

* జడభరతు డొక పూర్వజన్మమున గొప్ప రాజన్యుడు. ఆ జన్మమున నతడు వార్ధక్యమున వానప్రస్థాశ్రమము నవలంబించియుండగా, తల్లిని కోల్పోయిన యొక జింకపిల్లపై నత డనురాగము వహించెను. తత్ఫలముగా అతనికి భగవంతునియెడ గల తత్పరత్వము చెదరి, మఱుజన్మమున నత డొక జింకయై జన్మించెను. ఆ పిమ్మటిజన్మమున మరల మానవరూపమంది ఈశ్వర సాక్షాత్కారసిద్ధి నందెను. ఆ తుదిజన్మములో నతని పేరు జడభరతుడు. అత డొక జడునివలెను, మతిహీనునివలెను —ప్రాపంచిక బంధములలో చిక్కుకొందు నను భీతిచేత —ఉండుటవలన అతని కా పేరు వచ్చినది.

" 'మీ రింత కఠినసాధన లేల చేయవలయును?' అని గిరీశబాబొకతడవ శ్రీగురుదేవుని ప్రశ్నించెను. అందుకు గురుదేవు డిట్లు బదులుచెప్పెను: 'ఉమామహేశ్వరులకు శాశ్వతైక్యము కలదుగదా. అగుచో ఉమాదేవి అట్టి గాఢ తపస్య ఏల చేసినది? అదంతయు ఇతరుల కాదర్శప్రాయ మగు కార్యము. నే నంత యొనర్చినచో, ఇతరు లందులో పదునాఱవపాలైన నొనర్తురు. ఏ మందువు?' "

డిసెంబర్, 22

బ్రహ్మజ్ఞానమునుగూర్చి ప్రసంగము నడచుచుండెను.

స్వామి: "పరిమితమగు అవగాహనముగల సామాన్య మానవులకు పరమజ్ఞానమునుగూర్చిన మాటలు అర్థరహిత ములై యుండును. సామాన్యముగా ఏర్పడు ఇంద్రియగోచర జ్ఞానము వివేకముచే నశించును. ఈ యింటి నందుకు దృష్టాం తముగా గొనుము. ఇది పరమాణువుల కూడికయే గదా. అట్టిదే ఈ శరీరముకూడ. ఇంకను వివేచనము సాగించినచో, ఈ పరమాణువు లన్నియు ఏకపదార్థముగా — అఖండ పదార్థముగా — పరిణమించును. శ్రీరామకృష్ణు డిట్లు చెప్పువాడు: 'తాటిచెట్టు సత్యమేకాని దాని శాఖలును, ఫలములును సత్యములుకావు. అవి పడిపోవునుగదా. బ్రహ్మ మొక్కటే సత్యము; జగత్తు మార్పులకు లోనైనది. సమష్టిగా చూచినచో, అది బ్రహ్మమే. అప్పు డది సత్య మగును. అజ్ఞాన ముండుదనుకనే జ్ఞాన ముండును. నిజ మునకు అజ్ఞాన మెప్పుడు నశించునో అప్పుడు జ్ఞానముకూడ

నశించును. జ్ఞానము పరమప్రాప్యమగు లక్ష్యముకాదు; లక్ష్య సాధనకు మార్గమాత్రము. బ్రహ్మముతప్ప వేఱేదియు లేదు. 'బ్రహ్మము అఖండసచ్చిదానందము' అనునప్పుడు బ్రహ్మ మదియే అని అర్థముకాదు. అతనికి అంతకన్న సమీపమగు భావము మన మెఱుగమనియే అర్థము. 'బ్రహ్మము అసత్యముకాదు; అజ్ఞానముకాదు; దుఃఖము కాదు' అను భావమును తెలుపుటకే బ్రహ్మమును 'అఖండ సచ్చిదానందము'గ వర్ణించుట. అంతేకాని నిజమునకు బ్రహ్మము మాటలకును, భావమునకును అతీత మగు వస్తువు.

"ఈ శరీరములోకూడ నొక స్థలమున మనస్సును నిలిపినచో, మానవుడు పరిపూర్ణప్రశాంతితో నుండగలుగును. దృక్పథముయొక్క మార్పే ఆవశ్యకము. కష్టములను, వ్యథలను, ఎదుర్కొనక పాఱిపోయిన మాత్రమున, అవి తప్పిపోవు."

డిసెంబెర్, 25

నేటి ప్రసంగము ఏకాంతనివాసమువైపు మరలెను. స్వామి యునైటెడ్ స్టేట్సులో నున్నప్పుడు, కాలిఫోర్నియా 'శాంత్యాశ్రమము'న ఏకాంతవాసము నొక పారమార్థిక సాధనగా నియమించియుండెను.

స్వామి : "అచటికి వచ్చి నివసించు అమెరికాదేశపు భక్తులు దానిని (ఏకాంతవాసమును) 'ఆత్మతోడిసంభాషణము' అనువారు. పారమార్థికముగా దానిచే వారి

కెంతయో ఉపయోగము కలిగినది. వారే అట్లు చెప్పువారు. ఎవరుగాని మూడునాళ్ల కెక్కువగా ఏకాంతవాసము చేయరాదని నియమము. 'బ-' అను కన్యక యొకసారి నా కెఱుకపఱుపకయే ఏకాంతవాస మారంభించెను. అప్పుడు నేనును ఏకాంతవాసము చేయుచుంటిని. ఆశ్రమమునకు కొంతదూరమున నుండిన యొక ఉపగృహములో నా నివాసము. ఆ కాలమున 'గ-' అను నొక్కడుతప్ప పురుషు లెవ్వరును ఆశ్రమములో లేరు. అతడు నాకొకగిన్నెడు తేయాకు పానీయము, కొంచెము వేపుడురొట్టె, మున్నగువానిని భోజ నార్థము తెచ్చిపెట్టుచుండువాడు. నేనొక్కడనుమాత్రము ఒక వారముదినములు ఏకాంతవాసము చేయున ట్లేర్పఱచు కొంటిని. ఆ 'బ-' కన్యకకూడ వారమునా ట్లేకాంతనివాసము చేయుచు నావలెనే నిరంతరధ్యానమున, అల్పాహారముతో, మౌనవ్రతము నవలంబించి గడప నిశ్చయించుకొనెను. కొలది కాలమునకే ఆమెకు ఏకాంతవాసము దుస్సహ మయ్యెను. మతిభ్రంశసూచనలు చూపట్టెను. నేనప్పుడు నా ఏకాంత గృహములో మౌనవ్రతము పాటించుచుంటిని. ఏదో ముప్పు వాటిల్లనున్నట్లు నాకొక నిగూఢప్రబోధము కలిగెను. మన శ్శాంతి కుదురక, అయిదవనాడే నాగదిలోనుండి బయలువెడల వలసివచ్చినది. 'బ-'కన్యక అపాయకరమగు స్థితికి వచ్చియుం డెను. నేను చెప్పిపంపగా ఆమె వచ్చినది. బాగుగా చీవాట్లు పెట్టితిని. తన తప్పు నొప్పుకొని క్షమాపణ వేడెను. ఆమె నాశ్రమమునుండి పంపివేయ దలచితినిగాని, ఆమె పశ్చాత్తాప బుద్ధిని చూచి యుండనిచ్చితిని.

"పిమ్మట ఆమెయే ఇట్లు పలికెను : 'నేను మరణద్వారమును సమీపించుచుంటిని. అప్పుడు వెలుపటికి రప్పింపకపోయినచో, మరణించియే యుందును'. ఆమె మిక్కిలి ధీమంతురాలు. పదునాలుగేండ్లపాటు ఆమె సభావేదికలపై నుపన్యాసము లిచ్చినది. ఎందఱెందఱు శ్రోతలో ఆమె యుపన్యాసములు వినిరి. ఇరువదిరెండేండ్లవయసున 'సత్యనిలయము' అను నొక సంస్థను స్థాపించి, దానిని కొన్నేండ్లు నిర్వహించెను. కాని ఆమెకు అహంభావము లేదు.

"ఆమెవంటివా రనేకు లుండిరి: వారు ప్రఖ్యాతులేగాని, తమ భావములందే వారికి విశ్వాసము. ఐనను వారిలో కపటమేమియు లేదు. వారు ఆశ్చర్యముతో ఇట్లందురు: 'స్వామీ, భిన్నభిన్న ప్రకృతులు గలవారి నిందఱను మీ రెట్లొకటిగా నుంచి, వారికి శిక్షణ మిత్తురు? మీచర్య లన్నిటిని మే మతి జాగ్రత్తగా చూచుచున్నాము. ఇం దేదియు ఆక్షేపణీయమైనది లేదు. ఇదియే సరియైనస్థితి'. ఒక సంస్థను చక్కగా నడపుటకు నిర్వాహకునికి మాతృలక్షణము లుండవలెను: అతడు ప్రేమపూరితుడై, ఆత్రపడని స్వభావము కలవాడై యుండవలెను.

"'క—' మనసంప్రదాయమును వీడి వెళ్ళిపోయినాడట. ఆ మాటవిని నేను మిక్కిలివిచారించితిని. 'శాంత్యాశ్రమము'లో కూడ ఇట్టివి జరుగుచుండెను. అచటి సాధకులను నే నెన్నియో తడవలు తప్పులుచూపి యాక్షేపింపవలసియుండెడిది. [illegible]డలి

పోవుటకుముందు 'క–'కు జబ్బుచేసెను. ఇంటినిగూర్చి కలవ రింపనారంభించెను. తన్ను ఇంటివారివలె ప్రేమతో, శ్రద్ధతో, విచారింపవలెనని అతని కోరిక. అట్టి విచారణ ఇచట జరుగునా? అందుచే అతడు వెళ్ళిపోయెను. జబ్బు పడ్డప్పుడు క్రొత్తవారు అట్లు తలచుట నైజమే. కాని జ్ఞానము, అనుభవము, ముదురుకొలది, తానుండు స్థలమున కనుగుణ ముగా ప్రవర్తించుటయు, సాధుజీవనమునందుగల కష్టములను భరించుటయు, నేర్చుకొనవలెను.

"కావలసినది ప్రేమయే. పశువులుకూడ ప్రేమను గ్రహించి, ఆదరించును. బుద్ధిమంతుడగు మానవుడు దానిని గ్రహింప కుండనేరడు. 'కథలో మేకపిల్ల మేరీ నేల ప్రేమించినది? మేరీ మేకపిల్లను ప్రేమించెను గనుక'."

డిసెంబరు, 28

ఒక గృహస్థభక్తుడును, శ్రీరామకృష్ణసంప్రదాయ సన్న్యాసు లొకకొందఱును, స్వామియొద్ద నుండిరి. ఆ గృహస్థభక్తుడు తన బావమఱదికి అతీంద్రియదృశ్యములు కాన్పించుననియు, అతడు స్వప్నములోను, ధ్యానములోను, ఇష్టదైవమును చూచుననియు, భార్యను మాతృమూర్తిగా ఆరాధింప నాజ్ఞాపితుడయ్యు, ఆమెయొక్క భిన్నప్రకృతివలన అట్లు చేయజాలకున్నాడనియు చెప్పెను.

స్వామి: "భగవంతునిగూర్చి ప్రార్థించినచో, అత డామెబుద్ధిని మార్చునని నీ బాంధవునికి తెల్పుము.

"భగవత్కార్యము చక్కగా సాగుచున్నది. ఆయన లీలలనుగూర్చి మన మెఱిగిన దతిస్వల్పము. ఎన్ని విధముల మానవునికి తోడ్పడి, యతని నాయన పురోగమింప జేయుచుండును! ప్రారంభదశయం దతనికి అలౌకికదృశ్యములను చూపి అతని భక్తిశ్రద్ధలను బలపఱచును. ఇంతేల? ఆయన ఏమిచేసినను, అది సర్వజనకల్యాణార్థమే."

పిమ్మట ప్రసంగవిషయము సేవనుగూర్చినది.

స్వామి: ('స–' వైపు మరలి) "జీవులను దైవభావముతో సేవించుట మహత్తరకార్యము. దీనినిగూర్చి సిద్ధాంతీకరించి మాటలాడు టంతయు, నిష్ప్రయోజనము. అది అనుష్ఠానరూప మొందవలెను. అప్పుడుగాని, జీవులందు ప్రచ్ఛన్నముగా నుండు ఈశ్వరత్వమును బహిరంగపఱచు ఆదర్శము సిద్ధింపనేరదు. శ్రీరామకృష్ణుని బిడ్డల మని చెప్పుకొనువారియందు యోగ, భక్తి, కర్మ, జ్ఞానము లన్నియు — ఇవేల, సర్వమును —దీపించు చుండవలెను. శ్రీరామకృష్ణుడు సర్వమతమార్గసమన్వయస్వరూపుడు గదా! ఏదో యొక్క మార్గమున పారమార్థికసిద్ధి నొంద యత్నించుట పూర్వకాలపు పద్ధతి. ఇప్పుడు సర్వముఖపురోగమనము కావలయును. అందుతోకూడ ఇతరులను సహానబుద్ధితో చూచు హృదయవైశాల్యముకూడ కావలయును."

ప్రసంగము కొంతసేపటికి శరణాగతివైపునకు మరలెను.

స్వామి : ('స–'తో) "ఈశ్వరశరణాగతి నొందగలిగితి మేని, మనము ప్రశాంతముగ నుండగలము. ఆయన కేది మేలని తోచునో, అది చేయుగాక. మనతో ఆయన ఎట్లు ప్రవర్తింపవలెనో ఆ మార్గనిర్ణయ మొనర్చి తెలుపుట వెఱ్ఱి. ఆయన పాదములమ్రోల శరణుచొచ్చినపిదప మన స్వతంత్రేచ్ఛకు తావులేదు. మన కేది హితమో ఆయన ఎఱుగును. అహితవిషయముకై ప్రార్థించినను, మన కేది హితమో దానినే ఆయన ప్రసాదించును."

డిసెంబరు, 31

నేడు (శ్రీ) మాతృదేవి జన్మదినము. స్వామిగదిలో ఎందఱో భక్తులు కూడియుండిరి. కొద్దికాలమునకు మునుపు తనకు వచ్చిన కాలివ్రేలినొప్పినిగూర్చి స్వామి యిట్లనెను: "ఇట్టివి ఏల కలుగునో, ఏల హెచ్చునో, ఏల తగ్గిపోవునో, ఎఱుగజాలము. ఏదోయొక వెఱ్ఱిమొఱ్ఱి అందదుకుల కారణమును మనుష్యులు కల్పింతురుగాని, ఈ జగత్తులో సర్వమునకు మూలమై విశ్వేశ్వరి కలదు. జగత్తులోని సర్వమునకు వెనుక నొక మహాశక్తి మూలకారణమై నిలిచియుండుట నా కనుభవవేద్యము. ఆమె పరమశుభస్వరూపిణి. మానవులకు కలుగు దుర్భరవ్యథలకుకూడ ఆమె సంకల్పమే కారణభూతము. చివర కవి యన్నియు వారికి శ్రేయస్సునే కలిగించును. ఎట్లన, చిత్తమున గూడియుండు అసంఖ్యాక పూర్వసంస్కారముల నవి నిర్మూలించును.

"పూర్వజన్మములలో మానవుడొనర్చిన కర్మము లెన్నియో ఫలరూపము నొందవలసి వేచి యుండును. ఈ జన్మమున నంతటి ఘోరపాతక మేదియు చేసియుండక పోవచ్చును. కాని అనేకపూర్వజన్మసంచితమైన పాపము లుండునుగదా. ఈ వ్యథలకు మూలము అందు గలదు."

'క్ర–' : "ప్రాతినిధ్యదండనముగాకూడ నుండ వచ్చును."

స్వామి : "అవును. అట్లు పలుకువారును కొందఱు కలరు. పూర్వము ప్రాతినిధ్యానుభూతిసిద్ధాంతమందు—ఒకరి పాపములు మఱొక రనుభవింతు రనుటందు—నేను అంతగా నమ్మువాడను కాను, గాని ఇప్పుడు నే నది పూర్తిగా నమ్ముదును. ఇతరులసుఖము నధికపఱచుటయు, దుఃఖమును తఱిగించుటయు, కొందఱికి సుసాధ్యము. ఇట్లు చేయగల శక్తి యొక్క పరిమితి ఆ మానవుని పారమార్థికబలముపై ఆధార పడియుండును. శ్రీరామకృష్ణునియొక్కయు, శ్రీ మాతృదేవి యొక్కయు, జీవితము లీ విశ్వాసమును బలపఱచినవి."

1921, జాన్యువరి 3

స్వామి : "శ్రీరామకృష్ణునియొక్కయు, స్వామిజీ యొక్కయు, మహాశక్తి ఈ మఠకార్యమునకు మూలబలమై నిలిచియున్నది. కావున ఈ కార్యము మృదువుగా కొన సాగుచున్నది. ఈ సంస్థలోనికి క్రొత్తవారు చేరవచ్చు చున్నారు.

"ఎవరెవ రే యే పనికి అలవడియున్నారో, వారివారిని ఆయా పనినే చేయుచుండుడని నే నిటీవల చెప్పుచున్నాను. ప్రతివాడును ఏదో పని చేయవలసియే యుండునుగనుక అలవాటుచే నే యే పని యెవనికి సులభముగా నుండునో, వా రా యా పనియందే నిలిచియుండుట మేలు."

జాన్యువరి, 4

రమేంద్రసుందరత్రివేదీ విరచితమగు 'విచిత్రజగత్తు' అను పుస్తకమును స్వామి చదువుచుండెను. గ్రంథకర్తను ప్రశంసించుచు, స్వామి ఇట్లు పలికెను: "తాను చక్కగా గ్రహించిన విషయమునుగూర్చిమాత్రమే యెవ్వరైనను వివరింపగలరు. అట్లు గ్రహించుటకు మనస్సుయొక్క కేంద్రీకరణ మావశ్యకము. కేంద్రీకరణమునకన్న ధ్యానము శ్రేష్ఠము. శ్రీనగరములో నేను ఉపనిషత్తులనుగూర్చి ధ్యానించువాడను. అ దెంతయో మనోహరవ్యాపారముగా నుండినది. ఈ విధమున ఎనిమిది ఉపనిషత్తులు (మొదటి ఎనిమిది) కంఠస్థము లైనవి. ధ్యాన మనగా ఏదో యొక విషయమందు లీన మైపోవుటే గదా! ఏ విషయముపై మన బుద్ధి కేంద్రీకృత మగునో, ఆ విషయముయొక్క అంతరంగిక తత్త్వ మంతయు మనకు సుస్పష్టముగా తెలిసిపోవును.

"ప్రథమకార్యము మనస్సును సుశిక్షిత మొనర్చి యుండుట. ఆ పిదప దాని నే విషయములో చొనిపినను, ఆ విషయము విశదముగా తెలిసిపోవును. మనస్సును కొంత

కాలము జాగ్రత్తగా కనుపెట్టి పరిశీలించుచున్నగాని, మనము దానిని స్వాధీనములోనికి తెచ్చుకోజాలము. సందర్భానుసారముగా ఇది ప్రేమమూలమునగాని, శిక్షణ మూలమునగాని, సాధింపవచ్చును. మనస్సు నీయొక్క కట్టడలో నుండవలెను. అది నీపై నెక్కి స్వారి చేయరాదు. అది తలక్రిందువ్యాపారమగును.

"ఏ విషయమందైనను, అతిస్వల్పానురక్తి నీకు కలిగె నేని, తన ఇచ్ఛానుసారము నిన్ను నడపుటకు నీ మనస్సునకు సందు ఇచ్చినవాడ వగుదువు. నీవు దానికి దాసుడవై పోవుదువు. కేవలనిస్సంగత్వము సాధించితివేని, ఇట్లెన్నటి కిని జరుగదు. అనురక్తి, కామవికారము మున్నగున వన్నియు ఒకే వస్తువు. ఆ వస్తువుయొక్క బల మధిక మగు కొలది దానికీ వేర్వేఱు పేళ్లు వచ్చుచుండును. 'తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ। పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం॥' (కావున అర్జునా, మొదట నీ వీ ఇంద్రియములను జయించి, జ్ఞానవిజ్ఞానములను నశింప జేయు ఈ (కామమనెడు) పాపమును విడువుము.)—గీత. మనస్సున కే విషయమందైన ఆసక్తి జనించులోపల దాని నా విషయమునుండి మరల్పవలెను. అట్లు చేయనిచో, ఆ కార్యము పిమ్మట అసాధ్య మగును."

ప్రఖ్యాతపురుషు నొకనిగూర్చి స్వామి ఇట్లనెను: "శీలము లేనివానియొక్క వట్టి బోలుమాటలవలన ఏమి ప్రయోజనము? అందఱియొక్క భ్రంశమునకు (కాలు

జాతిపడుటకు) ముఖ్యకారణ మిదియే. 'దాదాపు అందఱును కామవ్యామోహ మనెడు వలలో చిక్కువడినారు. జగన్మాత కొలదిమందినిమాత్రమే రక్షించినది' అని శ్రీరామకృష్ణుడు పలుకువాడు. అది మిక్కిలి అపాయకరమగు వ్యామోహము. దానికి వశులు కాకుండునంతదనుక మానవులు చక్కగనే యుందురు. దానికి వశుడైనవాడు ఎంతటి నీచతకైన పాల్పడును. 'కామకాంచనములు', 'జిహ్వాకామవ్యామోహములు' అను మాటల యర్థ మొక్కటియే. ఈ భోగము లను విడనాడువాడు లోకమును విడనాడె ననియే చెప్ప వలెను. ఇది చేయగలవాడు లోకము నంతటిని ప్రతిఘటించి నిలువగల ధీరుడే.''

జాన్యువరి, 6

స్వామి : ''ఈ లోకము భయంకరమైనది. అసత్యమే ఇచట రాజ్య మేలుచుండును. సాధువునకు సత్యమే సర్వస్వము. సత్యమును పరిత్యజించినచో అతని పురోభివృద్ధి ఆగిపోయినట్లే. హానికరములు కానివైనను, అసత్యములు అసత్యములే.''

జాన్యువరి, 8

నిజమే మాటలాడుట నంత ముఖ్యముగా పరిగణింపని యొక్కరినిగూర్చి స్వామి యిట్లనెను : ''సత్యము భగవంతుడు; అసత్యము మాయ. సత్యవ్రతప్రతిష్ఠు డగువానికి సర్వమును సిద్ధించును. శ్రీరామకృష్ణుడు పండిత శివనాథ

శాస్త్రితో ఈ దెప్పిపొడుపుమాట లాడెను : 'మీ రంద అను మతిచెడనివారుగదా! అగుచో, మీరు అసత్యము లాడుటెట్లు? నన్ను మతిచెడినవా డని మీ రందురు. కాని అసత్యవాక్కొకటియైన, ఎన్నడైన, నా పెదవులను దాటినదా ?' కాళీఘాట్ పురోహితుడు తన్ను కాలితో తన్నిన సంగతి * (మథురునికి తెలియకుండ) రహస్యముగా నుంపగోరి, ఆ విషయ మెవ్వరికిని చెప్పకుండునట్లు తన చేత వాగ్దానము కైకొమ్మని ఆయన హృదయుని కోరెను. హృదయుడు మొదట అట్లు చేయుట కొప్పుకొనలేదు. కాని శ్రీరామకృష్ణుడు విడువక (హృదయునిద్వారా) ఆ వాగ్దానమును మూడుసార్లు చేసి, 'ఇకను ఆ విషయము నా పెదవులను దాటదు' అని పలికెను. ఆ పురోహితుని క్షేమమును కోరియే, ఆ విషయము నెవ్వరికిని తెలుపకుండు నని ఆయన యిట్లు ప్రమాణబద్ధు డయ్యెను.

"శ్రీయుత యదుమల్లిక్ ఇంటికి వత్తునని శ్రీరామకృష్ణు డొకసారి యేదో సందర్భమున మాట యిచ్చియుండెను. కాని దర్శనార్థులై వచ్చినవారితోడి సంభాషణలో మునిగియుండి, ఆ మాటయే మఱచి పోయెను. రాత్రి 11 గంటలకు పరుండబోవునప్పు డది హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చెను. వెంటనే లాంతరు నొకటి వెలిగింపజేసి, బ్రహ్మానంద స్వామిని వెంటబెట్టుకొని ఆ ఆరామగృహమున కేగెను. కాని ద్వారము బంధింపబడియుండెను. అందు ఒక యడుగు లోపల

* శ్రీరామకృష్ణలీలామృతము, 116 వ పుట చూడుడు.

నుంచి 'ఇదిగో నేను వచ్చినాను' అని బిగ్గరగా అఱచెను. ఆయన సర్వమును పరిత్యజించెనుగాని, సత్యమునుమాత్రము పరిత్యజింపజాలకపోయెను.

"సత్యవ్రతపరిపాలనము మిక్కిలి కష్టతరము. అందు కెంతో త్యాగ మవసరమైయుండును. ఒక విషయము నెవ్వరికి తెలుపక దాచియుంతునని ప్రతినపూనుటయు ఒక విధమగు అసత్యక్రియయే. తన వ్యాపారములం దే మాత్రము దాపఱికములేక అంతయు లోకపు ఎఱుకనే జరుపుచుండుట నిజమగు సత్యప్రవర్తనము.

"ఈ మాయాపరిపాలితలోక మెంత భయంకర మైనది! ఎట్టి ప్రళయకల్లోలములు అందు! ప్రశాంతబుద్ధితో దానిని కనుపెట్టియుండ గోరువారు దానిలోనుండి వెలికి రాగల్గి యుండవలెను. అనగా నిస్సంగబుద్ధిని సాధించుకో వలెను. లేనిచో అది మిక్కిలి అపాయకరము. కాని దానిలో నుండి వెలికివచ్చుట మిక్కిలి కష్టసాధ్యము."

జాన్యువరి, 9

స్వామి (కాశినుండి వెడలిపో గోరు నొకరితో) : "కాలు నిలువని త్రిమ్మరీడవు కాకుము. మొన్ననే కదా కలకత్తానుండి వచ్చితివి. అప్పుడే వెళ్లిపోయితివేని, ఇతరు లకు చెడుత్రోవ చూపినవాడ వగుదువు. చిత్తమును నీ వశమున నుంచుకొనుము. నీవు దానివశము కాకుము. నిన్నును, నీ సర్వస్వమును — నీ దేహమును, చిత్తమును,

ఆత్మను అన్నింటిని — భగవంతునికే అర్పించుకొనుము;
'ఓ మనోవిహంగమా, ఒక చెట్టును వీడి మఱొకచెట్టుపై
కెగిరి వివిధఫలము లేల భక్షించుచున్నావు? మహోత్కృష్ట
ఫలము నీయ గల ఆ ఒక్కనియందే నీ శాశ్వతకులాయ
మును (గూటిని) నిర్మించుకొనుము'."

ప్రసంగ మిప్పుడు మంత్రశక్తివైపునకు మరలెను.

స్వామి : "అవును, వ్యాధులను మంత్రబలమువలన
కుదుర్పవచ్చును. కాని భగవదనుగ్రహముచే, ఆ బలము
నకు మూలమగు పురుషునియందే నాకు అంతకన్న అధిక
విశ్వాసము కలదు."

'ద–' : "నా మనస్సునుండి కామవికారమును పాఱ
దోలి నన్ను కావుడు."

స్వామి : "బుద్ధిని దేహముపై గాక ఆత్మపై
నిల్పుము. మనస్సును సర్వదా ఆత్మమీదనే ఏకాగ్ర
పఱచుట నభ్యసింపుము. 'ధ్యాయతో విషయాన్ పుంసః
సఙ్గస్తేషూపజాయతే। సఙ్గాత్ సఞ్జాయతే కామః కామాత్
క్రోధోఽభిజాయతే ॥'—విషయములనుగూర్చి చింతించు
చుండు మానవునికి వానియందు ఆసక్తి కలుగును; ఆసక్తి
నుండి కామము (కోరిక), కామమునుండి క్రోధము (కోపము)
కలుగును.

"ఏకాగ్రరూపమునొందిన కామవికారమే క్రోధము.
దానిచేత మానవుని బుద్ధి స్వాధీనము తప్పిపోయి వివశత్వము

కలుగును. కామవికారముచేత బుద్ధి ఇంతగా స్వాధీనము తప్పిపోదు. క్షణభంగురము లగు విషయములమీదికి మనస్సు నెప్పుడును పోనీయకుము. అట్లొనర్చితివేని నీవు సంగత్వము నుండి తప్పించుకో గలుగుదువు.

"అమెరికాలో నన్ను చూడగోరి యొక స్త్రీ వచ్చెను. ఆమె బుద్ధిని గ్రహించి 'నాతో ఏమైన చెప్పగోరి వచ్చితివా?' అని ప్రశ్నించితిని. తన బుద్ధిని గ్రహించినందుకు సంతసించి ఆమె యిట్లు తన మనోభారమును వెల్లడించు కొనెను : 'నా భర్త మిక్కిలి సంభోగప్రియుడు. నా కట్టి కోరికయే లేదు. అతని సెవతయొద్దకు వెళ్లినను వెళ్లనుమను తించితిని. నన్నుమాత్రము బాధింపవల దంటిని'. అందుకు నేనిట్లు సమాధానము చెప్పితిని : 'నీ ప్రవర్తన ఎంత చక్కగా నున్నది! మీ రిరువురు నొకటిగా నుండి కాపురముచేయ నిర్ణయించుకొని ప్రారంభించితిరి. ఇప్పు డతనిని తటిమివేయ జూచుచున్నావు! అతనితో కూడియుండి, నీ హితోపదేశ ముచే అతనిని సంస్కరింప యత్నింపుము'. ఈ మాటలు విని ఆమె విలపింపసాగెను — విషయ మామెకు తేటయైనది. కొన్నాళ్లొకటిగా నివసించిరి గాని, చివరపటి కామె తాళుకో జాలకపోయినది. ఆమె వేఱుపడెను. కాని ఆ పిదప మరల వివాహ మాడలేదు.

"అమెరికాలో పురుషులు మిక్కిలి కష్టించి పని చేయుదురు ; అట్టివారు ఇంద్రియసుఖానుభవ మపేక్షించుట సహజమేకదా! ఇతరసుఖానుభవము వారికి ఎఱుక లేదు.

కావుననే వారి కంత కామోపభోగవాంఛ. స్త్రీలు అంతటి కాయకష్టము చేయరు. అందులో కొందఱు బుద్ధిశాలినులును కలరు. కావుననే కాబోలును వారికి కామాతురత తక్కువ.

"నే నా దేశములో నున్నప్పు డొక స్త్రీ నన్ను పలుమాఱు పిలువనంప నారంభించెను. ఒక మహాదుర్మార్గుని కామె యుంపుడుకత్తె. అత డామెను బయటకు పోనీయడు. త న్నొకసారి చూచిపొమ్మని నన్నెంతో శ్రద్ధతో వేడుకొనెను. నా రాక ననుమతించున ట్లతనినికూడ ఒప్పించెను. తన ఎదుటనే మాటలుజరుగు నియమముమీద అత డందుల కంగీకరించెను. అతడు కొంచెము దూరముగా కూర్చుండెను. ఆమె తన గది వెలుపటికి వచ్చి నాతో హస్తచాలనము చేసెను. నేను నిలుచుండి, అయిదునిమిషములపా టామె చేతిని నాచేత పట్టుకొని ఆమెబుద్ధి పరిశుద్ధత నందునట్లును, పరిశుద్ధమార్గములనే నడచునట్లును, తీవ్రముగా సంకల్పించితిని. మే మూ పిదప కూర్చుండి, అతని యునికి నే మాత్రము లక్ష్యపెట్టక, పారమార్థికవిషయములనుగూర్చి కొంత తడవు ముచ్చటించితిమి. అతడు కోపావేశముతో 'ఇది అమెరికా దేశ మని ఎఱుగుము' అని గద్దించెను. నే నందుకు 'ఐన నేమి? ఇది అమెరికా అని నే నెఱుగుదును' అని బదులు చెప్పితిని. ఈ సమావేశమువలని ఫల మద్భుతమైనది. ఆ స్త్రీ అతని ప్రాబల్యపు బారినుండి తప్పించుకో గలిగెను. అతనిని విడనాడి వేఱుగా నివసింప నారంభించెను. హస్తచాలనా

నంతరము ఆమె నాతో నిట్లు చెప్పెను : 'నేను సంతుష్టురాల నైతిని. నా క్లిష్టసమస్యలు తీఱిపోయినవి. స్త్రీత్వముయొక్క అర్థము నే నిప్పుడు గ్రహించినాను'.

"గురుశిష్యపరంపరాగత మగు నొక ప్రత్యేకశక్తిని భగవంతుడు మతబోధకులకు ప్రసాదించును. అట్టి దేమియు లేక, వారును తక్కినవారివంటివారే అయినచో, జనులు వారిని వెదకుకొని యేల వత్తురు? తన కార్యమును నిర్వహించుకొఱకే భగవంతుడు వారి కిట్టి శక్తిని ప్రసాదించునది. కాని వారీ శక్తిని స్వార్థసాధనార్థము వినియోగించిరేని, దానిని కోలుపోవుదురు. వక్తృత్వాదులగు ఇతరశక్తు లుండ వచ్చును గాని ఈ ప్రత్యేకశక్తిమాత్రము వారికడనుండి తొలగి పోవును. ఏ కార్యమును సాధించు నిమిత్త మాశక్తి ప్రసాదింపబడెనో, ఆ కార్యము సాధింపబడినపిదపకూడ అది నిలిచియుండును. కాని కొంచెము మందముగా నుండును. దుర్వినియోగము చేయబడినమాత్ర మది నిర్మూలముగా నశించును. ఆహా! ఆ కాలమున నా కెంత మహత్తరమగు సంకల్పబల ముండెడిది! అంతయు ఆయన అద్భుతలీల!"

స్వామి భగవద్గీత ఆఱవ అధ్యాయమునుండి యొక శ్లోకము చదువుచు, నడుమ నడుమ చక్కని అర్థబోధకము లగు వ్యాఖ్యానములు కలిపిచెప్ప నారంభించెను: " 'యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్' (చంచలము, అస్థిరము అగు మనస్సు ఎచటెచటికి పరుగిడునో, ఆ వస్తువులనుండి దానిని

మరల్చి ఆత్మయొక్క స్వాధీనమందే నిల్చునట్లు చేయవలెను.)

"విసుగు విరామము లేక మనస్సును మాటిమాటికి ఆత్మ దెసకు మరల్చుచుండవలెను. చంచలత్వము, అస్థిరత్వము మనస్సునకు నైజలక్షణములు. కొంటెబిడ్డలను చెవులుపిండి పాఠములు చదువుకొనునట్లు చేయమా? మనస్సును ఆత్మయొక్క సమక్షముననే — బుద్ధినికూడ అతిక్రమించి—లాగుకొని పోవలయును. ఎడతెగని పరిశ్రమము, లెక్కకుమీఱి నన్నిసార్లు, చేయవలసివచ్చును. కాని చివరకు మనస్సు నీ స్వాధీనములోనికి వచ్చి నిశ్చలముగా ఆత్మపై నిలుచును. మొదట తమోగుణమును దాటవలెను, ఆ పిదప రజోగుణమును, కడపట సత్త్వగుణమునుకూడ దాటవలసియుండును. నీకప్పుడు ఆత్మ సాక్షాత్కరించును. అది సర్వవ్యాపియై గోచరించును. అతడొక్కడుమాత్రమే కలడనియు, మఱేమియు లేదనియు నీకప్పుడు స్పష్టమగును. ఆ స్థితినే అతీంద్రియప్రజ్ఞానము (సమాధి) అందురు.

"ప్రజ్ఞానముయొక్క పొలిమేరసిబిరము లని వర్ణింపదగు ఇంద్రియమనోబుద్ధులను మనము జయింపవలెను. అట్లుగాని కామవికారమును జయింపజాలము. కామక్రోధలోభములు ఒకే వస్తువుయొక్క వేర్వేఱు రూపములు. జ్ఞానికి అవి నిత్యవైరులు, జ్ఞానవిజ్ఞానవినాశకరములు. ఇంద్రియములను భగవంతునితో కూర్పుము. వానికి బుద్ధి కఱపు మార్గ మదియే."

త్రాగుబోతులయొక్కయు, ఇంద్రియభోగలాలసుల యొక్కయు జీవితముల నున్నట్టుండి శ్రీరామకృష్ణుడు మార్పుచెందించుచుండిన విషయమును 'ద–'ప్రస్తావించెను. అందుపై స్వామి యిట్లనెను: "అవును, అవన్నియు నిజమే. అట్టివారిలో కొందఱి కాయన కొంత వ్యవధి నిచ్చువాడు. వారితో ఆయన ఇట్లనును: 'కానిండు, ఇంక కొన్నాళ్లు ఈ సుఖములనే అనుభవింపుడు. కాని ఈ బెకబెకలు చాల కాలము నిలువజాలవు. మిమ్ము కఱచినది ఘటసర్పము'

"ఆత్మ నంటియుండువారికి అపాయ ముండదు."

జాన్యువరి, 11

స్వామి: "నిన్నసాయంకాలము నాకు కొంచెము జ్వరము తగిలినది. నా పరిచారకులు దానిని మొదట నాకు తెలుపక దాచి 99·2 డిగ్రీలు మాత్రమే కానిపించెననిరి. నిజ మెఱుకపడినవెనుక తప్పుగా చూచితి మని చెప్పి తప్పించుకొనిరి. 'అజ్ఞత సుఖప్రద మైనప్పుడు జ్ఞానప్రదర్శన మవివేకము.' కాని అజ్ఞత ప్రయోజనకారి కానేరదు. జ్ఞాన మొక్కటే వాస్తవమైనది. 'జ్ఞానోదయ మగుటతోడనే ద్వంద్వభావ మంతయు అదృశ్య మగును' అని గదా గౌడపాదుడు చెప్పియున్నాడు. ఈ ద్వంద్వభావమే సర్వ పాపమూలము. ద్వంద్వభావము నశించుటతోడనే భయ మంతయు నశించును. 'భయమునకు జనకత్వము ద్వంద్వ భావమునందే కలదు.' 'జనకా, యథార్థముగా నీవు భయాతీతత్వమును సాధించినావు!'

"పలుకు మాటల కనుగుణముగా ఆచరింపనివాని శాస్త్రపఠనము నిష్ప్రయోజనము. శాస్త్రము లనాదిసిద్ధము లైనవి! 'కాంగ్రా' కనుమ ప్రాంతమున నేనును, బ్రహ్మానంద స్వామియును పర్యటించుచున్నప్పుడు — నాకప్పుడు సుమారిరువదియాఱేండ్లుండును —ఒక సాధువు మాకు తటస్థించెను. అతడు నిష్కపటి, మిక్కిలి ఋజువర్తనుఁడు. సుమారు నలువదిరెండేండ్లవాఁడు. అత డిట్లు చెప్పెను: 'నేను పదియాఱేండ్లుగా వేదాంతపఠనము చేయుచున్నాను. కాని నేడును స్త్రీని చూచితినేని నా ఆత్మనిగ్రహము సడలిపోవును: చింతపండు యొక్క తలంపుచే నోట నీరూఱినట్లు!' అతడు నిజమాడెను. పుస్తకములలో నేమికలదు!

"చండాశోకు డొకనిపై నత్యంతకుపితుడై, ఖడ్గము చేత బూని వానిని తఱిమెను. వాడొక సాధుజనుని యాశ్రమమున శరణుచొచ్చెను. ఆ సాధువు తన చర్య అపాయకరమని యెఱిగియు, శరణ మిచ్చెను. అశోకుడు వచ్చి ప్రశ్నింపగా, అత డచ్చట నున్నాడని సాధువు ఒప్పుకొనెను —అత డసత్య మాడునా! 'వానిని నాకప్పగింపుము' అని చక్రవర్తి యనెను. 'అట్లు చేయజాలను' అని సాధువు ధీరతతో పలికెను. అశోకుడు రౌద్రమూర్తియై అతనిని చంపుటకై ఖడ్గము నెత్తెను. కాని సాధువు నిశ్చలముగా, ప్రశాంతతతో, రూపుదాల్చిననిర్భయత్వమో యన, వ్రేటును నిరీక్షించుచు నిలుచుండెను. 'నీవు మరణముఖమున నెట్లు కంపింపకున్నావు' అను చక్రవర్తి ప్రశ్న కతడు 'ఏల కంపింప

వలెను? ఎవరి మరణమునుగూర్చి మీరు పలుకుచున్నారు?" అని బదులుప్రశ్న వేసెను. తదనంతరపు చర్చాఫలితముగ చండాశోకుడు ధర్మాశోకుడుగా మాఱిపోయెను. అతడు (చక్రవర్తి) మహాప్రజ్ఞావంతుడు. సత్యము గ్రహింప గల్గెను.

"పంజాబు దేశములోని కొన్ని ప్రాంతములందలి వేదాంతము నియమబద్ధమైనది కాదు. అచటివారు 'నేను బ్రహ్మమును' అందురు. కాని సర్వవిధకార్యములును —అవి తమ కేమియు అంటనట్లు — చేయుచుందురు! వివేకము జ్ఞానచిహ్నము కాదని వారి భావము. స్త్రీల భావముకూడ ఇదియే. వేదాంతము పేరిట అతి హేయవిషయములుకూడ అచట నొక్కొక్కసారి చేయబడును.

"దక్షిణేశ్వరమందు పంచవటిలో నివసింపవచ్చిన సాధువు కథ నీవు వినియేయుందువు. అతని శీలమునుగూర్చి గుసగుసలు బయలుదేఱి అవి తుదకు శ్రీరామకృష్ణుని చెవిని బడెను. ఆయన ఆతని నాక్షేపింపగా, అతడు 'ప్రపంచమే మిథ్యయైనప్పుడు, నా దుశ్చరితముమాత్రము సత్యమా?' అని బదులుచెప్పెను. అందుకు శ్రీరామకృష్ణుడు 'ఇట్టి జ్ఞానముపై నేను ఉమ్మివైతును' అని పలికెను. అసత్యము నెప్పుడును అభివృద్ధి నొందనీయరాదు.

"సామాన్యమానవుడు అనురాగబంధమును దృఢపఱచు వ్యాపారములందు ప్రసక్తుడగును. ప్రపంచమం దంత

టను ఇట్లే జరుగుచుండును. ఇందుకు భిన్నముగా ప్రవర్తించు నది సాధువు లొక్కరే—ప్రపంచము అశాశ్వతమని వా రెఱుగుదురు. వివేకము పరిపూర్ణ మగుటతోడనే జ్ఞానోదయ మగును.''

జాన్యువరి, 12

స్వామి : ''మనస్సు నెప్పుడును లోకాతీత క్షేత్రమున నిలిపియుంచు టెంత కష్టము! దిగిరావలె నని దాని కోరిక. కోరికల పట్టును వదల్చుకొనుట మిక్కిలికష్టము. '''నా'' అన దగువా రెవ్వరును లేనివాడుకూడ ఒక పిల్లిని పెంచుకొని సంసారబంధములు కల్పించుకొనును' అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు.

''పరమార్థసిద్ధి! ఎంత అద్భుతమైన దది! భగవం తుని తలంపే మనస్సును ఆనందమయము చేయును—అతనిని ముఖాముఖని, ప్రత్యక్షముగా, చూచు నానందము నెవరు పూర్ణముగా గ్రహింపగలరు!

'''అఖండానందామృతపరిపూరిత మగు బ్రహ్మాంభో నిధిలో ఏది విసర్జింపవలెను, ఏది గ్రహింపవలెను? నేను కాని దేది? నాకన్న భిన్నమైన దేది? దానియందు నా కేదియు కనిపింపదు, వినిపింపదు, గోచరింపదు. ఆత్మస్వరూపుడనై, నిత్యానందస్వరూపుడనై — తదితర మంతటికిని భిన్నముగా — నేను నిలిచియుందును.' ''

**జాన్యువరి, 14**

నిన్నటి భాగవతపాఠమునుగూర్చి స్వామి ఇట్లు చెప్పెను : "ప్రహ్లాదుడు తన చెలికాండ్ర కెంత మంచి హితోపదేశ మొనర్చెను! 'పసితనమునుండియు ఈశ్వరారాధనము చేయుడు. ఈ దేహము కేవలము తుచ్ఛము. దానియందొక్క గుణముమాత్రమే కలదు : భగవత్సాక్షాత్కారమున కది సహకరించును!' అని వారి కతడు చెప్పెను. భగవంతుని ప్రేమింపుమని తన కెవ్వరును — గురువులుకాని తనకు తానుకాని — బోధింపలేదని తండ్రితో నెంత ధీరతతో పలికెను! భక్తజనుల యనుగ్రహముచేత గాని ఈ భగవత్ప్రేమ లభింప దని అతడు పలికెను. తండ్రి ఇది విని ఇట్లు గద్దించి పలికెను : 'వీ డెవడు? నా మరణమునకు మూలమా వీడు! బ్రహ్మవిష్ణువులుకూడ నాయెదుట కంపించిపోవుదురు. కాని వీడు నాతో నిర్భయముగా వాదింప సాహసించుచున్నాడు! వీనిని చంపుడు!'

"ఇదంతయు కట్టుకథయని మీ రనుకొనుచున్నారేమో! కాదు, అంతయు యథార్థము. ప్రహ్లాదుడు మరణింపలేదు. ఇప్పటికిని జీవించియే యున్నాడు. భక్తు లందఱి హృదయక్షేత్రమునను — మీయందును, నాయందును — అతడు కలడు. అట్టి బ్రహ్మాండమైన ప్రయత్నములే అతనిని చంపజాలకపోయినచో, అత డెట్లు మరణించియుండగలడు? సర్వమయుడు తానే యని అతడు కనుగొనలేదా? విష్ణుపురాణమును చదువుడు. అతని అద్వైతజ్ఞానాను

భూతిచే రాతిబండలుకూడ నీటిపై తేలియాడె నని అందు చెప్పబడియున్నది!

"చండి (దేవీసప్తశతి) మహోక మహోత్కృష్ట గ్రంథము! అందులో నిబంధింపబడిన వేదాంతతత్త్వము శక్తిబ్రహ్మములయొక్క సమైక్యమును స్థాపించినది. 'ఈ జగన్మాత "నిత్య"; కాని జగద్రూపమున ఆమెయే "లీల"యు. ఆమె సర్వమయి'. తన క్రీడ నిరంతరాయముగా సాగుటకై ఆ మహామాయ లోక మంతటిని తన మాయచే సమ్మోహితమొనర్చినది. ఐహికభోగములను, పారమార్థిక మోక్షమునుకూడ, ప్రసాదించున దామెయే. ఇట్టిది ఆ గ్రంథములోని విషయము. సురథు డను రాజన్యుడును, సమాధి యను వైశ్యుడును శ్రీ మహాకాళిని మూడేండ్లు ఉపాసించి తమ వాంఛలను పడసిరి.

"మన మెఱుగుదుము, కాని తదనుసారముగా ఆచరింపజాలము! ఏల? ఆమె మాయాప్రభావమే యిది. ఆమె నాశ్రయించి ఆమె యనుగ్రహము నొందవలెను. 'ఆమె యనుగ్రహించెనేని, మోక్షవరమును ప్రసాదించును'. ఆమె యనుగ్రహము లేని దెవ్వరును ఈ మాయాజాలములో నుండి వెలువడజాలరు. జనసామాన్యము పరమానందమును, విశ్వప్రజ్ఞానమును పొందవలె నన్నచో, ఉపాసనయే అందుకు మార్గము. మార్గాంతరము లేదు.

"నీతో నీ వెట్లు పలుకుదువో అట్లే ఇతరులతోడ కూడ పలుకుము. అనగా, అందఱును నీయొక్క ఆత్మరూ

అని ఎఱుగుము. నీపై నీకెప్పుడైన కోపము వచ్చునా? అట్లే ఇతరులతోకూడ ప్రవర్తింపుము. కాని నీ యాత్మనే ఇతరులందుకూడ నీ వెప్పుడు కాంతువో అప్పుడుగాని ఇది సాధ్యముకాదు. దరిద్రులను నారాయణరూపములుగా ఆరాధింపవలె నను స్వామిజీసిద్ధాంతములో గల మూలభావ మిదియే. నిజమునకు సర్వమును తన ఆత్మగనే తోచు ప్రజ్ఞానక్షేత్ర మొకటికలదు. ఆ క్షేత్రమును చేరినవారి కిక భ్రాంతి యుండదు."

బాబు ఈశానచంద్రముఖర్జీయొక్క అద్భుతధర్మ కార్యము ఇప్పుడు ప్రసంగవిషయ మాయెను. ఈశానబాబు శ్రీరామకృష్ణుని భక్తకోటి లోనివాడు. ఆయన అతనిని ఈ ధర్మకార్యప్రసక్తిని విడనాడి, మన స్సంతయు భగవంతుని మీదికే మరల్పు మని చెప్పియుండెను.

స్వామి: "ఇట్టి ధర్మకార్యములందును అదృశ్య రూపమగు స్వార్థపరత్వము కలదు. యశస్సుపై అతనికి దృష్టి లేకపోలేదు. కావుననే అతడు మధ్యవర్తిగా, న్యాయ పరిష్కర్తగా, మార్గదర్శకుడుగా నుండగలిగెను. నిష్కామ కర్మ మత్యంతదుర్లభము!"

'న–': "ఆ దృక్పథమునుండి చూచినచో, రామకృష్ణ సంప్రదాయసాధువుల మగు మనము సల్పు కర్మముకూడ స్వార్థపరమే కాదా? మానవులు తమతమ స్వాభావిక వాంఛలచేత ప్రేరితులై, కర్మము లాచరింతురని కొంద ఱందురు."

స్వామి : "మానవులు స్వాభావిక వాంఛా ప్రేరితు లగుట నిజమే కాని, యుక్తభావముతో ఆచరింపబడినచో మీ కర్మ యొక్క ఫలము సకామ కార్యఫలమునకు ప్రత్యక్ష విరుద్ధమై యుండును."

'స-' : "మనము చేయు కార్యములు తత్త్వతః శ్రీరామకృష్ణుని కార్యములేనా అని సంశయించువారు కూడ కలరు."

స్వామి : "అట్లగుచో, వా రేల పని చేయుచున్నారు? ఈ కార్యము లన్నియు స్వామిజీవి కాని శ్రీరామకృష్ణునివి కావు అను భేదభావము యుక్తివిరుద్ధమైనది. స్వామిజీ తన సొంతభావ మొక్కటియైనను బోధింపలేదు. స్వామిజీ శ్రీరామకృష్ణులలో భిన్నత్వ మేర్పఱుపజూచువాడు మిక్కిలి సాహసికు డని చెప్పవలెను.

"ఈ కర్మములు ధ్యానమునకన్న హీనగుణము లని యెంచువారు కలరు. వారి మాటల యర్థము వారికే తెలియదు. ధ్యాన మనగా నేమి? దాని కంతటిగౌరవ మెట్లు ప్రాప్తించినది? దాని మూలమున ఆత్మ భగవంతునితో ఐక్య మొందుననియే కదా! కర్మాచరణము నియమించిన స్వామిజీయొక్క భావ మేమో ఇప్పుడు చూతము. మిమ్మును ఆయన ఊరక రోగుల పరిచర్య చేయుచుండు డనెనా, లేక వారియందు, వారిమూలమున, నారాయణుని సేవింపు డనెనా? అగుచో ఈ నారాయణసేవకును ధ్యానమునకును భేద మేమి? ఈ భావముతో కర్మాచరణ మొన

ర్చుట కొందఱికి సాధ్యము కాకుండవచ్చును, కాని ఆ కారణ
మున దానిని గుణహీనమనుటకు వారి కేమి అధికారము
కలదు? సర్వభూతాత్మక మగు ఆత్మయొక్క సాక్షాత్కార
సిద్ధిని పొందియే స్వామిజీ యీ నూత్నమార్గమును ప్రక
టించెను. జనసామాన్య మిది గ్రహింపజాలక, ఆధ్యాత్మిక
సాధనరూపమగు పూర్వమార్గములనే పట్టుకొనుచున్నారు.
యుక్తమార్గమున ఆచరింపబడినచో, ఇట్టి సేవ మూడు
నాళ్లలో పారమార్థికసిద్ధి కలిగించును. దాని నాచరించి
చూచిన ప్రతివానియొక్క అనుభవ మిదియే. తాను చికిత్సా
లయములో పనిచేయుచుండిన కాలమున తా నేదో
అత్యున్నతస్థాయియం దున్నట్లు ఎప్పుడును తోచుచుండెడి
దని 'క-' నాతో చెప్పినాడు. ప్రతిమానవుడును భగవంతుడే
కాడా? 'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి'
(ప్రతి హృదయమునందును ఈశ్వరుడు వాసము చేయు
చుండును.) ఈ సత్యము నెవ్వరైన గ్రహింపజాలకుండిరేని,
ఆ లోపము వారిదా, ఇతరులదా?

"నా జీవితపరమార్థము నిర్వాణసాధనమని నే నొక
సారి శ్రీరామకృష్ణునితో చెప్పగా, అంతటి క్షుద్రాదర్శము
కలిగియున్నందుకు నన్నాయన ఆక్షేపించెను. ఆయన
ఇట్లనెను : 'సామాన్యమానవుడు నిర్వాణముకై పరితపించు
చుండును. పాచికలాటలో క్రొత్తవా డెంత జాగ్రత్తగా
కాయలు నడుపునో చూడలేదా? జంటలుగాగాని నడపడు.
కట్టువడుదునేమో యని అతని కెప్పుడును భయమే.

"స్వగృహము" చేరవలెనని అతనికి నిరంతరాతురత! కాని నిపుణుఁ డిట్లు జాగ్రత్తపడఁడు. అతనికి ఆటసాగుచుండు టొక్కటే కావలసినది. "స్వగృహ"మునకు మిక్కిలి చేరువగా నున్నప్పుడుకూడ పాచికలను కావలెననియే మరలించును. పాచిక లతనిచేతి వ్రాలి వలన ఏ సంఖ్య కావలెనన్న, ఆ సంఖ్య పడును. అవును, "నిపుణుఁడు" ప్రపంచముననే ఉండి వేడుకను జూచుచు ఆనందించుచుండును'. ఈ పలుకులు విని నే నాశ్చర్యమగ్నుడనైతిని. నా సంశయమును వెలి పుచ్చగా, ఆయన ఈశ్వరీకటాక్షముచే అది సుసాధ్యమని నాకు మరల నమ్మకముతోప బల్కెను. ఆలంకారికముగా మాటలాడుచు ఆయన 'కృపామతియై ఆమె పాచికల నంత వ్రాలిపడుచును' అనెను."

'స—': "ఒక యావజ్జీవితకాల కష్టానుభూతి ఒక యెత్తు, అవతారమూర్తితో నొక్కనాటి సాహచర్యసుఖము ఒకయెత్తు అని మీరు మా కొకతడవ చెప్పితిరి."

స్వామి: "అవును, అది నిజమే. శ్రీ గురుదేవునితో కూడి యొక్క గంటసేపు సాముదాయికసంకీర్తన మొనర్చి నే మనుభవించు ఆనందము మమ్మెదో లోకాతీతక్షేత్రము నకు కొనిపోవునది. ఇప్పుడు ధ్యానముకూడ అట్టి అలౌకికా నందమునుగాని, దాని పోలికనుగాని, కలిగింపజాలదు. ఆ ఆనందము మాలో నొక వారముపాటు పాదుకొని నిలిచి యుండెడిది. మా కేదో కైపెక్కిన ట్లుండెడిది; కాని ఏల, ఎట్లు, అని తెలియునది కాదు. దానిని నమ్మువా రెవ

రుందురు? ఎవరినిగాని ఆ విషయమున విశ్వసింపజేయుట కష్టము. కాని నేను చెప్పకతప్పదు.

"సామాన్యమానవుడు దుఃఖము ననుభవించి యుండును గనుక నిర్వాణము వాంఛించును. కాని భగవంతుని సాన్నిధ్య మిచ్చు అపరిమితానందము నతడెఱుగడు.

"(శ్రీ) గురుదేవుడు మధ్యాహ్నభోజనము చేయుచున్నప్పుడు నే నొకసారి దక్షిణేశ్వరము వెళ్లితిని. వివిధ పదార్థములుగల పెక్కు గిన్నె లాయనముందు ఉంపబడియుండెను. అదంతయు అనుచితభోగమనియు, రాజసిక జీవనము గడపువారికే యోగ్యమనియు చూపఱకు తోపక మానదు. వెంటనే ఆయన నాతో ఇట్లనెను: 'నా మనస్సెప్పుడును అఖండముదెస కెగయుచుండును. ఇట్టి రాజసిక తంత్రములచేత దానిని నేను క్రిందిమెట్లను దాటనీయక నిలుపుకొందును. లేనిచో నీతో నే నిప్పుడు మాటలాడియే ఉండజాలను'. ఈ మాటలు విని నే నిట్లు తలచుకొంటిని: 'ఎంత చిత్రము! ఇతరులు గాఢములగు ఆహారనియమముల మూలమున రజస్సును జయించి సత్త్వము నందజూతురు, ఈయన తన మనస్సును సాత్త్వికక్షేత్రమున కెగసిపోకుండ బలాత్కరించి అణచిపెట్టుకోవలెను!'

"తన ప్రతికార్యము, ప్రతిచలనము—అడుగిడుటయు కూడ—లోకహితార్థమే యని ఆయన కృపాతిశయముచే నా కొకసారి తెలియవచ్చునట్లొనర్చెను.

"అస్వార్థకర్మ మను మాటను జను లేదో చూచాయగా అర్థముచేసికొందు రేగాని, స్పష్టముగా తెలిసికొననేరరు. ఏలయన వారికి దానియందు నిజముగా నమ్మకము కుదిరినచో, దాని ననుష్ఠింపక యెట్లూరకుండగలరు ? ఆత్మవంచకులుమాత్రము తాము దానిని గ్రహించితిమని ధారాళముగా చెప్పుదురు. సత్యమునకు పరిపూర్ణముగా ఆత్మార్పణ మొనర్చుకొన్నవారికిగాని అస్వార్థకర్మము సాధ్యముకాదు.

"పారమార్థికసిద్ధి కడ్డువచ్చునవి కోరికలే. పూర్తిగా ఆయన శరణుసొచ్చిన ఎంత శ్రేయస్కరము ! కాని అట్లు చేయము. ఆయనమీద కొంత, కొంత మన స్వయంకృషి మీద మన మాధారపడుదుము. అంతయు ఆయన చేయడని మన భీతి.

('ర'–తో) "భగవంతునిగూర్చి కొంచెముచెప్పుము".

'ర–' : "కలియుగ భాగవతము (వార్తాపత్రిక లని అతని భావము) లోని విషయములే మే మెఱిగినది !"

స్వామి : "అ ట్లేల తలతువు? భక్తునికి కలియుగ మెక్కడిది ? (ఇతరులతో) 'ర–' ఒక్కొక్కసారి మంచి సంగతులు చెప్పును. మొన్న నొకనాడు తనకు వచ్చిన కలను తెలిపెను. అది ఇంచుమించు సత్యముగా నుండెను. నాలో అది నాటుకొనెను."

దానిని మరల చెప్పుమని అందఱు అడుగగా, 'ర–' ఇట్లు చెప్పెను : "శ్రీరామకృష్ణుడు తీవ్రవ్యాధిగ్రస్తుడై

యున్నట్లును, అవసానకాల మాసన్నమైయున్నట్లును, కల గంటిని. శిష్యులు మిక్కిలి ఖిన్నులై యుండిరి. శ్రీ మాతృదేవి యొక లోపలిగదిలో కూర్చుండి విలపించుచుండెను. ఆ కాలమున నా భావము సామాన్యమానవులకును అవతార మూర్తులకును గలది శక్తితారతమ్యము మాత్రమే అని. నే నట్లు శ్రీరామకృష్ణునియెదుట నిలుచుండియుండగా, శిష్యప్రేమకారణమున ఈయన తన శరీరము నింక కొన్నాళ్లు నిలుపుకో జాలడా అను భావము నాలో కలిగెను. ఈ భావము నాకు స్ఫురించినదో లేదో, వెంటనే ఆయన ఇట్లనెను: 'ఈ మాట వినుము. భగవంతునికిని మానవునికిని ఎంతో భేదము కలదు. మానవు లెట్టివా రెఱుగుదువా? సముద్రజలములలోని కొంకింతదూరము నడవగలిగి, మహా కష్టముతో పెద్దయలలు (తీరమును తాకుముందు) విచ్ఛిన్న మగు ప్రదేశమువఱకు మాత్రమే పోయి, అచ్చటినుండి తిరిగివచ్చు మనుష్యుల వంటివారు!' [ఈ మాట లాయన పలికిపలుకకమునుపే నాయెదుట నొక అనంతసాగరము నిలిచియుండుటను చూచితిని. మనుష్యు లెందఱో ఆ జలములలో నుండిరి. అం దనేకులు ఇసుకకు మిక్కిలి చేరువగా నుండిరి. ఏ యొకరిద్దఱోమాత్రము ప్రథమ కల్లోలములవఱకు వెళ్లియుండిరి]. 'కాని భగవంతు డీ సాగరమును క్షణ మాత్రమున దాటిపోయి, మరల రాగలడు' అని శ్రీరామ కృష్ణు డనెను. [వెంటనే ఆయన దానిని దాటిపోవుటను, తిరిగివచ్చుటను నేను చూడగల్గితిని]. ఆ పిదప నాతో ఆ యన ఇట్లు చెప్పెను: 'అవతారమూర్తియొక్క మనస్సున

కెప్పుడును అఖండపదార్థమువైపుననే గమనము. అతని మనస్సులో నొక అణువుమాత్రమే ప్రపంచమును చూచు చుండును. ఆ ప్రపంచములో భక్తు లొక అత్యల్పభాగమే గదా. కావున, నా మనస్సును వా రెట్లు క్రింది కీడ్చిపట్టుకో గలరు?'

"శ్రీ మాతృదేవికూడ ఇట్లే చెప్పెడిది. ఆమె యొకసారి యిట్లు పలికెను: 'నా మనస్సు సర్వదా పరి పూర్ణములోని కెగయజూచుచుండును. ఎన్నో ఉపాయములు చేసి దానిని బలాత్కరించి క్రిందిమెట్లలో నుంపవలసి యున్నది. నా కట, సంగములు కలవట! క్షణమాత్రమున నేను సర్వబంధములను ఛేదించుకోగల నని వా రెఱుగరు!' "

స్వామి: "ఆమె తన్నుగూర్చి చెప్పిన యొక చక్కని సంఘటనమును నేను వినియున్నాను. శ్రీరామకృష్ణనిర్యాణా నంతర మామె యొకసారి విలపించు చుండగా ఆయన కాని పించి ఇట్లనెనట: 'ఏడ్చుచున్నా వేల? నేను మృతినొందితి ననియా నీ తలంపు? ఇదిగో ఇచటనే ఉన్నాను చూడుము! ఒక గదిలోనుండి మఱొక గదిలోనికి పోయినా నని చెప్ప వచ్చును. అంతయే. నా స్థూలశరీరము నీకు కనిపింపక పోవచ్చును గాని, నా యునికి నీ కెన్నోవిధముల తెలియ వచ్చు చుండును.' "

జాన్యువరి, 15

భక్తి జ్ఞానమునకన్న ఉత్తమ మని స్వామి 'ద-'తో వినోదార్థము వాదించుచుండెను. శ్రీ చైతన్యచరితామృత

ములోనుండి 'జ్ఞాని, దివ్యభక్త్యానందము నెఱుగక, కాకివలె జ్ఞాన మనెడి వేపపండ్లు తినును. భక్తు డన్ననో, దివ్యభక్తి రహస్యము నెఱిగి కోయిలవలె ప్రేమ మనెడు మావిపూవులను తినును' అనువాక్యము లుదాహరించి యిట్లు పలికెను : "వేపపండు చేదు. మఱియు చెట్టులో చివరకలిగినది అగుట చేత దాని కిక నభివృద్ధి లేదు. కొలదికాలమునకే వాడి పోవును. మావిపూ వట్లుకాక అభివృద్ధినంది, కమ్మని రస పూరితఫలమగును ; అది అభివృద్ధిసూచకము.

"జ్ఞానము పూర్తిగా పక్వమై భక్తియగును. జ్ఞాన సాధనచే మనస్సు క్రమపరిపక్వత నంది ద్వంద్వాతీతస్థితికి వచ్చును. యథార్థభక్తి మతేదియో సాధించుటకై కాదు. దానికదియే గమ్యము. భక్తు డెచ్చటనున్నను అతడు ప్రేమామృతపూరితుడు, దివ్యానందపూరితుడు.

"పారమార్థిక జీవితపు ప్రారంభదశలో ఇంద్రియ నిగ్రహసాధనకు జ్ఞాన మవసరమే. కాని ఆ పిదప నంతయు భగవత్పరమానందప్రదమగు ప్రేమయొక్క నిరంతరాను భూతియే.

"మఱియు థామస్ ఎ కెంపే యొక్క ఈ మాట లెంత మనోహరములు ? 'ప్రభూ, పలుకుము. నీ సేవకు డాల కించుచున్నాడు. బోధకులారా, మౌన మూనుడు ! మత ప్రవక్తలారా, మౌన మూనుడు ! ప్రభూ నీ వొక్కడవే పలుకుము—ఈ ఆత్మలో పలుకుము !'

" 'చిత్తమా, రమ్ము, కామాదివికారములకు దొరకకుండ పోయి, మనము వేఱుగ నివసింతము.' కాని వానిని తప్పించుకొనిపోవు టెంత దుర్లభము! అవియే మానవులను పశుప్రాయులుగా చేసినది!

"శ్రీరామకృష్ణు డొకసారి యేదో శాస్త్రవిషయమునుగూర్చి ఉపన్యసింపు మని యొక పండితు నడిగెను. పండితుడు త్రిపుటీభేదసిద్ధాంతమును (ఎఱుగుట, ఎఱుగువాడు, ఎఱుగబడువస్తువు, అను మూంటి భిన్నత నశించుట) గూర్చి యొక గంటకు పైగా మాటలాడెను. అంతయు విని శ్రీరామకృష్ణు డిట్లనెను: 'మిక్కిలి చక్కగా ఉపన్యసించితివి. కాని నే నెఱిగిన దొక్క విషయము మాత్రమే: మా యమ్మ కలదు నాకు. నే నామె బిడ్డను.' "

జాన్యువరి, 21

ఇప్పటి ప్రసంగవిషయము ప్రాచీననాగరికత. భారతదేశముయొక్కయు, చీనా దేశముయొక్కయు, ఇజిప్టు దేశముయొక్కయు, పారసీక దేశముయొక్కయు నాగరికతలే అన్నిటిలోను ప్రాచీనము లని 'త-' చెప్పెను.

స్వామి: "అణుజీవి (amoeba) యొక్క పరిణామమే ఇప్పటి మానవజాతికిగల నాగరికతయనిక దా వారిసిద్ధాంతము. పరిణామభావమును మనముకూడ సత్యమనియే అంగీకరింతుము గాని, నాగరికమానవుడుమాత్రము అనాదిగా కలడని అమెరికనులకు నేను చెప్పుదును. మఱొక నాగరి

కతనుండి ఉత్పత్తికాని ఒక్క నాగరికతనైన వారిని చూపు మనుము, చూతము.''

'త-' : ''ఉండవచ్చును గాని, హాటెంటాట్‌లు (ఒక అనాగరికజాతి) ఇప్పటికిని హాటెంటాట్‌లుగనే ఉన్నారు.''

'ర-' : ''జనసామాన్య మనాగరికులై యుండియు, వారిలో నొక మహనీయు డాకస్మికముగా నుద్భవించి వారికి జ్ఞాన తేజము నిచ్చియుండునేమో ?''

స్వామి : ''నిజమునకు మహాపురుషు లెల్లెన్నడును పుట్టరు. మృగప్రాయజాతుల కెప్పుడును నాగరికజాతుల తోడి పొందువలననే నాగరికత కలిగెను.

''నాగరికతకు గల పరమాదర్శము సర్వభూతము లందును ఒకే ఆత్మను చూడగల్గుట. 'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున। సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥' (ఏ యోగి సర్వభూతముల సుఖ దుఃఖములను తన సుఖదుఃఖములతో పోల్చుకొని, ఆ ప్రమాణముపై వానిని పరిగణించునో, అతడే పరమయోగి [యోగులలో శ్రేష్ఠుడు] అని నా యభిప్రాయము). కాని, నిర్వికల్పసమాధి సిద్ధించినపిదపనే ఈ యెఱుక కలుగును.''

'బ-' : ''సవికల్పసమాధియందు సగుణదైవమును కాంచినవాడుకూడ సర్వభూతములందును అతనినే చూచును గదా! అదియు విశ్వైక్యసిద్ధియే కదా!''

స్వామి : ''పరమార్థసిద్ధిలో అంతరములు కలవు. భారతదేశము జీవన్ముక్తులు లేని లోపము నెన్నడు ననుభ

వింపలేదని స్వామిజీ చెప్పువాడు. అట్టివారిని కనీసము పదియేను పదునాలుమందిని తానే చూచెనట. భారత దేశము గాఢాంధకారమయమై యున్న కాలములందుకూడ పారమార్థికసిద్ధి నొందిన మహాపురుషులు అచట పుట్టుచునే ఉండిరట.''

'ర-': ''ముప్పదికోట్లజనులు—పూర్వకాలమున ఇంతకన్న ఎక్కువమంది — పరమార్థసిద్ధికై నిరంతరకృషి సల్పువారు, ఉండు దేశమునకు అట్టి మహాత్ముల లేమి యెట్లు కలుగగలదు? లోకమునకు భారత దేశము దేవాలయ గర్భగృహప్రాయమైనది; భగవద్ధ్యానము ఆ దేశీయుల ముఖ్యవ్యాపారము.''

స్వామి: ''హృదయము (సానుభూతి, ప్రేమ మొ.) ఒక్కటియే యుండి మెదడు (బుద్ధి) లేకుండుట, మెదడొక్కటే ఉండి హృదయము లేకుండుటకన్న ఉత్తమ మనియు, హృదయము మూలముననే సర్వము జరుగుచున్నదనియు, స్వామిజీ అనువాడు.''

'త-': ''ఈ సిద్ధాంతమును నేను విశ్వసింపను.''

స్వామి: ''ఆదర్శజీవితోడి సాహచర్యజీవనము వలనగాని మానవుడు జీవితనిర్మాణము చేసికొనజాలడు. సాధుజనసాంగత్యముయొక్కయు, భక్తజనసాంగత్యము యొక్కయు ఆవశ్యకత భాగవతమున నెన్నియోసార్లు ఉద్ఘాటింపబడినది. శంకరుడు జ్ఞానమార్గమునకే ప్రాముఖ్యమిచ్చెననుట సత్యమే. కాని గురువుకూడ ముఖ్యమని

వేదాంతబోధ. జీవితమునకు వెలుగు (జ్ఞానతేజస్సు) మఱొక జీవితమునుండియే రావలసియున్నది."

'త-': "అదృష్టవశాత్తుగా శ్రీ రామకృష్ణుని యొక్కయు, స్వామిజీయొక్కయు, మీయొక్కయు జీవితములు మాకు కలవుగదా. కావున శాస్త్రములయొక్క యథార్థలక్ష్యము, యథార్థభావము, మా కెఱుకపడు అవకాశము కలదు."

స్వామి: "అపరోక్షానుభూతి గలవారి జీవితములే శాస్త్రములకు నిదర్శనములు, నిరూపణములును."

జాన్యువరి, 24

స్వామి కాలిగోళ్లలో నొకటి తనంతటతానే వీడిపోయెను. దీనినిగూర్చి ఆయన యిట్లనెను: "ఇట్లే శరీరమును వదలి ఆత్మ ఎగిరిపోవును. కాని అజ్ఞాతముగా కాదు — మనస్సుకు, 'అహమ్' అనుదానికి, ఆ పోక తెలిసియుండును. 'మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, జ్ఞానకర్మేంద్రియదశకము, ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు, శరీరము, చేతనము(ఎఱుక), ధృతి(స్థైర్యము) — ఇవియే ముఖ్యముగా క్షేత్రము (శరీరము), క్షేత్రవికారములు (మార్పులు) అనబడును'. క్షేత్రజ్ఞుడు (ఆత్మ) ఒక్కడే సత్యము. దాని సత్యత్వముచేతనే క్షేత్రము — మనశ్శరీరాదులు — సత్యముగా కానిపించును. చివరిపుట్టుకలో

మనుష్యుడు సత్యజ్ఞానము కలిగి, భగవంతు నెఱుగును. ఇక నతడు అహంకారకల్పితభ్రాంతులలో తగుల్కొనడు.

"ఇచ్ఛాద్వేషములే సర్వపాపమూలము. కావుననే వానిని విడనాడు మనెడు ఆదేశము. అవి లేనివాడు ఏమి కోరినను అది నిర్భయముగా చేయగలడు.

"మహాపురుషుల యనుగ్రహముచేత జ్ఞానము లభించును. 'మహాత్ముల కృపయో, భగవంతుని కృపా లేశమో' అని శాస్త్రోక్తి. అప్పుడు లోకమునుండి విముక్తి నొందు కోర్కె ప్రబలముగా నుద్భవించును. 'విశ్వసంకల్పము' అందు కనుకూలములగు స్థితిగతులనుకూడ కల్పించును.

"జీవుడు బద్ధుడు. కట్టివేయబడిన గోవు స్వాతంత్ర్యము వలె అతని స్వాతంత్ర్యము పరిమితము; పరిపూర్ణము కాదు. తనకు గల ఆ కొలది స్వాతంత్ర్యమును సద్వినియోగము చేయునతడు విమోచన మందును. కాని మానవుడు దానిని సద్వినియోగము చేయడు సరేగదా, పెక్కు విధములుగా దుర్వినియోగము చేయును.

"ప్రతివాని లోకమును వేత్తైనది. ఒకే వస్తువు నొక్కొక్క డొక్కొక్క విధముగా చూచును. సర్వవస్తువు లందును ఆత్మను చూచువాడు నిత్యశాంతి నందును."

జాన్యువరి, 26

స్వామి : (అచ్చటనున్న 'ద–'నుగూర్చి) "ఇతడు నానాటికి తమస్సులో కూలిపోవుచున్నాడు. సాధనలు అను

పేర సోమరితనమును పెంపొందించుకొనుచున్నాడు. నిష్క్రియాత్వమే పరమగమ్య మని వీరి భావము. ఇది నిజమైనచో, గోడ సమాధినందినట్లే కదా. మానవుడు ద్వంద్వముల కన్నింటికిని అతీతుడు కా నక్కఱలేదా? సర్వావస్థలందును సమబుద్ధి కలిగియుండుట, పరిపూర్ణ ప్రశాంతత సాధించుట — అది ఆదర్శము!

" 'నారాయణసేవ' — ఎంత దివ్యమైనది! ఈ యుగ మున నిది విశిష్టధర్మము. సక్రమముగా నాచరించుచో, కర్మ ధ్యానములు రెండును మహోత్కృష్టములే. రెండును సమగుణములే.

"స్వామిజీయొక్క బోధ శ్రీరామకృష్ణునియొక్క బోధకు భిన్న మను భావము కొంతకాలముక్రిందట నుండెను గాని, అది యిప్పుడు చాలవఱకు నశించినది. వైద్యవృత్తి, ద్రవ్యార్జనార్థ మవలంబింపబడినచో శ్రేయస్కరముకాదు; నిష్కామముగా నవలంబింపబడినచో మోక్షసాధనము. కర్మాచరణము బంధనకారి యందురు. కాని అది ఎట్లు బంధనకారియో, అట్లే విమోచనకారియు నగును. ఇదేమి ధ్యానము! అఱగంటసేపుప్రొద్దున, అఱగంటసేపు సాయం కాలము! దిన మంతయు నిరంతరప్రవాహముగా అది సాగ బనిలేదా? కొన్ని నిమిషములపాటు కన్నులు మూసికొని కూర్చుండుటయు, తక్కిన కాల మంతయు వ్యర్థప్రసంగ ములతో గడపుటయునా! పరిపూర్ణపరిశ్రమ దీర కాలము సాగింపవలెను. అప్పుడుగాని సిద్ధి కలుగదు.

"ఫలము పరిశ్రమమున కనురూపమై యుండును. నీ కేదైన నలయునేని, దాని యన్వేషణము వెంటనే సాగింపుము. అత్యున్నతిని నీ వందుకో జాలక పోవచ్చును. కాని నీవు అందుకో జాలునంత ఉన్నతిని అందుకొనుము. ఇప్పుడు తప్పినచో, ఎప్పటికిని తప్పినట్లే!"

ఫెబ్రువరి, 2

'స-' ముండకోపనిషత్తుయొక్క మొదటిసగము చదివి వినిపించెను. అతడు ముగించుటతోడనే స్వామి యిట్లనెను: "ఉండున దొకటే ఏకైకపదార్థమే. రెండవ దేమియు లేదు. మానవులుగా, పశువులుగా, పక్షులుగా, కీటకములుగా, తరులతాదులుగా, మనము చూచున దతనినే. కాని చక్కగా విమర్శించి చూచితిమేని, అతనిలో అట్టి భిన్నత యేమియు లేదు. 'అహము' ఒకటి కలదని భావించుకొని, దాని ప్రీత్యర్థ మెంత దాస్య మొనర్చుచున్నాము! ఒక్కొక్కని కొక్కొక్క లోక ముండును. అది మరణానంతరము వాని వెంట నుండును. సత్యజ్ఞానమునకు అడ్డుగొనునవి భోగములును, భోగవాంఛయును. ఆ అడ్డంకులు లేనిచో, మన మీ క్షణముననే జ్ఞానము సాధించుకోగలము. మనము చిత్ (=జ్ఞాన)స్వరూపములము కాదా? కాని మన దురదృష్ట మెట్టిదో కాని, ప్రాపంచికసుఖములను విడనాడుట మహా దుర్లభము!

"గ్రహించుకోరిక మన కున్నగాని, మనలను నమ్మింప జేయు టెవ్వరికిని శక్యముకాదు. తనకు బొరుగులు చేయు

మార్గమును నేర్పినవానికి అర్ధరాజ్య మిత్తునని యొక రాజు వాగ్దానముచేసెను. అనేకులు వచ్చిరి, బోధించిరి, చేసి చూపిరి. కాని చివరకు తన కది యర్థము కాలే దనువాడా రాజు. ఎట్లర్థ మగును? అర్థము చేసికొను కోర్కియతని కున్నగదా! మనమును అట్టివారమే. ఈ లోకము క్షణభంగుర మని యెఱుగనివా డెవడు? కాని అది నమ్మరాదని మన నిశ్చయము! నమ్మితిమేని 'అర్ధరాజ్యము' (ప్రాపంచికభోగముల) నిచ్చివేయవలసివచ్చునని మనభీతి.''

'న–': ''కాని దుఃఖముల నాలింగనముచేసికొను ఈ మార్గముమాత్ర మొక విధపు వెఱ్ఱికాదా?''

స్వామి: ''అవును. వెఱ్ఱియే. కాని ఆధ్యాత్మికసాధనగా దాని కెంతో విలువ కలదు. అది మనస్సును పరిశుద్ధపఱచును.

''లేశమాత్రముగా నైన అజ్ఞానము మనలో మిగిలియున్నంతవఱకు 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మమును) అని పల్కుట నిష్ప్రయోజనము. మన మప్పుడు భగవంతుని అర్చింపవలెను. మన యర్చనలచే జగన్మాత సంతుష్టి నొందెనేని, మనకు భుక్తిముక్తులు రెంటిని ప్రసాదించును. 'రాజా, ఆ మహాదేవి నాశ్రయింపుము. ఆమె మెచ్చెనేని, ఐహికసంపదలు, పారమార్థికసిద్ధి, రెంటిని దయచేయును'.

''బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో నొకరు నీకు బోధకుడైయున్న నేమి? నీవు సర్వమును మఱచినతప్ప ఆత్మసాక్షాత్కారసిద్ధి నీకు లభింపదు.

" 'ఈ జగత్తంతటికిని బ్రహ్మమే కారణమగుటచేత, అది నిజమునకు బ్రహ్మముతప్ప వేఱేమియుకాదు. బ్రహ్మమే జగత్తుయొక్క సత్త్వము, అనగా మూలసారము; బ్రహ్మము నందుతప్ప దీనికి ఉనికియే లేదు. ఈ జగత్తు కలదు అను వాడు ఇంకను భ్రమకు లోనైయున్నాడు. అతని పలుకులు నిద్దురలోని ప్రేలుడు వంటివి'."

ఫెబ్రువరి, 4

సేవాకర్మములనుగూర్చి స్వామి ఉత్సాహముతో మాటలాడుచుండెను.

స్వామి : "జపధ్యానములచేత పరమార్థసిద్ధి లభించు టెంత నిస్సంశయమో, సేవాభావముతో చేయు కర్మముచేత కూడ అది లభించుట అంత నిస్సంశయము.

"అంతరర్థమును గ్రహించు నుద్దేశముతో గీతాపఠన మొనర్చితిమేని, అందు కర్మమునకే ప్రాధాన్య మీయబడి యున్నదని స్పష్టపడును. జ్ఞాని కర్మాతీతుడను గీతా భావమునకు నిగూఢార్థము కలదు. కర్మమొనర్చు నితరులకు బోలె అతనికి కర్తృత్వభావము ఉండదని ఆ మాటల భావము.

" భిక్షుకవృత్తితప్ప తక్కిన కర్మము లన్నియు సన్న్యాసు లుజ్జగింపవలె నను ప్రాచీనభావములు మమ్ము— శ్రీరామకృష్ణునియొక్కయు, స్వామిజీయొక్కయు జీవిత ములచేతను, బోధలచేతను, ప్రబుద్ధులమైన మమ్ము—

ఏ మాత్రమును తృప్తిపఱుపజాలవు. ఆ భావములపై వా రొక నవీన తేజమును ప్రసరింపజేసినారు; పూర్వ తేజమునే వా రొక నవీనరూపమున గోచరింపజేసినారు.''

శిక్షితుడగు పనివా డెవ్వడును లభింపమిచేత నొక కార్యాచరణమున ఇబ్బంది కలుగుచున్నదని విని స్వామి ఇట్లనెను : "కానిండు. మీకు సాధ్యమైనదంతయు చేయుడు. అవసరమయ్యేనేని ఆ కార్యమునకు మీ ప్రాణము లర్పింపుడు. దానిచేత శ్రేయమే చేకూరును.

"డబ్బుకై పనిచేయువారిచేత మన కార్యము జరుపుట నా కిష్టములేదు. అంతకన్న దానిని నిలిపివేయుట మేలు...... గురుదేవుని కార్యమునకై ప్రాణములనైన బలియీయ సంసిద్ధులై పని సాగింపుడు. సకాలమున ఆయనయే వలయుసాహాయ్యము నంతయు సమకూర్చునని నా పూర్ణవిశ్వాసము. అందునుగూర్చి విచారింపవలదు.

"ఆరాధనమును, కార్యాచరణమును, విడదీయుట నా కేమాత్రమును నచ్చదు. కార్యాచరణ మంతయు ఆరాధనమే. సర్వకర్మములును ఆయన సేవయే. ఏకాంత తపశ్చర్య నాచరించువారికి పలుమాఱు స్వార్థపరత్వము పట్టువడును. కాని కార్యపరుడు తన కార్యార్థమై యనేకులతో కూడి జీవింపవలసివచ్చును. అందుచే అతనికి ఓర్పు, సానుభూతి, ప్రేమ, స్వార్థరాహిత్యము అలవఱచుకొను నవసర ముండును. ఇదిగాక ఉపాసనకూడ కర్మమే. దానిఫలము కూడ భగవదర్పితము చేయవలయును.''

ఫెబ్రువరి, 11

స్వామి: "'జ-' కొన్నాళ్లక్రిందట నన్ను చూడ వచ్చెను. అతనికి పురుషకారమునందు — స్వతంత్రేచ్ఛ యందు, స్వతంత్రకర్తృత్వమునందు — పూర్ణవిశ్వాసము. రెండవ పక్షమును — విధినిర్ణయమును — గూర్చి నే నతనికి తెలిపితిని. నేను చెప్పిన దిది: 'మే మీ రెండుపక్షములను చూచితిమి. కావున రెంటిలో భగవ దిచ్ఛయే బలిష్ఠమైన దని తలచితిమి. నీ కొకవేళ జీవితములో ఆశాభంగములు, అపజయములు, కలుగలే దేమో. అందు చేతనే స్వతంత్రేచ్ఛయందు నీ కంత విశ్వాసము'. కాని అత డేమాత్రమును చలింపక తన భావములే సరియని వాదించెను. మన సేవాకార్యములకై మనల నభినం దించుటకే అతనిరాక. భగవత్కృపచేతనే అవి సాధ్యమైన వని నేను చెప్పగా, అతడు 'భగవత్కృపచేత కాదు, మీ కార్యదీక్షచేత' అని బదులాడెను. వైరాగ్యమును బోధించి సాధువులు దేశమును వినాశదశకు తెచ్చినారని అత డనెను! కాని అతడు మంచివాడు, అత డనిన నాకిష్టము."

ఫెబ్రువరి, 12

స్వామి: ('య-'నుగూర్చి) "ఐహికజీవనమును విడ నాడుటకుముందు కొంత ద్రవ్యము సంపాదించియుంచుకొన వలె నని అతని యుద్దేశము. భిక్షుకజీవన మతనికి భీతికరము; కాని అట్టిజీవన మవలంబింపనివానిది నిజమగు వైరాగ్యము కానేరదు. 'భిక్ష మెత్తుకొని బ్రదుకుచు తిరుగుము'. భిక్ష

మెత్తుకొనుట పవిత్రకార్యము. మన మప్పుడు భగవంతునిపై ఆధారపడుట నేర్చుకొందుము. సర్వాగ్రహములు భగవంతునివే యనియు, ఆయన ఏది యిచ్చునో అదియే, ఎప్పుడిచ్చునో అప్పుడే, మనకు ప్రాప్తించు ననియు, మనము కనుగొన నారంభింతుము. భయమును, మానవులపై ఆధారపడుటను, తప్పించుకొనుటకు వేఱుమార్గము లేదు.

‘‘తమకు గలదానిలో కొంత ఇతరులకు పెట్టు భావమే కొందఱికి భయము కలిగించును. ఒక సాధు వరణ్యములో నివసించుచుండెను. ఒకప్పు డతనికడకు ఒక రాజు వచ్చెను. ఆ రాజు తన రాజ్యమును విడనాడి, భగవదన్వేషణార్థమై వచ్చినవాడు. తన భోజనములో నితడిక పాల్గొన నారంభించునని సాధువు భయపడెను. అందుచేత నతడు ‘నీకు మనుష్యసంపర్కమే పనికిరాదు. ఇంకను లోనికిపొమ్ము. అరణ్యగర్భమున నీకు పరిపూర్ణమగు ఏకాంతత లభించును’ అని ఆ రాజునకు చెప్పెను. రాజీ మాటలు సత్యములే యని నమ్మి, అతనిని విడిచి అరణ్యగర్భములోనికి పోయెను. కొంచెముసేపటి కొక మనుష్యు డచటికి ఇరువురకు వలయు భోజనము చేతబట్టుకొని వచ్చెను. అందులోనుండి సాధువున కెప్పటియట్లే యొక రొట్టెను పెట్టెను. ఆ మనుష్యునికడ నింకను ఒక బంగారుపాత్రము నిండ ఇష్టమృష్టాన్నము లుంట జూచి, ఇవి ఎవరి కని సాధువు అడిగెను. ‘రాజ్యమును విడనాడి వచ్చిన పురుషునికొఱకు’ అని యతడు బదులు చెప్పగా, సాధువు కోపముతో ‘ఏమీ! ఎన్నాళ్లనుండియో

సాధువృత్తినుండు నాకు వట్టి రొట్టెయు, ఈ రుచ్యపదార్థము లన్నియు ఆక్రోత్తవానికా!' అనెను. అందు కా మనుష్యుడు ఇట్లు బదులుచెప్పెను : 'నా కేమియు తెలియదు. కాని నన్ను పంపినయతడు "ఈ రొట్టె నీకు తృప్తిగా నుండనిచో, కొడవలితీసికొనుము" అని చెప్పుమనెను'. ఈ సాధువు పూర్వాశ్రమమున గడ్డికోసికొని జీవించువాడు. ఇందు భావ మే మనగా : ఇతనికిగాని, రాజునకుగాని, ఇప్పుడు ప్రాప్తించు నది తృప్తి గొల్పనిచో, వారు తమ పూర్వవృత్తులకు మరల పోవచ్చు నని : సాధువు గడ్డికోతకును, రాజు తన రాజ్య మునకును. కావున రాజునకు ఆదరణచూపుట అర్హమే కదా!

"ఇది చక్కని కథ, మిక్కిలి భావగర్భితమైనది. 'శాంత్యాశ్రమ' ప్రారంభదశలోని విషయ మొకటి వినుము. సమీపపు రైలుస్టేషను అచటికి ఏబదిమైళ్ల దూరమున నుండెను. సమీపస్థ మొక అయిదుమైళ్లదూరమున నున్న పోస్టు మాస్టరు. మూడుమైళ్లదూరమునుండి పీపాలలో నీరు తెచ్చుకొనవలసియుండెను. ఈ స్థితిగతులు చూచి నా ధైర్యము క్రుంగిపోయినది. ఇట్టి చోట రమారమి పదియేవురు నివ సించు టెట్లు? ఉదయ మంతయు మనస్సు విషాదభావ ములతో నిండియుండెను. ఆ రాత్రి నా కొక విధమగు దృశ్యము కానిపించినది : 'చండి'లో వర్ణింపబడిన ట్లొక 'తల్లిపక్షి' పిల్లలకు మేత పెట్టుచుండెను. జగన్మాత సర్వసన్నా హాము లప్పటికే పూర్తిచేసియుంచెనని నాకు తెలుపబడెను.

ఆశ్రమవాసుల మిత్రు డొకడు మఱునాడు వచ్చెను. అతడు భూమిలోని నీటిపట్టులను గుర్తించువిద్య నేర్చినవాడు.

"జగన్మాతయందు నాకు విశ్వాసము లేదనియు, 'బేబీ'కన్న నేను అజ్ఞుడ ననియు, ఆశ్రమవాసులలో నన్నొక యామె ఈలోపలనే తీవ్రముగా పరిహసించెను. 'బేబీ' యనునది మిక్కిలి భక్తిపూరితయగు నొక బాలికకు స్వామిజీ పెట్టిన పేరు. ఆ పరిహాసము జగన్మాతయే చేసెనని నాకు తోచెను. జలాశయజ్ఞుడు ఆశ్రమభూమి నంతయు పరిశోధించి, రెండుగంటలసేపటికి మరలవచ్చి, ఆ భూమిలో మూడు జలాశయములు కలవని చెప్పెను. ఆ మూటిలోను చేరువైన చోట నత డొకించుక త్రవ్వగా, చక్కని జెల యేర్పడెను. ఈ విధముగా శాంత్యాశ్రమములో సర్వమును సరియయ్యెను.

"అన్నిటికి అతడే కర్త. ఉండున దా యొక్కడే. మఱెవ్వరును లేరు. 'సర్వభూతములందు ఆత్మను, ఆత్మయందు సర్వభూతములను' చూచుట బహుదుర్లభము. దానినిగూర్చి మనము ధారాళముగా మాటలాడుదుము; ఇతరులకు బోధింతుము; కాని అట్లాచరించు టెంత కష్టము! అంతయు మనయందే కలదు. సుఖదుఃఖములు మన వెలుపల నెచ్చటనో ఉండునవి కావు. సుఖమును మనలోనుండి వెలిజిమ్మి కొన్ని వస్తువులతో దానిని కూర్తుము.

"జ్ఞాని 'నేను' అను మాటను ఆత్మైక్యభావముతో నుపయోగించును. మనము దానిని దేహైక్యభావముతో నుపయోగింతుము. మన చిత్తమునం దీశ్వరుని చూచు

టనగా మన 'అహము'ను ఆత్మలో విలీనమొనర్చుటే. 'గౌతమా, పరిశుద్ధోదకము పరిశుద్ధోదకములో పోసినచో ఒకటిగా కలిసిపోవునట్లే ఆత్మయొక్క ఏకత్వము నెఱిగిన సిద్ధ పురుషునియొక్క ఆత్మ ఐక్యమైపోవును.'

''ఐక్యసిద్ధి నందిన జ్ఞాని లోకములో ప్రవర్తించునట్టి విధము: మన మెప్పుడైన మన నాలుకను కొఱుకుకొన్నప్పుడు ప్రవర్తించునట్టి విధమే — మనము మన నాలుకపై కోప గించుకొనము. ఎండమావులయొక్క యథార్థతత్త్వము మన కెఱుకపడకుండునన్నాళ్లు మనము దానిని చూచి మోసపోవుదుము. కాని అది యెఱుకపడిన వెనుక దాని నెన్నిసార్లుచూచినను, మన మిక మోసపోవము. అట్లే జగత్తుయొక్క యథార్థతత్త్వము నెఱిగిన యోగి దానిచే భ్రాంతినొందడు.

''సవికల్పసమాధిలో కలుగు ఆనందమునకును నిర్వికల్పసమాధిలో కలుగు ఆనందమునకును కలది 'పరిమాణభేద'మే కాని 'ప్రకారభేదము' కాదు— రెంటిలోను ఆత్మ ఈశ్వరునందే రమించును. నిర్వికల్పసమాధి ఆత్మజ్ఞాన రూప మగు నిరవధికానందమయ మైనది. అది శుష్క శూన్యరూపమైనది కాదు.

''జీవన్ముక్తి నందినవాడు అకారణప్రేమమయు డగును. ఆ ప్రేమయందు ప్రియునియొక్క శక్తివైభవముల తలంపే ఉండదు. అట్టిప్రేమయే బాలకృష్ణునియెడ గోపికల కుండెడిది.

"లోకసముద్ధరణార్థమై జన్మించు ఆధికారిక పురుషులు, ప్రవక్తలు, అవతారమూర్తులు కర్మదాస్య బద్ధులు కారు. వారు దేహధారు లగుట పూర్వకర్మఫలముగా కాదు. మానవసేవార్థమై, భగవత్సంకల్పముచే, వారు జనింతురు. ఇంద్రాది దేవతలు తమ తమ తేజోగోళపాలన వైభవ మనుభవించిన పిమ్మట పతన మొందుదురు. కాని జీవన్ముక్తులు సర్వశక్తిసంపన్నులు. వారికి లోకసృష్టి సంహార శక్తులు లేవు, అవి ఈశ్వరునికిమాత్రమే కలవు అని బ్రహ్మసూత్రములు నుడువుచున్నవి గాని, వారా కార్యములను చేయజాల రనికాదు దీని కర్థము; వారి కా కోరిక యుండదు. మోక్షసిద్ధి యనగా సర్వశక్తిసంపన్నత నార్జించుటయే.

"బ్రహ్మ మనెడు అనంతసాగరమునుండి శివు డొక గ్రుక్కెడునీటిని త్రావెననియు, శుకుడు దానిని తాకగలిగె ననియు, నారదుడు దానిని దూరమునుండి చూచెననియు శ్రీరామకృష్ణుడు పలికినాడు.

"మహారాజ్ (బ్రహ్మానందస్వామి) ఇచట నున్నంత కాలము నిరంతరోత్సవవైభవము జరుగుట నాక్షేపించుచు నొకరు వ్రాసియున్నారు. కాని మఱె ట్లుండుట సాధ్యము? 'తమ హృదయములందు భగవంతుని శాశ్వతసాన్నిధ్యసుఖ మనుభవించువారు నిరంతరశ్రేయస్సౌందర్యసంపన్నులై, నిత్యోత్సవానందయుక్తులై యుందురు' అని భాగవతమున వ్రాయబడియున్నదిగదా!

"రామానుజుడు సూరదాసు ఉన్నచోటికి వచ్చి, అత డెప్పుడును తన దుఃఖములనుగూర్చియు, కష్టములను గూర్చియు. భగవంతునితో మొఱ లిడుకొనుచుండుట చూచి, 'సూరదాసా, ఇట్లేల నీ దుఃఖములనుగూర్చి మొఱ లిడుచున్నావు, భగవద్వైభవమును కీర్తింపుము' అని పల్కెను. ఆ పిదపనే సూరదాసు లక్ష శ్లోకములతో భగ వంతుని కీర్తించెను. గ్రుడ్డివాడుగా నుండిన సూరదాసుకు ఆ పిదప చూపువచ్చెను.

"సర్వమునకు భగవంతుడే కర్త. లాభనష్టములు, చావుబ్రదుకులు, కీర్త్యపకీర్తులు : అన్నియు ఆయన ప్రసాదించునవే యని తులసీదాసు మిక్కిలి యథార్థముగా పలికినాడు. ఆయన యేకైకకర్త. కాని లోకమున స్థాన ముండునది ముక్తికిమాత్రమే కాదు. భోగానుభూతికి కూడ స్థానము కలదు. కావుననే మానవులు ఎల్లెట్లో కష్టము లనుభవించుచు, సుఖము లనుభవించుచు, క్రమతో సాగి చివరకు 'మేలుకాంచి' విముక్తు లగుదురు. పాప పుణ్యములు రెంటికిని మూలమగు ప్రేరకశక్తి భగవంతుడే. ఈ వైవిధ్య మంతటికిని వెనుక అతని శుభసంకల్ప ముండును. కావున సర్వకర్మములును చివరకు పరమసుఖముకడకే దారితీయును.

"జగత్తులోని నానాత్వము దిగ్భ్రాంతికరమైనది. అత్యంతమిశ్రితరూప మైనది. ప్రకృతివికారము లన్నిటికిని త్రిగుణములే కారణములు. కాని వాని కతీతస్థితి యొకటి

కలదు. అది పరమహంస లధిగమించునది. ఈ అనంత నానాత్వమునకు మూల మగు ఏకత్వమును చూచువారికి శాశ్వతశాంతి చేకూరును. ఏలయన ఆ స్థితియందు లాభ నష్టములు, కీడుమేళ్లు లేవు. కొన్నినాళ్లనుండి 'రుద్రాధ్యాయము'లోని స్వార్థపరములగు ప్రార్థనలు మేము చదువు చున్నాము: 'నా ఆవులను చంపవలదు. నీ ధనుర్బాణము లచట నుంచి రమ్ము. నా శత్రువుల నణచివైచి శిక్షింపుము'— ఇట్టి ప్రార్థనలకు స్వార్థపరత్వమే మూలము. కాని ఈ శరీర మొకటి కల దను భావము నతిక్రమించినవారికి ఇట్టి వాంఛ లుండవు. సర్వము అతడే అని తలచునంతటి మహోత్కృష్ట భావము ఇంకొకటి లేదు. అది తప్పినచో, అతడే సర్వకార్య ములకును యథార్థకర్త యనియు, మన కర్మ లన్నిటికిని కారణభూతు డతడే యనియు తలచుట శ్రేష్ఠము.

"పూర్వజన్మ మొకదానిలో రాజన్యుడై భోగము లనుభవించినవాడే సన్న్యాసాశ్రమమున కర్హుడని శ్రీరామ కృష్ణుడు చెప్పువాడు. అట్టివారికే ఆజన్మసిద్ధమగు యథార్థ వైరాగ్య ముండును. సన్న్యాసము వేషమాత్రమా? సన్న్యాసులు మిక్కిలి అపురూపముగా నుందురని మే మను కొనుచుంటిమి. మాయాజాలములోనుండి సామాన్యులు విముక్తినొందుదురా? హృషీకేశమునందు మూడువేల మంది సన్న్యాసులను చూచునంతవఱకు యథార్థసన్న్యాసు లకును, సన్న్యాసవేషధారులకును గల భేదము నేను నిజముగా ఎఱుగకుంటిని. కాషాయవస్త్రధారులందఱును సన్న్యాసులు కారు.

"పనిచేయుట తప్పించుకొనుటకై త్వరితముగా సన్న్యాసాశ్రమస్వీకార మందగోరుదురు. మా గురుదేవుడు భగవత్సాక్షాత్కారసిద్ధికి ప్రాముఖ్య మిచ్చువాడు గాని సన్న్యాసస్వీకారమునకు కాదు. ఐనను, వైరాగ్యము సాధింపనివారికి బ్రహ్మజ్ఞానము ప్రాప్తింప దనిమాత్రము దృఢముగా పలుకువాడు."

ఒకరు: "కాని స్వామిజీ సన్న్యాసమునకు మిక్కిలి ప్రాముఖ్య మిచ్చువాడుగదా."

స్వామి: "అవును, ఆయన ఇచ్చువాడే. కాని సేవా సంస్థ నేర్పఱచినదికూడ ఆయనయే. ఆయనను సమష్టిగా చూడవలెను. మీ రది చేయరు. కార్యాచరణవిముఖులు కొందఱు కలరు. శ్రీగురుదేవుడు చెప్పినట్లు వారు వెన్నకై చిలుకకొనరు. ఇతరులు దానిని ఎత్తి వారినోట బెట్టవలెను. సర్వము వారికి సంసిద్ధపఱచి ఈయవలెను! కావుననే సన్న్యాసాశ్రమప్రవేశము పురోగమనమునకు తోడ్పడదు.

"లోకహితాచరణముకై మన మాత్మార్పణము చేసికొన్నగాని లోకమునకు మన మంతగా ఉపకరింప జాలము. అనంతమగు సానుభూతి, ఓరిమి, అవసరము. దేహారోగ్యలోపము ఒక పెద్ద అంతరాయము. అందుచే సులభముగా కోపమువచ్చును.

"స్వామిజీ సాత్త్వికస్వభావుడు కాదా? ప్రశాంత మగు సమబుద్ధి కాదా ఆయనది? అంతటి సాత్త్వికప్రకృతి

మఱెవ్వరికి గలదు? ఆయననుగూర్చి నా భావములు వినికి వలన నేర్పడినవి కావు. నిరంతరసాహచర్యము, ప్రత్యక్షానుభవమే వానికి మూలము. రాత్రి తొమ్మిది గంటలకు ఆయన ధ్యానస్థితుడై, గుంపులుగుంపులుగా మీదవ్రాలి, చుఱుక్కు-చుఱుక్కుమని కుట్టుచుండు దోమల స్పర్శనే యెఱుగక, వేకువ అయిదుగంటలకు ప్రాతస్స్నానార్థమై లేచుట నేను స్వయముగా చూచియున్నాను. ఆయన గాఢధ్యాననిమగ్నుడై, బాహ్యస్మృతియే తక్కి యుండునప్పుడు శివుడే ధ్యానస్థితుడై యున్నాడా ఏమి అనిపించును. ఆత్మనిగ్రహము, సమత్వము: ఇవిగదా సత్త్వలక్షణములు. హిందూదేశము మొదట రజస్సు (కార్యాచరణము) నభ్యసించినగాని చక్కబడదని ఆయన కనుగొనెను. కావుననే నిష్కామకర్మాచరణమును — అనగా ఉద్రేకరహితసమబుద్ధి (లేక, సత్త్వము)చే ప్రేరితమును, నియమితమును అయిన రజోగుణమును—ఆయన బోధించెను.

"సత్త్వము ఆత్మనిగ్రహమును కలిగించును, రజస్సు కార్యాచరణమూల మగును, తమస్సు పతనహేతువగును. తమస్సును రజస్సు (లేక కార్యాభిముఖత)గా మార్పవలెను. తమస్సు శిలాహిమమున నిద్రించుటవంటిది — ప్రాణాపాయకరము. నల్లమందు — మరణకారక మగునంత పరిమాణము — తిన్నవానిని బలాత్కారముగా — దేహహింసామూలముననైన — నిద్రపోకుండునట్లొనర్పవలెను. ఏలన అప్పుడు నిద్రించుటన్న మరణించుటే. సత్త్వమని పేరు పెట్టి హిందూదేశీయులు తమస్సులో కూలిపోవుచున్నారు.

వారికి కార్యశూరత్వము కలిగించుటకై స్వామిజీ గాఢ ప్రయత్నము లొనర్చెను.''

ఒకరు : ''ఈ పతనదశకు కారణ మేమి?''

స్వామి : ''కారణము తెలియుచునే ఉన్నదిగదా — ఆదర్శమునుండి తొలగుటయే.''

నవెంబరు, 17

శిష్యుడు : ''ఇంద్రియనిగ్రహ మెట్లు సాధించుట?''

స్వామి : ''నా కేమి తెలియును? (కొంత ఆగి) 'శ్యామామాతా! నీ శుభనామమే నాకు గతి...'. 'ఎన్నడు గాని శ్రీ దుర్గానామమును మఱవకుము. ...మనస్సా, ఆమె నేల మఱచుచున్నావు? శ్రీ దుర్గానామము నుచ్చరింపుము...'

''నీ వొకింతతడవు ప్రసంగము లన్నియు కట్టిపెట్టి, భగవన్నామోచ్చారణమందే పూర్ణశక్తితో నిలువగలవా? ఉగ్రాణములో కొంత సరకు ఉన్నప్పుడేగదా కూడబెట్టు ప్రయత్నము సాధ్యమగును? ఏ పూటకు ఆ పూట ఎట్లో గడపువా డెట్లు కూడబెట్టుకో గల్గును? కాని ఏదోయొక విధమున పరిశ్రమించి కొంత దాచియుంపగలిగెనేని, దాని నా పిదప త్వరితముగా అభివృద్ధిపఱచుకోగలుగును. ఆధ్యాత్మికజీవనక్షేత్రమునగూడ నిట్లే. కొంతకాలము పూర్ణ పరిశ్రమ మొనర్చి కొంత గడించి యుంచుకో జూడుము. అవిరామముగా — భోజనము చేయుచున్నప్పుడును, పరుండి

యున్నప్పుడును, నీ కార్యస్థానమున కూర్చుండియున్నప్పుడును — ఎల్లప్పుడును భగవన్నామ ముచ్చరించుచునే యుండుము. పెదవులు మూసికొని ఒకేపనిగ నామము నుచ్చరించుచుండుము. శ్రీ గురుదేవుడు దిక్సూచీయంత్రము నుదాహరణముగా చెప్పువాడు. దాని సూది ఉత్తరదిశనే చూపుచుండును. దానిని నీవు మఱొకదిశకు త్రిప్పవచ్చును, కాని వదలిపెట్టినతోడనే మరల అది యథాపూర్వము ఉత్తరమునే చూపుచు నిలుచును. నీ మనస్సునకు అట్టి శిక్షణ మిమ్ము. ఎవ్వరైనను వచ్చి నిన్నింకొక విషయముదెసకు మరల్చిరేని, వారు వెళ్లుటతోడనే మనస్సు మరల నామోచ్చారణము చేయుచుండవలెను. చూచితివా — ఇంత సేపటినుండి నీతో మాటలాడుచుంటిని, కాని మాటలు నిలుపుటతోడనే నాలోపల 'మనసా, ఏల మఱచెదవు? శ్రీ దుర్గానామమును జపింపుము' అను పాట వినవచ్చుచున్నది. ఈ మాటలకు ముందు మన స్సాపనినే చేయుచుండెను. ఇంకొక సంగతి. ఇదంతయు రహస్యముగా, ఎవరికిని తెలియకుండునట్లు, జరుపుచుండవలెను.

"'భగవదిచ్ఛప్రకారమే జరుగును' అని జను లందురు. సరేకాని, నీ ప్రయత్న మేమియు లేనిదే, భగవంతునికి ఊరకే ఇచ్ఛ జనించునా? ఎగిరి ఎగిరి, ఱెక్కలలసిపోయినప్పుడుగదా పక్షి ఓడస్తంభముపై వ్రాలి విశ్రాంతి గైకొనును. నీచేతనైన ప్రయత్న మంతయు చేసిన పిదప గాని యథార్థశరణాగతి యేర్పడదు."

శిష్యుడు : "నన్నే విధముగా నామోచ్చారణ మొనర్పుమందురు ?"

స్వామి : !"విధమునుగూర్చి చింతింపవలదు. 'నేను నీ బిడ్డను, నీవు నా తల్లివి' అని తలంచిన చాలును. నాతో నెట్లు మాటాడుచున్నావో, అట్లే ఆమెతోడను మాటాడుము. ఆమె నీ హృదయము నెఱుగును. ఆమె అందఱియందును కలదుగదా !"

శిష్యుడు : "ప్రార్థనకూడ అవసరమా ?"

స్వామి : "అవును. అదియు అవసరమే."

శిష్యుడు : "నా చిత్త మెల్లప్పుడును ఆయనయందే లగ్నమైయుండవలె ననున దొక్కటే — ఆయన నెన్నడును మఱవకుందునుగాక అనునదే — నా ప్రార్థనము."

స్వామి: "అట్టి ప్రార్థన మత్యావశ్యకమే. ఇట్లనుము: 'నిన్ను నే నేల మఱవవలెను ? నిన్ను ప్రార్థించుచుండు ఏకైక వాంఛతోడనేగదా సర్వమును పరిత్యజించితిని. అనుగ్రహించి, యెన్నటికిని నేను నిన్ను మఱవకుండునట్లు చూడుము'."

శిష్యుడు :' "భక్తిగీతికలు పాడుటకూడ అవసరమా?"

స్వామి : "అవును. అవియు అవసరమే. అవి లేనిచో, ఆధ్యాత్మికసాధనలు భేదరాహిత్యమువలన విసుగుదల కలిగించును. కాని ప్రారంభదశయందు జపమున కత్యంత

ప్రాముఖ్య మీయవలెను. అనుష్ఠాన మొక్కొక్కదాని మీదనే కేంద్రీకరించుచుండవలెను.

"కార్యదీక్షపూని, నడుముకట్టుకొని నిలుచుండుము. మనోనిగ్రహము సాధించితివేని ఇక నీకు భయములేదు. మనస్సే కడగండ్లన్నిటికిని కారణము. చేతు లేదో యొక్క కార్యము చేయుచుండవచ్చును. కాని మనస్సుమాత్రము నామోచ్చారణవ్యాపారమునందే నిలువవలెను. మనస్సు దేనిదేనిమీదికో పోవుచు, నామమును ఊరకే—అనాలోచితముగా—ఉచ్చరించుట నిష్ప్రయోజనము. పెదవులేకాక మనస్సుకూడ నామోచ్చారణము చేయవలెను. మానసిక జపము సర్వోత్తమము."

శిష్యుడు: "ఇతరులతో కలిసితిమేని, అంతయు తల క్రిందు లవును."

స్వామి: "మనస్సు స్వాధీన మగువఱకును ఇతరులతో కూడవలదు. అది స్వాధీనములోనుండుట అలవాటయ్యేనేని, ఎంతటితో కూడినను హాని లేదు.

"భగవత్ప్రార్థనముకూడ కార్యాచరణమే యగును. దానిని పరిపూర్ణతత్పరత్వముతో చేయవలెను. నీ నిరంతర ప్రార్థనలచేత భగవంతునికి దిక్కుతోపకుండున ట్లొనర్పుము. బిడ్డ యొకించుక యేడ్చినతోడనే తల్లి రాదు. కాని గొంతు రాసిపోవున ట్లేడ్చి నిలుపకున్నప్పుడు వెంటనే ఆమె వచ్చి యెత్తుకొనును.

"సర్వమున కతని యిచ్ఛయే కారణభూతము. "నిందాస్తుతులు, గౌరవాగౌరవములు : అన్నిటికిని నీవే మూలమవు.'

"నా జబ్బునుగూర్చి 'ఇదంతయు కర్మఫలము' అని "ర–' చెప్పెను. అందుకు నేను వెంటనే 'నీవే కర్మమవు, నీవే ధర్మమవు, నీవే అధర్మమవు' అని దేవీమాహాత్మ్యము (చండి)లో నున్నదిగదా అంటిని. కర్మాదు లన్నిటికి ఉత్పత్తి స్థాన మామెయే. ఆద్యంతరహితయు ఆమెయే. మొదలు లేనిది ఇం కేమైన నున్నదా? 'కర్మ మనాదియైనది' మున్నగు మాటలు చెప్పవలసివచ్చుటకు కారణము జనుల కేదో యొక సమాధాన మీయవలయుటే. ఆరోగ్యానారోగ్యములు, కీడు మేళ్లు — అన్నియు ఆమె ఇచ్ఛాధీనములై వచ్చుచు పోవు చుండును. ఇది చివరకు తేలు సత్యము. ఆమెయై ఎవరికి తెలుపునో వారుమాత్రమే ఈ సత్యమును గ్రహింప గలుగుదురు. ఇది గ్రహింపరా దని నిశ్చయ మూనినవారికి నే నిది నిరూపింపలేను.

"సర్వము ఆమె ఇచ్ఛావిధేయమై జరుగుచుండు నని మనము జీవితములో అనుభవపూర్వకముగా గ్రహింప వలెను — తార్కికబుద్ధిచే గలుగు విశ్వాసము నిష్ప్రయోజనము. అది మన విశ్రాంతిస్థాన మని చెప్పవచ్చును. లోకములోని దెబ్బలతాకుడుకు ఆగలేనప్పుడు ఈ భావము మనకు శాంతి నిచ్చును.

"పారమార్థికసాధన యనగా నేమి? అస్తిత్వముగల ఏకైకవస్తువు (అనగా పరమసత్యము)తో ఐక్యమునందు

ప్రయత్నమే అది. ఉండున దొక్కవస్తువే. రెండవవస్తువు లేనేలేదు. ఐక్యమును కనుగొనుటే జ్ఞానము, నానాత్వమును చూచుటయే అజ్ఞానము. ఆ వస్తువునుండి మనలను వేఱు పఱచుకొంటిమి గనుకనే కష్టము లన్నియు ప్రాప్తించు చున్నవి. అతనికడ పూర్తిగా ఆత్మార్పణ మొనర్చుకో గలిగితిమేని, యథార్థశాంతి లభించును. మఱెందును అట్టి శాంతి లభింపదు. అతనిని సమీపించుకొలదిని శాంతి అధిక మగుచుండును. చివరకతనియందే మనము విశ్రమింపవలసి యున్నది. అతడును నీవును నిజముగా భిన్నులా? భిన్నుడ నని తలంచుటే భిన్నుడవుగా నుండుటకు కారణము. అట్లు తలంపనిచో నీ వతడవే.

"జయాపజయాదు లన్నియు అతనివశములోనివే.

"సైతాను తన శక్తినిగూర్చి మిక్కిలి ప్రగల్భము లాడుచుండెను. అందుచే భగవంతు డతనిని 'జోబ్' కడకు పోయి ఆశలుచూపి లోంగదీయు మని చెప్పెను. సైతా నట్లే జోబ్ కడ కేగి 'నన్నారాధించితివేని అత్యధికములగు భోగ భాగ్యములు ప్రసాదింతును' అనెను. కాని జోబు 'ఇచటి నుండి వెడలిపొమ్ము' అనెను. సైతాను కోపోద్దీపితుడై, అతని సర్వస్వమును ధ్వంస మొనర్చెను. బిడ్డ లందఱు నొకరి వెంటనొకరు మరణించిరి. చివర కతడు కుష్ఠవ్యాధిపీడితు డయ్యెను. అప్పటికిని సైతా నతనికి ఆశలుచూపుట మాన లేదు. అప్పుడు జోబు సైతానుతో ఇట్లుచెప్పెను: 'భగ వంతు డిచ్చినాడు, భగవంతుడు తీసికొన్నాడు; భగవ న్నామమునకు జయ!'"

డిసెంబరు, 27

స్వామి : " 'రామసుధామాధుర్యం।
ఏ మనుజుఁ డెఱుంగు నాతఁడే సిద్ధుఁడిలన్।
రాము నెఱుంగని మనుజుం।
డేమియును నెఱుంగనట్టి హీనుండ సుమీ॥' *

"లోకములో అత్యంతముఖ్యమైనవి నాలు గని తులసీదాసు పలికియున్నాడు: సాధుసంగము, భగవన్నామస్మరణము, కారుణ్యము, సేవాభావము.

"సర్వమునకు సంగమే మూలకారణము. 'సఙ్గాత్ సఞ్జాయతే కామః' (సంగమువలన కోరిక లేర్పడును) అని గీత పలుకుచున్నది. 'అతని సహచరు లెట్టివారో చెప్పుము, అత డెట్టివాడో నేను చెప్పెదను' అను నొక సామెతకలదు. సాధువులసంగముచే మనస్సు పరిశుద్ధమగును. కాని వారు యథార్థసాధువులుగా నుండవలెను. సాధువేషధారు లందఱును సాధువులు కారు. ఎవడు భగవంతుని స్వకీయునిగా నొనర్చుకొనునో, వాడే సాధువు. భగవత్సాక్షాత్కార మందినవాని కీ భూలోకమే స్వర్గ మగును. అందలి ప్రతివస్తువును అతని కోర్కుల నీడేర్చును."

శ్రీయుత రమేంద్ర సుందర త్రివేదిచే రచింపబడిన 'వైజ్ఞానిక జగత్తు' అనెడు బెంగాలీగ్రంథమును స్వామి పఠించుచుండెను. ఈ గ్రంథమునుగూర్చి స్వామి ఇట్లు చెప్పెను: " 'ఏ జీవుల బల మధికతమమో ఆ జీవులుమాత్రమే

* ఆంగ్లపద్యరూప మూలమున కనువాదము.

నిలిచియుండును' అను సూత్రము ననుసరించి సర్వము సాగుచున్నదని ఈ గ్రంథకర్త నిరూపింపజూచుచున్నాడు. ఈ సూత్రము అణుజీవి మొదలు మానవునివఱకుగల క్రింది తరగతులలో వర్తించుననుట నిజమే. ఆ తరగతులలో ప్రధానవిషయము స్వప్రయోజనము. కాని, మానవక్షేత్రమునకు వచ్చినపిదప ఈ సూత్రము వర్తింపదు. ఆ పిదప భగవంతుని చేరుటయే లక్ష్యము. 'అహము' నెంత మఱచిన భగవత్సామీప్య మంత సిద్ధించును.

" 'ఈ ప్రపంచము నే మాత్రముగానైన గ్రహించుట — స్వాభావికముగనే — అత్యంతదుర్లభము. యావజ్జీవపర్యంతపరిశ్రమము చేసి అందొక కొంచెము గ్రహించినట్లు నాకిపుడు తోచుచున్నది. ఆ జ్ఞానము నితరులకు తెలుపజూచితినో లేదో, నాకు పిలుపువచ్చినది: రమ్ము, వచ్చివేయుము. ఇతరులకు బోధించు బాధ నీ కేల? ఈ ఆట ముగియుట తల్లి కిష్టములేదు' అని వివేకానందస్వామి నాకొకసారి చెప్పెను.

"ఆయన కుటుంబమువారు మిక్కిలి కష్టజీవనము చేయుచుండిరి. వరాహనగరమఠమున ఆయనతమ్ము డొకడు ఆయనకడకు వచ్చెను. స్వామిజీ అతనిని అపరిమితముగా చీవాట్లుపెట్టి పంపివైచెను. ఇది చూచి నేనా బాలుని కొంచెమవతలికి పిలుచుకొనిపోయి సానుభూతితో మాటాడి, ఊఱడించి పంపితిని. ఆ పిదప స్వామిజీని నేను 'అతని నంత క్రూరముగా దూషించితివేల?' అని యడుగగా 'నా కేమియు

సానుభూతి లేదనియు, నేను కఠినహృదయుడ ననియునే కదా నీ భావము?' అని యాయన అనెను. నేను నిరుత్తరుడ నైతిని. ఆ పిదప ఆయన ఇట్లు చెప్పెను: 'వారియెడ అణుమాత్రమైన ప్రేమ చూపితినేని, నే నిచట నుండుటయే అసాధ్య మగును. వా రందఱును వచ్చి న న్నన్ని విధములగు బాధలు పెట్టుదురు. నా తమ్ములును, చెల్లెండ్రును — నా బంధువు లందఱును — అన్నార్తులై మృతినొందినను, నే నిచటనే ఉండి భగవన్నామస్మరణ మొనర్పవలె నని నా యభీష్టము. అట్లు చేసిన గాని నాకు భగవంతునియెడ యథార్థప్రేమ కలదని నాకు స్పష్టము కాదు.'

"శారదాప్రసన్నుడు (త్రిగుణాతీతానందస్వామి) మఠమును వదలి యింటికి పోవగోరెను. బ్రహ్మానందస్వామి అతని మనస్సు మార్పగోరి యిట్లు చెప్పెను: 'ఏల పోయెదవు? నరేంద్రుని వీడి యెచటికి పోయెదవు? నరేంద్రుడు నీకు చూపునట్టి ప్రేమను చూపువా రిం కెవ్వరైన గలరా? నేనును ఇంటికి పోయి, ఇచ్ఛవచ్చినేని అచ్చటనే ఉండిపోగలను, కాని నరేంద్రుని ప్రేమయొక్కటే న న్నిచట నిలుపుచున్నది'."

1922, ఫెబ్రువరి 4

కాశీపురనివాసి యగు డాక్టర్ 'క–' సన్న్యాసాశ్రమము స్వీకరింపగోరి వారాణసి కరుదెంచి కొన్నాళ్లనుండి అద్వైతాశ్రమమున నివసించుచుండెను.

స్వామి : ('క-'తో) "భగవత్సాక్షాత్కృతి లభించిన వారికి ఆధ్యాత్మిక సాధన లన్నియు పసిబిడ్డల బొమ్మలాటల వలె తోచును. ఆ ఆటలలో పిల్లలు 'ఇది నా భార్య', 'ఇది నా పెనిమిటి' అందురు. ఒక బొమ్మను మఱొక బొమ్మ కిచ్చి పెండ్లిచేయుదురు. పిదప జీవితములో జరుగనున్న నిజమగు ఆటనే యీ పసినాటి బొమ్మలాటలు సూచించును. నిజముగా భర్తలు లభించినప్పుడు, సుఖము లన్నియు వారిచేతిలోనే కలవు, బొమ్మలు మూలబడినవి; వానివైపు ఇప్పుడు చూచువా రెవరు? అట్లే భగవత్సాక్షాత్కృతి లభించినప్పుడు సాధన లన్నియు మూలద్రోయబడును. ఈ విషయమునుగూర్చి శ్రీరామకృష్ణు డిట్లు చెప్పువాడు : 'వరుడు తన్ను చూడ రాబోవునప్పుడు వధువు చక్కని వేషము దాల్చి, తల బాగుగా దువ్వుకొని, అందముగా కానిపించు నుపాయము లెన్నియో చేయును. ఇవన్నియు వరుడు లభించుకొఱకు. కాని అతడు లభించినపిదప, సర్వమును విసర్జింపబడును— ఆ పిదప వీని యన్నిటితో నేమి పని?' "

మార్చి, 10

ప్రేక్షకు డొకనితో "వీ రందఱు (స్వామిని, మమ్మును చూపి) సాధువులు" అని డాక్టరు 'బ-' చెప్పుచుండెను.

స్వామి : (చిఱు నగవుతో) "అవును, వేషమునందు సాధువు లనుట నిస్సంశయము. కాని సాధుత్వ ముండునది వస్త్రము లందును వేషము నందును కాదు. సాధుత్వము

మనస్సునకు లభ్యముకావలెను. అది బహుదుర్లభకార్యము. 'కోరికలకు నిప్పంటించి తగులబెట్టి భస్మముచేయుము. ఆ భస్మము రుద్దుకొని (మనస్సు) స్నానముచేయుటకు మిక్కిలి చక్కగా నుపయోగించును.'

"భగవన్నామము మనస్సుయొక్క మురికిని పోగొట్టును. నీటిలోని మురికి యంతయు, చిల్లగింజ చాది వైచినచో, నెట్లు అడుగున పేరుకొనునో, అట్లే నిరంతర భగవన్నామోచ్చారణచే మానసికకల్మష మంతయు నశించును. 'జగజ్జననీ, నాకు అసాధ్యలక్షణముగల వ్యాధి తటస్థించినది. చత్తునో బ్రతుకుదునో ఎఱుగను. నీ నామము నెడ నాకు రేయుంబవల్లు అరుచి ఏర్పడినది'. భగవన్నామమునెడ రుచి తప్పుటకన్న ఘోరమగు ఆపద లేదు.

"(డాక్టరు 'బ–'తో) అన్నద్వేష మొక విధమగు జాడ్యమనిగదా వైద్యశాస్త్రము వాకొనును?"

డా. 'బ–': "ఇంద్రియభోగద్వేష మెన్నటికిని కలుగదు!"

స్వామి: "అందుకు సందేహమా? పొట్ట పగులు నట్లుకును తిందుము. అప్పటికి ఆకలి తీఱునుగాని, కొంత సేపటికి అట్టి మితిమీఱిన కాంక్షయే మరల పొడచూపును. ఆకలి తీఱుట క్షణికమే, శాశ్వతముకాదు. భోగము లన్నిటి లోను కామవికారమంతటి అత్యాకర్షకమైనది లేదు. సుఖానుభూతు లన్నిటిని భోగము లందురు. కాని కామసుఖ

మును సంభోగము (అతిశయభోగము) అందురు. వివేకశక్తి నొందినవాడు దానినికూడ నిగ్రహింపగలుగును.

"మొన్న నొక డాక్టరు — మిక్కిలి మంచివాడు— వచ్చెను. 'ప్రతి భోగమునెడ మనస్సు విముఖత్వము చూపునుగాని, దానియెడమాత్రము (సంభోగమునెడ) చూపుట లేదు'అని యతడు పల్కెను. 'భగవంతుని ప్రార్థింపు' మంటిని. 'ప్రార్థించు కోరికకూడ లే' దని యతడు బదులుచెప్పెను. అతడు మిక్కిలి మంచివా డని నాకు తోచినది. దాపటిక మేమియు లేక తన మనస్సులో కల దంతయు అతడు సాధుపురుషుని ముంగల వెళ్లబోసికొనెను. 'మంచిది! ఈ అడవిమామిడిపండు * యొక్క పుల్లదనము తోనే కొన్నాళ్లు ఆనందింపుము. కాలక్రమమున అదియే క్షీణించును' అని నేను చెప్పితిని. 'అడవిమామిడిపండులో తొక్కయు, టెంకయునే కాని గిజు రేమియు నుండదు. అది తిన్నచో కడుపునొప్పి పుట్టును కాని తినుటకు రుచిగా నుండును. అట్టిది ఈ లోకము' అని శ్రీరామకృష్ణు డను వాడు. ఈ లోకమున సుఖ మెచట కలదు? — ఇది దుఃఖ మయము — వ్యథానిలయము. శ్రీకృష్ణు డర్జునునితో 'నన్నే యెవ్వ రాశ్రయించుచున్నారో, వారీ మాయను తరింతురు' అని చెప్పెను. 'నిన్నాశ్రయించినవారు, మాయ యొక్క పట్టును వదల్చుకోగలిగినచో, మానవు లందఱు అట్లేల చేయరు?' అని అర్జును డడుగబోవు ప్రశ్న కాయన

* HOGPLUM (spondius mangifera)

ముందుగనే ఇట్లు పలికెను: 'అదెట్లు సాధ్యము? దురత్యయ మగు (దాటశక్యముకాని) నామాయలేదా వారి నట్లు చేయకుండున ట్లొనర్చుటకు?' 'జ్వరము కాయుచున్నప్పుడు, రుచ్యాహారముకూడ అసహ్యముగనే ఉండును' అని తులసీ దాసు చెప్పవాడు. అట్లే పాపమునందు చరించువాని బుద్ధి భగవంతునివైపునకు మరలదు.

"మనస్సును పరిశుద్ధ మొనర్పవలెను. ఇంద్రియ భోగములందత్యాసక్తిగల మనస్సు అపరిశుద్ధము. చాల వఱకనాసక్తమై యుండు మనస్సు పరిశుద్ధము".

ఏప్రిల్. 12

స్వామి: "నరుల మనస్సు సామాన్యముగా అట్టడుగున నుండు మూడు కేంద్రములలోనే విహరించుచుండును; ఆ మూటిలోనే పైకి, క్రిందికి, చరించుచుండును. ఈ నిద్రా హార మైథున క్షేత్రములను దాటి పై కెగయుట కది సామాన్యముగా ఇచ్ఛగింపదు. ఒక కొలదిమందిమనస్సు హృదయ కేంద్రమువఱకెగయును. అప్పుడు తేజస్సు కాని పించును. ఆపైది కంఠస్థానము. మన స్సచటి కెగసినచో, జగత్తు మిథ్యగా తోచును. ఈ కడపటి రెండు స్థానముల నుండికూడ మనస్సు దిగజాఱును. అధోగమనాభిముఖమగు ఆకర్షణశక్తి అంత బలిష్ఠము! కాని మనస్సు భ్రూమధ్య స్థానమున కెగసెనేని, అది ఎంత జాఱినను, హృదయక్షేత్రము క్రిందికి జాఱదు. ఆపై క్షేత్రము శిరోగతమగు సహ స్రారము."

స్వామి 'జ-': "మనస్సు కంఠక్షేత్రము నందుకొన్నచో తేజస్సు కానిపించునందురే, అదెట్టి తేజస్సు? అది అత్యంత దేదీప్యమానముగా నుండునా?"

స్వామి: "అవును, తేజస్సు కానిపించును. కాని అది స్థూల తేజస్సు కాదు — జ్ఞాన తేజస్సు.

'అచట సూర్యుడు ప్రకాశింపడు, చంద్రతారకములు కూడ ప్రకాశింపవు, విద్యుత్ప్రకాశముకూడ నుండదు, ఇక అగ్నిమాట చెప్పవలెనా? ఈ సర్వము అతని తేజస్సు వలననే ప్రకాశించుచున్నది.' ఇచట బ్రహ్మ యొక మహాదేదీప్యమానమగు తేజస్సనియు, అది సూర్యచంద్రాదుల తేజస్సును మందీకరించు ననియు తలచుట పొరపాటు. ఆ వాక్యముల కర్థము 'బ్రహ్మముయొక్క ఉనికిచేతనే ఈ జగత్తంతయు అభివ్యక్తమగుచున్నది' అని.

"మానవుడు ఇంద్రియభోగములందే నిమగ్నుడై యుండును. అతని జీవిత మంతయు ఆహారనిద్రామైథునాదులందే గడచిపోవును. శ్రీరామకృష్ణు డిట్లు చెప్పువాడు: 'గొప్పధాన్యవర్తకులు తమ ధాన్యపుకొట్లలోనికి ఎలుకలు చొరకుండుటకై ఆ కొట్ల తలుపుల ముందరనే అటుకులు మొదలగువాని నుంతురు. ఎలుకలు వచ్చి వీనిని తినుట కారంభించును. లోపల బస్తాలకొలది ధాన్య మున్నది. కాని ఎలుకలు దాని జాడనే కనుగొనవు. అట్లే జగన్మాత కామకాంచనరూపములగు భోగ్యవస్తువులచే లోకులను భ్రమగొల్పుచున్నది. మానవులు వాని నతిక్రమించి ధాన్యపు

మూటల (భగవంతుని) యొద్దకు పోజాలరు. ఈ ప్రపంచము అగమ్యగోచరమగు చక్రవ్యూహమువంటిది. దానిని ప్రవేశించినవాడు వెలికి రాజాలడు — త్రోవ కానిపింపదు. మనుష్యజన్మ మెత్తిన జీవులకు వెలికిపోవు నవకాశము లభించును. కాని అది ఏమి ఉపయోగము? మనుష్యుడు ఇంద్రియవిషయములందు నిమగ్నుడై సర్వమును మఱచును'."

ఏప్రిల్, 30

స్వామి 'జ-': "అనేకులు ఆధ్యాత్మికసాధనలు చేసి చేసి, విసివి, వానిని చివరకు విరమింతురు."

స్వామి: "కాని ఇంద్రియభోగములచే నెవ్వరును విసుగుచెందరే! ఆ మార్గమున నందఱికిని శక్త్యుత్సాహము లెంతయైన నుండును. ఇతరులశక్తి నుపయోగించుకొనియైన ఇంద్రియసుఖము లనుభవించువారు కూడ కలరు. యయాతి తన కుమారుని యౌవనమును ఎరవుగొని, వేయేండ్లు ఐహిక సుఖము లనుభవించెను. ఆధ్యాత్మికసాధనలవిషయముననే విసుగుపుట్టుట అను మాట వినవచ్చునది! అదంతయు అర్థరహితప్రసంగము: వారి కందు ఆసక్తి లేదు, అభిరుచి లేదు; కావుననే విసుగు. కొన్నాళ్లు ఆధ్యాత్మికసాధనలు చేసి 'వీని వలన నేమియు ఫలము కానిపించుటలేదు, ఐహికజీవనము నందే మనకు చక్కగా నుండెను' అని వారనుకొందురు.

"ఒంటినిండ బురదపూసికొని, ఆ పిదప కడుగుకొను ప్రయాసము పడుటకన్న, బురదయొద్దకే పోక, దూరముగా

నుండుట శ్రేష్ఠముగదా! కాని, అందఱెందఱు ప్రవర్తింప గలరు? కావున కొంచెము ఐహికభోగము ననుభవించుచే మేలని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. కాని అట్లు చేయు వారు కొంత వివేకముతో ప్రవర్తింపవలెను. ఈ జననమరణ చక్రముగుండ మనము క్రమక్రమముగ అతని దెస కేగు చున్నాము.''

మే, 4

స్వామి: ''వాక్కులం దెంత శక్తి ఇమిడియున్నది! సర్వము మిథ్యయని ఎన్నిసార్లు వల్లించినను, ఈ జగత్తు అసత్య మనుచున్నను, నేనొక కఠినవాక్కు పలికితినేని, నీ మనస్సు వెంటనే నొచ్చును. దుర్వాక్యములలో అంత బలము కలదేని, 'అహం బ్రహ్మాస్మి' మున్నగు వేదమహావాక్య ములలో బల మేల లేకుండును? కాని వేదసిద్ధాంతము లందుగాని, వేదమంత్రములందుగాని, మనకు విశ్వాసము లేమిచే అవి మన జీవితములో వాని బలమును చూపజాల కుండును. నోటిమాటలు, వ్రాతమాటలు అని మాటలు రెండువిధములు. ఒక జాబులో ఏదో వ్రాయబడియుండును. అది చదువుటతోడనే నీ మనస్సునం దొక వికారము — అనుకూలమైనదో, ప్రతికూలమైనదో — కలుగును. మఱియును — ఇ దెంత వినోదకరమైన సంగతి! — ప్రతివారి కొకే విధమగు వికారము కలుగదు. కొందఱి కెట్టి వికారము కలుగదుకూడ. ఆ విషయమునందు ప్రసక్తు లగువారియందే అది జనించును. వివేచన చేయు తరుణమున నేమియు

లేనట్టే తోచును. కాని కొంచెము పిదప అంతయు ప్రత్యక్షమగును. వివేచనకాలమున ఇంద్రియభోగ్యవిషయ మేదియు ఎదుట లేనిచో, నీయం దెట్టి మనోదౌర్బల్యము లేదని తోచును; కాని అట్టి విషయ మేదైన కానిపించుట తోడనే తాఱుమాఱు అవుదువు. మనము వివేకించుమాట నిజమే, కాని కొంతకాలమున కా అభ్యాసమును మాను కొందుము. ఆ మానుకొనుట ఫలమే యిది. వివేచనా భ్యాసము మనయందు నిరంతరముగా దీపించుచుండవలెను. దానియందే మనస్సు నివసింపవలెను. అట్లు చేయనిచో, ఎట్టి ఉపయోగమును కలుగదు. భోగ్యవిషయములు తన యట్టయెదుట కానిపించినను, మనస్సు చలింపకయుండువాడే ప్రాజ్ఞుడు. ఇదియే అందుకు పరీక్ష — మనస్సు ఆస్థితికి వచ్చి నప్పుడు సర్వము చక్కబడినదని నమ్మకోవచ్చును.

"ద్వంద్వభావముకై భీతిల నక్కఱలేదు. దానికి ఇదియే(తన హృదయసీమను చూపుచు)మూలము. పూర్ణ సంకల్పబలముతో విదర్చివైచిన, అది మాయమవును. విషయభోగము లక్కఱలేనివానికి — వాని తలంపు మనస్సు లోనికి వచ్చుటనే ద్వేషించువానికి — విషయభోగేచ్ఛలు తమంత తామే పాఱిపోవును. ఎవరో యొకనితోడి సాంగత్యము నా కిష్టములేనిచో, నేను వానితో మాటాడను. ఇట్లు నా కతనియెడ శాశ్వతవిముఖత్వము తెలిపితినేని, అతడు స్వయముగనే నాయొద్దకు వచ్చుట మానుకొనును. విషయభోగేచ్ఛలను తఱిమివేయ బ్రయత్నించినవాడుగాని

వానిబారినుండి తప్పించుకోజాలడు. కాని వానిని మనము విడువక అంటిపట్టుకొని యుందుము. ఇక అవి యెట్లు విడిచి పోవును?

"ఒక రాజున కొక సాధువు మిత్రుడై యుండెను. పలుమాఱు రాజతనిని 'ఈ ఐహికబంధములనుండి నన్ను వదలింపుము, నన్ను విముక్తుని చేయుము' అని ప్రార్థించును. సాధువు విముక్తిమార్గములు తెలుపును. కాని రాజు యథాప్రకారము 'నన్ను విముక్తినిచేయుము' అని యడుగుట మానడు. ఒకనాడా సాధు వొక స్తంభమును గట్టిగా పట్టుకొని, రాజును చూచి 'మిత్రమా, నన్ను వదలింపుము' అని యడుగనారంభించెను. రాజు 'ఆ పట్టు నేల వదలవు?' అని యడిగెను. కాని సాధువు 'కాదు. నీవే నన్ను వదలింపవలెను' అనెను. అందుకు రాజు 'ఇది మిక్కిలి వేడుకగానున్నది. ఆ స్తంభమును నీవు గట్టిగాపట్టుకొనియున్నావు. కావలెనన్నచో ఏ క్షణమందైనను దానిని విడువగలవు. కాని అట్లు చేయక నా సహాయ మపేక్షింతువు. నీవే దాని నేల విడువవు?' అని ప్రశ్నించెను. అటుపై ఆ సాధువు స్తంభమును వదలి రాజున కిట్లు చెప్పెను: 'నీవుకూడ అదే కదా చేయుచున్నావు? ప్రపంచమును నీవు గట్టిగా పట్టుకొని యున్నావు; వదలింపుమని నన్నెప్పుడును అడుగుచుందువు. నీవే దాని నేల వదలవు?' రాజున కర్థమైనది.

"శ్రీ మ. యొక్క పెద్దకుమారుడు మరణించినప్పుడతని భార్య శ్రీరామకృష్ణునియొద్దకు వచ్చి గోడుగోడున

ఏడువదొడగెను. నేను చెంతనుంటిని. ఆమె అంతగా దుఃఖించుచుండుటచూచి ఆయన కఠినవాక్కులతో ఇట్లనెను: 'తక్కినప్పు డంతయు నీవు జ్ఞానమునుగూర్చి, భక్తినిగూర్చి, పల్కుచుందువు. అవి ఇప్పు డెచటికి పోయినవి? మాయ మైనవా?' ఈ మాటలు నాకు మిక్కిలి సముచితములుగా తోచినవి.

"శోకముతోగాని దుఃఖముతోగాని నిండియుండు వారితో నిర్దాక్షిణ్యముగా మాటలాడినచో, ఆ మాటలు మిక్కిలి ఫలవంతములగును — వానిచే తమోగుణ ప్రాబల్యము తఱిగిపోవును. సుఖవేళలందు ప్రతివాడును ప్రశాంతముగా నుండగలడు, ప్రతివాడును వివేకవిచారము చేయగలడు. కాని కష్టవేళలందుగూడ అట్లుండగలిగినవాడే వివేకమునందు సుప్రతిష్ఠితుడైనా డనవలెను. అట్టి తరుణము లందు మనుష్యుడు తన శక్తినంతయు వినియోగించుకోవలెను. అప్పుడు దౌర్బల్యమునకు లొంగనేని, దుఃఖ మతనిని పరవశునిచేసి వినాశ మొనర్చును."

మే, 9

స్వామి: "మనస్సును స్వాధీనములోనికి తెచ్చు కొనుట అత్యంతదుర్లభము. కాని ఎట్లో అది చేసియేతీఱ వలెను. గత్యంతరములేదు.

"దృఢసంకల్పము చాల ముఖ్యము. మనస్సు మన స్వాధీనములో నుండవలెను. మనము మనస్సుస్వాధీనములో నుండరాదు. ఇచటనుండు నా తుండుగుడ్డతో నా యిచ్చ

వచ్చినప్పుడు నా శరీరము నెట్లు తుడుచుకో గలనో అట్లే మన మనస్సునుగూడ మన యిచ్ఛవచ్చిన ట్లుపయోగించుకో గలిగియుండవలెను. మనము గుఱ్ఱముపై నెక్కవలెనుగాని గుఱ్ఱము మనపై నెక్కరాదు. అపసవ్యమార్గము పట్టకుము: బండికి ముందుగదా గుఱ్ఱ ముండవలెను, గుఱ్ఱమునకుముందు బండి కాదు. 'మనస్సు నొక మట్టిముద్దవలె నుండునట్లు చేయవలెను. దేనిపై వైచిన దానికి అది అంటుకోవలెను' అని (శ్రీ) వివేకానందస్వామి చెప్పువాడు."

మే, 13

స్వామి : "ఈ శరీరములో నుండు నొక వస్తువును పాపమెన్నడును అంటదు. పాపము దానిని కలంక మొనర్ప జాలదు, స్పృశింపనే జాలదు. నీ వొక ప్రత్యేకజీవుడ వను భావమును విడనాడి ఆ (పరమ) వస్తువుతో ఐక్యమొంద గలిగితివేని, నీ కిక భయము లేదు. కామక్రోధములు జీవుని లక్షణములు. కామకాంచనవ్యామోహమునుండి క్రమ క్రమముగా తప్పించుకొని, జీవుడు చివరకు భగవంతునితో ఐక్యమందును. దుష్టపదార్థములనుగూర్చి — కామకాంచన ములనుగూర్చి — నిరంతరచింతన చేయుటచేత మనుష్యుని శరీరముకూడ మాఱిపోవును—ముఖవర్చస్సు మాఱిపోవును. పాప మొనర్చినపిదప, దాని నెంత దాపజూచినను, అం తయు నిష్ప్రయోజన మగును; నీ మొగమే దానిని వెలి పుచ్చును. సామాన్యమానవులకుకూడ నీ గుట్టు తెలిసి పోవును. ఇక మనోవేదులమాట చెప్పవలెనా? అత్యంత

స్పష్టముగా తెలుపునవి కన్నులు. ఖూనీలు, బందిపోట్లు చేయువారి ముఖలక్షణమే వేఱువిధముగా నుండును. ఇదెప్పుడైన నీవు గమనించితివా? అతిసుందరాకారుడైనను హేయమగు దుష్కార్య మొనర్చినపుడు, కురూపివలె కానిపించును. ఘోరపాతకి యగువాడొక మహాపురుషుని కృపచే సన్మార్గము త్రొక్కెనేని, సుందరాకృతియై యొప్పును. ఇవి నేను ప్రత్యక్షముగా చూచిన విషయములు.

"కామవికారమును జయింపుము. నీ స్వాతంత్ర్యమును సుప్రతిష్ఠిత మొనర్చుకొనుము. కామవికారము నిన్ను జయింపకముందే దానిని నీవు జయింపుము. అది నిన్ను వశముచేసికొనెనేని నీగతి మూడినట్లే. కుస్త్రీపట్టులలో కూడ నిట్లే. ఒకసారి క్రిందపడితివా, ఇక నీకు ఆశలేదు. వివేకమువలన, భగవద్భక్తివలన, కామవ్యామోహము నుండి విడివడవచ్చును. భగవద్భక్తి పెరుగుకొలది, కామక్రోధాదులు తఱిగిపోవును. శ్రీరామకృష్ణదర్శనార్థము దక్షిణేశ్వరము వెళ్లునప్పుడు ఉద్యానబహిర్ద్వారముదాటుతోడనే నా గుండె కొట్టుకొనసాగెడిది. అనేకుల కిట్లే జరిగెడిది. మహాపవిత్రపురుషుని చేరబోవుచున్నామను భావమే మానవులను భయకంపితుల జేయును. మహాపురుషుని సాన్నిధ్యమున కేగినవానిలోగల పాపములు వణకిపోవజొచ్చును."

శిష్యుడు: "పాపకలంకితముకాని మనస్సు గలవారి విషయమేమి? అట్టివారిగుండెలుకూడ కొట్టుకొనునవా?"

స్వామి : "అవును, కొట్టుకొనునవే. ఏలయన శ్రీరామకృష్ణునికి గల పవిత్రత మరెవరికిని లేదుగదా! మాలో అత్యంతపవిత్రుడుకూడ శ్రీరామకృష్ణునిముందట క్షుద్రుడే. అయోగ్యభావ మేదైన నా మనస్సులో పొడ చూపెనేని, దానిని ఆయన వెంటనే కనుగొని 'అట్లున్నా వేమి? అందుకు కారణ మిదియేనా?' అనును. ఆ కారణ మును, రేఖామాత్రభేదము లేకుండ, నిర్దుష్టముగా, చెప్పి నన్నాశ్చర్యపరవశు నొనర్చును. తా నేతప్పిదమును చేయ లేదని తన అంతరాత్మసాక్షిగ చెప్పగలవా డెంత నిర్భయు డుగా నుండవలెను!"

జూన్, 5

స్వామి: "ఎవరైనను, ఏ వస్తువునైనను, పోగొట్టుకొని రేని శ్రీరామకృష్ణుడు మిక్కిలి చీదఱగొనువాడు. హోజ్రా ఒకసారి తన తుండుగుడ్డను గంగానదిలో పోగొట్టుకొనెను. శ్రీరామకృష్ణుడు మిక్కిలి చీకాకుతో అతనిని చూచి యిట్లనెను: 'నే నెన్నో తడవలు సామాన్యక్షేత్రమున నుండను. కాని నే నెప్పుడును ఏమియు పోగొట్టుకోలేదు. నీ కింత పరాకు!'

"భగవంతునిపై ఆధారపడియుండుట మిక్కిలి ఆవశ్యకము. సర్వము ఆయనకు అర్పింపవలెను. పరిపూర్ణ శరణాగతి నొందితీఱవలెను. అది లేనిచో విజయమే అసాధ్యము. గట్టిగా నమ్ముము — విజయమే అసాధ్యము. పరిపూర్ణశరణాగతి నొంది అతడు నిన్నే స్థితియందుంచునో,

అందే సంతుష్టుడవై యుండుము. శరణాగతి పొందుట ప్రతివానిచేతిలోని పనియే. కాని, ఎవ్వరును దానిని కనుగొనరు, ఎవ్వరును అనుసరింపరు.

"జను లెప్పుడును అనుకూలస్థితుల నపేక్షింతురు. వారి కెప్పుడును భౌతికసుఖములపై బుద్ధి: సుఖజీవనము, సుఖభోజనము — వీనిమీదనే వారి దృష్టి. ఎవరికైన యథార్థముగ భగవంతుడు కావలసియుండునా? మన జీవితమునునైతము ఆయనకై బలియీయ సిద్ధపడియుండవలెను. నీ మనశ్శరీరములను పరిపూర్తిగ ఆయనకు సమర్పించుకోవలెను—సాధ్యమగుచో, అంతకుమించి ఇంకేదైనగూడ. ఆయన నీకే కార్యమునైన అప్పగించెనేని, దానిని నీ యావచ్ఛక్తిని వినియోగించి, మనఃపూర్తిగా, చేయుము. అది ముగియుటతోడనే, అతడు నీకు మఱొక కార్యము నిచ్చునేమో! దానిని కూడ నీ యావచ్ఛక్తితో చేయుము. ఇంతేల, నీ జీవితమునంతయు ఆయన కార్యముకై సమర్పింప సంసిద్ధుడవై యుండుము. అట్లుచేసిననే, నిన్నొక కొలది సార్లు పరీక్షించి, ఆయన నీకు ముక్తి ప్రసాదించుటసాధ్యము.

"సన్న్యాసాశ్రమ మర్థించితివేని, నీ భావిజీవితమునకు ఏర్పాట్లు ముందుగనే ఆలోచించుకొను అభ్యాసమును పూర్తిగా మానుకోవలెను. ఆయనమీదనే ఆధారపడవలెను. ఆయనకు పరిపూర్తిగా ఆత్మార్పణము చేసికొనవలెను. నీ స్వాధీనములో ఏమియును ఉంచుకోరాదు. మనస్సు, శరీరము, హృదయము, ఆత్మ—అన్నియు ఆయన కర్పించుకో

వలెను—ఆయనఇచ్ఛానుసారము వాని నుపయోగింపనీయ వలెను. శరీరమునకు శ్రద్ధ అవసరమైనచో, అందు కాయ నయే ఏర్పాట్లు చేయును.

"నేను హరిద్వారసమీపమున నుండు లాంగాల్ లో తీవ్రవ్యాధిగ్రస్తుడనై తిని. ఈ విషయమును బేలూరుమఠము వారికి తెలుపవలెనని 'క-' ఉద్దేశము. ఇది గ్రహించి నే నతని నిట్లు ఎచ్చరించితిని: 'జాగ్రత్త! నీవు జాబువ్రాసితివని తెలిసినచో, ఈ స్థితిలోనే నే నిచటినుండి వెళ్ళిపోవుదును. అచ్చటనే నేను "ఔషధం జాహ్నవీతోయం, వైద్యో నారాయణో హరిః" (గంగోదకము ఔషధము, నారాయ ణుడే వైద్యుడు) అని పల్కినది.' అవి వట్టిమాటలు కావు. నిజముగా నాకట్లే తోచినది."

శిష్యుడు: "వివిధభావములు మనస్సును పరిభ్రమింప జేయును. వానిని పాఱద్రోలు టెట్లు?"

స్వామి: "భగవంతునియందు నీ తలంపు లగ్నమగు కొలదిని, ఇతరభావము లంతరించును. 'తూర్పునకు మనము సాగుకొలది, పశ్చిమము దూరమగుచుండును' అని శ్రీ గురుదేవుడు పల్కినాడు. గంగాజలము నిరంతరప్రవాహ ముగా, సముద్రముఖమై పాఱునట్లు, నీ తలంపు లాయన వైపునకు ప్రవహించుచుండవలెను. ఇట్లు కొన్నాళ్లు చేయు చుండగలిగితివేని, అంతయు చక్కపడును—మనస్సు అప్ర యత్నముగా ఆయనమీదికే పాఱును.

"నీ మనఃఫలకముపై పెద్ద అక్షరములతో 'లోపలికి రాకూడదు' అని వ్రాసిపెట్టుము. ఇట్లు కొంతకాలము జరిగిన పిదప 'నీవు రమ్ము, అందఱును రండు' అని చెప్పదగు స్థితి నీవు పొందుదువు. తలుపులు తెఱచియుంటినుగనుకనే గదా నాయొద్ద కందఱును వత్తురు. వానిని మూసితినేని వా రెట్లు రాగలరు? ఇతరభావములు ప్రవేశించి నీ మనస్సును ఏల కలవర పెట్టనీయవలెను? నీవు రానిచ్చుచున్నావుగనుకనే వాని రాక. ప్రారంభదశయందు నిరంతరజపధ్యానములు నీ కశక్యమైయుండును; ఇతరవిషయములుకూడ కొన్ని యుండవలెను: కొంచెము ధ్యానము, కొంచెము జపము, కొంచెము శాస్త్రపఠనము, కొంచెము భక్తిగీతికా సంకీర్తనము. అతనినే స్మృతిపథమున నుంచుకొనుటకు ఇట్టి వేర్వేఱు మార్గములు అవలంబింపవలెను, ఇట్లు కొన్నాళ్లు అభ్యాసములు సాగించితివేని, నీ తలంపు లాయనమీదనే నిలువ గల్గును, నీ బుద్ధిని ఏకాగ్రము చేసికో గల్గుదువు.

"కేవల పుస్తకజ్ఞానము—సైద్ధాంతికరూపమైనది—నిష్ప్రయోజనము. మన కంతయు తెలియును, కాని ఏమియు చేయము. 'మన కెంతయో తెలియును; కొంచెము తక్కువ తెలిసిన బాగుండెడిది' అని స్వామిజీ చెప్పువాడు. కార్య రూపముగా నేదో చేయుము, ఏదైన సరియే. చేయుశ్రమ నెవ్వరును పెట్టుకొన నిచ్చగింపరు. నీవే కష్టించి పనిచేయ వలెను. నీకై ఇతరు లేమియు చేయజాలరు.

"నీ నెత్తిబరువును మఱొక డెత్తుకొని మోయగలడు.

కాని నీకు ఆకలైనప్పుడు నీవే తినవలెను. మఱొకడు తిని నీ యాకలి తీర్పజాలడు.

"'మనసా! మరణమునకైన తెగించి పరిశ్రమింపుము. మోకాలిబంటి నీటిలో ముత్యములు దొరకునా? ఆతని సాక్షాత్కార మభిలషించితివేని, సముద్రగర్భాంతరాళములోనికి మునుగుము' అని శ్రీగురుదేవుడు పాడెడు వాడు.

"మే మొకప్పుడు గాఢసాధన లొనర్చితిమి. ఇప్పుడును ఆధ్యాత్మికసాధనలందు కోరినప్పుడెల్ల నిమగ్నము కాగల సంస్కారము మాలో కలదు."



## 5-వ ప్రకరణము

# శ్రీ శివానందస్వామి సంభాషణములు

మార్చి 23, 1919

బేలూరుమఠము దర్శించుటకై కొందఱు కాలేజీ విద్యార్థులు వచ్చియుండిరి. యూనివర్సిటీపరీక్షలు ముగిసినవి. ఆ విద్యార్థులిక సెలవులకు ఇండ్లకు పోవు సన్నాహములో నున్నారు. మఠప్రధానమందిరమున, గంగాభిముఖమగు తూరుపువసారాలో, స్వామి కూర్చుండియుండెను.

స్వామి: "మీకు చాలకాలము సెలవులుగదా. వాని నెట్లు గడపుదురు? కేవలము వేడుకలందును, చీట్లాడు టందును కాలహరణము చేయుటవలన నేమి ఉపయోగము? ఇచటికి వచ్చితిరిగనుక మా భావములు కొన్ని కైకొని వాని నాచరింపజూడుడు. మీలో మీరే చందాలు వేసికొని కొంచెము డబ్బు పోగుచేయుడు. దానితో హోమియోపతి మందులు కొని మీ ఊళ్లలోని రోగులను, బీదలను 'ఉచితముగా' మందులిచ్చియు, ఉపచారములుచేసియు సేవింపుడు. హీనదశ ననుభవించుచుండు జాతులతో ధారాళముగా కలసి మెలసి తిరుగుచు, వారి యోగక్షేమములు విచారింపుడు. ఇట్లు చేసి, జబ్బుగా నుండువారి నుపచరించి ఔషధము లిచ్చినచో వారు మిక్కిలి కృతజ్ఞు లగుదురు. వారికై యొక పాఠశాలను రాత్రిపూట నడపుడు. దేశచరిత్ర,

ఆరోగ్యసంరక్షణవిధులు మున్నగునవి వారికి నేర్పుడు. శ్రీరామకృష్ణవివేకానందులనుగూర్చి వారికి చెప్పుడు. ఈ విధముగా వారికి విద్య కఱపుడు. వారు పైకివచ్చినగాని దేశము బాగుపడదు. మీ మార్గములు, మీ భావములు, వారు ప్రథమమున గ్రహింపజాలక మిమ్ము సంశయదృష్టితో చూతురు. కాని కాలక్రమమున మీరు స్వార్థపరులుకా రని గ్రహించి వారు సుముఖులగుదురు. స్వార్థరాహిత్యముతో మీరు ప్రవర్తింపవలెను. ఇట్టి అస్వార్థకర్మమే మనఃపారిశుద్ధ్యమును కలిగించును. పరిశుద్ధమనస్కులబుద్ధి స్వల్పకారణముల చేతకుండ భగవంతుని దెసకు మరలును. అపరిశుద్ధమనస్కు లెంతె జపము చేసినను, పారమార్థికాభివృద్ధి కలుగదు. అసూయ, ద్వేషము, స్వార్థపరత మనస్సున నిండియున్నచో, జప మేమి చేయగలుగును? దేశము తమోనిమగ్నమైయున్నది. కనుకనే స్వామిజీ దాని నుద్ధరించుటకై కర్మాచరణము బోధించినాడు. లోకహితార్థము మీస్వార్థపరతను విడనాడజాలరేని, మీ పట్టములవలన నుపయోగ మేమి? ఉద్యోగలాభ మెట్లు ఉపకరించును? పూర్వఋషుల సంతతిలోనివారు మీరు. మీ రక్తనాళములలో స్వచ్ఛమగు హైందవ రక్తము ప్రవహించుచున్నది. ఈ దాస్య మనుభవించుట మీకు లజ్జాకరము కాదా? దేశాభిమానుల మందురు! బీదలపై ప్రేమ, వారి సేవ: వీనికన్న నధికమగు దేశాభిమాన మేది?

"మీ దేశాభిమానము యథార్థమైన దేని, నేను చెప్పినట్లు చేయుడు. లెండు, నిదుర మేలుకొండు, సోమరి

తనమును విడనాడుడు, సత్యమునందు సుప్రతిష్ఠితులుకండు, ప్రతిపల్లెలో, ప్రతిజిల్లాలో, ప్రతిమండలములో, ప్రజలకు విద్య, ఆరోగ్యజీవనవిధులు మున్నగువానిని విస్తృత మొనర్పుడు. మీ అస్వార్థతను, మీ సేవాసక్తిని చూచి ఇతరులు కార్యావేశపరు లగుదురు. దేశము శీఘ్రకాలముననే అభ్యున్నతి నందును. ప్రతి సెలవుదినములందును ఇట్లు మీ కాలము గడపుడు. తత్ఫలముగా శాశ్వతహితము కొంత చేకూరగలదు. ఈ పనితోకూడ మీకు ఆటలును వినోదక్రీడలునుకూడ నుండవచ్చును. కాని సెలవుకాల మంతయు వ్యర్థముగా గడపుచు, దేశాభిమానగీతికలు పాడుటవలన దేశాభ్యుదయము కలుగదు.''

1922 మే, 6

బేలూరుమఠ ప్రధానమందిరపు మేడపై వసారాలో స్వామి సాయంకాలమున విశ్రమించియుండగా నొక శిష్యు డాయనతో నిట్లనెను: "మి మ్మొక ప్రశ్న మడుగగోరెదను. శ్రీ గురుదేవుని పూజామందిరములోనికి పాశ్చాత్యులు రావచ్చునా?''

స్వామి: "ఏల రాకూడదు? కాని పాదరక్షలు తీసి వేసి రావలెను.''

శిష్యుడు: "మహమ్మదీయులుకూడ రావచ్చునా?''

స్వామి: "రావచ్చును. మొన్న మౌలానా మొహమ్మదల్లీ, మౌలానా షౌకతల్లీ పూజామందిరములోనికి వెళ్లిరి గదా!''

శిష్యుడు : "ఔను, నా భావముకూడ అదే. సర్వ మతములవారికిని పూజామందిర ప్రవేశానుమతి లేనిచో, శ్రీ గురుదేవుని సర్వమతసామరస్యసిద్ధాంతము నెట్లు నిర్వహింపగలము? సర్వమతాచార్యునిగా జను లాయన నెట్లు పరిగణింపగలరు? పూజామందిరములో ప్రవేశించునప్పుడు సమగ్రపారిశుద్ధ్య మవసర మనుట నిస్సంశయము.

"మన ఢాకా కేంద్రమున కొక ఆంగ్లేయుడు వచ్చెను. శ్రీ గురుదేవుని సర్వమతసమన్వయరూప బోధలనుగూర్చి విని 'మీ పూజామందిరములోనికి నేను రావచ్చునా' అని యత డడిగెను. 'అవశ్యము రావచ్చును, కాని పాదరక్షలు తీసివేయవలెను' అని నేను బదులుచెప్పితిని."

మే, 21

ఆదివారము, రాత్రి 8-30 గంటలు. స్వామి బేలూరు మఠ ప్రధానమందిరపు పావన గంగాభిముఖమగు వసారాలో కూర్చుండియుండెను. కొందఱు సాధువు లాయనప్రక్క నుండిరి. కొందఱు నిలుచుండియు, కొందఱు కూర్చుండియు నుండిరి. అందులో నొక రాయన నిట్లడిగిరి :

"ఇచట పూజింపబడుచుండు శ్రీ గురుదేవుని తాయెత్తు మీ తండ్రిగా రిచ్చిన దందురే, నిజమేనా?"

స్వామి : "శ్రీ గురుదేవుడు శరీర మంతయు మంట లెత్తి బాధపడుచున్నప్పుడు, ఇష్టకవచము నొకదానిని ధరింపు మని మా తండ్రి ఆయనకు చెప్పెను. అదియే ఇది."

ఒక భక్తుడు : "మీరు రప్పుడు దక్షిణేశ్వరమున నుంటిరా?

స్వామి : "నే నప్పటికి పుట్టనే లేదు. శ్రీ గురుదేవుని సాధనకాలములోని విషయ మది. మా తండ్రి ఆ దినములలో అప్పుడప్పుడు దక్షిణేశ్వరము వెళ్లుచుండువాడు. ఆయన శారాసాతలో న్యాయవాది. అనేక భూస్వాములు—రాణి రాస్మణియు—ఆయన కక్షిదారులు. చాల ద్రవ్య మార్జించు వాడు. గొప్ప తాంత్రికసాధకు డాయన. కామాఖ్యనుండి పెక్కండ్రు తాంత్రికసాధకుల నాయన పిలిపించి జగన్మాత నర్చించుటయు, జప మొనర్చుటయు నే నెఱుగుదును. వారి కర్చులన్నియు ఆయనయే పెట్టుకొని వారిని రప్పించువాడు. నేను చూచిన సాధకులలో నొక రొక ద్రాక్షసారాయి బుడ్డిని ప్రక్క నుంచుకొని జపము చేయువాడు. అప్పు డప్పుడు కొంచెము కొంచెము సారాయిత్రాగుచు, రాత్రియంతయు అవిరామముగా జపించువాడు.

"మా తండ్రి దక్షిణేశ్వరము వెళ్లిన విషయము మాత్రము నే నెఱుగకుంటిని. పిదప శ్రీ గురుదేవు డది నాకు తెలిపెను. సామాన్యముగా ఎవరినిగాని ఆయన వారి గృహవిషయము లడుగువాడు కాడు. కాని యొకనాడాయన 'ఎందుకోగాని, నీవారినిగూర్చి విచారింప నాకు బుద్ధిపుట్టినది. మీ దే యూరు?' అని నన్నడిగెను. మా యూరి పేరు చెప్పగా, 'మీ తండ్రిపే రేమి?' అని అడిగెను. 'కనాయి ఘోషాల్' అని నేను బదులు చెప్పితిని. ఆ పేరు వినుట

తోడనే ఆయన బిగ్గరగా నిట్లనెను : 'ఓ! ఆయన గొప్ప సాధకుడు. ఒక ఎఱ్ఱ పట్టుపంచె కట్టుకొని ఈ కాళికా లయములో కూర్చుండి జప మొనర్చువాడు. ఆయన తన వెంట మఱొక పురుషుని కొనివచ్చువాడు. అతడు వెనుక కూర్చుండి దేవీస్తోత్రగీతికలు పాడువాడు. మీ తండ్రి కన్నులనుండి అశ్రువులు జాలువడుచుండెడివి. దేవ్యాలయము నుండి రక్తకాంతిగల నేత్రములతో వెలువడునప్పుడు ఆయన సాక్షాద్భైరవునివలె కానిపించువాడు. ఆ కాలమున నా శరీర మంతయు దుర్భరమగు మంట లెత్తుచుండెడిది. ఆ వేడిమికి ఒడలిపై రోమము లన్నియు కమలిపోవునవి. అందుచే ఆయనను నేను 'మీరు చాలవిషయము లెఱుగు దురు. ఈ మంట లెట్లు శమించునో చెప్పగలరా?' అని యడిగితిని. ఇష్టకవచము ధరింపు మని ఆయన చెప్పగా, అట్లుచేసి ఆ బాధనుండి విముక్తుడనైతిని' ".

ఒక సాధువు : "ఆ కవచము నెవరు చేసిరి?"

స్వామి : "నే నెఱుగను. శ్రీ గురుదేవు డది చెప్ప లేదు."

ఒక సాధువు : "మీరు శ్రీ గురుదేవుని ప్రథమ దర్శన మెచట చేసికొంటిరి? దక్షిణేశ్వరమున నేనా?"

స్వామి: "కాదు. రామచంద్రదత్త యింట. నేను పనిచేయుచుండిన ఆఫీసులో రామచంద్రుని బంధు వొక డుండెను. అతడు శ్రీ గురుదేవుని దర్శనము చేసికొనువాడు. ఆఫీసులో ఆయననుగూర్చి మాకు పలుమాఱు చెప్పువాడు.

నేను చిన్నపిల్లవాడనుగా నున్నప్పుడుకూడ సాధన లభ్యసించు వాడను. ఆ కాలమున నేను బ్రాహ్మమతావలంబిని. శ్రీ గురుదేవునిగూర్చి కేశవబాబుపత్త్రిక 'ధర్మతత్త్వము'లో చదివితిని. కాని దక్షిణేశ్వర మెచటనుండునది, అచటికి ఏ మార్గమున పోవలసినది, నాకపుడు తెలియదు. పిదప రామబాబు బందుగు డది బాలీఖాల్‌కు ఎదుటనుండు నని తెలిపెను.

''ఒక శనివారమునాడు శ్రీ గురుదేవుడు రామ బాబు ఇంటికి విచ్చేయుననియు, అచటి కేగినచో ఆయనను చూడగల్గుదు ననియు అతడు తెలిపెను. ఆప్రదేశము మా యింటికి మిక్కిలి చేరువ నుండుటచే తప్పక వెళ్లుదునని నేను చెప్పితిని.

''సమాధితత్త్వము నెఱుగవలెనని నాకు చాల కాలమునుండి మిక్కిలి అభిలాషయుండెను. సమాధి యనగా నేమియో విస్పష్టముగా కనుగొనవలెనని నా వాంఛ. అనేకులను ప్రశ్నించితినిగాని, ఎవ్వరును తెలుపజాలకపోయిరి. ఒకరుమాత్రము ఇట్లుచెప్పిరి: 'ఈ కాలములో సమాధిస్థితి నెవ్వరును పొందజాలరు. ఆ స్థితి నొందువారి నొక్కరిని మాత్రము నేను చూచితిని—ఆయన దక్షిణేశ్వరముననుండు రామకృష్ణపరమహంస.'

''ఆ సాయంకాలము రామబాబుగృహమున కేగితిని. జనులతో క్రిక్కిఱిసియుండు నొక గదిలో శ్రీ గురుదేవుడు కూర్చుండియుండెను. ఆయన కంతగా స్మృతి లేనట్లు

కనిపించెను. నేను నమస్కరించి ఆయన సమీపమున కూర్చుంటిని. అప్పుడు—నా యాశ్చర్య మేమని చెప్పుదును!—నే నే విషయమునుగూర్చి వినుటకై అంత కుతూహలము కలిగియుంటినో, ఆ సమాధివిషయమునుగూర్చియే ఆయన నిరాఘాటముగా ప్రసంగించుచుండెను.''

ఒక సాధువు : ''నా డాయన సమాధినిగూర్చి ఏమి చెప్పెను?''

స్వామి : ''వివరములు జ్ఞప్తి లేవు. కాని నిర్వికల్ప సమాధినిగూర్చి చెప్పుచు, అది అత్యల్పసంఖ్యాకులగు నెవరికో మాత్రము శక్యమనియు, అది పొందినవారి శరీరము ఇరువదియొక్క నాళ్లకు రాలిపోవుననియు చెప్పెను.

''ఆ నాడు నే నాయనతో మాటాడలేదు. ఒక నెలకు పిదప దక్షిణేశ్వరమునకు పోయి ఆయన కెఱుకపడితిని.''

1928 జూలై, 7

స్వామి కొన్నాళ్లనుండి జబ్బుగానుండెను. భక్తులలో నొకరు ''మీకు నే డెట్లున్నది?'' అని అడిగిరి.

స్వామి: ''అంత బాగుగా లేదు. కాని అంతకన్న బాగుండుననని తలచుట వెఱ్ఱి. ఈ శరీరము ముదిసినది. ఆయన యనుగ్రహముచే ఎట్లో గడచుచున్నది. ఇంతకు, ఈ శరీరమునుగూర్చి విచారించుట తగవా? నాకు దాని విషయమగు చింతయే లేదు. నా పారమార్థిక సాధనల కుపకరించెనేని, నాకు చాలును. తన ఆరోగ్యమునుగూర్చి

వ్యాకులపడునట్టియు, మరణమునుగూర్చి భయపడునట్టియు, సాధువు సాధువే కాడు. అతడు సాధువు కాజూచువాడే కాని. సాధు వైనట్టివాడు కాడు. ఇట్లే నడచుచుండిన, నాకు సంతుష్టియే. ఈ శరీరముచే ఏ కార్యమునైన చేయింపదలచెనేని, ఆయన ఇచ్చవచ్చినన్నాళ్లు దీనిని నిలుప నిమ్ము. నేనుమట్టుకు పిలుపుకు ప్రతినిమిషమందును సంసిద్ధుడనే.''

1930 జాన్యువరి, 13

ఒకానొక భక్తుడు మొదట స్వామిని దర్శించి ఆ పిదప పూజామందిరమున కరిగెను. దీనినిగూర్చి స్వామి యిట్లనెను: ''ఇది సరికాదు. మొదట పూజామందిరమున కేగి, ప్రభు నర్చించి, ఆ పిదప ఇచటికి రావలెను. 'అతని ప్రకాశము వలననే ఇదంతయు ప్రకాశించుచున్నది ; అతడు ప్రకాశించు చున్నందునవలననే, సర్వమునకు ప్రకాశము లభించినది'. ఈ చెట్టుచేమలు, లతాపుష్పములు, భక్తులు, నేను : సర్వము ఆయనసత్తే. వీని ఉనికి కాధార మాయన ఉనికియే. ఆయన కాని దేదియు లేదు. ఆయన అఖండ'సత్తు'(ఉనికి). హరి, రాముడు, సూర్యుడు, చంద్రుడు మున్నగు నామరూప ములతో విలసిల్లు నానాత్వ మంతయు ఆయనలోనిదే. ఆయన యునికిచేతనే, ఆయనపై నాధారపడియే, ఇవన్నియు నున్నవి. ఆయన అఖండసచ్చిదానందము. చిత్తు (జ్ఞానము) లేని సత్తు (ఉనికి) సత్తే కాదు. మఱియు సత్తు, చిత్తు కల చోట ఆనందముకూడ కలదు. దుఃఖ మనగా నేమి?

యథార్థజ్ఞాన లోపమే. కావున జ్ఞానము కల చోట దుఃఖ ముండజాలదు, ఆనందమే ఉండును.''

జాన్యువరి, 14

స్వామి : ''కర్మాచరణముతోకూడ జపధ్యానములు అవిరామముగా నభ్యసించువాని కెట్టి బాధయు లేదు. మనకు కర్మాచరణము తప్పదు. అందుకు సందేహామే లేదు. కాని దానితోపాటు జపధ్యానము లభ్యసింపఁడేని, అతని కర్మాచరణము సముచితభావప్రేరితమై యుండదు. మమతాహంకారములే సర్వకష్టములకును మూలము. అవి సుఖమును కోరుచుండును. జపధ్యానము లత్యావశ్యకములు. అం దెట్టి లోపమును జరుగనీయరాదు. అవి యున్నగాని, పురోగమన ముండదు. ధ్యానవేళయందు అతడును, నీవును తప్ప తక్కినవి — కర్మము, సంప్రదాయము, మతము మున్నగునవి— ఏమియు లేవనుకొనుము. క్రమక్రమముగా నీ యునికిని కూడ మఱవవలెను. మనస్సును మలినమొనర్చు కర్మము సత్కర్మము కానేరదు. అది దుష్కర్మము.

''సేవితమానవునియందు భగవంతుని చూచి చేయు సేవయే యథార్థసేవ. కాని ప్రథమదశలో ఈ భావము కలుగుట కష్టము. కావున ఆ దశలో సాధకుడు గురువాక్యముపై నాధారపడి, అది సత్య మను విశ్వాసముతో నారంభింపవలెను. ఈ సేవాసిద్ధాంతమును ప్రతిపాదించిన స్వామిజీయందు మనము విశ్వాస ముంపవలెను. శ్రీ గురుదేవుని

జీవితము 'సూత్రము', స్వామిజీ జీవిత మందుపైని 'భాష్యము' అన వచ్చును. సర్వభూతములందును భగవంతుని చూచుచు సేవచేయు సిద్ధాంతమును శ్రీ గురుదేవుని జీవితము లోని అనేక సంఘటనములనుబట్టి, స్వామిజీ ప్రతిపాదించెను. శ్రీ గురుదేవుడు మథుర్ బాబుచే అనేకపర్యాయములు దరిద్రజనసేవ చేయించెను.

"మనస్సునందు స్వల్పభాగముమాత్రమే కర్మాచరణముపై నుంచి, తక్కిన దంతయు భగవంతునియం దుంచినను, ఎంతో కర్మ మొనరింపవచ్చు నని మహారాజ్ (శ్రీ బ్రహ్మానందస్వామి) పల్కువాడు. మన మెల్లప్పుడును, అవిరామముగా, 'అతని' నిగూర్చి తలంచు చుండవలెను. 'చేతులు పనిచేయుచున్నను, పెదవులు నామోచ్చారణ మొనర్చుచుండుగాక' అని తులసీదాసు పలికెను."

జాన్యువరి, 26

శిష్యుడు : "క్షుద్రభావములనుండి తప్పించుకొను టెట్లు?"

స్వామి : "అవి వచ్చుచు పోవుచుండును. వానిని లక్ష్యపెట్టకుము. నిరంతరసాధనచే, అతని యనుగ్రహమున నీకు బలము లభించును. జపము, ధ్యానము, అర్చన, శాస్త్ర పఠనము : వీనిలో నెప్పుడెప్పుడు నీకు ఏవి అభిమతములుగా నుండునో అప్పుడు వానియందు ప్రసక్తుడవై నీ మనస్సునంతయు వానియందే నిలుపుము. భగవంతుడు సర్వమును

చక్కబెట్టును. శ్రీరామకృష్ణుడు పాక్షికత నంగీకరించువాడు కాడు. సర్వపక్షాసక్తతయే ఆయన కిష్టము."

శిష్యుడు : "స్థూలశరీరపతనానంతరముకూడ అవతారమూర్తులు సూక్ష్మశరీరమునందు భక్తజనులకొఱకై జీవించి యుందురా ?"

స్వామి : "నిస్సంశయముగా. కల్పాంతమువఱకును వారట్లు నివసించియుందురు. ఇంతకును, స్థూలశరీర మెన్నాళ్లు మనగలదు ? సూక్ష్మశరీరజీవిత మత్యావశ్యకము."

శిష్యుడు : "ధ్యాన మెట్లు చేయవలెను ?"

స్వామి : "సుషుమ్నానాడిలోని కేంద్రము లన్నిటి యందును బుద్ధిని నిల్పి ధ్యాన మొనర్పవలెను. హృదయక్షేత్రమందు పండ్రెండుదళములు గల ఎఱ్ఱతామరపూవుపై తన యిష్టదైవము కూర్చుండియున్నట్లును, శిరఃక్షేత్రమున వేయిదళములుగల తెల్లతామరపూవుపై గురువు కూర్చుండియున్నట్లును భావించి ధ్యానింపవలెను. ఈ ధ్యానములు జపమునకు సహాకరించును గాన అభ్యసింపవలెను."

ఫెబ్రువరి, 8

కొలదిమంది గాఢతపశ్చర్య లభ్యసించుచున్నా రని విని స్వామి యిట్లనెను : "తపస్యవలనను, యజ్ఞముల వలనను, ధర్మకార్యములవలనను, శాస్త్రపఠనమువలనను, భగవత్సాక్షాత్కారము లభింపదు. అతని యనుగ్రహ మెవనిపై ప్రాలునో, అతనికే అది లభించును. కాని

మఱొకటికూడ కలదు : 'ఈయాత్మ బలహీనులకు లభ్యము కాదు.' బలహీనులకును, అప్రయత్నశీలురకును, ఆయన సాక్షాత్కరింపడు. గీత పురుషకారమునకు ప్రాముఖ్య మిచ్చుచున్నది : 'ఉద్ధరే దాత్మనాత్మానం। నాత్మాన మవ సాదయేత్। ఆత్మైవ హ్యాత్మనో బన్ధు।రాత్మైవ రిపురాత్మనః' (మానవుడు తన్ను తానే ఉద్ధరించుకొనుగాక. తన్ను తానే అధోగతి నొందించుకొనకుండు గాక. ఏలన, అతడు తనకు తానే మిత్రము, తనకు తానే శత్రువు). తన్ను తానే బంధ విమోచన మొనర్చుకోవలెను. ఎన్నడుగాని నిరాశ నొంద రాదు. ఈ శ్లోకమునందు 'ఆత్మ' యనగా, మనస్సు బుద్ధి మున్నగునవి.''

ఫిబ్రువరి, 21

శిష్యుడు : ''వైరాగ్యము పారమార్థికసాధనలపై నాధారపడినదా ?''

స్వామి : ''కాదు. పూర్వసంస్కారములపై అది ఆధారపడియుండును. కోరిక లన్నియు నశించినవాని కది లభించును. తక్కినవారికి లభింపదు; మనస్సులో ఏ కోరిక యైన నిలిచియున్నచో ఈ వైరాగ్యభావము అంకురింపదు. వివేకబుద్ధితో గూడిన భోగమువలన నిది ప్రాప్తించును. ఆధ్యాత్మికసాధనలుకూడ ఉండితీఱవలెను. కాని అన్నిటికన్న అతని అనుగ్రహము ముఖ్యము. కావుననే శ్రీ గురుదేవుడు 'అమ్మా, నేను పారమార్థికసాధన లెఱిగినవాడనుకాను.

నన్ను కృపజూడుము' అని ప్రార్థించువాడు. భగవదనుగ్రహము లేనిది, పారమార్థిక సాధన లేవియు సాధ్యములు కావు. స్వతంత్రముగా కర్మాచరణ మొనర్పువా డెవ్వడును లేడు. ప్రతివాడును ఆతని ఆజ్ఞానువర్తియే. ఆయన యంత్ర చోదకుడు (నడుపువాడు). తక్కినవా రందఱును యంత్ర మాత్రులు. కాని ఇదంతయు జ్ఞప్తియం దుంచుకొనుట మిక్కిలి కష్టము. ఈ భావము గలవాడు కీడుమేళ్లకు అతీతు డగును. జగన్మాత కరుణించెనేని, సర్వము సాధ్యమగును : వైరాగ్యము, పారమార్థిక సాధనలు, మున్నగునవి. ఈశ్వరునికి విద్యాశక్తియు అవిద్యాశక్తియు కలవు. అవిద్యను తొలగించి విద్యను మఱ కతడు ప్రసాదించెనేని, అంతయు చక్కగా నడచును. కావున జగన్మాతృకరుణకై ప్రార్థింపుము. అది లభించెనేని, అసాధ్య మను మాటయే లేదు.''

మార్చి, 22

సాధనలందు నిరాశ నొందిన యొక సాధకునితో స్వామి యిట్లనెను : ''ఇది తప్పు. నిరాశకు లొంగిపోకుము. అందుచే మనస్సునం దశాంతి జనించును. మీ రెల్లరును అదృష్టవంతులనియు, ఈశ్వరుని బిడ్డలనియు సర్వదా తలంచు చుండుము. పాపభావములు నీలోనికి చొచ్చెనేని, వానిని సరకుచేయకుము. అవి పూర్వజన్మసంస్కారములు. మనో గర్భముననుండి అప్పుడప్పుడు ఉబికి స్మృతిపథమున కేతెంచు చుండును. మనోబలమును కోల్పోవకుము. భీతిలుటకు కారణ మేమియు లేదు. సర్వము సకాలమున ప్రాప్తించును.

మనస్సున కెక్కక కేవలము నోటితో చేయు జపము అంతగా ప్రయోజనకారికాదు. భగవంతునియెడ నీకు ప్రేమ ముండుట అత్యావశ్యకము, కాని మనసుకెక్కని జపమందు కూడ కొంత గుణము లేకపోలేదు. ఉచ్చరించునది భగవన్నామముకదా! కాని ప్రధానమైనది భగవంతునియెడ ప్రేమ — అతడే మన తండ్రియు, తల్లియు, మిత్రుడును, స్వామియు, సర్వమును అను భావము. అట్టి సంబంధ మేదో యొకటి కల్పించుకొనవలయును. జపము నభ్యసించు నపుడు నిశ్చలబుద్ధితో, ప్రశాంతుడవై, కూర్చుండవలెను.''

ఏప్రిల్, 2

దేశాంతరమున చాలకాలముగడపి తిరిగివచ్చిన భక్తు డొకడు స్వామిని చూడవచ్చెను. ఆయన అనారోగ్య దుఃస్థితిని చూచి అతడు కన్నీరు కార్ప నారంభించెను.

స్వామి : ''బుద్ధుడు పరినిర్వాణ మొందబోవు తరుణ మున ఆనందుడు శోకోద్విగ్నుడయ్యెను. బుద్ధు డది చూచి: 'ఆనందా, విలపింతు వేల? ఈ జీవితము 50, 60 ఏండ్లు మాత్రమే సాగునది, అధికమైనచో, నూ ఱేండ్లు సాగ వచ్చును. కాని నే నా పిదప శాశ్వతజీవిత మందబోవు చున్నాను'.''

ప్రసంగవశమున అతివివాదగ్రస్తమగు కులవ్యవస్థా సమస్య చర్చకు రాగా, స్వామి యిట్లనెను: ''సాంఘిక వ్యవస్థగా కులము లుండనిమ్ము. దానితో మన కేమి పని?

భక్తులలో కులభేదములు లేవని శ్రీగురుదేవుడు పల్కు-వాడు; వారి దొక ప్రత్యేకకులము. మనము సన్న్యాసులము. మనకు కులముతో నెట్టి సంబంధమును లేదు.''

శిష్యుడు : ''గురువునకును ఇష్టదైవమునకును సంబంధమేమి ? వారిరువురును ఒకటియేనా ?''

స్వామి : ''గురువును, ఇష్టదైవమును ఒక్కటియే. కాని మన మీ నామరూపపరిమితమగు భేదమయప్రపంచమున నుండునప్పుడు వారు భిన్నులనియే అంగీకరింపవలెను. జ్ఞానోదయమైనప్పుడు వారిరువురు నొక్కరే యని తెలిసిపోవును. గాఢతపస్యానంతరముగాని ఈజ్ఞానము లభింపదు.''

జూలై, 14

శిష్యుడు : ''మనస్సులోని కప్పుడప్పుడు చెడు తలంపులు ప్రవేశించుటకు కారణ మేమి ?''

స్వామి : ''అట్లు జరుగుట స్వాభావికమే. బలమును, జ్ఞానమును, వైరాగ్యమును, ప్రసాదింపుమని భగవంతుని గూర్చి ప్రార్థింపుము. అతని అనుగ్రహముకై, భక్తికై, శ్రద్ధకై నిండుమనస్సుతో ప్రార్థింపుము. గాఢతపోభ్యాస మెల్లరకును సాధ్యముకాదు, కాని ప్రార్థనచేత సర్వమును సాధింపవచ్చును. అప్పుడప్పుడు భోగేచ్ఛ కలుగవచ్చును. దానిని సరకుగొనకుము. అది ఏమి చేయగలదు ? వివేచనచే నట్టి వాంఛలను పరిత్యజింపుము.

"వాంఛలు క్లేశకారణములు. వాంఛారాహిత్యమే ఆనందము. భోగేచ్ఛ తప్పక పరిత్యజింపవలసినదే. కాని ఇచ్ఛ లన్నియు త్యజింపరాదు. ఐహికేచ్ఛలనే పరిత్యజింపవలసినది. ఈశ్వరసాక్షాత్కారేచ్ఛ, జ్ఞానేచ్ఛ, భక్తికోఱకిచ్ఛ: వీనిని పరిత్యజింపరాదు."

శిష్యుడు: "ధ్యాన మంత కష్టసాధ్యమై యుండు టేల?"

స్వామి: "అంతరవలోకన మతి ముఖ్యము. నీ మనస్సును నీవు చక్కగా పరిశీలించి, పూర్తిగా గ్రహింపవలెను. లేనిచో, దానిలోగల కలంకములను నీ వెట్లు పోగొట్టుకోగలవు? ధ్యానించుట కష్టముగా తోచినచో, ప్రార్థనాయత్తబుద్ధి వగుము. ప్రారంభదశయందు ఇష్టదైవముయొక్క విస్పష్టబింబమును ధ్యానమున గాంచుట అసాధ్యము."

ఆగస్టు, 8

స్వామి: "జీవితము కోఱకగు ఈ పోరాటములో ఆశయు, భయమును, నిరంతరము కలుగుచునే ఉండును. పోరాటము లేని జీవితము జీవితమే కాదు. మానవునికి నిరంతరసుఖము, నిరంతరభోగములు లభించుచుండెనేని, వాడు భగవంతుడు, ఆత్మ మున్నగు ఉన్నతవిషయములను గూర్చియే తలంపడు. అట్టిజీవితమునకును మృగజీవితమునకును గల భేద మేమి? కాని భయక్లేశములుమాత్రమే ఉన్న

యెడల, అతని పురోగమనము తఱిగిపోవును; అతని అభి వృద్ధికి భంగముకలుగును.''

ఆగస్టు, 13

స్వామి: "నీవు సాకారభగవంతునిగూర్చి ధ్యానించితి వేని, అతడే తన యథార్థతత్త్వమును నీ కెఱుకపఱచును. రూపమున కతీతమగున దొకటి కలదు. ఈ కానిపించున దంతయు స్థూలప్రపంచము. దీని కతీతమై సూక్ష్మ ప్రపంచము, దాని కతీతమై కారణప్రపంచము మున్నగునవి కలవు. నిరాకారధ్యానము మిక్కిలి కష్టసాధ్యము. వేదము లందు ఆకాశము నిరాకారేశ్వరచిహ్నముగా నిర్దేశింపబడి యున్నది. మహాసముద్రము మున్నగు ఇతరచిహ్నములు కూడ నవలంబింపవచ్చును. కాని ఆకాశము శ్రేష్ఠము. ఆ వస్తువు 'అణో రణీయాన్ మహతో మహీయాన్' (అత్యంతస్వల్పవస్తువులకన్న ఎంతో స్వల్పము, మిక్కిలి పెద్ద వస్తువులకన్న నెంతో పెద్దది). అతడు మానవుల హృద యములందు ప్రజ్ఞాన(ఎఱుక)రూపమున నుండును. కాని మన మారంభదశయం దొక రూపమును కైకొనవలెను. వీనిలో నొకటి ఉత్తమము, ఒకటి అధమము అనెడు భేదము లేదు. అది సాధకుల ప్రకృతిమీదనే ఆధారపడియుండు విషయము. ఎవరి కేది అనుకూలమో అది వారికి శ్రేష్ఠము. ఆకారము కరగి నిరాకార మగును; నిరాకారము ఆకార మును దాల్చును. ఈశ్వరుడు సాకారుడును, నిరాకారుడును, రెంటికిని అతీతుడునుకూడ. ఈ మన మనస్సుతో మన

మాతని కాంచజాలము. వినిర్మలమానసమే అతనిని కాంచ గలదు. 'వినిర్మలమానసమును, ఆత్మయు ఒక్కటే' అని శ్రీ గురుదేవుడు పల్కువాడు. వృత్తిరహితము, వాంఛారహితము, అగు మనస్సును మన స్సనరాదు. ఆ స్థితియందు బ్రహ్మ మనుము, శక్తి యనుము, సర్వగతప్రజ్ఞాన మనుము— అదొక్కటిమాత్రమే యుండును. భక్తుని ప్రకృతినిబట్టి అదియే ఆకృతిని దాల్చును. ఇదంతయు గ్రహించుట దుర్లభము. నిష్కామకర్మము, శాస్త్రపఠనము, ఉపాసన, జపము, ధ్యానము: వీనియందు నిరంతరము మగ్నుడై యుండువానికి మాత్రమే వేదాంతసత్యము గ్రహించుట శక్యమగును. ఈశ్వరానుగ్రహము గలవారికి ఇవి తమంతట తామే అలవడి, బుద్ధి వానియందు ప్రసక్తమగును. అతని యనుగ్రహము లేనివారికి అతని నామము నెడ విముఖత కలుగును; అందు అభిరుచి యుండదు; భగవంతునిగూర్చిన ప్రసంగమే దుస్సహముగా నుండును. భగవంతునిగూర్చిన తలంపులు స్వతస్సిద్ధముగా ఎవనియం దుదయించునో, వానికి భగవత్కృప అలవడియేయున్న దనుట స్పష్టము. భగవంతుని సాకారనిరాకారభావములలో న్యూనాధికతలు లేవు. సర్వము ఆయనయే. కాళీఘాట్ లోను, దక్షిణేశ్వరము లోను, కాశిలోను, ప్రయాగలోను, హరిద్వారములోను కలది ఒకే గంగానది."



8 వ ప్రకరణము

# శ్రీ శారదానందస్వామి సంభాషణములు

## I

శిష్యుడు : "స్నానాదు లొనర్చిగాని జప మొనర్పవల దని '—' తన శిష్యుల నాదేశించుచున్నాడు. ఈ యాచరణ లంత ముఖ్యమా? అవి అనుల్లంఘ్యములా?"

స్వామి : "ఆస్తికధర్మాచరణము తేలిక చేయుటకే శ్రీ గురుదేవుని రాక. విధులయొక్కయు, నియమముల యొక్కయు భారమున మానవులు క్రుంగిపోవుచుండిరి. భగవ న్నామోచ్చారణమునకును, భగవదారాధనమునకును, కాల ప్రదేశనిర్ణయ మేదియును లేదు. ఏ స్థితియం దుండువా డైనను భగవన్నామోచ్చారణ మొనర్పవచ్చును. శ్రీ గురుదేవు డెన్నడును ఈ బాహ్యాచరణముల కంతగా ప్రాముఖ్య మిచ్చువాడు కాడు. ఇక మార్గమా, నీ కేది యనుకూలమో, దాని ననుసరింపుము. సాకారభగవంతుని యెడ నీ బుద్ధి పాఱునేని, ఆ మార్గము నిన్ను గమ్యమునకు గొనిపోవును; లేక నిరాకారభగవంతునియెడ పాఱు నేని, అదియు మంచిదే. ఆ మార్గముననే నడువుము. పురోగమింతువు. అతని ఉనికియే నీకు సంశయగ్రస్తమేని, అతని నిట్లు ప్రార్థింపుము : 'నీ వుండునది లేనిది నే నెఱుగను; నీవు సాకారుడవో, నిరాకారుడవో నే నెఱుగను; నీ యథార్థ తత్త్వమును నాకెఱుకపఱుపుము'. వస్త్రములు మార్చు

కొనుట, స్నానముచేయుట మున్నగు బాహ్యానుష్ఠానము లాచరింపగలిగితివేని, మంచిదే. చేయజాలకుంటివేని, ఆ విష యమునుగూర్చియే తలంపక అతని యారాధనకు కడంగుము. ఒక తడవ (శ్రీ) గురుదేవు డొక పాట పాడి, 'ఈ పాటలోని ఏ యొక భావమునందు సుప్రతిష్ఠితుడవైనను, నీవు గమ్యమును చేరుదువు' అని నాకు చెప్పెను. ఆ పాటయొక్క భావ మిది :

'ప్రభూ, నీవే నా సర్వమవు ; నా జీవితమునకు ప్రాపువు నీవే; సత్యముయొక్క మూలసారమవు నీవే ; నీవు తప్ప నాకు స్వకీయు లింకెవ్వరును లేరు.

'నీవే సుఖమవు, శాంతివి, అండవు, ద్రవ్యమవు, జ్ఞానమవు, బుద్ధివి, బలమవు ; నా నివాసమవు, నా క్రీడో ద్యానమవు ; నా మిత్రమవవును, నా బంధువవును.

'నీవే నా ప్రస్తుత జీవితమవు, నా ఏకైకశరణ్య మవు; నా అనంతరజీవతమవు నీవే, స్వర్గమవును నీవే; నీవే శాస్త్రవిధివి, నిత్యకల్యాణప్రదుడగు గురువవు నీవే, నిరవధి కానందనిధానమవు నీవే.

'నీవే మార్గమవు, లక్ష్యమవును ; సృష్టిస్థితికారకు డవును, ఆరాధ్యుడవును నీవే ; నీ బిడ్డను శిక్షించు తండ్రివి నీవే, నీవే ప్రేమించు తల్లివియును, అవ్యయానందనిధివియును నీవే.' "

శిష్యుడు : "శుభముహూర్తములు, దుర్ముహూర్త ములు, నిర్ణయించు జోస్యపు లెక్కలనుగూర్చి మీ భావ మేమి ?"

స్వామి : "శ్రీరామకృష్ణుడు వీనిని పాటించువాడే. శుభాశుభతరుణములు కలవనియే ఆయన నమ్మకము. ఆయన వానిని పాటించుచుండెను గనుక మేమును పాటించుచున్నాము. కాని ఈ కాలమువారు వేయు లెక్క లంత సరియైనవి కావు. గ్రహములయొక్కయు, గ్రహకూటములయొక్కయు, స్థానములు మారినవి, కాని ఆ మార్పుల కనుగుణముగా ఈ లెక్కలు సవరింపబడలేదు. కావున వానినిటీవల నే నంతగా పాటించుటలేదు."

శిష్యుడు : "శ్రాద్ధాన్నము భక్తికి హానికరమని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. అది ఏల హానికరము?"

స్వామి : "శరీరపాటవము, బుద్ధిబలము, కలుగుటకే అన్నము తినునది. మనశ్శరీరములు పరిశుద్ధములుగానున్న గాని పారమార్థికసాధన లభ్యసింప నేరము. భగవదర్పితమైన అన్నమే పవిత్రమగు మనశ్శరీరములను నిర్మింపగలదు. శ్రాద్ధాన్నము పితృదేవతల కర్పింపబడినది, భగవంతునకు కాదు. కావున మనశ్శరీరములకు పవిత్రత నిచ్చుటకుబదులు అది తద్విరుద్ధఫలము నిచ్చును. అన్నము మనశ్శరీరనిర్మాణము చేయును. అన్నముయొక్క స్వభావము కూడ వానిపై ప్రతిఫలించును. చైతన్యదేవుడు పారవశ్యస్థితియం దుండగా, ఆయనను తాకిన సామాన్యమానవుడొకడుకూడ పారమార్థికభావావేశము నొందె నని చైతన్యజీవితమున నున్నదిగదా! ఆయావేశము తగ్గుట కతనికి

శ్రాద్ధాన్నభోజనము విధింపబడెను. ఆ భోజనముచే అతనికా ఫలము కలిగెనట.''

శిష్యుడు : ''గ్రహణకాలమున చేయు జపము శుభప్రదమని యేల చెప్పుదురు?''

స్వామి : ''అట్టి ప్రకృతివికారసంఘటనకాలమున మానవుడు ఆలోచనాపరుడగును. గ్రహణఫలముగా ప్రకృతిరంగమున నొక గొప్ప మార్పు కలుగును. ప్రకృతి ఒక స్థితినుండి మఱొక స్థితికి మాఱు సంధికాలమున మనస్సు ప్రశాంతమగును. కావున ఆ కాలము జపధ్యానముల కనుకూలముగా పరిగణింపబడును.''

శిష్యుడు : ''కేవల కర్మాచరణమూలమున నెవరికైన భగవత్సాక్షాత్కారసిద్ధి కలిగెనా?''

స్వామి : ''నిష్కామకర్మము చిత్తపారిశుద్ధ్యము నిచ్చును. పరిశుద్ధచిత్తమున భక్తిజ్ఞానము లుదయించును. ఆత్మకు జ్ఞానమే స్వాభావికము. కాని అజ్ఞానముచే కప్పువడియుండుటచేత అది ప్రత్యక్షముగా నుండదు. నిష్కామకర్మముయొక్క యుద్దేశము ఈ కప్పును తొలగించుటయే. చిత్తము పరిశుద్ధమగుటతోడనే జ్ఞానోదయమగును. కేవల భర్తృసేవచేతను, ఇతర గృహకృత్యనిర్వహణము చేతను, జ్ఞానసిద్ధి నొందిన పతివ్రత కథ మహాభారతమున కలదు. గీతలోకూడ 'జనకాదులు కర్మముచేతనే సంసిద్ధి నొందిరి' అని యున్నదికదా. 'జనకాదులు' అనుటచే

జనకు డొక్కడేకాక అనేకులు కర్మమూలమున సంసిద్ధి నొందిరనుట స్పష్టము.''

శిష్యుడు : ''ఇచట 'కర్మ' మనగా జపధ్యానాదులా?''

స్వామి : ''కాదు. భాష్యకారు లా యర్థము నిచ్చిరి నిజమె; కాని అది సరియైనచో, శ్రీకృష్ణు డర్జును నొక దేవతావిగ్రహము నెదుట ఘంటానాద దీపార్చన లొనర్పు మని చెప్పియుండును. యుద్ధము చేయుమనికదా ఆయన చెప్పెను!''

శిష్యుడు : ''అర్జును డహంభావరహితచిత్తముతో భగవంతుని చేతిలోని సాధనమాత్రుడ నని భావించి యుద్ధము చేసెనా?''

స్వామి : ''నిస్సంశయముగా! విశ్వరూపసందర్శనానంతరముకూడ అహంకారము నిలిచియేయున్నయెడల, ఆ సందర్శనము నిష్ప్రయోజనముగదా! 'నీ ప్రసాదమువలన నా మోహము నశించినది, స్మృతి లభించినది' అని అర్జునుడు పలికెను.''

శిష్యుడు : ''ఇందు 'స్మృతి' శబ్దమున కర్థమేమి?''

స్వామి : ''అర్జునుడు శాస్త్రబోధను గురుబోధను మఱచియుండెను. ఏ సూత్రముల ననువర్తించుటచే తాను పురోగమించుచుండెనో, వాని నతడు మోహావేశపరవశుడై మఱచెను. భీతి, బాంధవప్రేమ, వృద్ధజనగౌరవము ఈ మోహమునకు కారణములు. 'స్మృతి' యను మాట

కద్వైతులు 'తన యథార్థతత్త్వముయొక్క స్మృతిని పునర్లభ్యము చేసికొనుట' అని అన్వయించిరి. ఇదియు మిక్కిలి చక్కని అన్వయమే.

"వైష్ణవులు సాధనఫలముగ అద్వైతజ్ఞానసిద్ధిని పొందినప్పుడు, భగవంతునితో నేదో యొక సంబంధము కల్పించుకొని, ఆ అద్వైతభావమునుండి తప్పించుకొన జూతురు. ఆ భావము వారు పట్టు త్రోవ కడ్డువచ్చిన దని తలచి, అట్టి భావ మంకురరూపమున కానిపించిన వెంటనే, దానిని నిరోధించుటకు జాగ్రత్తపడుదురు. ఇంతేల? అద్వైతసాధనపరిపాకరూపమగు 'శాంతభావము'ను వారు భక్తిసాధన లైదింటిలోను అధమముగా గణింతురు! వారు భావావేశ మలవఱచుకొని దానిని భగవంతుని దెస మరల్తురు. అది అత్యున్నతాదర్శ మని వారి భావము. భావావేశ పారవశ్యపరమావధి యగు మధురభావమునకు (స్త్రీకి ప్రియునితోడి సంబంధము) వారు అత్యగ్రస్థాన మిత్తురు."

శిష్యుడు: "'సర్వధర్మాన్ పరిత్యజ్య। మామేకం శరణం వ్రజ' అనెడు శ్లోకమున కర్థమేమి?"

స్వామి: "ఇచట 'ధర్మ'శబ్దమునకు కర్మకలాపము, జపము మున్నగునవి అని యర్థము. టిళక్ * ఈ 'ధర్మ'శబ్దమునకు మహాభారతమున గల "తలిదండ్రులు, అతిథులు మున్నగువారి సేవ" అనునర్థము కల్పించినాడు. అట్టి సేవచేత

* ఆంధ్రదేశమున వ్యాప్తిలోనుండు 'తిలక్' అను రూపము తప్పు. 'టిళక్' అని యాయన పేరు. —అనువాదకుడు.

కూడ కొందఱు జ్ఞానసిద్ధి నొందినది నిజమే యైనను, ఈ అన్వయము అసాధువే. టిళక్ యొక్క గీతాన్వయము పాక్షికమైనది. కర్మమార్గము సర్వోత్కృష్టమని స్థాపించుట గీతయొక్క ఏకైకలక్ష్యమని నిరూపించుటే అతని ఉద్దేశము. గీతలో పురుషకారము అత్యంతముగా స్తుతింపబడియున్నది. పురుషకారమునకుకూడ కొంతపరిమితి కలదని ఈ శ్లోకము సూచించుచున్నది.''

శిష్యుడు : ''ఆధ్యాత్మికసాధనల కే ఋతువు అనుకూలము?''

స్వామి : ''వర్షకాలము వానికి అననుకూలము. ఆ కాలమున ధ్యానింపజూచువానికి కునికిపాట్లు వచ్చును. మా కిది అనుభవజ్ఞాతము. ఆ ఋతువునందు మనస్సునకు అస్థిరత అధికము. ధ్యానమునకు చలికాలము మిక్కిలి అనుకూలము. ధ్యానము నభ్యసింపగోరువారు ఆరోగ్యకరమగు బలిష్ఠాహారము కై కొనవలెను. నేయి, వెన్న మున్నగునవి అనుకూలములు.''

శిష్యుడు : '' 'కుండలిని'ని సర్పమువంటి దని భావించుటేల?''

స్వామి : ''కారణము ఫలానిదని నేను నిష్కర్షగా చెప్పలేను. కాని లక్షలాదిజీవితముల సంస్కారములు దానియందు చుట్టలుచుట్టుకొని యున్నందువలన కానోపును. మేలుకాంచిన కుండలిని సర్పమువలె వక్రగమనముతో

పై కెగబ్రాకుటయు నొక కారణముగా నుండవచ్చును. శ్రీ గురుదేవు డొకసారి పారవశ్యస్థితియందు కుండలినినిగూర్చి 'నీవు సర్పమును చూచితివా ?' అని యడిగెను.''

శిష్యుడు : ''నిరాకారధ్యాన మెట్టిది ?''

స్వామి : ''కర్మకలాపములో 'భూతశుద్ధి' కాలమున భగవంతునిగూర్చి సహస్రారమునందు చేయు ధ్యానము నిరాకారధ్యానమే. ప్రత్యేకరూప మేదియు నీ మనస్సు కెక్కనప్పుడు, నిరాకారధ్యానము చేయుము. గురువు యొక్క మూర్తినిగూర్చి ధ్యానించుటయందు మన స్పష్టమైన ఆసక్తమైనయెడల, గురుధ్యానము చేయుట ఉత్తమము. భగవంతుడేగదా గురురూపమున అభివ్యక్తు డగునది !''

శిష్యుడు : '' 'అనాలోచితమంత్రజపము' (బుద్ధి అందులేనిదే, వట్టి ఉచ్చారణము) ప్రయోజనకారియేనా ?''

స్వామి : ''మంత్రోచ్చారణముచేత సాక్షాత్కారసిద్ధి కలుగు నని తంత్రములు చెప్పుచున్నవి. నా భావముకూడ అదియే.''

శిష్యుడు : ''మీ బోధల నన్నిటి ననుసరించి ప్రవర్తింప యత్నించుచునే ఉన్నాను గాని, నా ఆధ్యాత్మిక సాధన లేలయో చక్కగా పనుపడుట లేదు. ఒక్కొకసారి అవి నిర్జీవరూపములుగా నుండును.''

స్వామి : ''ప్రతిదిన మొకే విధమున ప్రవర్తించునెడ, అప్పుడప్పు డట్లు తోచుట సహజమే. కావున ఒకటి

చేయుము. సాధనలో ఏ భాగము నీ కేనాడు రుచించునో దానిని ఆ నాడు అనుసరించి, తక్కిన భాగములను విడనాడుము. ఇట్లు చేయుచో, కొన్ని సాధనలు మూడునాలుగు నాళ్లపాటు విసర్జించుట జరుగవచ్చును. కాని అందుచే లోపమేమియు రాదు. ఆ సాధనలను పునఃప్రారంభ మొనర్చినప్పు డవి నీకు ఆనందప్రదములై యుండును.

"ధ్యానమునకు పూర్వము శ్రీ గురుదేవునిగూర్చి తలంపుము. అట్లు చేసితివేని నీ కార్యము లన్నియు ఫలవంతము లగును. ఆయన అన్నిటను, అంతటను, కలడని అప్పుడప్పుడు తలంపుము. సముద్రమున ముంపబడిన కుండవలె నీ వాయనయందు మునిగియున్నట్లు భావింపుము. 'మహాపురుషులు సర్వవ్యాపకుడగు భగవంతునియొక్క పరమపదమును చూపుమేరవఱకు వ్యాపించు ఆకసమువలె సర్వదా కాంచుచుందురు' * అని తలంపుము. నిన్నుగూర్చి సర్వమును ఆత డెఱుగును. అతనియొద్దనుండి నీ వేదియు దాపజాలవు. నీ హృదయాంతరాళములో గల తలంపులు కూడ అత డెఱుగును.

"నిరంతరాభ్యాసము మిక్కిలి లాభకర మనుటకు సంశయము లేదు. కొంతకాలముపాటు ప్రతిదినము సాధనలు క్రమముగా సాగించినచో, బలముచేకూరుటే గాక, సాధనలందు ఆనందముకూడ కలుగును."

---

* "ఓం తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతమ్"

శిష్యుడు : "శ్రీ గురుదేవునిగూర్చి నే నెంతయో చదివినాను. పుస్తకములద్వారా ఆయన జీవితమునుగూర్చి చాలవిషయములు నాకు తెలియవచ్చినవి. కాని ఆయన జీవితమునుగూర్చి తలంచినప్పుడు నా కందు ఆనందము కలుగదు. ఎందుచేత ?"

స్వామి : "దేనియందైన ఆనందము కలుగుటకు బుద్ధియు, హృదయమును సమ్మేళనమొందవలెను. కేవల బుద్ధిప్రచారమువలన ఆనందము కలుగదు; సర్వమును నిర్జీవమగును. శ్రీ గురుదేవునిగూర్చి నీవు చదివిన విషయము నీకు హృదయాకర్షకముగ నుండెనేని, ఆయన జీవితమును గూర్చిన తలంపు నీ కానందదాయకమగును. అప్పుడాయన జీవకళతో కానిపించును."

శిష్యుడు : "ఊహాశక్తియొక్క లోపము అననగునా?"

స్వామి : "నీ సంశయము లన్నియు కాలక్రమమున నానంతట అవియే విరిసిపోవును."

శిష్యుడు : "పూర్వము సేవాకార్యము విడనాడి, ఆధ్యాత్మికసాధనలందే నిమగ్నుడనై యుండు కుతూహల ముండెడిది. నా కిప్పుడా వాంఛ అంత తీవ్రముగా లేదు. పరిసరములను మార్చుకొను కోర్కె లేదు గాని, జపధ్యానము లందును, శాస్త్రపఠనమందును, బుద్ధి క్రమాధికముగా ఆసక్తమగుచున్నది. మునుపటివలె ఏకాంతనివాస తీవ్రవాంఛ ఏల లేదో ?"

స్వామి: "లేకపోయిన నేమి? కర్మాచరణమగున్నడయ్యు ఆధ్యాత్మికసాధనలమూలమున జ్ఞానప్రాప్తి నొందగలవాడు, కర్మాచరణమును పరిత్యజింప నవసరములే దని శాస్త్రములు పలుకుచున్నవి. ధర్మవ్యాధునిగూర్చి నీవు వినలేదా? జ్ఞానసిద్ధి నొందినపిదప అతనికి కసాయివృత్తికూడ త్యాజ్యమని తోపలేదు. మన 'స్నాతని' దెస నాకర్షింపబడిన పిదప, మన పరిసరముల మార్పు లేల? ఆయన ఇచ్ఛవలన తప్ప నేదియు జరుగనప్పుడు, మన యేర్పాట్లు నిరుపయుక్తములుకదా! అతనిమీదనే ఆధారపడి, అతని సంకల్పానుసారముగా ప్రవర్తించుట శ్రేష్ఠము. మఱియు మన పరిసరములను మార్చుకొంటిమేని, క్రొత్తపరిసరములకు అనువుపడునట్లు మనము మాఱ యత్నింపవలసియుండును. కావున ఇప్పటి పరిసరము లట్లే నిలిచియుండుగాక! అందే యుండి అతని నావాహన చేయుచుండుము. అతని సంకల్పముచేతనే నీ పరిసరములు మాఱెనేని, వాని నంగీకరింపుము."

ఎవరో కర్మయోగవిషయమును ప్రస్తావింపగా, స్వామి యిట్లనెను: "'మా ఫలేషుకదాచన'(కర్మఫలములకు నీ కధికారము లేదు). కర్మఫల మెన్నియో విషయములపై నాధారపడియుండును. అందు నీకృషియు నొక్కటి. తన సద్యఃకృత్యమును నెఱవేర్చుటకు సాధకుడు పూర్ణప్రయత్నము లొనర్పవలెను. కాని అప్పటికిని నెఱవేర్పజాలనిచో, చింతిల రాదు. ఏలయన కార్యసాఫల్యమునకువలయు అంగములలో నొకటి (అనగా, తనచేతిలోనిది) చక్కగనే నిర్వహింపబడినను, తక్కినవానిలో లోప ముండియుండవచ్చునుగదా.

కావున తనచేత నైన దంతయు చేసి, కార్యసాఫల్యవిషయమున విషాదముచెందక ప్రశాంతచిత్తుడై యుండుట కర్మయోగ మనబడును.''

శిష్యుడు : '''సర్వకర్మసన్న్యాస' మను గీతలోని వాక్యమునకు 'కర్మము నంతయు పరిత్యజించుట' అని యర్థమా, 'అహంభావరహితబుద్ధితో కర్మ మొనర్చుట' అని యర్థమా?''

స్వామి : ''నీచేతిలోని పనిని యావచ్ఛక్తి వినియోగించి చేయుము. ఆ కార్యసిద్ధికై నీవు ఏవేవియో మార్గముల నేర్పఱచి ప్రయోగించుకొనవలసి యుండును. కాని క్రొత్తకార్యములను పూనుకోవలదు. నీ పాలికి వచ్చిన కార్యమును నీ యావచ్ఛక్తితో నిర్వహింపుము. బలాత్కారముగా కార్యములందు ప్రవేశింపరాదు. అట్లు చేసితివేని, ఆ కార్యములలో నొక్కదానినైనను, నీవు చక్కగా నిర్వహింపజాల కుందువు. తత్ఫలముగా, నీ మనస్సునకు ఖేదమును, అశాంతియును కలుగును.''

కాంతికిరణ వక్రీకరణమును (Refraction of light) గూర్చి ప్రసంగము మరలగా, స్వామి యిట్లు చెప్పెను: ''గుజరాతులో నేను రైలు ప్రయాణము చేయుచున్నప్పుడు రైలు కిరుప్రక్కలను జలాశయములు మెల్లకొలదిగా కానిపించుచుండెను. అంతజల మెట్లు చేరెనని నే వద్భుతపడితిని. కాని అవి ఎండమావులుగా నుండనోపునని ఆ పిదప తోచినది.

"భగవత్సాక్షాత్కారసిద్ధి నొందినవానికి ఈ ప్రపంచము ఎండమావులవంటి (అసత్య) దృశ్యముగా కానిపించును. మానవుల నాకర్షింపదగినది అం దేదియును లేదు. ఎండమావులలో నీటి దృశ్యమును చూచినవాని కచట నీరు లేదని యెట్లు తెలియునో, అట్లే ఈ నామరూపాత్మక ప్రపంచము కానిపించుచున్నను, అదంతయు మాయ యనియు, భ్రాంతి యనియు జ్ఞానికి తెలిసియుండును.

"ప్రథమమున జ్ఞానప్రాప్తి నొందవలెను. జ్ఞానప్రాప్తి నొందినవానికి ఈ భేదమయప్రపంచము ము న్నెట్లుండెనో అట్లే కానిపించును గాని, అం దేదియు అతని నాకర్షింపదు. ఎండమావులు అనెడు ఎఱుక ఉత్పత్తి యగుటకుపూర్వము అందు జలముండు నను ఆశ యుండును, కాని దాని యథార్థ తత్త్వ మెఱిగినవానికి అది కానిపించుచున్నను, అందు నీరు లేదని తెలిసియుండును. అట్లే ఈ భేదమయప్రపంచము ఇంద్రియవేద్యముగా నున్నను, జ్ఞాని దానిని సత్యముగా కైకొనడు. దానియం దాసక్తుడు కాడు.

"అనేకవస్తువులందు మనకు గల ఆసక్తిని భౌతిక విజ్ఞానము పొఱదోలినది. ఇందు కుదాహరణముగా రంగు అనెడు ప్రకృతివికారమును కైకొనుడు. నిజమున కే వస్తువునకుగాని ఏ రంగును లేదు. సూర్యకాంతియందు ఏడు వేఱు వేఱు రంగులు కలిసియున్నవి. కొన్నికొన్ని వస్తువులు కొన్ని కొన్ని రంగులను విలీనపఱచుకొని తక్కినరంగులను ప్రతే

పించును. ఇట్లు ప్రక్షేపింపబడిన రంగులే, ఆ యా వస్తువుల రంగులుగా తోచును. రంగువస్తువులయొక్క సౌందర్యము మనల నాకర్షించును నిజమే, కాని నిజమున కా సౌందర్యమునకు సూర్యరశ్మియే ఆధారము. ఈ సంగతిని దృష్టి పెట్టుకొనువారిని ఆ రంగు లాకర్షింపవు. నేడు మనకు అందముగా తోచువస్తువు రేపు స్థితిగతుల మార్పుచే అందమును కోల్పోవచ్చును. నిజమునకు వస్తువులు సౌందర్యమును కోలుపోవుచునేయుండును.

"ఇక స్పర్శవిషయము కై కొనుము. నిజమునకు మనకు గల దొక్క యింద్రియమే. అదే స్పర్శేంద్రియము. చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణేంద్రియము లన్నియు స్పర్శమీద నే ఆధారపడినవి. స్పర్శ లేనిదే ఈ యింద్రియము లేవియు పనిచేయజాలవు. అవి యే యనుభూతులను ఈయజాలవు. 'సంస్పర్శజనితము లగు భోగములు దుఃఖకారకములు' అని గీతకూడ చెప్పుచున్నది. శబ్దము దేశకాలస్థితిగతుల ననుసరించి మధురముగనో, పరుషముగనో వినిపించును. శబ్దము వాయుమార్గమున ప్రసరించును. కావున ఇచ్చటకూడ చెవితో స్పృశించు నవసరముకలదు."



## II

1925, జాన్యువరి 31

'బ–' : "తలచు తలపునకు పలుకు పలుకునకు ఏకీభావము కల్పింపు మని శ్రీ గురుదేవుని బోధ. దాని కర్థ మేమి?"

స్వామి : "జీవితము మోస మేమియు లేక, నిష్కపటముగా, నుండవలెనని — నీ ఆంతరజీవితము, బాహిర జీవితము ఏకీభవించియుండవలెనని."

'బ–': "అట్లుండుటయే సహజము. మన మాటల లోనిదే మనస్సులో నుండును."

స్వామి : "అట్లుండుట అపురూపముగదా! భగవన్నామమును మన ముచ్చరించునది నాలుకచివరనుండి—చిట్ట చివరనుండి. 'నేను నీ దాసుడను, నీవు నా స్వామివి; నీవు నా ప్రభువవు; నీకొఱకై నా సర్వమును త్యజించితిని; నిన్నే నావాహనచేయుచున్నాను. ప్రభూ, నాయొద్దకు రమ్మ' అని మన మందుము. కాని మనస్సులలో సర్వవిధదుర్భావములకును తా వొసంగుదుము. ఇట్లు చేయదగదు. నోట నే మందుమో అదే మదిలో తలపవలెను. దీని కర్థ మే మనగా, భగవన్నామోచ్చారణ మొనర్చునప్పుడు మనస్సు భగవంతునియందే నిలువవలెను. 'అది నిజముగా అదియే' అని శ్రీ చైతన్యు డనువాడు. అనగా, భగవంతుని నామమే భగవంతుడు. ఆ రెంటిని వేఱుచేయుట సాధ్యముకాదు."

'బ-': "ప్రారంభకాలమున భగవన్నామోచ్చారణము మాత్రమే చాలునుగదా! ఏకాగ్రత ప్రథమదశలో లభింపదు."

స్వామి: "నిజమే. నామమున కనురూపమగు భావము క్రమక్రమముగా అభివృద్ధియగును."

'ద-': "శ్రీ గురుదేవునియొక్కయు, స్వామిజీ యొక్కయు అనంతకారుణ్యము మాకు కలదు. మీరును మీ ఆశీస్సులను మాపై కురిపించియున్నారు. కాని మాకంత విస్పష్టమగు పురోభివృద్ధి కలిగినట్లు కానిపింపదు."

స్వామి: "కారుణ్యము, ఆశీస్సులు కల వనుమాట నిస్సంశయమే. కాని లోతుగా పాతుకొనియున్న సంస్కారము లొక్కనాడు నశించునా? మీరు భగవంతునికొఱకై ఇల్లు, వాకిలి విడనాడినారు. అదియును ఒక సిద్ధియే. నిస్సంశయముగా మీరు పురోగమించుచున్నారు. ఆ పురోగమనము క్రమాధిక మగుచుండును. శ్రీ గురుదేవునియొక్కయు, స్వామిజీయొక్కయు అనుగ్రహము మనకు అవ్యారిగా నున్నది. మనోనిశ్చయముతో వెంటనే సాధనలలోనికి దుముకుడు. మీరు పురోగమించునది, లేనిది, అప్పుడు మీకే తెలిసిపోవును. గాఢకృషి చేసినగాని పరమార్థసిద్ధి లభింపదు."

'బ-': "ధ్యానమునందు మా యిష్టదైవముగాక మఱొకమూర్తి కానిపించిన మే మేమి చేయవలెను?"

స్వామి: "ఇష్టదైవము ఆ మూర్తితో సాక్షాత్క రించినాడని భావింపుడు. అట్లొనర్చితిరేని, ఆ మూర్తి మెలమెల్లగా అదృశ్యమై ఇష్టమూర్తి మరల చూపట్టును."

'మ-': "కానిపించిన మూర్తి ఏదైనను ఇట్లొనర్ప నగునా?"

స్వామి: "కాదు. ఏదోయొక మహాపురుషునిమూర్తి కానిపించు నెడ మాత్రమే."

'మ-': "సామాన్యుని మూర్తి యైనచో, ఏమి చేయవలెను?"

స్వామి: "గాఢదీక్ష పూని దానిని తటిమివేసి, మీ శక్తి నంతటిని వినియోగించి మీ యిష్టదేవతామూర్తిని మరల పునఃప్రతిష్ఠ యొనర్పుడు. ఉన్నట్టుండి చెప్పాలుకుట్టు దుకాణ మొకటి కానిపించి, మీ బుద్ధిని పెడత్రోవకు లాగినచో, దానినిగూర్చి ధ్యానింపనగునా!"

'స-': "'అద్వైతజ్ఞానమునందు సుప్రతిష్ఠితులైన పిదప మీ రెచటికైనను వెళ్లవచ్చును' అని శ్రీ గురుదేవు డనెడివాడు కదా. ఆ మాట కర్థమేమి?"

స్వామి: "'ఎచటికైనను వెళ్లవచ్చును' అని కాదు; 'ఏమైనను చేయవచ్చును' అని. 'పరమార్థజ్ఞానసిద్ధి నొందినవా డెట్టి అకార్యమును చేయజాలడు' అని ఆయన భావము. వివేకవైరాగ్యమూలమునను, భక్తిప్రేమచిత్తపారిశుద్ధ్యముల మూలమునను, జ్ఞానసిద్ధిని గాని, భగవత్సాక్షాత్కృతిని గాని,

పొందినవాడు దుండగము లెట్లొనర్పగలుగును? అట్టివాడు అకార్యము లొనర్చుట అసంభవము.”

‘ర–’: “సాకారోపాసనమూలమున అద్వైతజ్ఞాన మార్జించుట సాధ్యమా?”

స్వామి: “ఏల కాదు? సకాలమున అది అద్వైత జ్ఞానసిద్ధిగా పరిణమించును.”

‘బ–’: “అ ట్లెట్లు పరిణమించును : సర్వమునందును భగవంతుని యునికి గోచరించునా? లేక సర్వమును పూర్తిగా అదృశ్య మగునా?”

స్వామి: “రెండును. నీ సాధనలు సాగుకొలది నీ కది తెలియవచ్చును. అభ్యాసపరిపాకమున నీ కది అనుభవవేద్య మగును. వ్యర్థప్రసంగములవలన నేమి ప్రయోజనము? కొంత కాలమైనను జపధ్యానములు అభ్యసింపుము. లేనిచో ‘బ్రహ్మమా, నీవే నా యథార్థతత్త్వమవు’ అని పలుకుచు రుచ్యభోజ్యము లారగించు పంజాబీసాధువులవలె ప్రవ ర్తించు టగును. గాఢపరిశ్రమ చేయుము, కాలక్రమమున సర్వమును నీ కెఱుకపడును. నిగూఢసమస్యలనుగూర్చి ప్రశ్నించుట నిరుపయోగము. అందుమూలమున నేమియు సిద్ధింపదు. ప్రతివాడును మాటలాడును, కాని ఎవ్వడును కార్యమునకు ఒగ్గడు. పరిశ్రమమందే ఫలసిద్ధి కలదు. చెప్పిన ట్లేల సాధన లొనర్పరాదు?”

‘బ–’: “‘హృదయస్థానమున ధ్యానింపుము’ అని

మహారాజ్ (బ్రహ్మానందస్వామి) యొక్క బోధ. 'హృదయ స్థానము' అనగా ఏది?"

స్వామి: "(వక్షఃస్థలమున చేతి నుంచి) అది సాధారణముగా ఈ 'పాకస్థలి'— అడుగు బరిమెముకల నడిమి గుంట (**Pit of the Stomach**). ఇదియే హృదయస్థానము. ఈ ప్రదేశమున ఎనిమిది రేకులుగల ఎఱ్ఱ తామరపూవుపై ఇష్టదైవము కూర్చుండియున్నట్టు తలంచి ధ్యానింపవలెను. భ్రూమధ్యస్థానమున కెగువగా శిరస్సునందు గురువు తెల్ల తామరపూవుపై కూర్చుండియున్నట్టుగా భావించి ధ్యానింపవలెను."

'హ–': "ఈశ్వరకోటి యనగా నెవరు?"

స్వామి: "నే నీశ్వరకోటిని కాను. అందుచేత అది సరిగా వివరింపజాలను."

'హ–': "శాస్త్రములలో ఏమి చెప్పబడియున్నది?"

స్వామి: "ఈశ్వరకార్యసాధనార్థమై ఈశ్వరకోటులు భూమిపై నవతరింతురు. పరిపూర్ణజ్ఞానము వారి కాజన్మసిద్ధము. నారదుడు, శుకదేవుడు మున్నగుమహర్షులీ గణములోనివారు. వారు మాయావరణమునుదాల్చి జన్మింతురు అని వేదాంతబోధ."

'హ–' "అగుచో, జీవన్ముక్తునికిని ఈశ్వరకోటికిని భేదమేమి?"

స్వామి: "సామాన్యజీవి అపారపరిశ్రమమూలమున గాని ఏమియు సాధింపజాలడు. అద్వైతసిద్ధి నందెనేని

అచ్చటనుండి సామాన్యక్షేత్రమునకు దిగి రాజాలరు. ఈశ్వర కోటు లన్ననో, లోకకల్యాణార్థమై అవతారమూర్తుల ననుసరించి, పైకి మాయావరణ మున్నను లోపల పరిపూర్ణ జ్ఞానము దీపించుచు, ఉద్భవింతురు. పరమసత్యక్షేత్రము నుండికూడ వారు దిగి సామాన్యక్షేత్రమునకు రాగలరు. ఇది సామాన్యమానవులకు సాధ్యమా?"

'హ-': "అవతార మనగా నేమి? అవతారమూర్తికి తన యథార్థతత్త్వ మెల్లప్పుడును తెలిసియుండునా?"

స్వామి: "అవును. అత డెల్లప్పుడును పరిపూర్ణజ్ఞానమందు సుప్రతిష్ఠితుడై యుండును."

'హ-': "అగుచో అతడు పారమార్థికసాధన లేల చేయవలయును? ఆ సాధనల కర్థ మేమి?"

స్వామి: "బుద్ధిపూర్వకముగా ఆవరణమును దాల్చి, సామాన్యమర్త్యులవలె నతడు లోపము లనుభవించును. కావుననే అతని సాధనాదులు. అట్లు చేయనివా రెట్లుందురో ఎఱుగుదువా? సముద్రపు లోతు కనుగొనుటకై అందులో ప్రవేశించు ఉప్పుబొమ్మల వంటివారు. సముద్రజలములో కరగి పోయి వారు మరలరాజాలరు."

'క-': "వీరికిని వారికిని గల భేదము శక్తియందా, జ్ఞానమందా?"

స్వామి: "శక్తియందే. దానినిగూర్చి శ్రీ గురుదేవు డేమి చెప్పెనో ఎఱుగుదువా? ముప్పొరొక పచ్చికబయలులో

విహరించుచుండిరి. చేరువనున్న యొక గొప్ప ఆవరణములో మధురస్వరములు, సంగీతము మున్నగునవి వారి కున్నట్టుండి వినవచ్చెను. ఆ ఆవరణములోనికి గొనిపోవు ద్వార మేదియు కానరాకుండుటచే, ఒక డొక నిచ్చెన తెచ్చి మిక్కిలి కష్టముతో గోడపై కెక్కెను. అచ్చట అత్యద్భుతమగు నృత్యగానాదులు నడచుచుండుట చూచి, ఆనందపారవశ్య మున, తన సహచరులతో నేమియు చెప్పకయే, లోనికి దుమికెను. రెండవవాడును అట్లే పై కెక్కి అట్లె లోనికి దుమికెను. కాని మూడవవా డట్లు చేయక, గోడపై నిలు చుండి లోపలజరుగునదికూడ చూడసాగెను. వా డిట్లు తల పోసెను: 'దీనిని నే నొంటరిగా అనుభవించుట స్వార్థపరత్వము కదా! ఇతరులనుకూడ పిలిచెదను. వారును వచ్చి చూచి ఆనందింతురుగాక!' అట్లు తలపోసి గోడపైనుండి దిగి అనే కులను పిలిచి ఆవరణములోని యుదంత మంతయు వారికి తెలిపెను. అవతారమూర్తు లిట్టివారు. శక్తి అభివ్యక్త మగుటలో ఇవి అంతరములు. గాఢపరిశ్రమానంతరము తాను ఆర్జించినదాని నితరులకుకూడ అందజేయుట కెంతయో హృదయవైశాల్యము వలయును—ఎంతయో వైరాగ్యము! ఎంతయో ఓరిమి! ఇవన్నియు శక్తి అభివ్యక్త మగుటలోగల తారతమ్యములను తెలుపును.''

'బ-': ''తోతాపురి అద్వైతస్థితి నందినవాడేనా?''

స్వామి: (కొంచెము తాళి)''ఇట్టి ప్రశ్న మేల యడి గెదవు? తోతాపురిసంగతి యంతయు నెఱిగియుండుటకు నేను

తోతాపురినా? ఈ విషయములు వ్రాయబడిన గ్రంథముల నుండి నీవే సులభముగా ఇది కనుగొనగలవు.''

'బ-': ''నిర్వికల్పసమాధినుండి సామాన్యస్థితికి ఈశ్వరకోటులు, అవతారమూర్తులు తప్ప ఇతరులు రాజాల రని మీ రిప్పుడు చెప్పితిరిగదా. అందుచేత నేనా ప్రశ్నము నడిగితిని.''

స్వామి : ''అదియా? జీవన్ముక్తుల విషయ మేమి? జ్ఞానసిద్ధి నొందినపిదప వారును జీవించియుందురు. ఇది సిద్ధిని గూర్చిన విషయము. వట్టి ప్రశ్నలు నిరుపయోగములు. నిర్మలుడవై యుండుము. పాపపు తలంపులను విడనాడి గాఢపరిశ్రమ మొనర్పుము. క్రమేణ సర్వము నీవే గ్రహింప గలుగుదువు. సహజజ్ఞానమువలనగాని ఈ విషయములను గ్రహించుట సాధ్యముకాదు. గాఢ సాధన లొనర్పుము. చేయవలసి వచ్చెనే అనెడు భావముతో పారమార్థిక సాధన లాచరింపదాదు.''

'ర-': ''సేవాసంస్థకు సంబంధించిన మహాకార్య భారమును మీరు మాపై బెట్టితిరి. అంత కార్యభారము వహించువారు సాధనలందు పూర్ణముగా నెట్లు ప్రసక్తులు కాగలరు?''

స్వామి: ('ర-' తో) ''మహాకార్యభారమా! బళీ! ఆ పనియే లేనిచో, మీ రిప్పుడు చేయు స్వల్పముకూడ చేసియుండ రని నీ వెఱుగుదువా? సాధ్యమైనయెడల ఒక్క నాడైనను పని మానుకొనుము. సత్రములో అన్నము తిని

కఠినసాధన లాచరింపుము. నీ వెంతమాత్రము పురోగమింప గలవో, నేను చూతునుగాక! ఒక్కనాడైన నీ వట్లు చేయ జాలవు. కొన్నాళ్లకు వ్యర్థకాలక్షేప మారంభింతువు. మానవుడు ఈశ్వరునియొక్క ప్రత్యక్షమూర్తి యనెడి పరిపూర్ణ జ్ఞానముతో మానవసేవ చేయుటకుగా స్వామిజీ ఈ పనులను విధించెను. ఇది క్రొత్తమార్గము: సులభముగా గ్రహింపదగినది, సులభముగా అనుసరింపదగినది. కాని నీ కిది అనుచితముగా తోచుచున్నది! పని మానుకొని, ఏమగునో చూడరాదా? ఈ కార్యాచరణమధ్యమున నీ విప్పు డొనర్చు కొద్దిపాటి సాధనకూడ నీ వప్పు డొనర్పవు. ఇప్పుడు నీవు చేయునది అస్వార్థకర్మము. దానిని విడనాడితివేని, స్వార్థపరత్వములో పడి మునిగిపోవుదువు. ఇదియే జరుగబోవునది. లోకములోని జను లెంతే కష్టింపవలసియున్నదో, చూచుటలేదా? ఐహికజీవన మవలంబించి, ఆ వేడుక చూడరాదా? తలిదండ్రులసేవ తప్ప వేఱు సేవ యేదియు లేనివారు ఆ సేవయే చేయజాలక దిక్కుతోపకున్నారు. సాధనలందు అభీష్టము కలదు గనుక కడుపార కుడిపి ఏమియు పనిపెట్టకుండుటా? కర్మాచరణమధ్యమునకూడ మానవు డవశ్యము గమ్యసిద్ధి నొందగలడు. శ్రీ గురుదేవుని కార్యమగు సేవాసంస్థకర్మమునకును, పారమార్థికసాధనలకును, రేఖామాత్రభేదమైన కలదా? కర్మాచరణము పరిత్యజించినపిదప సాధకునికి పారమార్థికసాధనలందు గల ఆసక్తి చాలవఱకు తఱిగిపోవును. మార్గమునందు విఘ్నములు నిలిచియుండునంత కాలము శక్తిప్రదర్శన ముండును. ఇంట నుండువానికి

సాధుజీవనము నెడ వాంఛ గాఢముగా, తీవ్రముగా, నుండును. కాని సాధుజీవన మవలంబించినపిదప ఎంత కాలము ఆ సద్భావములు నిలిచియుండును? (కొంచెము సేపు మౌనముగా నుండి) ఇంట నున్నప్పు డెన్నో విషయములు — క్రమము తప్పక చదువుకొనుట, తలిదండ్రులనుగూర్చిన ప్రత్యేక జాగ్రత్త, వైవాహిక విషయములు — మనస్సు నెదుర్కొని పీడించును. కావున మనఃశక్తియు వానితో పోరాడుటకై బలీయ మగు చుండును. కాని ఇల్లు వదలి వచ్చి వేసినపిదప, గమ్యము లభించిన దను భావము కలుగును. పోరాట ముండదు. చెఱువుగట్టు నుదాహరణముగా కైకొనుము. అది నిలిచియున్నంత కాలము నీరు దానిని త్రెంచుకొని వెలు వడుటకై దానిపై కెగసియెగసి త్రోపాడుచుండును. కాని వెలువడుమార్గము లభించెనేని అంతయు క్రమ్ముకొని ఆ నీరు నిలిచియుండును. ఆ బల మిప్పు డించుకంతయు లేదు. చెల్లాచెదరై అంతటను వ్యాపించుటచేత కేంద్రీకృతబల మంతయు నశించినది.''

'క–' : ''వెలువడుటకై త్రోవను కల్పించుకొనక యే చివరకు ఆగిపోయి బలముదక్కి పడియుండవచ్చును గూడ!''

స్వామి : ''అవును. ఒక్కొక్కసారి అట్లే జరుగును. కాని అది అరుదు. శక్తి తన ప్రదర్శనమునకు మార్గము లన్వేషించుచు, ఆటంకముల నడుమనే బలోదగ్ర మగు చుండును. నీ కుపదేశింపబడిన మంత్రమును క్రమముతప్పక

ఏల జపింపరాదు? కాని మీ రెవ్వరును అది చేయరు. గురువుయొక్క ఆదేశముల ననుసరించి ప్రవర్తింపుడు. మీలో నెందఱు అట్లు చేయుచున్నారు? జపమునకై ఒక యఱగంటసేపు కూరుచుందు రేమో — ఎక్కువ కూర్చున్న నాడు — అదియు స్తిమితమగు బుద్ధితో కాదు! అది యొక బాధయైనట్లు! ఇది నిష్ప్రయోజనము! మంత్రోపదేశా నంతరము నియమముల నెవరు పాటించుచున్నారు? ఈ కాలమున సన్న్యాసమన్న కొందఱికొక మోజు! ఇది వాడుక యగుచున్నది. సన్న్యాసమనగా నొక ఆంతరంగికవికాసము. లాంఛనమాత్రసన్న్యాసమువలన నేమైన సాధింపగలమా? లాంఛనికవృత్తియం దేమైన సారము కలదా? సన్న్యాస మునకు అర్హత నార్జించుకొనవలెను. ఇందుకు ఆంతరంగిక పురోగమన మవసరము. సముచితబుద్ధితో పనిచేయువా రెందఱు కలరు? కూలివానివలె పనిచేయుటవలన నేమి ప్రయోజనము? మనలను కార్యాచరణమునకు పురికొల్పు బుద్ధి—మానవరూపములను దాల్చిన నారాయణుని సేవించు చున్నా మను బుద్ధి — మన యిష్టదైవమే సర్వమానవ రూపములతోను ప్రత్యక్షమైన దను బుద్ధి—అది యొక్కటే చివర కుపయోగించునది.''

'బ–': ''ఇష్టదైవమును, బాహ్యావస్తువులను ఒకేసారి, గోచరింపజేసికొనుట సాధ్యమా?''

స్వామి: ''దీని భావ మేమనగా, ఇన్ని వేర్వేఱు రూపములతో కానిపించుచున్నది మన యిష్టదైవమే

యనియు, సర్వమునందా యిష్టదైవమే కలదనియు, మనము తలంచుకొనవలెను. (శ్రీ) గురుదేవుడు సర్వమునందును జగన్మాతను చూచుచుండెనుగదా!

(కొంచెము సేపు తాళి) "పోరాడుడు, పోరాడుడు, పరిశ్రమింపుడు."

'క–' : "మేము భగవంతుని చూడజాలము. చూడని వానిని ప్రేమించు టెట్లు? అదృశ్యమూర్తిని — అతని యునికియే సంశయగ్రస్త మైనవానిని —మే మెట్లు ప్రేమింపగలము?"

స్వామి : "గుర్వాదేశానుసారము నడచుకొనుడు. ఈశ్వరసాక్షాత్కారార్థమగు ఆ ఆదేశములను 'తు', 'చ' తప్పక అనుసరింప గలిగితి రేని, చివర కంతయు సులభమగును. ధ్యానము ఆ పిదప అలవడగలదు. ధ్యాన మలవడ దేని, నిండు మనస్సుతో, పరిపూర్ణశ్రద్ధతో, మంత్రజపమును సాగింపవలెను. ('బ–' తో) గుర్వాదేశములను నీ వనుసరించుచున్నావా? గుర్వాజ్ఞలో నర్ధభాగమునైన నెవరు ఆచరించుచున్నారు? ఆచరించితి రేని, ఫలము లభించుట సిద్ధము. 'మంత్ర పురశ్చరణము' ఎఱుగుదువా? లక్షసార్లు జపించినచో మంత్రము సచేతనమగును. సక్రమబుద్ధితో మంత్రము నొక్కసారి ఉచ్చరించినను చిత్తపారిశుద్ధ్యము చేకూరును. వెంటనే మనస్సు హర్షమునొంది ఆనందమయమగును."

'క–': "దినమునకు లక్షసార్లు జపించిన చాలునా?"

స్వామి: "తప్పక అది మహోపకారకముగా నుండును. శక్త్యనుసారము లక్షసార్లు, కనీసము పదివేలసార్లు, జపింపుము. మంత్రము పెద్దదైనచో ఐదువేలసార్లు, మఱియు పెద్దదైనచో రెండువేలసార్లైనను మంచిదే."

'హ–': "గాయత్రీమంత్రమును వేయిసార్లుచ్చరించుటకే ఐదాఱుగంటలు పట్టును."

స్వామి: "సరే, మంత్రము మిక్కిలి పెద్దదైనచో, వేయిసార్లైనను ఏల ఉచ్చరింపరాదు? దినముతప్పక వేకువనే నిద్రలేచి జపింపవలెను. మంత్రము అంత పెద్దది కాదేని, రెండువేలసార్లతో ప్రారంభించి క్రమక్రమముగా అధికపఱుపుడు. అదిచాలును. అభ్యసించువారెవ్వరును లేరు, అందఱును వ్యర్థకాలయాపన చేయువారే. విజయము సాధింపవలె నన్నచో గాఢతరాభ్యాస మవసరము.

('బ'–తో) "గాఢపరిశ్రమచేయుము. జయము సిద్ధము. నిద్రాహారముల కందఱకును తీఱిక లభించును. ఆధ్యాత్మిక సాధనలకే తీఱిక దొరకనిది!"

1925, ఫెబ్రువరి

స్వామి: ('క–' తో) "నీ విప్పు డేమి చదువుచున్నావు?"

'క–': "అధ్యాత్మరామాయణము."

స్వామి: "మంచిపని. (శ్రీ) గురుదేవునికి ఆ గ్రంథముపై చాల ప్రీతి. అందులో ననేకభాగము లాయన ముఖ

ష్ఠము లొనర్చుకొనెను. ఆయన కద్భుతమగు జ్ఞప్తి యుండె డిది. ఆయన 'శ్రుతిధర' సార్వభౌముడు. ఒక్కసారిమాత్రమే విన్న విషయములుకూడ ఆయనకు జ్ఞప్తియుండెడివి. స్వామిజీ అంతకన్న కొంచెము తక్కువ తగరతివాడు. చదువుటయో, వినుటయో, రెండుస్లారు జరిగినపిదప ఆయనకు జ్ఞప్తి యుండెడిది."

'బ-': "ఈ యద్భుతశక్తి యెట్లు లభ్య మగును? వారి బుద్ధిసూక్ష్మతయేనా, ఇతర కారణ మేదైన కలదా?"

స్వామి: "వీరిబుద్ధి పరిపూర్ణముగా వీరికి వశవర్తియై యుండెడిది. ఏ వస్తువుపై ఆ బుద్ధిని చొనిపినను, అది ఆ వస్తువుకు అంటుకొనిపోవును. ఇందుకు అపారమగు కేంద్రీ కరణశక్తి కావలెను. ఒకేసారి విన్న, లేక చూచిన, విషయ ముకూడ వారికి సంవత్సరములబడిగా జ్ఞప్తియుండును.

(కొంచెము సేపు తాళి) "శమదమాదులగు ఆఱు గుణసంప దలలో శ్రద్ధ (పరిపూర్ణతత్పరత్వము) ఒకటి. ఈ పరిపూర్ణ విశ్వాసము—తన గురువాక్యమునందును, ఈశ్వరునందును, శాస్త్రములందును పరిపూర్ణవిశ్వాసము — ఇదియే పార మార్థిక క్షేత్రమున అత్యంతముఖ్యము. 'ఫలానిపనిని చేయు మని గురువు నన్నాజ్ఞాపించినాడు. నే నది చేసితినేని, నాకు విజయము చేకూరుట నిస్సంశయము. అన్యథా జరుగనేరదు' అని తలంచు జాజ్వల్యమానశ్రద్ధ గురువాక్యములందుండుట అత్యావశ్యకము.

"శ్రుతిధరునకును సామాన్యమానవునకును భేద మేమి? శ్రుతిధరుడు తన మానసికశక్తుల నన్నిటిని ఏకాగ్ర

మొనర్చి దేనిమీదనైన ప్రసరింపజేయగలడు. సామాన్య మానవుని మానసికశక్తులు చెదరియుండును. వాని నేకాగ్ర మొనర్చి ఉద్దిష్టవస్తువుపై కేంద్రీకరించుశక్తి అతని కుండదు. లౌకికుల బుద్ధి ఎన్నో వస్తువులమీదికి చీలియుండును. వివాహ మయ్యేనేని, బుద్ధిలో సగపాలు భార్యమీద నిలుచును, మిగిలినదానిలో నెక్కువభాగము బిడ్డలమీదికి, ద్రవ్యముమీదికి, ఆస్తిమీదికి, ఇల్లిన్నిటిమీదికో పోయి యుండును. ఇంకను మిగిలియుండు కొంచెమును భోగ్య వస్తువులందు విభజింపబడియుండును. కాని బుద్ధి నంతయు ఏకాగ్రము చేసి, ఏకముఖముగా ప్రసరింపజేయుట అసాధ్య ప్రాయమైన విషయము. శ్రీ గురుదేవుడు మనస్సును ఆవ గింజల పొట్లమునకు పోల్చువాడు. 'ఆ పొట్లము చిరిగెనేని, గింజలు చెల్లాచెదరై దశదిశల వ్యాపించును. వానిని మరల చేర్చుట ఎంత దుష్కరము! కొన్ని దొరకనే దొరకవు! కాని పరిపూర్ణశ్రద్ధగలవానికి అసాధ్యముకూడ సాధ్యముగా మారిపోవును.

(కొంచెము సేపు తాళి) "సత్యము నెన్నటికిని మఱచి పోరాదు. దానిని — సత్యమును, ఈ క్షణికప్రపంచమున గల ఏకైక నిత్యవస్తువును — దృఢముగా చేత చిక్కించుకొని యుండవలెను. శ్రీ గురుదేవుడొకసారి హరి మహారాజ్‌తో (తురీయానందస్వామితో) ఇట్లనెను: 'నీవు వేదాంతము చదువుచున్నావు. దాని సార మేమి? బ్రహ్మ మొక్కడే సత్యము, జగత్తు మిథ్య అనియేకదా! ఇంకేమైన కలదా? నీకు కావలసినది సారము. తక్కినదంతయు పాఱ

వైభవము'. వివిధశాఖలయొక్కయు, మతములయొక్కయు సిద్ధపురుషులు చేసిన బోధ లన్నియు శ్రీగురుదేవు డొకసారి వినెను. పిదప నొకనాడు వివిధమతశాస్త్రములు పెక్కింటిని తెప్పించి వాని నన్నిటి నొక దండగా గ్రుచ్చి ధరించి, ఇంచుకసేపు నృత్యమొనర్చి, ఆ పుస్తకము లన్నిటిని 'తునాతునుకలు'గా చించి పాఱవైచెను. కొన్ని వస్తువులు పంపుమని నీ కొకరు జాబు వ్రాసినప్పుడు, ఆ వస్తువులు సేకరించి పంపినపిదప, ఆ జాబుతో ఏమిపని? నిజమునకు, మానవునికి కావలసిన దీ జగత్తుయొక్క సారము మాత్రమే."

1926, జూన్

శిష్యుడు : "కామము నశింపదా?"

స్వామి : "నశించును. మెలమెల్లగా పోవును. భగవంతుని దివ్యనామమును స్మరింపుము. అదియే పోవును."

1926, అక్టోబర్

శిష్యుడు : "ధ్యానకాలమున నా మనస్సును ఇష్టదైవముమీఁదగాని, గురువుయొక్క మూర్తిమీఁదగాని, నిలుపజాల కున్నాను."

స్వామి : "'నిలుపజాలకున్నాను' అనుట నిష్ప్రయోజనము. సక్రమాభ్యాసము చేయవలెను. నిరంతరపరిశ్రమము వలయును. గత్యంతరము లేదు. ప్రతిదినము, కొన్ని గంటలు నియమించుకొని, ప్రాతస్సాయంకాలములందు పూనికతో అభ్యాసము లొనర్పవలెను. ఇష్టదైవము

యొక్క పటమును ఎదుట నుంచుకొని ధ్యానము చేయ ప్రయత్నింపుము.''

శిష్యుడు : ''నిర్ణీత కాలములో కొంచెము వ్యత్యాసములు కలిగిన నెట్లు? సరియైన కాలమందే ధ్యానమునకు కూర్చుండక పోయినచో నేమి?''

స్వామి : ''ఒకటి రెండు దినములు కొంచెము వ్యత్యాసము కలిగినను హానిలేదు. కాని పనిచేయుచుండు కాలమంతయు అతనిని జ్ఞప్తి యుంచుకొని అతనినిగూర్చి తలంచుచుండవలెను. అట్లు చేయుము.''

శిష్యుడు: ''జపధ్యానములు పూర్తిగా విడనాడినచో, కేవలము కర్మమూలముననే అభీష్టసిద్ధి కలుగునా?''

స్వామి : ''కర్మ మొనర్చు బుద్ధి సరియైన దైనచో, కలుగును. కాని ఇది సామాన్యముగా జరుగదు. జపధ్యానములు పరిత్యజింపరాదు.''

శిష్యుడు : ''మంత్రము నెన్ని సార్లు జపింతును నేను?''

స్వామి : ''ఎన్నిసార్లు జపింప గలవో అన్ని సార్లు.''

శిష్యుడు : ''మనస్సునందు పెక్కుసార్లు చెడుతలంపులు రేకెత్తుచుండును. వాని బారినుండితప్పించుకొనుటెట్లు?''

స్వామి : ''దృఢసంకల్పముతో వానిని తఱిమివేయవలెను. 'నిరంతరాభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మనస్సు నిగ్రహింపబడును' అని గీతలో చదివియున్నావు గదా. వేఱుమార్గము లేదు. భగవంతుని శరణ మర్థింపుము. అతనిని స్వకీయునిగా నొనర్చుకొనుము. చెడుతలంపు లెగిరిపోవును. అతనిని స్వకీయునిగా చేసికొనితీఱవలెను.''

శిష్యుడు : "పెక్కుతడవలు ధ్యానవేళలందుగూడ కామము తీవ్రరూపమున చూపట్టును."

స్వామి : "దానిని లక్ష్యపెట్టకుము. అది అందఱకును చూపట్టును. భగవంతుని శరణుచొచ్చి దానిని తఱిమి వేయుము. కాని భోజనవిషయమున జాగ్రత్త పుచ్చుకొనుము. జీర్ణకోశమును రేగజేయు పదార్థములను, సులభముగా జీర్ణముకాని పదార్థములను, విసర్జింపుము."

శిష్యుడు : "మన మంత్రమున కర్థమేమి ?"

స్వామి : " 'జగత్తునకు సృష్టిస్థితిలయకారకుడగు భగవంతుడు నా క్లేశములను పోగొట్టునుగాక' అని. అన్ని మంత్రముల కిదియే అర్థము. భగవంతునియందు విశ్వాసముంపుము. అట్లు చేయవేని, ఇట్టి వివరణములు వేలకొలదిగా విన్నను ఉపకారము కలుగదు. భగవంతుని ప్రార్థింపుము, అతనిని ప్రేమింపుము."

శిష్యుడు : "ఆసనప్రాణాయామాదులు మనస్సంస్కారములను తొలగింప తోడ్పడునా ?"

స్వామి : "వానివలన ముఖ్యమైన దేదియు సాధింపననువుపడదు. ఒకవేళ కొంచెము గుణ మేదైన లభించునేమో. భగవంతునిపై నీ ప్రేమ అధిక మగు కొలది, నీ మనస్సు మఱిమఱి నీకు వశ మగుచుండును."

శిష్యుడు : "గురువునుగూర్చి ధ్యానించుట నాకు ఇష్టము. ఇష్టదైవభావము నా మనస్సులో నంతగా కానిపించు చుండదు. కావున నేను గురుధ్యానము చేయుచున్నాను. ఇది చాలదా ?"

స్వామి : "చాలదు. పని నంత తేలిక చేసికొన నేల? గురుధ్యానానంతరము ఇష్టదైవధ్యానముకూడ చేయుము. కాని గురువుకై నీ మన స్సెక్కువగా పరితపించు చున్న యెడల, అతని నెక్కువకాలము ధ్యానింపుము. ఇష్టదైవ ధ్యానము చేయజాలవేని, అతడు కలడు అనియైనను తలంపుము. అందుచేతకూడ నీకు మనశ్శాంతి చేకూరును."

శిష్యుడు : "ఇరువురును తాత్త్వికముగా నొక్కరే యని నేను వినియున్నాను. అగుచో అందులో నే యొకరిని గూర్చి ధ్యానించినను చాలునుగదా! అట్లేల కాదు?"

స్వామి : "కాదు. వారిరువురును ఒక్కటే అను అనుభవజ్ఞానము కలిగినప్పుడు —ఆ దశయందుమాత్రమే— నీ వట్లు చేయవచ్చును. నీ పనినంత సులభ మేల చేసి కొందువు?"

శిష్యుడు : "జపము ధ్యానముతోకూడనే చేయ వలెనా, ధ్యానానంతరము చేయవలెనా?"

స్వామి : "ధ్యానముతోకూడనే చేయవలయును. ధ్యానము గాఢ మగుకొలది, జపము తనంతట తానే నిలిచి పోవు నని నీవు పురోగమన మందుకొలది నీకే తెలియ వచ్చును."

శ్రీరామకృష్ణార్పణమస్తు

ఓం తత్ సత్.



# అకారాది విషయసూచి



